ఓమ్

శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర వైదికమార్గప్రవర్తక
శ్రీమాధవాచార్యవరపూర్వాశ్రమనామధేయ
శ్రీవిద్యారణ్యమునివర్యప్రణీత



# జీవన్ముక్తిప్రకాశిక

బ్రహ్మశ్రీ
అన్నవరపు వేంకటరాఘవశాస్త్రి గారిసహాయమున
శ్రీ మేకల పార్థసారథినాయుడు గారిచే
పరివర్తితము.





చెన్నపురి:
శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.
1930.



# జీవన్ముక్తిప్రకాశికా పత్రిక.



ఈ సంసారమునందు ముక్తులు, ముముక్షువులు, విషయులు, పామరులు నని నలుగురుగు మానవులుందురు. ముక్తులు సర్వసిద్ధిగలవా రగుటచే వారికి వలసిన యుక్తి లేదు. అందులకై ప్రయత్నమును లేదు. విషయసక్తులును, పామరులును జ్ఞానహీనులు గనుక, వారీశాస్త్రమున కనధికారులు. ఇంక మిగిలిన ముముక్షువులే యీ వేదాంతశాస్త్రము నభ్యసింప నర్హులు. ముముక్షువునకు జ్ఞానసంపత్తిగలిగినపిదప నాత్మవిచారము చేత, పంచభూతాత్మకమైన శరీరపాతమునకు పిదప ముక్తి గలుగనే కలుగును. అయినను, జ్ఞేయమైయున మాత్మయొక్క స్వరూపజ్ఞానము గలిగినయనంతరమే, ప్రతిబంధకమగు నజ్ఞానము నశించుటచేత ముక్తిసుఖము గలుగుఁగాక యని పరమదయాళువులగు పూర్వమహర్షులచే శరీరోపాధి యున్నను, తత్వజ్ఞానము గలిగినపిమ్మట "తత్త్వజ్ఞానాదేవ కైవల్యమ్" అన్నట్లు జ్ఞానప్రాప్తికి వెంబడే ముక్తి యని చెప్పఁబడినది. దానికే జీవన్ముక్తియని పేరు. ఆ జీవన్ముక్తి వేదోపనిషత్తులందును, గీతలందును సంక్షేపముగను, విస్తారముగను

జెప్పఁబడియున్నది. దాని ననుసరించియే సన్న్యాసాశ్రమము శ్రేయ మని పరాశరమాధవీయాదిస్మృతులందును వేరొక్కానఁ బడినది.

అయినను, ఆ గ్రంథములు పెక్కులై, దురవగాహములై యుండుటంజేసి, సునాయాసముగా ముముక్షువులకు జీవన్ముక్తి జ్ఞానము కలుగును గాక యని పరమకృపాళుఁడును, వీరబుక్కణమహీపాలుని సామ్రాజ్యధురంధరుఁడు నైన శ్రీనారాయణ మాధవాచార్యులవారు తాను సన్న్యాసాశ్రమము స్వీకరించిన పిదప, తాను పూర్వాశ్రమమున రచియించిన జ్యోతిర్వైద్య ధర్మశాస్త్రవ్యాకరణ మీమాంసాగ్రంథములచేఁ దనివినొందక, మోక్షాపేక్షగలవారు మోక్షసాధనమైన తత్త్వజ్ఞానమును పొంది కృతార్థతను చెందుటకుగాను వివరణోపన్యాసాదిగ్రంథములను, చిత్రదీప తృప్తిదీపాదిగ్రంథములను రచియించిరి. ఆమీఁద తత్త్వజ్ఞానసంపత్తిగలిగి దేహాంతమందు విదేహకైవల్యము నొందుటకు తగిన మహానుభావులు జీవితమునందే మోక్షసుఖ మనుభవించుటకు తగినసాధనముల విశదముగా ప్రతిపాదించిన వాసిష్ఠరామాయణమును పర్యాలోచనచేసి యిది గొప్పదైనందున బుద్ధిమంతులు చాలకాలము అభ్యసించినఁ గాని విషయము బోధకాదని ఆలోచించిరి. ఇందుచే వీరు తా రచియించిన యాయాగ్రంథమునుండి సారమును గ్రహించి, వేదాంతసారమగు భగవద్గీతనుండియు,

వేదాంతసారభూతమై శ్రీ శుకమునీంద్రుని మోమునుండి వెలువడిన శ్రీ భాగవతమునుండియు, అష్టగుణగణవిశిష్టమై, శ్రీ రామునకు వసిష్ఠునిచే నుపదిష్టమైన వాసిష్ఠమహారామాయణమునుండియు, తనగ్రంథమునకు వలసిన ప్రమాణములగు విషయములను గైకొని, యుక్త్యనుభవయుక్తమై, సన్న్యాసవిషయభాగముతోఁ గూడినదై, జీవన్ముక్తివిలక్షణమైన భావములను బోధించునదై, మోక్షమార్గమునకు నిచ్చెనయై యొప్పఁదగిన యీ జీవన్ముక్తివివేకమను గ్రంథమును రచించిరి.

ఈగ్రంథము మొదటిప్రకరణమున జీవన్ముక్తిస్వరూపము, తత్ప్రమాణమ్మును, రెండవప్రకరణమున జీవన్ముక్తిసాధనములగు తత్త్వజ్ఞానవాసనాక్షయములును, మూడవప్రకరణమున తత్త్వజ్ఞానసహితమైన మనోనాశనమును, నాల్గవప్రకరణమున జీవన్ముక్తివలని ప్రయోజనములును, అయిదవప్రకరణమున వాసనాక్షయమనోనాశముల నభ్యసించుట కనుకూలమైనవిద్వత్సన్న్యాసమును ఈ అంశములన్నియు ప్రతిపాదింపఁబడినవి. శ్రీ విద్యారణ్యులవారి గ్రంథములకన్నిటికి నీగ్రంథమే శిరోభూషణమై యలరారుచున్నది. ఇందు ప్రతిపాదింపఁబడ్డ వాసనాక్షయమనోనాశముల నభ్యసింపకపోయినను, దీనిఁ జదివినంతమాత్రమున జీవన్ముక్తిసుఖము కొంత అనుభవమగుట నిశ్చయము. ఇట్టి గొప్పగ్రంథము సంస్కృతభాషాపరిచయము లేనివారి కుపకరింపక పోవులోపముఁ దీర్ప

నాలోచించి నెల్లూరుజిల్లా, కావలితాలూకా జమీన్దారు శ్రీయుత మేకల పార్థసారథినాయుడుగారు, బ్రహ్మశ్రీ అన్నవరపు వెంకటరాఘవశాస్త్రిగారిసహాయమున అంగీకరించిరి. అచ్చుటచ్చుట నుపయుక్తములగు విశేషాంశములఁ జేర్చి దీని స్మృతిప్రకాశిక యను పేరుతో దీనిఁ బ్రచురించిరి.





శ్రీరస్తు.

# శ్రీ విద్యారణ్యస్వామిచరిత్రము.



ఈ మహానుభావుని పూర్వాశ్రమమున మాధవాచార్యుఁడని పేరు. ఈ మహానుభావుఁడు తుంగభద్రానదీతీరమున ౫౦౦ సంవత్సరములకు ముందు విద్యానగరము నేలుచుండిన హరిహరబుక్కరాయలకు మంత్రియై యుండెను. తండ్రి మాయణుఁడు, తల్లి శ్రీమతి. ఇతనికి సాయణభోగనాథులనెడి యిద్దరు తోఁబుట్టువులు గలరు. ఇతఁడు బోధాయనసూత్రుఁడు; యజుశ్శాఖాధ్యాయి; భారద్వాజగోత్రుఁడు; ఇతనికి గురువు భారతీతీర్థుఁడు. ఈ మహామహుఁడు ౧౩౦౦ శకాబ్దమున నున్నవాఁడని తెలియుచున్నది. ఇతఁడు నాలుగు వేదములందును, షట్ఛాస్త్రములందును, ధర్మశాస్త్రపురాణేతిహాసములందును పారంగతుఁడగుటచేత నితఁడు సర్వజ్ఞుఁడను బిరుదనామము వహించెను. ఈ మాధవాచార్యుఁడు ధర్మశాస్త్రమున పరాశరమాధవీయమును, జ్యోతిషమున కాలనిర్ణయమును, పూర్వమీమాంసాశాస్త్రమున జైమినీయన్యాయమాలావిస్తరమును, వ్యాకరణమున మాధవీయధాతువృత్తిని, యజుర్వేదభాష్యమును, ఋగ్వేదభాష్యమును,

సామసంహితాభాష్యమును, పంచవింశబ్రాహ్మణభాష్యమును షడ్వింశబ్రాహ్మణభాష్యమును రచియించెను.

ఈ సర్వజ్ఞుఁ డిన్నిగ్రంథములను రచియించి, సకల జనులకు జ్ఞానప్రవాహమును బ్రవహింపఁజేయుట కాక, సన్న్యసించినపిమ్మట విద్యారణ్యయతీంద్రు లనఁబరగి సుమారు ౩౦ యేండ్లు కొంకణదేశమునఁ గొంతభూమండలము నేలినట్లును, పోర్చుగీసువా రిండియాదేశపు పశ్చిమతీరమున దిగినప్పుడు, గోవాపట్టణము ఈ విద్యారణ్యస్వామిపాలనముక్రింద నున్నట్లును, వీరి పరిపాలన స్మరణమునకై, యా ప్రదేశమున మాధవపురమను పేర నొక్కనగర ముండినట్లును తెలియుచున్నవి. వీరిచే రచితములయిన గ్రంథము లెల్లను వీరికిఁ గల సర్వతోముఖపాండిత్యమును వెలిపుచ్చుచున్నవి. ఈ మహాత్మునకుఁ గల వేదాంతశాస్త్రపరిజ్ఞాన మీాజీవన్ముక్తివివేకము మున్నగు వేదాంతగ్రంథములు తెలుపుచున్నవి. వీనినెల్ల నొక్కమాఱు పారాయణము చేయుటకైనను నల్పాయుష్కులము, నల్పమేధసులము నైన యస్మాదృశులకు వీలు కాకుండుట యతిశయోక్తి కాదని తోఁచెడి. అస్మాదృశులు వారికృతుల ననవరతము పఠించుటయే వారియెడఁ జూపవలసిన కృతజ్ఞత.

శ్రీరస్తు.

శ్రీ హయగ్రీవాయ నమః.

# జీవన్ముక్తిప్రకాశిక.

## ౧-వ ప్రకరణము.

శ్లో. ప్రణమ్య సచ్చిదానందం జగత్కారణ మీశ్వరమ్,
కరోమి స్వీయబోధాయ జీవన్ముక్తిప్రకాశికామ్.

ఈప్రపంచమునందు జనులు బుభుక్షులు, ముముక్షు లని రెండువిధములు. బుభుక్షువు లనఁగా నీలోకమునందుండు స్రక్చందనవనితాపుత్త్రమిత్త్రాదిప్రాప్తిచే నగు సుఖవిశేషములను, పయిలోకమునందుండు స్వర్గస్త్రీపారిజాతాదిసుమాది ప్రాప్తిచే నగు సుఖవిశేషములను ననుభవింప నిచ్ఛగలవారు. ముముక్షు లనఁగా నవిద్యాకామకర్మవాసనలయొక్క నిశ్శేషవినాశపూర్వకముగా పరమానంద స్వరూపమైన స్వాత్మప్రాప్తిని గోరువారు. ఇహలోకసుఖములకు కృషివాణిజ్యాదులు, పరలోకసుఖములకు యాగదానాదులు, అవిద్యాదినిశ్శేషవినాశపూర్వక పరమానందరూప స్వాత్మప్రాప్తియను మోక్షమునకు తత్త్వజ్ఞానము సాధనములు. తత్త్వజ్ఞానముయొక్క స్వరూపసాధనము లుత్తరగ్రంథమందు వివరింపఁబడును. ఇట్టి తత్త్వజ్ఞానసాధ్యమైన మోక్షము విదేహముక్తి యన్ని, జీవన్ముక్తి యని రెండువిధములు. విదేహముక్తి ప్రథమ

సాధనము వివిదిషాసన్న్యాసము. జీవన్ముక్తికి ప్రథమసాధనము విద్వత్సన్న్యాసము. సన్న్యాసమనఁగా సర్వకర్మతత్ఫలపరిత్యాగము. వివిదిషాసన్న్యాసమనఁగా తత్వజ్ఞానమును సంపాదింప నిచ్ఛచేతఁ జేయఁబడు సన్న్యాసము. విద్వత్సన్న్యాస మనఁగా తత్వజ్ఞానము గలిగినతరువాతఁ జేయఁబడుసన్న్యాసము. ఇట్టి సన్న్యాసమునకు ముఖ్యకారణము వైరాగ్యము. వైరాగ్య మనఁగా నితరవస్తువులయందు నిస్పృహ. (ఆశ లేకుంట.) ఈవైరాగ్యము మందవైరాగ్యము, తీవ్రవైరాగ్యము, అతి తీవ్రవైరాగ్యము అని మూఁడువిధములు. పుత్రభార్యాదుల కాపదగలిగినకాలమందు దుఃఖాతిశయము చెంది గృహక్షేత్రాదులయందుఁ గలిగెడునిఃస్పృహాబుద్ధి మందవైరాగ్య మనఁబడును. ఇట్టి వైరాగ్యముగలిగినకాలమందు ఏసన్న్యాసమును జేయఁగూడదు. చేసెనా, భ్రష్టుఁడగును. ఈజన్మమందే భార్యాపుత్రగృహక్షేత్రాది విషయములతో నాకు ప్రయోజనము లేదను స్థిరమైనబుద్ధి తీవ్రవైరాగ్య మనఁబడును. పునరావృత్తిగల బ్రహ్మలోకాదిపుణ్యలోకములతో నాకు ప్రయోజనము లేదనుస్థిరబుద్ధి అతితీవ్రవైరాగ్య మనఁబడును. వైరాగ్యము సన్న్యాసమునకు కారణమని చెప్పుటలో

శ్రుతి "యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్" ఇతి.

అను జాబాలశ్రుతి ప్రమాణము

తాత్పర్యము—ఏదినమందు వైరాగ్యము గలుగునో, ఆదినమందే సన్న్యాసమును గ్రహింపవలయునని యర్థము.

వాక్యము—వైరాగ్యముచేతఁ బొందఁదగిన సన్న్యాసము కుటీచక, బహూదక, హంస, పరమహంస అని నాలుగువిధములు. ప్రైషోచ్చారణమును చేసి (సంన్యస్తం మయా అను మంత్రము ప్రైష) త్రిదండకాషాయములను ధరించి శిఖాయజ్ఞోపవీతముల నుంచుకొని పుత్రాదిబంధుగృహములయందు భిక్షను స్వీకరించువానిసన్న్యాసము కుటీచక మనఁబడును. ప్రైషోచ్చారణమును చేసి త్రిదండకాషాయగ్రహణము నాచరించి తీర్థయాత్రాసక్తుఁడై తిరుగువానిసన్న్యాసము బహూదక మనఁబడును. ప్రైషోచ్చారణమునుచేసి, ఏకదండకాషాయములను గ్రహించి, శిఖను త్యజించి, యజ్ఞోపవీతము మాత్రము నుంచుకొని గ్రామైకరాత్రముగా సంచరించుచు కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతముల నాచరించువానిసన్న్యాసము హంససన్న్యాస మనఁబడును. ప్రైషోచ్చారణదండకాషాయగ్రహణమును జేసి శిఖాయజ్ఞోపవీతములను త్యజించి ఆత్మజ్ఞానపరుఁ డగువానిసన్న్యాసము పరమహంససన్న్యాస మనఁబడును. ఇందులో తీవ్రవైరాగ్యముగల పురుషుఁడు తీర్థయాత్రలను జేయుటకు దేహపాటవము లేనివాఁడుగానుండెనా! కుటీచకసన్న్యాసమును, దేహపాటవముగలవాఁడుగా నుండెనా! బహూదకసన్న్యాసమును గ్రహింపవలయును. అతితీవ్రవైరాగ్యముగలపురుషుఁడు బ్రహ్మలోకాభిలాషగలవాఁడుగానుండెనా! హంససన్న్యాసమును, మోక్షాభిలాషగలవాఁడుగా నుండెనా! పరమహంససన్న్యాసమును గ్రహింపవలయును. హంససన్న్యాసమును గ్రహించిన పురుషుఁ డీలోకమునందు సగుణబ్రహ్మోపాసనమును జేసి యర్చిరాదిమార్గముచేత

బ్రహ్మలోకమును బొంది, యాలోకమునందు తత్త్వజ్ఞానము నొంది మోక్షమును బొందును. పరమహంససన్న్యాసమును బొందిన పురుషుఁడీలోకమునందే తత్త్వజ్ఞానముచేత మోక్షము నొందును.

ఇఁక పరమహంసను గూర్చి వివరించెదము. వివిదిషాసన్న్యాసి విద్వత్సన్న్యాసి యనువీరిద్దఱు పరమహంసలని చెప్పఁబడుదురు. వివిదిషాసన్న్యాసి జిజ్ఞాసు వని విద్వత్సన్న్యాసి జ్ఞాని యని వ్యవహరింపఁబడును. జిజ్ఞాసువనఁగా తత్త్వజ్ఞానమును సంపాదింప నిచ్ఛగలవాఁడు. జ్ఞాని యనఁగా సంపాదింపఁబడిన తత్త్వజ్ఞానము గలవాఁడు. తత్త్వజ్ఞానసంపాదనేచ్ఛగల వానికి సన్న్యాస మావశ్యక మని

శ్రు. ఏతమేవ లోకమిచ్ఛన్తః ప్రవ్రాజినః ప్రవ్రజన్తి.

అను బృహదారణ్యశ్రుతి చెప్పుచున్నది. ఈశ్రుతియొక్క తాత్పర్యము వివరించెదను.

తా. ఆత్మలోకమని అనాత్మలోకమని లోకములు రెండు విధములు. ఇందులో అనాత్మలోకము మూఁడువిధములు.

శ్రుతి. అథ త్రయో వావ లోకాః మనుష్యలోకః పితృలోకో దేవలోక ఇతి. సోఽయం మనుష్యలోకః పుత్రేణైవ జయ్యో నాన్యేన, కర్మణా పితృలోకో, విద్యయా దేవలోకః.

అని బృహదారణ్యశ్రుతి చెప్పుచున్నది. మనుష్యలోకము, పితృలోకము, దేవలోకము అని మూఁడులోకములు. ఇందులో మనుష్యలోకము గృహక్షేత్రాదులు. ఇది పుత్రుని

చేతనే జయింపఁదగినది. మరియొకసాధనముచేత జయింపఁబడ దు. అగ్నిష్వాత్తాదిపితృదేవత లుండులోకము పితృలోకము. ఇది శ్రాద్ధాదికర్మలచేత జయింపఁదగినది. బ్రహ్మలోకము. దేవ లోకము. ఇది ఉపాసనచేత జయింపఁదగినది అని ఉదాహరింపఁ బడిన శ్రుతియొక్క అర్థము.

శ్రుతి. యో హ వా అస్మాల్లోకాత్ స్వం లోకమదృష్ట్వా ప్రైతి సఏనమవిదితో న భునక్తి ఆత్మానమేవ లోకముపాసీత స య ఆత్మానమేవ లోకముపాస్తే న హాస్య కర్మ క్షీయతే.

అను శ్రుతి ఆత్మలోకమును జెప్పుచున్నది. ఏపురుషుఁడు రక్త మాంసాదివికారమగు నీదేహమునందుండి పరమాత్మస్వరూ పమనులోకమును నేనే బ్రహ్మనని యెఱుఁగకయే మరణము నొందునో, అజ్ఞానముచేత నంతర్హితమైయున్న యాపరమాత్మ జ్ఞానహీనుఁడై మృతినొందినపురుషుని శోకమోహాదిదోషము లను నివారించి రక్షింపఁడు గనుక పరమాత్మస్వరూపమును నేనే బ్రహ్మనని చింతింపవలయును. ఏపురుషుఁడు పరమాత్మ స్వరూపమును వెనుకఁజెప్పినప్రకారము చింతించునో ఆపురు షునియొక్క పుణ్యకర్మ ఒకఫలమును మాత్రము ఇచ్చి నశిం పదు. కోరిన సర్వఫలముల నిచ్చి మోక్షమును గూడఁ గలుగఁ జేయునని శ్రుతియొక్క తాత్పర్యము. బృహదారణ్యకషష్ఠా ధ్యాయమందును

శ్రుతి. కిమర్థం వయమధ్యేష్యామహే? కిమర్థం వయం యక్ష్యామహే? కిం ప్రజయా కరిష్యామో? యేషాం నోఽయమాత్మా అయం లోకః.

అను వాక్యమును ఆత్మలోకమును ప్రతిపాదింపుచున్నది. ఏమన

కీయాత్మస్వరూపమే ప్రాప్యముగా నున్నదో, ఆమనము వేదాధ్యయనము, యాగము, పుత్రోత్పాదనము మొదలగు పుణ్యకర్మల నెందుకుఁ జేయవలయును? నిత్యసిద్ధమైన ఆత్మస్వరూపమును కోరువారికి కేవలజ్ఞానముచేతనే ఆత్మస్వరూపప్రాప్తి గలుగుచున్నది. కనుక ఆత్మస్వరూపప్రాప్తినిగూర్చి యాగస్వాధ్యాయాదిపుణ్యకర్మలను జేయ నక్కఱ లేదని తాత్పర్యము.

కనుక ప్రకృతశ్రుతియందు లోకశబ్దముచేత నాత్మస్వరూపమే చెప్పఁబడినదని నిశ్చయింపఁదగియున్నది. ఇది గాక

శ్రు. స వా ఏష మహానజ ఆత్మా.

ఈ ఆత్మ అనఁగా జీవాత్మ వ్యాపకమై జన్మశూన్యమైన పరబ్రహ్మమే యని ముందుగా నుపక్రమించిన ఆత్మస్వరూపమును. 'ఏతం' అనుశబ్దముచేత గ్రహించినందున నిచ్చటిలోకశబ్దము పరమాత్మపరమే యని నిశ్చయము. 'లోక్యత ఇతి లోకః' అనుభవింపఁబడునది గనుక లోకమని చెప్పఁబడును. ఆత్మానుభవమును కోరువారు సన్న్యసించవలయునని శ్రుతియొక్క తాత్పర్యము.

శ్లో. బ్రహ్మవిజ్ఞానలాభాయ పరహంససమాహ్వయః,
శాంతిదాంత్యాదిభిః సర్వైస్సాధనైః సహితో భవేత్.

అను స్మృతివాక్యమును తత్వజ్ఞానేచ్ఛగల పురుషునకుసన్న్యాసమావశ్యకమని చెప్పుచున్నది.

బ్రహ్మజ్ఞానమును గోరినపురుషుఁడు పరమహంససన్న్యాసమును గ్రహించి శాంతి దాంతి మొదలగు సద్గుణ

ములుగలవాఁడై యుండవలయు నని స్మృతివచనముయొక్క అర్థము.

ఈజన్మమందుఁగాని పూర్వజన్మలయందుఁగాని ఫలాపేక్ష లేకయే అనుష్ఠింపఁబడిన వేదాధ్యయనయాగదానాదిపుణ్యకర్మలచేత మనస్సునందుఁబుట్టిన జ్ఞానేచ్ఛచేతఁ జేయఁబడినయట్టి సన్న్యాసము వివిదిషాసన్న్యాసమని చెప్పఁబడును. జ్ఞానసాధనమైన యీవివిదిషాసన్న్యాసము తిరజన్మ హేతువులగు కామ్యకర్మలను పరిత్యజించుట మాత్రము గాను, ప్రైషోచ్చారణపూర్వకముగా దండకాషాయాది గ్రహణముగల యాశ్రమముగాను రెండువిధములుగా నున్నది.

శ్లో. పుంజన్మ లభతే మాతా పత్నీ చ ప్రైషమాత్రతః,
బ్రహ్మత్వం సకలం జ్ఞానం వై సంప్రాప్నోతి.

తా. ప్రైషోచ్చారణపూర్వకముగా స్వీకరింపఁబడిన సన్న్యాసాశ్రమముయొక్క ప్రభావముచేత ఆసన్న్యాసియొక్క తల్లియు, భార్యయు పురుషజన్మ నొందుదురు. నశించిపోయిన వేదము తిరిగి ప్రాప్తించును. అనఁగా వేదమును చదివికొని మరచిపోయినచో మహాపాపమని చెప్పియున్నందున నీసన్న్యాసాశ్రమప్రభావముచేత మహాపాపము లేకపోవడమే కాక నిత్యవేదపారాయణముచేత కలుగు పుణ్యముకూడఁ గలుగునని తాత్పర్యము. సదాచారసంపత్తియును తత్త్వజ్ఞానము కూడఁ గలుగునని ఆశ్రమరూపసన్న్యాసముయొక్క ఫలములు చెప్పఁబడియున్నవి.

శ్రుతి. న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః.
అను శ్రుతి కామ్యకర్మపరిత్యాగము సన్యాసమే యని చెప్పు చున్నది. యాగాదికర్మలచేతఁగాని, పుత్రసంతానము చేతఁగాని, ధనము చేతఁగాని, దానము చేతఁగాని యెవరు మోక్షము నొందలేదు. కొందఱు పుణ్యపురుషులు కర్మత్యాగము చేతనే మోక్షమును బొందిరి యని శ్రుత్యర్థము. ఈ రెండువిధములైన సన్యాసమునందు స్త్రీలకును అధికారము గలదు. వివాహమునకు పూర్వమందుఁగాని, భర్తచనిపోయిన తరువాతఁగాని స్త్రీలు సన్యాసమును గ్రహించవచ్చునని కొన్ని శాస్త్రములు చెప్పియున్నవి. భిక్షాచరణము, మోక్షశాస్త్రశ్రవణము, బ్రహ్మస్వరూపధ్యానము, త్రిదండకాషాయధారణము మొదలగు యతిధర్మములను స్త్రీలు కూడ నాచరించవలయును. ఈయర్థము శాంతిపర్వాంతర్గతమోక్షధర్మములయందు సులభాజనకసంవాదగ్రంథముయొక్క చతుర్థరీటీక యనువ్యాఖ్యానమునందు విస్పష్టముగా వ్రాయఁబడియున్నది.

బృహదారణ్యము మొదలగు వేదాంతములయందును, గార్గి మొదలగు స్త్రీలు సన్యాసినులనియు, బ్రహ్మనిష్ఠలనియు చెప్పియున్నది. కనుకనే యాజ్ఞవల్క్యమహాముని తనభార్యయగు మైత్రేయీదేవికి బ్రహ్మవిద్యనుపదేశించెను. బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థాశ్రమములయందుండు పురుషులకు ఆశ్రమరూపసన్యాసమును స్వీకరించుటకు కొన్ని కారణములవలన అనుకూల్యము లేనియెడల తమతమయాశ్రమధర్మముల నాచరించుచు కామ్యకర్మతత్ఫలపరిత్యాగ మనుమానససన్యాసమును చేయు

టయం దేమియు విరోధము లేదు. ఇటువంటి మానససన్న్యాసముచేతనే వేదాంతశ్రవణమును చేయవచ్చును. శ్రుతిస్మృతిఇతిహాసపురాణములయందును లోకమునందును మానససన్న్యాసపూర్వకముగా వేదాంతశ్రవణమును జేసినమహానుభావు లనేకులు గనుపడుచున్నారు గనుక దండకాషాయాదిగ్రహణరూప శ్రమసన్న్యాసము లేనివారికి వేదాంతశ్రవణము చేయ నధికారము లేదను కొందఱు సన్న్యాసులయొక్క వాదము నిర్మూలము. ఇది వివిదిషాసన్న్యాసము.

ఇఁకను విద్వత్సన్న్యాసమును గూర్చి వివరించుచున్నాను. సదాచార్యసన్నిధియందు శ్రద్ధాభక్తులతో తత్త్వమస్యాది వేదాంతమహావాక్యములయొక్క శ్రవణమనననిదిధ్యాసములను చేసి పరమతత్త్వమైన పరబ్రహ్మము చక్కఁగా తెలిసికొన్న తరువాత చేయఁబడుసన్న్యాసము విద్వత్సన్న్యాసమని చెప్పఁబడును. ఈసన్న్యాసమును యాజ్ఞవల్క్యమహాముని యాచరించినారు.

అది యెటువలె నంటే, విదేహదేశాధిపతియగు జనకమహారాజు తత్త్వజ్ఞానసంపాదనేచ్ఛచేత బ్రహ్మతత్త్వజ్ఞానముగల మహానుభావుల ననేకుల నొకటఁ జేర్చి వారిలో నుత్తమోత్తముఁడైనవానివలన బ్రహ్మతత్త్వజ్ఞానము నుపదేశముఁ గాంగోరి బహుదక్షిణల నియ్యఁదగిన యొకయాగమును చేయ నుపక్రమించఁగా కురుపాంచాలాదిదేశములయందుండు బ్రహ్మవేత్తలచ్చటి కనేకులు చేరిరి. అప్పుడు వెయివేలపాడిమొదవులను సువర్ణరజతాభరణములతో నలంకరించి యాబ్రహ్మవేత్తలయొక్క సభయెదుట నిలిపి జనకమహారాజు మీలో నెవరు బ్ర

ష్ఠాజ్ఞానసంపత్తియందుత్తములో వారికీ మొదవులు వక్షిణగా సమర్పింపఁబడిన వని విన్నవింపఁగా, అచ్చటిబ్రాహ్మణు లందఱు తనకంటె నెక్కువవా రందు రేమో యని సంశయించుచుం డిరి. ఆసభామధ్యమందున్న యాజ్ఞవల్క్యమహాముని తనశిష్యు లనుజూచి, యీ ధేనువులను మనయాశ్రమమునకుఁగొనిపొం డని యాజ్ఞాపింపఁగా నచ్చటిబ్రాహ్మణు లందఱాగ్రహించి యాజ్ఞవల్క్యమహామునిని జయింపఁగోరి కర్మవిచారములయందు వాదింప నారంభించిరి. అప్పుడు యాజ్ఞవల్క్యమహాముని అశ్వల, ఉషస్తి, కహోళ, శాకల్య, గార్గి మొదలగు బ్రహ్మవేత్తల ననేకుల నిర్జించి కీర్తిధనములనొంది జనకమహారాజుచేత గురువుగా వరింపఁబడి ఆయనకు బ్రహ్మతత్త్వజ్ఞానము నుపదేశించి కృతార్థునిగా నొనరించి తన యాశ్రమమును ప్రవేశించి తనభార్యయగు మైత్రేయీదేవికి నాత్మతత్వము నుపదేశింపఁ గోరి యామెకు త్వరగా బ్రహ్మమునందాభిముఖ్యము గలుగఁ జేయుకొరకు తాము సన్న్యాసాశ్రమమును స్వీకరింపఁ బోవుచున్నామని వక్కాణించి, ఆమైత్రేయీదేవికి బ్రహ్మతత్వము నుపదేశించి పరమహంససన్న్యాసాశ్రమము నంగీకరించిరి. ఈయర్థము బృహదారణ్యోపనిషత్తుయొక్క మైత్రేయీబ్రాహ్మణ మనుభాగములోని యాద్యంతవాక్యములయందు విస్పష్టముగాఁ జెప్పఁబడియున్నది.

శ్రుతి. అథ హ యాజ్ఞవల్క్యోఽన్యద్వృత్తముపాకరిష్యన్మైత్రేయీతి హోవాచ, యాజ్ఞవల్క్యః ప్రవ్రజిష్యన్వా అరేఽహమస్మాత్ స్థానా దస్మి ఏతావదరే ఖల్వమృతత్వమిత్యుక్త్వా యాజ్ఞవల్క్యః ప్రవవ్రాజ ఇతి.

తా. జనకమహారాజునకు బ్రహ్మతత్త్వజ్ఞానము నుపదేశించి స్వాశ్రమమునకుఁ బ్రవేశించిన తరువాత యాజ్ఞవల్క్య మహాముని మఱియొక కార్యమును చేయఁదలఁచి తన భార్యను ఓమైత్రేయీ! యని పిలిచి నేను గృహస్థాశ్రమమును విడిచి సన్న్యాసాశ్రమమును గ్రహింపఁదలఁచి యున్నానని చెప్పె ననియు, ఓమైత్రేయీ! యింతవరకు నీకు నేనుపదేశించినదే మోక్షమనియు చెప్పి యాజ్ఞవల్క్యమహాముని సన్న్యసించె నని శ్రుతివాక్యముల కర్థము.

బృహదారణ్యకపంచమాధ్యాయమునం దుండు కహోళబ్రాహ్మణ మను భాగమునందును విద్వత్సన్న్యాసము ప్రతిపాదింపఁబడియున్నది.

శ్రు. ఏతం వై తమాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి.

తా. ఈప్రకార మీయాత్మస్వరూపమును తెలిసికొని బ్రహ్మజ్ఞాననిష్ఠులగు పురుషులు పుత్రులయందు, ద్రవ్యము నందు, స్వర్గాదిపుణ్యలోకములయం దుండు కోరికను సమానముగా విడిచిపెట్టి పరమహంసపరివ్రాజకాశ్రమము నొంది దేహధారణముకొరకు భిక్షాచరణమును మాత్రము నాచరింపుచుందు రని శ్రుత్యర్థము.

బ్రహ్మస్వరూపమును తెలిసికొని సన్న్యసించుదురని చెప్పియున్నందున నీశ్రుతి విద్వత్సన్న్యాసమునే తెలియఁజేయుచున్నది. కనుక నీవాక్యము వివిదిషాసన్న్యాసమునే బోధించుచున్నదని చెప్పఁగూడదు. ఆప్రకారము చెప్పినయెడల బ్రహ్మ

నిష్ఠ పురుషవాచకమగు బ్రాహ్మణశబ్దము ఆత్మానం విదిత్వా యని ఆత్మజ్ఞానమునకు సన్న్యాసమునకుంటె పూర్వకాలస్థితిని దెలియఁజేయు క్త్వాప్రత్యయమున సారస్యము నొందును. ఉత్తరవాక్యమునందు పాండిత్య బాల్య మౌనశబ్దములచేత చెప్పఁబడిన శ్రవణమనననిదిధ్యాసములచేత సాధింపఁదగిన బ్రహ్మసాక్షాత్కారముగలవాఁడు బ్రాహ్మణుఁడని చెప్పియున్నందున ఈశ్రుతియందుండు బ్రాహ్మణశబ్దము బ్రాహ్మణజాతిని జెప్పునది కాదు. కొందఱు వివిదిషాసన్న్యాసముయొక్క పరిపాకమే విద్వత్సన్న్యాసముగాని విద్వత్సన్న్యాసమనునది వివిదిషాసన్న్యాసమునకంటె భిన్నమైనది కాదని చెప్పుదురు. వివిదిషాసన్న్యాస విద్వత్సన్న్యాసములకు ఫలానుష్ఠేయములు భిన్నములుగానున్నందున అది యుక్తము గాదు. అది యెటువలెనంటే వివరించెదను. వివిదిషాసన్న్యాసమునం దనుష్ఠింపవలయువిషయములు శ్రవణమనననిదిధ్యాసనములు. ఫలము బ్రహ్మతత్త్వసాక్షాత్కారము. విద్వత్సన్న్యాసమునం దనుష్ఠేయములు వాసనాక్షయమనోనాశములు. ఫలము జీవన్ముక్తి. కనుక విద్వత్సన్న్యాసవివిదిషాసన్న్యాసము లొకటి యని చెప్పుట యుక్తము గాదు. ఇదిగాక వివిదిషాసన్న్యాస విద్వత్సన్న్యాసము లత్యంత భిన్నములుగా శారీరబ్రాహ్మణమందుఁ జెప్పియున్నవి.

శ్రు. ఏతమేవ విదిత్వా మునిర్భవతి, ఏతమేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛంతః ప్రవ్రజంతీతి.

ఈ ఆత్మస్వరూపమును దెలుసుకొని పురుషుఁడు సన్న్యాసియగును. ఈఆత్మస్వరూపమును దెలియ నిచ్ఛగల పురుషుఁడును సన్న్యాసి యగు నని యర్థము.

వివిదిషాసన్న్యాస విద్వత్సన్న్యాసముల కెటువంటి భేదము గలిగియున్నప్పటికిని పరమహంసాశ్రమములో నంతర్భూతములుగనుక సన్న్యాసాశ్రమము నాలుగు ప్రకారములుగా స్మృతులయందు నిరూపింపఁబడినది. వివిదిషాసన్న్యాస విద్వత్సన్న్యాసములు రెండు పరమహంసాశ్రమాంతర్భూతము లని జాబాలోపనిషత్తునందుఁ జెప్పఁబడినది. ఆయుపనిషత్తునందు సన్న్యాస మెటువంటి దని జనకమహారాజు ప్రశ్న చేయఁగా యాజ్ఞవల్క్యమహాముని అధికారిని విధించి, సన్న్యాసగ్రహణానంతర మనుష్ఠింపవలసిన ధర్మములతోఁగూడ వివిదిషాసన్న్యాసమును ప్రతిపాదించి అనంతరమందు యజ్ఞోపవీతము లేనివాఁ డే ప్రకారము బ్రాహ్మణుఁ డగునని అత్రిమహామునిచేత నాక్షేపింపఁబడి ఆత్మజ్ఞానమే యితనికి యజ్ఞోపవీత మని సమాధానమును చెప్పిరి. కనుక వివిదిషాసన్న్యాసి బాహ్యయజ్ఞోపవీతము లేనివాఁడైనందున పరమహంస యని నిశ్చయింపఁబడెను. ఆయుపనిషత్తునందే మరి యొకప్రదేశమునందు బ్రహ్మజ్ఞానులు జీవన్ముక్తులు నగు సంవర్తుఁడు మొదలగునేకుల నుదాహరించిరి.

శ్రు. అవ్యక్తలింగా అవ్యక్తాచారా అనున్మత్తా ఉన్మత్తవదాచరంతః-

అని విద్వత్సన్న్యాసులను నిరూపించిరి.

తా. బాహ్యమునకు కనుపడని యజ్ఞోపవీతాదిచిహ్నములు గలవారును, బాహ్యమునకు కనుపడని ఆత్మధ్యానాద్యాచారములు గలవారును, ఉన్మత్తులు (పిచ్చివారు) కాకపోయినను, పిచ్చివారివలె సంచరించువారును పరమహంసలని శ్రుత్యర్థము. అప్రకారమే మరియొకశ్రుతియందు,



శ్రు. త్రిదండం కమండలుం శిక్యం పాత్రం జలపవిత్రం శిఖాం యజ్ఞోపవీతం చేత్యేతత్సర్వం భూస్స్వాహేత్యప్సు పరిత్యజ్యాత్మాన మన్విచ్ఛేత్.

తా. త్రిదండమును, కమండలువును, భిక్షాన్నము నుంచుకొనెడియుట్టిని, భోజనపాత్రమును, త్రిదండమునకు కట్టనజలపవిత్రమును, శిఖను, యజ్ఞోపవీతమును నీటి నన్నిటిని భూస్స్వాహా యనుమంత్రమును జెప్పి యుదకమునందు విడిచిపెట్టి ఆత్మస్వరూపమును దెలుసుకొన వలయునని త్రిదండసన్యాసియగుపురుషునకు ఏకదండధారణము గల వివిదిషాసన్యాసమును విధించి తరువాత వివిదిషాసన్యాసమునకు ఫలభూతమగు విద్వత్సన్యాసమును,

శ్రు. యథా జాతరూపధరో నిర్ద్వంద్వో నిష్పరిగ్రహ స్తత్త్వ బ్రహ్మమార్గే సమ్యక్సంపన్న శ్శుద్ధమానసః ప్రాణసంధారణార్థం యథోక్తకాలే భైక్ష మాచరన్నుదరపాత్రేణ లాభాలాభౌ సమౌ కృత్వా శూన్యాగారదేవగృహతృణకూటవల్మీకవృక్షమూలకులాలశాలాగ్నిహోత్రనదీపులినగిరికందరకుహరకోటర నిర్ఝరస్థండిలేష్వనికేతవాస్యప్రయత్నో నిర్మమశ్శుక్లధ్యానపరాయణోఽధ్యాత్మనిష్ఠః శుభాశుభకర్మనిర్మూలనపరః సన్న్యాసేన దేహత్యాగం కరోతి స పరమహంసో నామ.

అను శ్రుతిచేత నిరూపించిరి.

తా. పుట్టిననాటిరూపమును ధరించినవాఁడును అనఁగా దిగంబరుఁడని యర్థము. శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వములను సహించువాఁడును, గృహక్షేత్రాదులను దండకమండల్వాదులను విడిచినవాఁడును, వేదాంతవేద్యమైన బ్రహ్మమార్గము

నందు చలింపనిచిత్తము గలవాఁడును, రాగద్వేషరహితమ్మైన మనస్సుగలవాఁడును, దేహధారణమాత్రముకొఱకు పగటిలో నిరువదియాఱవగడియ కాలములో గ్రామములోనికి భిక్షకుఁబోయి కడుపునకు వలసినంత భిక్షాన్నమును పుచ్చుకొని భిక్షాన్నముయొక్క లాభాలాభములను సమముగాఁ దలఁచి జనులు కాపురములేని యింటియందుఁ గాని, దేవాలయము, గడ్డివాములపోటు, పుట్టలుండుచోటు, కుమ్మరవాండ్రు కొత్తకుండలు చేసి పెట్టుకొనెడియిల్లు, అగ్నిహోత్రగృహము, ఏటి యిసుకదిన్నె, పర్వతగుహ, కొండచరియ, పెద్దవృక్షములయొక్క తొఱ్ఱ, సెలయేటియొక్క దరి, నీటినేల ఈ ప్రదేశములలో నెక్కడనో యొకస్థలమందు నియతి లేక నివసించువాఁడును, సర్వవిషయములయందు ప్రయత్నము లేనివాఁడును, నాది నాది యను మమకారము లేనివాఁడును, బ్రహ్మస్వరూపమును ధ్యానము సేయువాఁడును, పరమాత్మయందనన్యవ్యాపారతారూపనిష్ఠగలవాఁడును శుభాశుభకర్మల నన్నిఁటిని నశింపఁజేయుటయందాసక్తిగలవాఁడునై సన్న్యాసముచేసిన దేహత్యాగమును చేయు మహాపురుషుఁడు పరమహంస యని చెప్పఁబడు నని శ్రుత్యర్థము. కనుక వివిదిషాసన్న్యాసివిద్వత్సన్న్యాసు లిద్దరు పరమహంస లని సిద్ధము. వీరిద్దరకు పరమహంసత్వము సమానమైనను, వీరిచేత ననుష్ఠింపఁబడు ధర్మములు పరస్పరవిరుద్ధములుగా నున్నందున వివిదిషాసన్న్యాసి విద్వత్సన్న్యాసుల కవాంతరభేదము గలదు. అది యెటువలెనంటె ఆరుణ్యుపనిషత్తులో నారుణి యనుశిష్యుఁడు 'ఓస్వామీ ! శిఖాయజ్ఞోపవీతస్వాధ్యాయ గాయత్రీమంత్ర

జపాదిసకలకర్మలను ఏవిధానముచేత త్యజింప నగు నని వివిదిషాసన్యాసమునుగూర్చి యడుగఁగా గురువగు ప్రజాపతి శిఖాయజ్ఞోపవీతాదులయొక్క త్యాగమును చెప్పి, దండమును, కౌపీనమును, పైవస్త్రమును (కాషాయమును) మాత్రము పరిగ్రహించవలయునని విధించి త్రికాలస్నానము, బ్రహ్మధ్యానము, ఉపనిషత్పారాయణము మొదలగు జ్ఞానసాధనధర్మముల ననుష్ఠింపవలయు నని విధించిరి. పరమహంసోపనిషత్తులో పరమహంసలగు యోగులయొక్క మార్గము (అనుష్ఠానము) ఎటువంటిదని నారదమహాముని విద్వత్సన్యాసమునుగూర్చి ప్రశ్న చేయఁగా గురువగు ప్రజాపతి వివిదిషాసన్యాసికివలె సర్వత్యాగము నుపదేశించి కౌపీనదండకాషాయములను లోకోపకారముకొరకును, స్వశరీరోపకారముకొరకును ధరింపవలయు నని చెప్పి, యిది ముఖ్యసన్యాసము గాదని దండకాషాయకౌపీనాదుల నన్నిటిని త్యజించి దిగంబరుండై స్తుతినమస్కారాదులయం దపేక్షలేక పూర్ణానంద స్వభావపరబ్రహ్మను నేనని తలఁచి కృతార్థుఁడగు పురుషశ్రేష్ఠునియొక్క సన్యాసము ముఖ్యసన్యాసమని యుపదేశించిరి. కనుక వివిదిషాసన్యాసివిద్వత్సన్యాసుల కనుష్ఠేయధర్మములు విలక్షణములై యున్నందున, నుభయసన్యాసుల కవాంతర భేదము నిశ్చయముగా నున్న దని సిద్ధము. స్మృతులయందును వివిదిషాసన్యాసవిద్వత్సన్యాసములయొక్క భేదము స్పష్టముగాఁ జెప్పఁబడినది. అది యెటువలెనంటే,

స్మృతి. సంసారమేవ నిస్సారం దృష్ట్వా సారదిదృక్షయా,
ప్రవ్రజంత్యకృతోద్వాహాః పరం వైరాగ్యమాశ్రితాః.

తా. సంసారమును నిస్సారముగాఁ జూచి సారమగు బ్రహ్మస్వరూపమును దెలియ నిచ్ఛగలవారై వివాహమును జేసుకొనకయే పరమవైరాగ్యము నాశ్రయించి కొందరు మహానుభావులు సన్యసించుదురు.

శ్లో. ప్రవృత్తిలక్షణో యోగో జ్ఞానం సన్యాసలక్షణం,
తస్మాద్ జ్ఞానం పురస్కృత్య సన్యసేదిహ బుద్ధిమాన్.

తా. కర్మయోగము ప్రవృత్తిమార్గ మని జ్ఞానయోగము నివృత్తిమార్గ మని చెప్పఁబడును గనుక జ్ఞానము సంపాదింప నిచ్ఛగలిగి బుద్ధిమంతుండగు పురుషుఁడు సన్యసించవలయును. ఈవాక్యములచేత వివిదిషాసన్యాసము చెప్పఁబడినది.

శ్లో. యదా తు విదితం తత్త్వం పరం బ్రహ్మ సనాతనం,
తదైకదండం సంగృహ్య సోపవీతాం శిఖాం త్యజేత్.

తా. ఎప్పుడు అనాదిసిద్ధమై పరమార్థసత్యమైన పరబ్రహ్మము దెలియఁబడెనో, అప్పుడు ఏకదండసన్యాసమును బరిగ్రహించి శిఖాయజ్ఞోపవీతములను విడువవలయును.

శ్లో. జ్ఞాత్వా సమ్యక్పరం బ్రహ్మ సర్వం త్యక్త్వా పరివ్రజేత్.

తా. పరమాత్మస్వరూపమును చక్కఁగా దెలుసుకొని, గృహక్షేత్రాదిపరిగ్రహముల నన్నిటిని విడిచి సన్యసించవలయును. ఈవాక్యములు విద్వత్సన్యాసమును జెప్పుచున్నవి.

ఆక్షేపము.—ఓయీ! వివిదిషాసన్యాసమునకు వివిదిషవేదనమందు (=తెలిసికొనుటయందు) కోరిక కారణము. విద్వత్సన్యాసమునకు విద్వత్త (బ్రహ్మజ్ఞానము) కారణ మని

చెప్పుట యుక్తము గాదు. చిత్రరచనాది లౌకిక విద్యల నభ్యసంప నిచ్ఛ గలిగినటుల, వేదాంతవిద్య నభ్యసింప సామాన్యేచ్ఛగలవారు కొందఱు గలరు. కొందఱు స్వల్ప జ్ఞానము గలిగి పండితుల మను అభిమానముతో బ్రహ్మజ్ఞానముగలవారుగా వ్యవహరించుచున్నారు. వీ రుభయులు సన్న్యాసమును గ్రహించినట్టు గానము. కనుక, ఎటువంటి వివిదిషావివ్దత్తలు సన్న్యాసహేతువు లని చెప్పఁబడినవి?

పరిహారము— లోకమునం దొకపురుషునికి తీవ్రమైన బుభుక్ష (ఆఁకలి) కలిగినప్పుడు ఏప్రకారము భోజనముకంటె నితరమైనపని యిష్టము కాదో, భోజనమందు నాలస్యము సహింపఁబడదో, ఆప్రకారము ఏజ్ఞానేచ్ఛ గలిగినప్పుడు జన్మ సంపాదకములగు కామ్యకర్మలయం దరుచి (అయిష్టము), బ్రహ్మజ్ఞానసాధనములగు శ్రవణాదులయం దుత్కటమగు త్వరయును గలుగునో ఆజ్ఞానేచ్ఛ వివిదిష. అటువంటివివిదిషయే సన్న్యాసకారణము గాని సామాన్యేచ్ఛ కారణముగాదు. విద్వత్తయొక్క అవధి (పరాకాష్ఠ) ఉపదేశసహస్రియను గ్రంథమునందు శ్రీశంకరభగవత్పాదాచార్యులవారిచేఁ జెప్పఁబడినది.

శ్లో. దేహాత్మజ్ఞానవత్ జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకమ్,
ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే.

తా. పరమాత్మవిషయమైన యేజ్ఞానము (అహం బ్రహ్మాస్మి యనుజ్ఞానము) పామరజనులకు దేహమే నే ననుజ్ఞానమువలె

దృఢముగా నుండునో అజ్ఞానము దేహమే నే ననుమిథ్యాజ్ఞానమును బాధించును. ఇట్టివంటి పురుషుఁడు మోక్షేచ్ఛ లేనివాఁడైనను ముక్తినొందు ననియర్థము.

శ్రు. భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే.

ఈశ్రుతియును విద్వత్తయొక్క అవధిని జెప్పుచున్నది

తా. హిరణ్యగర్భాదిదేవతలకంటె నుత్తముఁడగుపరమాత్మ మనోవృత్తిచేత ప్రత్యక్షముగాఁ జూడఁబడినప్పుడు అంతఃకరణచిదాత్మలకజ్ఞానముచేతఁ గలిగిన యేకత్వాభిమానమనుహృదయగ్రంథి నశించును. అంతఃకరణముకంటె విలక్షణమైనచిదాత్మ పరబ్రహ్మమువునా? కాదా? పరబ్రహ్మమైనప్పటికి అంతఃకరణముచేత దెలియ శక్యమా? కాదా? శక్యమైనప్పటికి నిట్టువంటి బ్రహ్మజ్ఞానముచేత ముక్తిగలదా? లేదా? అను సందేహములు దెగిపోవును. వర్తమానదేహమును గలుగఁజేసి దీనియందు సుఖదుఃఖాదిభోగములను గలుగఁజేయుప్రారబ్ధకర్మ యనుభవముచేతనే నశించఁదగినది గనుక ప్రారబ్ధముకంటె నితరములైనసంచితాగామికర్మలు ఇచ్చటకర్మలని చెప్పఁబడినవి. బ్రహ్మజ్ఞానముగలుగుటకు పూర్వము ఈజన్మమునందును పూర్వజన్మమునందును సంపాదింపఁబడి, యుత్తరజన్మకారణములైనపుణ్యపాపములు సంచితము లనఁబడును. బ్రహ్మజ్ఞానము గలిగినతరువాత చేయఁబడుపుణ్యపాపములు ఆగాములు లనఁబడును. ఈకర్మలన్నియు క్షయము నొందు నని యర్థము.

ఈయర్థమును

స్మృ. యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే,
హత్వాపి స ఇమాఁ ల్లోకాన్న హంతి న నిబధ్యతే.

యను భవద్గీతావచనమును ప్రతిపాదింపుచున్నది.

తా. ఏపురుషునియొక్క సత్తామాత్రమైన యాత్మస్వరూపము అహంకారముతో (అంతఃకరణతో) అభేదప్రతిపత్తిలేనిదై ప్రకాశించుచుండునో యేపురుషునియొక్క బుద్ధి సంశయము లేనిదై యుండునో ఆపురుషుఁడు ఈలోకముల నన్నిటినిజంపినా? పాతకముచేత సంధింపఁబడఁడని యర్థము. ఇటువంటి విద్వత్సన్యాసమునకు కారణము గాని పండితాభిమానులయొక్క ఆభాసవిద్వత్త కారణము గాదు.

ఆక్షేపము—ఓయీ! ఈలాగైతే వివిదిషాసన్యాససాధ్యమైన తత్వజ్ఞానముచేత నాగామిజన్మలు (రాఁబోవుజన్మలు) నివారింపఁబడును. వర్తమానజన్మశేషము అనుభవముచేత నశించును గాని మరియొకదానిచే నశింపఁజేయుటకు శక్యమైనది కాదు గదా. కనుక నీవిద్వత్సన్యాసముతో ప్రయోజనమేమి?

సమాధానము—ఈవిద్వత్సన్యాసము జీవన్ముక్తికి కారణ మని పూర్వము చెప్పియున్నాము గనుక విద్వత్సన్యాసమునకుఁ బ్రయోజనము జీవన్ముక్తి యని తెలియవలయును. కనుక ఏప్రకారముతత్వజ్ఞానముకొరకు వివిదిషాసన్యాస మనుష్ఠింపఁబడునో, ఆప్రకారము జీవన్ముక్తికొరకు విద్వత్సన్యాసమనుష్ఠింపఁబడవలయునని సిద్ధము. ఇది విద్వత్సన్యాసము.

ప్రశ్న—జీవన్ముక్తియనఁగా నేమి? జీవన్ముక్తిగల దనిచెప్పుటకు ప్రమాణ మేమి? అది యేలాగున సిద్ధించును? సిద్ధించెనా, దానివలనఁ బ్రయోజన మేమి?

ప్రతివచనము— శరీరముతోఁ గూడి జీవించియున్న పురుషునకు కర్తృత్వభోక్తృత్వసుఖదుఃఖాదిమనోవికారములు ఆయాసస్వరూపము లగుటచే బంధము. ఇటువంటిబంధము నివారింపఁబడడమే జీవన్ముక్తి యనఁబడును.

ఆక్షేపము— ఈ సుఖదుఃఖాదిమనోవికారరూపమగు బంధము ఆత్మస్వరూపములోనుండి నివారింపఁబడునా? లేక చిత్తములోనుండి నివారింపఁబడునా? ఆత్మస్వరూపములోనుండి బంధము తత్త్వజ్ఞానముచేతనే నివారింపఁబడినందున విద్వత్సన్న్యాసము నిష్ప్రయోజనముగనుక ప్రథమపక్షము యుక్తము గాదు. సుఖదుఃఖాదులు చిత్తధర్మము లగుటవలన చిత్తస్వభావములే కనుక చిత్తములోనుండి నివారించుట జలములోనుండి శైత్యమును అగ్నిలోనుండి వేడిమిని నివారించుటయు శక్యముగానట్లు శక్యమైనది కాదు. కాఁబట్టి రెండవపక్షమును అయుక్తము.

సమాధానము— ఆత్మస్వరూపములోనుండి నివారింపఁబడడము గాదు, చిత్తములోనుండి నివారింపఁబడడమే. అయితే చిత్తములోనుండి బంధమునకు ఆత్యంతికనివారణము (నిశ్శేషముగా సర్వదా నివారణము) సంభవింపక పోయినా కొంతమట్టుకు కొంతకాలమువరకు నివారణమే కదా. జలమందుండు ద్రవత్వము మట్టియొక్క మేళనముచేత కొంతభాగము

ఏలాగున నివారింపఁబడునో అగ్నిలోనుండి వేడిమి మణిమంత్రములచేత కొంతకాల మేలాగున నివారింపఁబడునో ఆలాగున యోగాభ్యాసముచేత శక్యముగానే యున్నది.

ఆక్షేపము—ఓయీ, సకలమైన అవిద్యను తత్కార్యములగు దేహేంద్రియాదులను నిశ్శేషముగా నశింపఁ జేయుటకు ప్రవర్తించిన తత్వజ్ఞానమును ప్రారబ్ధకర్మ ప్రతిబంధించి (అడ్డగించి) తనయొక్క ఫలమగు సుఖదుఃఖాదిభోగముల నిచ్చుటకు శరీరేంద్రియాదులను నిలిపినది. సుఖదుఃఖాదిభోగములు చిత్తవృత్తులను (చిత్తవికారములను) వినాగా సంపాదించుటకు శక్యములుగావు. కాఁబట్టి ప్రారబ్ధకర్మచేత నావశ్యకముగా ప్రవర్తింపఁజేయఁబడు చిత్తవృత్తులకు యోగాభ్యాసముచేత నివారణము ఏలాగున సంభవించును ?

సమాధానము—చిత్తవృత్తులయొక్క నివారణముచేత నగుజీవన్ముక్తియును సుఖవిశేషాంతర్భూతమైనందున ప్రారబ్ధకర్మ కొన్నిసుఖముల ననుభవింపఁ జేయుటకై చిత్తవృత్తులను బ్రవర్తింపఁ జేయునటుల జీవన్ముక్తిసుఖము ననుభవింపఁ జేయుటకై చిత్తవృత్తుల నివారించును.

ఆక్షేపము—అయితే ప్రారబ్ధకర్మచేతనే జీవన్ముక్తిగలుగుచుండఁగా విద్వత్సన్యాసయోగాభ్యాసాదిపురుషప్రయత్నముతో ప్రయోజనము లేదు గదా.

సమాధానము—ఈలాగునఁ జెప్పితే ప్రారబ్ధముచేతనే ధనపుత్రాదిలాభము గలుగుచుండఁగా కృషివాణిజ్యపుత్రకా

మేష్ట్యాదిపురుషప్రయత్నముతో ప్రయోజనము లేకపోవును గనుక ప్రారబ్ధము ధనాదిఫలముల నిచ్చెడిసమయములో కృషి వాణిజ్యాదిపురుషప్రయత్నమును ద్వారముగా నుంచుకొని యిచ్చినట్టుగా జీవన్ముక్తిసుఖమును ఇచ్చెడిసమయములోను విద్వత్సన్న్యాసయోగాభ్యాసము లను పురుషప్రయత్నము లను పురస్కరించుకొని యిచ్చుచున్నది. కాబట్టి జీవన్ముక్తి సుఖము ప్రారబ్ధకర్మఫలమని చెప్పినను, యోగాభ్యాసాదిపురుష ప్రయత్నము వ్యర్థము కాదు. వాస్తవమునకు జీవన్ముక్తిప్రారబ్ధకర్మఫలమే కాదు. విద్వత్సన్న్యాసయోగాభ్యాసములయొక్క ఫలము. తత్వజ్ఞానముకంటె ప్రారబ్ధకర్మ యేప్రకారము ప్రబలమో ఆప్రకారము ప్రారబ్ధకర్మకంటె యోగాభ్యాసముచేత చిత్తవికారములు నిరోధింపబడును. కనుకనే యోగాభ్యాసపరులగు వీతహవ్యోద్దాలకాదిమహాత్ములు స్వేచ్ఛచేత దేహత్యాగమును జేసినట్టు, ఇతిహాసములయందు జెప్పబడియున్నది. అల్పాయుష్యముగల మనవంటివారికి అటువంటి మహాయోగము సంభవింపకపోయినను కామక్రోధాదిచిత్తవృత్తులను మాత్రము నిరోధించుయోగము సులభముగానే సంభవించును. శాస్త్రమందు జెప్పియున్న పురుషప్రయత్నమునకు ప్రారబ్ధముకంటె ప్రాబల్యము నంగీకరింపనియెడల వైద్యశాస్త్రము మొదలు వేదాంతశాస్త్రమువరకు అన్నిశాస్త్రములు నిష్ప్రయోజనములని చెప్పవలయును. ఈశాస్త్రములన్నియుం బ్రారబ్ధకర్మఫలములగు రోగాదులకు నివర్తకములైన ఔషధసేవాదిపురుషప్రయత్నమునకు కొన్ని దేశకాలములయందు ప్రయోజనము కనుపడక పోయినమాత్రాన అన్నిపురుషప్ర

యత్నములను సర్వదా ప్రయోజనము లేదని చెప్పఁదగదు. ఒకానొకరాజుయొక్క సైన్యము యుద్ధమందు పరాజయము నొందెనని సకలరాజులు సైన్యమును సంగ్రహించుటయం దనాదరులై యుండరు గదా. ఒకవైద్యుఁ డొకరోగికి రోగమును నివారణచేయలేదని తక్కినవారు వానిని పిలువకుందురా? కనుకనే ఆనందబోధాచార్యులవారు—

"నహ్యజీర్ణభయాదాహారపరిత్యాగః. భిక్షుకభయాద్వాస్థాల్యా ఽనధిశ్రియణం, యూకాభయాద్వా ప్రావరణపరిత్యాగః."

తా. ఒకప్పుడు భోజనము చేయఁగా నజీర్ణము చేసెనని యెప్పటికి భోజనమును చేయక మానుట లేదు. ఒకప్పుడు భిక్షుకులు (మధూకరపువాండ్రు) ఎక్కువగా వచ్చినారనుభయము చేత నెప్పటికి నన్నమును వండుటకు పాత్రను పొయిమీద పెట్టుటమానుట లేదు. ఒకప్పుడు చీరపేలు పడిన వనుభయము చేత నెప్పటికి పైనుత్తరీయమును ధరించుట మానుటయు లేదని యర్థము గనుక పురుషప్రయత్నమగు యోగాభ్యాసము చేత చిత్తవృత్తినిరోధపూర్వకముగా జీవన్ముక్తి సంభవించునని సిద్ధము. శాస్త్రోక్తమగు పురుషప్రయత్నము ప్రారబ్ధకర్మకంటె ప్రబలమని వాసిష్ఠరామాయణమునందు వసిష్ఠరామసంవాదవాక్యములవలన విస్పష్టముగా చెప్పఁబడినది. అది యెటువలెనంటే—

శ్లో. సర్వమే వేహ హి సదా సంసారే రఘునందన,
సమ్యక్ప్రయత్నాత్సర్వేణ పౌరుషాత్సమవాప్యతే.

తా. ఓరామా! సంసారమునందు పుత్త్రులు, ధనము, స్వర్గలోకము, బ్రహ్మలోకము మొదలగుసకలమైన ఫలము

పురుషునిచేతఁ జేయఁబడుపుత్రకామేష్టి కృషివాణిజ్యములు, జ్యోతిష్టోమాదియాగములు బ్రహ్మోపాసనము మొదలగు దృఢమైన ప్రయత్నముచేత నిశ్చయముగా లభించును.

శ్లో. ఉచ్ఛాస్త్రం శాస్త్రితం చేతి పౌరుషం ద్వివిధం స్మృతమ్,
తత్రోచ్ఛాస్త్రమనర్థాయ పరమార్థాయ శాస్త్రితమ్.

తా. పురుషప్రయత్నము శాస్త్రీయ మని అశాస్త్రీయ మని రెండువిధములు. పరద్రవ్యాపహారపరస్త్రీగమనసురాపానాదులు అశాస్త్రీయపురుషప్రయత్నము. నిత్యనైమిత్తికకర్మానుష్ఠానగంగాస్నానసాలగ్రామతీర్థప్రాశనాదులు శాస్త్రీయపురుషప్రయత్నము. ఇందులో నశాస్త్రీయపురుషప్రయత్నము అనర్థమగునరకమునకు కారణము. శాస్త్రీయపురుషప్రయత్నము స్వర్గాదిపురుషార్థములకంటె నుత్తమ మగు మోక్షమునకు కారణము.

శ్లో. ఆబాల్యాదలమభ్యస్తైః శాస్త్రసత్సంగమాదిభిః,
గుణైః పురుషయత్నేన సోఽర్థః సంపద్యతే హితః.

తా. చిన్నతనము మొదలు సంపూర్ణముగా నభ్యసింపఁబడిన సచ్ఛాస్త్రాభ్యాససత్పురుషసహవాసములు మొదలగు గుణములతోఁ గూడినపురుషప్రయత్నముచేత అపరమపురుషార్థమగు మోక్షము సాధింపఁబడును అని వసిష్ఠమహాముని చెప్పఁగా శ్రీరాములు అడుగుచున్నారు.

శ్లో. ప్రాక్తనం వాసనాజాలం నియోజయసి మాం యథా,
మునే తథైవ తిష్ఠామి కృపణః కిం కరోమ్యహమ్.

తా. పూర్వజన్మలయం దనుష్ఠింపఁబడిన ధర్మాధర్మముల (పుణ్యపాపముల) యొక్క సంస్కారము లనెడివాసనలు నా

యంతఃకరణములందుండి నన్నే ప్రకారముగాఁ బ్రేరణ చేయు చున్నవో, ఆప్రకారము నేను పోఁగలవాఁడనేకాని, అస్వతంత్రుఁడనైన నేను ఏమి చేయఁగలను? ఇందుకు వసిష్ఠమహా ముని ఉత్తరమును చెప్పుచున్నారు.

శ్లో. అత ఏవ హి హే రామ శ్రేయః ప్రాప్నోషి శాశ్వతమ్,
స్వప్రయత్నోపనీతేన పౌరుషేణైవ నాన్యథా.

తా. ఓరామా! యెందువలన నీవు వాసనలకు పరతంత్రుఁడవై యుంటివో, అందువలననే కరణత్రయముచేత నుత్సాహముతోఁ జేయు ప్రయత్నమువలన పారతంత్ర్యమును తప్పించుకొని శాశ్వతమైన మోక్షమును పొందఁగలవు. మఱి యొక మార్గముచేత మోక్షమును పొందలేవు.

శ్లో. ద్వివిధో వాసనావ్యూహః శుభశ్చైవాశుభశ్చ తే,
ప్రాక్తనో విద్యతే రామ ద్వయోరేకతరోఽథవా.

తా. ఓరామా! పూర్వజన్మసిద్ధములైన వాసనలు పుణ్యవాసన లని పాపవాసన లని రెండు నీకుఁ గలవు. అందులో రెండువాసనలు నిన్నుఁ బ్రేరణచేయుచున్నవా? లేక ఒక విధమైనవాసనలు మాత్రమే ప్రేరణచేయున్నవా? ఒకవిధమైన వాసనలు మాత్రమే ప్రేరణచేయుచున్నపక్షమందు పుణ్యవాసనలా? లేక పాపవాసనలా? నిన్నుఁ బ్రేరణచేయుచున్నవి.

శ్లో. వాసనౌఘేన శుద్ధేన తత్ర చేదపనీయసే,
తత్క్రమేణాశు తేనైవ పదం ప్రాప్స్యసి శాశ్వతమ్.

తా. ఈపక్షములు మూటిలో పుణ్యవాసనలు నిన్నుఁ బ్రేరణచేయుచున్నపక్షమందు ఆపుణ్యవాసననీచేత చేయింపఁ

బడు అనుష్ఠానముచేతనే ప్రయత్నాంతరము లేకయే శాశ్వతమైన పదము (మోక్షమును) పొందఁగలవు.

శ్లో. అత్ర చే దశుభో భావ స్త్వాం యోజయతి సంకటే,
ప్రాక్తన స్తదసౌ యత్నా జ్జేతవ్యో భవతా స్వయమ్.

తా. లేక పాపవాసనలు నిన్నుఁ బ్రేరణ చేయుచున్నపక్షమందు అపూర్వజన్మసిద్ధములైన పాపవాసనలను శాస్త్రమందు చెప్పిన సత్కర్మానుష్ఠానము మొదలగు ప్రయత్నములచేత నీవు నశింపఁజేయుము.

శ్లో. శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహంతీ వాసనాసరిత్,
పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి.

తా. పుణ్యపాపవాసనలు రెండు నిన్నుఁ బ్రేరణ చేయుచున్నపక్షమందు పుణ్యవాసనల నాప్రకారమే నిలిపి పాపవాసనలను శాస్త్రోక్తసత్కర్మానుష్ఠానసత్పురుషసహవాసాదిప్రయత్నముచేత నశించి పుణ్యవాసనలనే వృద్ధిపఱుపవలయును.

శ్లో. అశుభేషు సమావిష్టం శుభేష్వేవావతారయేత్,
స్వమనః పురుషార్థేన బలేన బలినాం వర.

తా. మనస్సు పరస్త్రీపరద్రవ్యాభిలాష మొదలగుపాపములయందు చేరియుండినా, సచ్ఛాస్త్రశ్రవణదేవతాధ్యానాది పుణ్యములయందుఁ బ్రయత్నముచేత చేర్పవలయును.

శ్లో. అశుభాచ్చాలితం యాతి శుభం తస్మాదపీతరత్,
జంతోశ్చిత్తం తు శిశువ త్తస్మాత్తచ్చాలయేద్బలాత్.

తా. లోకములో నొకబాలుఁడు మట్టిని తినుచుండఁగా పండుతినడమును నేర్పి మృద్భక్షణమునుంచి ఆబాలుని ఏప్ర

కారము నివారింపవచ్చునో, ఆప్రకారము చిత్తము పాపకృత్యమగు దుష్టసహవాసము మొదలగువాని నివారించుచుండఁగా సత్సహవాస సచ్ఛాస్త్రశ్రవణాది పుణ్యకృత్యముల నేర్పి పాపకృత్యములనుండి మనస్సును మరలింపవచ్చును గనుక పురుషప్రయత్నమువలన చిత్తమును బలాత్కారముగా అకార్యములలోనుండి మరలింపవలయును.

శ్లో. సమతా సాంత్వనేనాశు న ద్రాగితి శనైశ్శనైః,
పౌరుషేణ ప్రయత్నేన లాలయే చ్చిత్తబాలకమ్.

తా. చపలమగు పశువును కట్టుమట్టుకుఁ జేర్చుటకు రెండుపాయములు గలవు. ఒకటి మంచిపచ్చిగడ్డిని జూపుట. రెండవది కఱ్ఱయెత్తి బెదరించుట. ఇందులో మొదటి యుపాయముచేత శీఘ్రముగా కట్టుమట్టుకుపశువు చేర్పఁబడును. రెండవయుపాయముచేతనో అటూఇటూ పరువులిడి నెమ్మదిగాఁజేర్పఁబడును. ఈప్రకారమే చిత్తమును శాంతినొందించుటకును రెండుపాయములు. ఒకటిశత్రుమిత్రాదులయందుసమబుద్ధిని బోధించుట. రెండవది ప్రాణాయామప్రత్యాహారాదిహఠయోగము. ఇందులో మొదటియుపాయముచేత చిత్తమును శీఘ్రముగా శాంతినొందింపవలయును గాని రెండవది యగుహఠయోగముచేత శీఘ్రముగా చిత్తము శాంతి నొందింపఁ దగదు. నెమ్మదిగా కొంతకాలమునకు శాంతి నొందించవలయును.

శ్లో. ద్రాగభ్యాసవశాద్యాతి యదా తే వాసనోదయమ్,
తదాభ్యాసస్య సాఫల్యం విద్ధి త్వమరిమర్దన.

తా. మృదువగునుపాయముచేత(శత్రుమిత్రాదులయందు

సమబుద్ధిని గలపురుషుచేత శీఘ్రముగానే చిత్తమునందు పుణ్యవాసనలు పుట్టనేని, తాను చేసినప్రయత్నము సఫలమైన దని తలఁపవలయును. స్వల్పకాలమునకే యిటువంటిపుణ్యవాసనలు పుట్టునా యని సంశయింపఁ దగదు.

శ్లో. సందిగ్ధాయామపి భృశం శుభామేవ సమాహర,
శుభాయాం వాసనావృద్ధౌ తాత దోషో న కశ్చన.

తా. అభ్యసింపఁబడు పుణ్యవాసనలు సంపూర్ణముగాఁ బుట్టెనా లేదా యను సంశయము కలిగినప్పుడు తిరిగి పుణ్యవాసనలకు సాధకములగు నుపాయములను విడువక యభ్యసింపనే వలయును. పుణ్యవాసనలకు వృద్ధి గలుగఁజేసినపక్షమందు హాని లేదు. లోకములో సహస్రగాయత్రీమంత్రజపమును జేయసంకల్పించినపురుషునకు పదియవశతమందు పదియవశతమును జపించినానా లేదా యను సంశయముకలిగి తిరిగి పదియవశతమును జపించితే జపముపూర్ణము గాకయుండెనా పూర్ణమగును. అయియుండెనా అధికమగును. అధికమైనందున సహస్రగాయత్రీజపమునకు హాని లేదు గదా.

శ్లో. అవ్యుత్పన్నమనా యావద్భవానజ్ఞాతతత్పదః,
గురుశాస్త్రప్రమాణైస్తు నిర్ణీతం తావదాచర.

తా. నీవుపరమాత్మస్వరూపమును ఎఱుఁగనందునను పరమాత్మస్వరూపమందుఁ జేరనిచిత్తవృత్తికలవాఁడవై యెంతవరకునుందువో, యంతవఱకుసద్గురూపదేశముచేతసచ్ఛాస్త్రపరిశీలనముచేతను పరమాత్మతత్త్వమును విచారించుచుండుము.

శ్లో. తతః పక్వకషాయేణ నూనం విజ్ఞాతవస్తునా,
శుభోఽప్యసౌ త్వయా త్యాజ్యో వాసనౌఘో నిరోధినా.

తా. చిత్తమునందుండు మాలిన్యము లన్నియు నశించి, యాపరమాత్మస్వరూపము బాగుగా తెలియఁబడినతరువాత పరమాత్మస్వరూపమం దేకాగ్రనిష్ఠ గల చిత్తవృత్తిచేత పూర్వ మభ్యసింపఁబడిన పుణ్యవాసనల నన్నిటిని విడువవలయును. అనఁగా పరమాత్మయందు చిత్తమును చేర్చి యితరముల నన్నిటిని మఱవవలయునని భావము.

శ్లో. యదతిసుభగమార్యసేవితం త
చ్ఛుభమనుసృత్య మనోజ్ఞభావబుద్ధ్యా,
అధిగమయ పదం యదద్వితీయం
తదను తదప్యవముచ్య సాధు తిష్ఠ.

తా. ఏపుణ్యకార్యముసర్వజనమనోరంజకమును,సత్పురుషులచేత నాచరించఁబడునట్టిదియుగా నుండునో, అటువంటి పుణ్యకార్యమును నిష్కపటమగు బుద్ధిచేత నాచరించి, అందుచేత నద్వితీయమును సచ్చిదానందస్వరూపము నగుపరమాత్మను తెలుసుకొని అనంతరము ఆపుణ్యవాసనలను కూడవిడిచి కేవలపరమాత్మస్వరూపానుసంధానపరుఁడవై యుండుము

వ. అని యీప్రకారము వసిష్ఠమహాముని శ్రీరాములవారికుపదేశించిరి గనుక యోగాభ్యాసాదిపురుషప్రయత్నము చేత ప్రారబ్ధకర్మసంపాదితము లగుకామక్రోధాదిచిత్తవృత్తుల నభిభవించి జీవన్ముక్తిసుఖము నొందవచ్చు ననుటకు సంశయము లేదు. ఇది జీవన్ముక్తియొక్కస్వరూపము. ఇఁకను జీవన్ముక్తికల ననుటకు ప్రమాణ మేమి యను రెండవ ప్రశ్నకుసమాధానము చెప్పఁబడును. జీవన్ముక్తి కల దనుటయందు శ్రుతిస్మృతివాక్య

ములు ప్రమాణములు. ఈవాక్యములు కఠవల్లి మొదలగు నుపనిషత్తులలో పఠింపఁబడియున్నవి. అది యెటువలెనం టే-

శ్రు. 'విముక్తశ్చ విముచ్యతే.' యని కఠవల్లివాక్యము.

తా. దృష్టబంధనమని యదృష్టబంధమని బంధము రెండు విధములు. అందులో దృష్టబంధమనఁగా కామక్రోధలోభాది చిత్తవృత్తులు. అదృష్టబంధమనఁగా ముందు రాఁబోవు దేహము. తత్త్వజ్ఞాని జీవితకాలమందే యోగాభ్యాసముచేత కామక్రోధాదిదృష్టబంధములవల్ల విశేషముగా విడువఁబడి దేహపాతానంతరమందు (మరణానంతరము) అదృష్టబంధమగు నుత్తరదేహసంబంధమువల్లను విశేషముగా విడువఁబడునని శ్రుత్యర్థము. జ్ఞానోత్పత్తికి పూర్వమునందును జ్ఞానోత్పత్తికొరకు శమదమాదిసాధనముల సంపాదించుకాలమునందును కామక్రోధాదివృత్తులవలన విడువఁబడినవాఁడై నప్పటికి, ఉత్పన్నములగు వృత్తులను ప్రయత్నముచేత నివారింపవలసి యుండును గనుక కామక్రోధాదివృత్తులవలన విడువఁబడినవాఁడని మాత్రము చెప్పఁబడును. జీవన్ముక్తిదశయందు బంధకములగు కామక్రోధాదివృత్తులు పుట్టనే పుట్టవు గనుక కామక్రోధాదివృత్తులవలన విశేషముగా విడువఁబడు నని చెప్పినది. ఆప్రకారమే మహాప్రలయమునందు దేహము నశించినతరువాత చాలకాలమువరకు నుత్తరదేహసంబంధ మను నదృష్టబంధము లేదు గనుక మహాప్రలయమునందు నశించినదేహముగల పురుషుఁ డుత్తరదేహసంబంధమువలన విడువఁబడినవాఁడని మాత్రము చెప్పఁబడును. తత్త్వజ్ఞానముగలిగి దేహపాతమునొందిన పురుషుఁడైతే యెప్పటికి నుత్తరదేహసంబంధ

మును పొందు నదిలేదు గనుక నుత్తరదేహసంబంధమువలన విశేషముగా విడువఁబడునని శ్రుతిచెప్పినది.

శ్రు. యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది శ్రితాః,
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే.

అని బృహదారణ్యశ్రుతివాక్యము.

తా. తత్వజ్ఞానియొక్క హృదయమునం దావిర్భవించు కామక్రోధాదివృత్తులు యోగాభ్యాసాతిశయముచేత నెప్పుడుతిరిగి పుట్టకుండ నశించునో అప్పుడు ఆతత్త్వజ్ఞాని ముక్తుఁడవును. ఈదేహమునందుండియు అవిచ్ఛిన్నపరమానంద బ్రహ్మస్వరూపము నొందును.

శ్రు. సచక్షురచక్షురివ సకర్ణోఽకర్ణ ఇవ సమనా అమనా ఇవ.

అని మఱియొకశ్రుతివాక్యము.

తా. దృఢమైన బ్రహ్మతత్త్వసాక్షాత్కారము గల పురుషుఁడు నేత్రములు కలవాఁడైనప్పటికి నితరవస్తువులను చూచుటయు, కర్ణములు కలవాఁడైనప్పటికి నితరశబ్దములను వినుటయు, మనస్సుకలవాఁడైనప్పటికి నితరవిషయముల నాలోచించుటయును లేనివాఁడే యని అర్థము. అనఁగా బ్రహ్మజ్ఞాని బ్రతికియుండినకాలమందు దేహేంద్రియాదిసంబంధము కలవాఁడుగా నున్నప్పటికిని కేవలబ్రహ్మస్వరూపానుసంధానపరుఁ డగుటవలన దేహేంద్రియాదివ్యాపారములు లేనివాఁడై యుండు నని భావము.

వ. ఇటువంటి శ్రుతు లనేకములు కలవు. స్మృతుల యందును జీవన్ముక్త, స్థితప్రజ్ఞ, భగవద్భక్త, గుణాతీత, బ్రాహ్మ

ణ, అతివర్ణాశ్రమి యనునామములచేత జీవన్ముక్తుఁ డగుపురుషుఁడు వ్యవహరింపఁబడుచున్నాఁడు. అది యెటువలె నంటే, వాసిష్ఠరామాయణమునందు—

శ్లో. నృణాం జ్ఞానైకనిష్ఠానా మాత్మజ్ఞానవిచారిణామ్,
సా జీవన్ముక్తతోదేతి విదేహోన్ముక్తతా యథా.

అని వసిష్ఠవచనము.

రా. ఆత్మతత్త్వజ్ఞానము కలిగి లౌకికవైదికసర్వకర్మపరిత్యాగము చేసి పరమహంసాశ్రమము నంగీకరించిన మహాపురుషులకు విదేహముక్తివలె జీవన్ముక్తియు నావిర్భవించును. జీవన్ముక్తివిదేహముక్తులయం దాత్మానుభవము తుల్యము. ద్వైతప్రపంచముయొక్క అదర్శనమును తుల్యము. లోకమునం దుండుపురుషులయొక్కదృష్టిచేత తత్త్వజ్ఞానికి దేహమున్నట్లు కనుపడినప్పుడు జీవన్ముక్తియని దేహము లేనట్లు కనుపడినప్పుడు విదేహముక్తియని వ్యవహరింపఁబడును అని వసిష్ఠమహాముని చెప్పఁగా శ్రీరాములు—

శ్లో. బ్రహ్మన్ విదేహముక్తస్య జీవన్ముక్తస్య లక్షణమ్,
బ్రూహి యేన తథైవాహం యతే శాస్త్రగయా దృశా.

రా. ఓస్వామీ! విదేహముక్తునియొక్కయు జీవన్ముక్తునియొక్కయు లక్షణములను నాకు చెప్పవలయును. ఆలక్షణములను విని నేను శాస్త్రోక్తమార్గముచేత జీవన్ముక్తిదశ నొందుటకు యత్నించెదను అని యడుగఁగా వసిష్ఠమహాముని చెప్పుచున్నాఁడు.

శ్లో. యథాస్థిత మిదం యస్య వ్యవహారవతోఽపి చ,
అస్తం గతం స్థితం వ్యోమ స జీవన్ముక్త ఉచ్యతే.

తా. ఈకనుపడు గిరినదీసముద్రాదిప్రపంచమంతయు ఆయాపురుషులయొక్క దేహేంద్రియాదివ్యవహారములతో (నేను మనుష్యుఁడను, నేను చూచుచున్నా నను వ్యవహారములతో)కూడ మహాప్రలయమందు పరమేశ్వరునిచేత సంహరింపఁబడి స్వరూపశూన్యముగా నశించును. జీవన్ముక్తిదశయందాలాగుననశింపదు. తత్వజ్ఞానియొక్క దేహేంద్రియాదివ్యవహారము లన్యపురుషనిష్ఠములై యుండును. అనఁగా తత్వజ్ఞాని బ్రహ్మైకనిష్ఠకల వాఁడగుటచే నతనిదేహేంద్రియాదివ్యాపారము లతనికి స్ఫురించకపోయినా అన్యపురుషులకు స్ఫురించుచుండు నని భావము. గిరినదీసముద్రాదిప్రపంచమును అప్పుడు పరమేశ్వరునిచేత సంహరింపఁబడనందున తత్వజ్ఞునికంటె నితరులగు పురుషులకందఱికి స్ఫురించుచుండును. తత్వజ్ఞున కితర ప్రపంచమును తెలియఁజేయువృత్తి లేనందున సుషుప్తికాలమందువలె సకలప్రపంచమునశించును. స్వప్రకాశమైన పరమాత్మస్వరూపము మాత్రము స్ఫురించుచుండును.

ఇతఁడే జీవన్ముక్తుఁ డనఁబడును. ఇదియే జీవన్ముక్తునియొక్క లక్షణము. అయితే తత్వజ్ఞానములేని పురుషుఁడు సుషుప్తికాలములో జీవన్ముక్తునితో సమానుఁడగు నని శంకింపఁదగదు. తత్వజ్ఞానము లేనిపురుషునకు ఉత్తరకాలమందుఁ బుట్టు స్థూలవృత్తులు లేకపోయినా ఉత్తరకాలమందుఁబుట్టు స్థూలవృత్తులకు కారణములగు వాసనలున్నందున జీవన్ముక్తునితో సామ్యము లేదు.

జీవన్ముక్తునకు సమాధిదశలో వృత్తులే లేవు. వ్యుత్థానదశలో కనుపడు వృత్తులు చమురు లేని దీపమువలె నాశితప్రాయస్థితిలో నున్నందున వృత్త్యంతరములను పుట్టించు సామర్థ్యము గలవిగావు.

శ్లో. నోదేతి నాస్తమాయాతి సుఖదుఃఖే ముఖప్రభా।
యథాప్రాప్తస్థితిర్యస్య స జీవన్ముక్త ఉచ్యతే.

తా. ప్రశంసనాదులవలన నితరులు స్తుతిసత్కారాదిపూజలను చేయుటవలనను, సుఖము ప్రాప్తించినా సంతోషమునొందనివాడును, ధనహాని తిరస్కారము మొదలగువానివల్ల దుఃఖము ప్రాప్తించినా దైన్యమును బొందనివాడును, స్వప్రయత్నము లేక ప్రారబ్ధకర్మచే ప్రాప్తించిన భిక్షాన్నమాత్రముచేత దేహధారణమును చేయువాడును జీవన్ముక్తుడనబడును. బ్రహ్మతత్త్వజ్ఞునికి సమాధిదశ యని వ్యుత్థానదశ యని రెండు దశలు గలవు. సమాధిదశ యనగా బ్రహ్మస్వరూపమందు చిత్తవృత్తి లీనమైయుండు కాలము. వ్యుత్థానదశ యనగా బాహ్యవిషయములయందు చిత్తము ప్రవర్తించు కాలము. ఇందులో సమాధిదశయందు ప్రశంసనసత్కారాదులు ప్రకాశించుటయే లేదు. వ్యుత్థానదశలయందు కొంచెము ప్రకాశించినా బ్రహ్మేతరములగు విషయము లన్నియు మిథ్యయనుజ్ఞానము దృఢముగానున్నందున జీవన్ముక్తునకు ప్రశంసనాదికార్యములయందు హర్షవిషాదములు పుట్టును.

శ్లో. యో జాగర్తి సుషుప్తిస్థో యస్య జాగ్రన్న విద్యతే,
యస్య నిర్వాసనో బోధః స జీవన్ముక్త ఉచ్యతే.

తా. ఏపురుషుఁడు సుషుప్తిదశలోనుండియు జాగ్రతగలవాఁడై యుండునో, యెవనికి జాగ్రదవస్థయు లేదో యెవనియొక్క జ్ఞానము వాసనాశూన్యమైయుండునో, అతఁడు జీవన్ముక్తుఁడనఁబడును. అనఁగా చక్షురాదీంద్రియములు తమతమగోళములయందుండి విషయములను గ్రహించుకాలము జాగ్రద్దశ యనిమనస్సు ఇంద్రియములయందుఁ జేరక విలీనమైయుండుదశ సుషుప్తిదశ యనిచెప్పఁబడును. జీవన్ముక్తుఁడు మనస్సు పరమాత్మయందు లీనమైయున్నందున సుషుప్తిదశలోనున్నవాఁడని చక్షురాదీంద్రియములు గోళములలోనున్నందున జాగ్రద్దశలోనున్నవాఁడని చక్షురాదీంద్రియములు గోళములలోనుండియు విషయములను గ్రహించక పోవుటచేత జాగ్రద్దశ లేనివాఁడని చెప్పవచ్చును. జీవన్ముక్తునియొక్క జ్ఞానమునందు పరమాత్మస్వరూపము తప్ప తక్కినవిషయము లేవియు స్ఫురింపనందున, ఆతనియొక్క జ్ఞానము వాసనాశూన్యమైయుండు నని భావము.

శ్లో. రాగద్వేషభయాదీనా మనురూపం చరన్నపి,
యోఽంతర్వ్యోమవదత్యచ్ఛః స జీవన్ముక్త ఉచ్యతే.

తా. పురుషుండు రాగమున కనురూపమగు భోజనాది వ్యాపారమును వేషమున కనురూపమగు చార్వాకకాపాలాదిశాస్త్రములయందు వైముఖ్యమును, భయమున కనురూపమగుసర్పవ్యాఘ్రాదులనుజూచి తొలఁగిపోవుటయును మాత్సర్యమున కనురూపమగు నితరయోగులకంటె తా నెక్కువగాసమాధిననుష్ఠించుటయునువ్యుత్థానదశయందుపూర్వాభ్యాసముచేతఁ జేయుచున్నవాఁడై నను మనస్సునందు కాలుష్యము

లేనివాఁడౌటచేత ఆకాశమువలె సతిస్వచ్ఛస్వభావము కల వాఁడై యుండునో అతఁడు జీవన్ముక్తుఁ డనఁబడును.

శ్లో. యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే,
కుర్వతోఽకుర్వతో వాపి స జీవన్ముక్త ఇష్యతే.

తా. లోకమునం దజ్ఞాని యగు పురుషుఁడు శాస్త్రోక్తములగు సంధ్యావందనాదికార్యములను జేయునప్పుడు నేను చేయుచున్నానని యాత్మయం దహంకారమును జేర్చును. ఈసత్కర్మచేత స్వర్గమును బొందఁగల నని సంతోషముచేత బుద్ధి లిప్తమగును. శాస్త్రోక్తకర్మలను చేయనికాలమందు నేను విడచినానని చిదాత్మయం దహంకారమును జేర్చును. స్వర్గము లాభించదను విషాదముచేత బుద్ధి లిప్తమగును. ఈప్రకారమే లౌకికకామ్యకార్యములయొక్క అనుష్ఠానానుష్ఠానములయం దహంకారబుద్ధిలేపములు కలుగును. ఏతత్త్వజ్ఞానికి శాస్త్రీయలౌకికకామ్యకార్యములయొక్క అనుష్ఠానానుష్ఠానములయందు అహంకారము హర్షవిషాదములచేత బుద్ధిలేపమును కలుగదో ఆతత్వజ్ఞుఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడును.

శ్లో. యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః,
హర్షామర్షభయోన్ముక్తః స జీవన్ముక్త ఉచ్యతే.

తా. తిరస్కారము, తిట్టుట, కొట్టుట మొదలగుదుష్కార్యములయందుఁ బ్రవర్తింపనందున, ఏతత్త్వజ్ఞానివలన లోకులు భయమును బొందరో యిటువంటి మహానుభావునివిషయమై లోకులుతిరస్కారతాడనాదివ్యాపారముల నాచరించరు. ఎవఁడైనా ఒకానొకదుష్టుఁడు చేసినా ఏతత్త్వజ్ఞానియొక్క చిత్త

మునందు క్రోధాదివికారములు పుట్టవో యేమహానుభావుఁడు హర్షక్రోధభయాదివికారములు లేక సర్వదా పరమానందభరితుఁడై యుండునో అతఁడు జీవన్ముక్తుఁ డని చెప్పఁబడును.

శ్లో. శాంతసంసారకలనః కలావానపి నిష్కళః,
యః సచిత్తోఽపి నిశ్చిత్తః స జీవన్ముక్త ఉచ్యతే.

తా. శత్రుమిత్రమానావమానాదులయందు సమబుద్ధికలవాఁడును, సమస్తమైనచతుష్షష్టివిద్యలు బాగుగా తెలిసియున్నప్పటికి,ఆవిద్యలయందభిమానముగాని వాటిని లోకులయందు బ్రకాశింపచేయడము గాని లేనివాఁడును స్వరూపతః మనస్సుకలిగియున్నప్పటికి వృత్తిశూన్యముగానున్నందున మనస్సు లేనివానివలె నుండువాఁడును జీవన్ముక్తుఁడని చెప్పఁబడును.

శ్లో. యస్సమస్తార్థజాతేషు వ్యవహార్యపి శీతలః,
పరార్థేష్వివ పూర్ణాత్మా స జీవన్ముక్త ఉచ్యతే.

తా. పరగృహములయందగు వివాహాదికార్యములకుఁ బోయివారియొక్క సంతోషముకొఱకు తాంబూలప్రదానాది కార్యములయందు బ్రవర్తించుచున్నప్పటికి నాకు నింతపెత్తనమును ఇచ్చిరను హర్షమునుగాని యీపని చేయవలసివచ్చెనే యనివిషాదమునుగాని యేతత్వజ్ఞుఁడు బొందఁడో ఆప్రకారమే స్వకార్యములయందుఁ బ్రవర్తించునప్పుడును హర్షవిషాదములనొందఁడో, పరిపూర్ణాత్మస్వరూపానుసంధానపరుఁడగు నామహాపురుషుఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడును. ఇది జీవన్ముక్తునియొక్క లక్షణము ఇఁకను విదేహముక్తునియొక్క లక్షణము చెప్పఁబడును.

శ్లో. జీవన్ముక్తపదం త్యక్త్వా శరీరే కాలసాత్కృతే,
విశత్య దేహముక్తత్వం పవనోఽస్పందతామివ.

తా. వాయు వెప్పుడును చలించుస్వభావము కలదైనప్పటికి, ఒకానొకసమయమునందు చలనమును విడిచి నిశ్చలమైయుండునటుల, ఈచిదాత్మ అవిద్యచేత తనయందు కల్పింపఁబడిన శరీరేంద్రియాదుల నవిద్యతోకూడ విడిచి కేవల స్వరూపముతోనుండును. అదియే విదేహమోక్ష మని చెప్పఁబడును.

శ్లో. విదేహముక్తో నోదేతి నాస్తమేతి న శామ్యతి,
న సన్నాసన్నదూరస్థో న చాహం న చ చేతరః.

తా. విదేహముక్తి నొందినపురుషుఁడు లింగదేహమిచ్చుటనే నశించినందున హర్షవిషాదములను బొందుట గాని వాటిని విడుచుట గాని లేదు. అనఁగా హర్షవిషాదముల యొక్క ప్రాప్తిత్యాగములు లింగదేహధర్మములే కనుక లింగదేహము నశించినప్పుడు హర్షవిషాదములయొక్క ప్రాప్తిత్యాగము లసంభావితములని తాత్పర్యము. మాయోపాధికుఁడై జగత్కారణమగుపరమేశ్వరుఁ డని కాని పృథివ్యాదిభూతము లని కాని దేవమనుష్యాదిశరీరము లని కాని మాయాతీతమగు శుద్ధచిన్మాత్రమని కాని అవిద్యోపాధికుఁడగు వ్యష్టిజీవుఁడని కాని వ్యవహరించుటకు శక్యమైన వాఁడు కాఁడు. అనఁగా సర్వవికారశూన్యుఁడై యవాఙ్మానసగమ్యుఁడై యుండును.

వ. ఇటువంటి విదేహముక్తితో జీవన్ముక్తికి సామ్యమును చెప్పుటచేతజీవన్ముక్తియందునిర్వికల్పసమాధియొంత ఆధిక్యము

నొందునో, అంత ఉత్కృష్ట జీవన్ముక్తికి కలుగును. కనుకనే జీవన్ముక్తి మూఁడుభూమికలు కలదిగా నున్నది. ఈమూఁడు భూమికలయొక్క స్వరూపలక్షణము ఉత్తరగ్రంథమునందు వివరింపఁబడును.

భగవద్గీతలయొక్క రెండవయధ్యాయమునందు స్థితప్రజ్ఞశబ్దముచేత జీవన్ముక్తుఁడు వ్యవహరింపఁబడుచున్నాఁడు అదియెటువలెనంటే? అర్జునుఁడు భగవంతుఁడగు కృష్ణుని నడుగుచున్నాఁడు.

శ్లో. స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ,
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్.

తా. తత్వజ్ఞానము ప్రజ్ఞయనఁ దగును. అది స్థితమని యస్థితమని రెండువిధములు. జారునియం దనురాగముగల స్త్రీయొక్క బుద్ధి సమస్తకార్యములయందు జారునే ధ్యానముచేయుచు అభ్యాసముచే చేయఁబడు గృహకృత్యములనప్పుడేమరచిపోవునటుల పరమవైరాగ్యముఁ గూడి యోగాభ్యాసాతిశయముచేత మిక్కిలి స్వాధీనపడినచిత్తముగల పురుషునియొక్కబుద్ధిశ్రవణమననాదులచేత పరమాత్మస్వరూపజ్ఞానము కలుగఁగానే ఆపరమాత్మస్వరూపమును నిరంతరముగా ధ్యానించుచు అభ్యాసముచేతచేయఁబడు లౌకికవైదికకర్మలనప్పుడే మరచి పోవును. ఆజ్ఞానమే స్థితప్రజ్ఞయని చెప్పఁబడును. పరమవైరాగ్యాదిగుణములు లేనివానికి ప్రాచీనపుణ్యముచేత నొకానొకప్పుడు తత్త్వజ్ఞానము కలిగినా, అప్పుడే మరచిపోవును. ఇదియే యస్థితప్రజ్ఞయని చెప్పఁబడును. ఈయర్థము వసిష్ఠమహాముని చేత

శ్లో. పరవ్యసనినీ నారీ వ్యగ్రాఽపి గృహకర్మణి,
తదేవాస్వాదయత్యంతః పరసంగరసాయనమ్.
ఏవం తత్త్వే పరే శుద్ధే ధీరో విశ్రాంతిమాగతః,
తదేవాస్వాదయత్యంతర్బహి ర్వ్యవహరన్నపి.

అనుశ్లోకములచే చెప్పఁబడినది.

తా. జారునియం దాసక్తి గలస్త్రీ గృహకృత్యముల నాచరించుచున్నప్పటికిని, చిత్తమునం దాజారపురుషసంభోగ సుఖమునే యేప్రకార మనుభవించుచుండునో, ఆప్రకారము పరమాత్మస్వరూపసాక్షాత్కారము గల పురుషుఁడు బాహ్యమునందు లౌకికవైదికకార్యముల నాచరించుచున్నప్పటికిని మనస్సునం దాపరమాత్మస్వరూపమునే విడువక ధ్యానించుచుండును అని భావము.

శ్లో. పుంఖానుపుంఖవిషయేక్షణతత్పరోఽపి
బ్రహ్మావలోకనధియం న జహాతి యోగీ,
సంగీతతాళనటనాదివశంగతోఽపి
మౌళిస్థకుంభపరిరక్షణధీర్నటీవ.

అని మఱియొకప్రదేశమునందుఁ జెప్పియున్నది.

తా. నిపుణముగ నాట్యము చేయువాఁడు సంగీతము, తాళము, నాట్యము వీనిని చేయుచున్నప్పటికిని శిరస్సునందుండు కలశమునందే చిత్తము నేమరకుండ నిలిపినటుల బ్రహ్మసాక్షాత్కారనిరతుఁ డగువాఁడు అవిచ్ఛిన్నపరంపరగా సంభవించు సుఖదుఃఖాదివిషయముల ననుభవించుచున్నప్పటికిని,

అంతఃకరణమును అద్వితీయచిదానంద బ్రహ్మస్వరూపమునందే చేర్చియుండు నని భావము.

ఇందులో స్థితప్రజ్ఞగల పురుషుఁడు సమాహితుఁడని వ్యుత్థితుఁడని రెండువిధములు. సమాహితుఁడనఁగా నేకాగ్ర చిత్తుఁడై సమాధియందు పరమాత్మస్వరూపమును ధ్యానించువాఁడు. వ్యుత్థితుఁడనఁగా బాహ్యవిషయములయందు చిత్తముఁ బ్రవర్తించుచుండఁగాఁ జూచుచుండువాఁడు. ఈ యిద్దఱియొక్క లక్షణమును పూర్వోత్తరవాక్యములచేత నర్జునుఁ డడుగు చున్నాఁడు.—సమాహితుఁ డగుస్థితప్రజ్ఞుఁడు ఏమి లక్షణము కలవాఁడు? అనఁగా సమాధియం దుండుస్థితప్రజ్ఞుఁ డగుపురుషుఁడు లోకులచేత నేమని వ్యవహరింపఁబడు నని యర్థము. వ్యుత్థితుఁడగుస్థితప్రజ్ఞుఁ డెటువంటివ్యవహారములనాచరించును? అనఁగా వ్యుత్థానదశయందు స్థితప్రజ్ఞునియొక్క భాషణాసనగమనము లన్యజనులకంటె నేప్రకారముచేత భిన్నములుగా నుండు నని యర్థము. ఇందుకు శ్రీభగవానులు ప్రత్యుత్తరమును జెప్పుచున్నారు —

శ్లో. ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్,
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే.

తా. కామములు బాహ్యము లని, అంతరము లని, వాసనామాత్రము లని మూఁడుప్రకారములు. సంపాదింపఁబడిన భక్ష్యభోజ్యాదులు బాహ్యము లనఁబడును మనోరథముచేత నాశింపఁబడునవి యాంతరము లనఁబడును. మార్గమునఁ బోవుచుండఁగాఁ గనఁబడు తృణపర్ణాదులవలె కనఁబడు

చున్నప్పటికి అపేక్షించఁబడని భక్ష్యభోజ్యములు వాసనామాత్రము లనఁబడును. సమాహితుఁ డగుస్థితప్రజ్ఞుఁడు సకల చిత్తవృత్తులను నశింపఁజేసియున్నందున నీత్రివిధకామములు లేనివాఁడై యుండును. అయినను ముఖప్రసాదము మొదలగు గుఱుతులచేత లోపల సంతోషమున్నట్టు కనఁబడును. కామములన్నియు పూర్వమునందే విడువఁబడినందున ఈసంతోషము కామములచేత కలిగినది గాదు. పరమానందస్వరూపమగు పరమాత్మచిత్తవృత్తియందు సాక్షాత్కరించినందువల్లనే యీసంతోషము కలిగినది. ఇది యసంప్రజ్ఞాతసమాధి యగుటవలన సంప్రజ్ఞాతసమాధియందు వలె నాత్మస్వరూపానుభవముచేత నైనయానందము అంతఃకరణవృత్తిచేత నాస్వాదింపఁబడదు. స్వప్రకాశచిద్రూపముగానే ప్రకాశించును. ఈసమాహితుని యొక్క సంతోషము సాత్త్వికవృత్తి ప్రతిబింబితానందాంశము కాదు. ఇది మొదలగు లక్షణబోధకవాక్యముల చేత సమాహితుఁడగుస్థితప్రజ్ఞుఁడువ్యవహరింపఁబడును. సంప్రజ్ఞాతాసంప్రజ్ఞాతసమాధులయొక్క లక్షణము ముందువివరింపఁబడును.

శ్లో. దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః,
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే.

తా. రాగద్వేషాదికారణములచేత రజోగుణోద్రేకమునందుఁ బుట్టి దేహేంద్రియములను పరితపింపఁజేయు ప్రతికూలమగు చిత్తవృత్తి దుఃఖ మనఁబడును. ఇటువంటిదుఃఖము ప్రాప్తించినసమయమునందు నేను మహాపాపిని; ఛీ నే నెందుకు జీవింపవలె నను పశ్చాత్తాపము గలవాఁడుగా కనఁబడుచు

తమోగుణోద్రేకముచేత కలిగినందున భ్రాంతిరూపమగు చిత్తవృత్తియుద్వేగ మనఁబడును. ఈయుద్వేగ మనుచిత్తవృత్తి వివేకమువలె కనఁబడుచున్నప్పటికిని పాపమును చేయుకాలమందు పుట్టిన పశువునకు పాపమును జేయకుండఁ బ్రతిబంధించఁ గలదు. కనుక అప్పుడు వివేకమని చెప్పఁదగియుండును. పాపము పూర్ణముగా జేయఁబడి ఫలమును చూపించుకాలమందు పుట్టినందున నిష్ప్రయోజనము గనుక భ్రాంతియని చెప్పఁదగియున్నది. రాజ్యప్రాప్తి పుత్రోత్పత్తి మొదలగు కారణములచేత సత్త్వగుణోద్రేకము గల సమయమునందు ప్రీతిరూపమై యనుకూలముగాఁ బుట్టినచిత్తవృత్తి సుఖమనఁబడును. ఇటువంటి సుఖము సంభవించినప్పుడు సుఖసాధనమగు పుణ్యమును చేయకయే వ్యర్థముగా సుఖపరంపర నపేక్షించు తమోగుణజన్యమైన చిత్తవృత్తి స్పృహయనఁబడును. సుఖదుఃఖములు ప్రారబ్ధకర్మచేత సంపాదింపఁ బడుచున్నందున వృత్తితుఁడగుస్థితప్రజ్ఞునకు సుఖదుఃఖములయందు చిత్తవృత్తి ప్రవర్తించుచున్నందునను, వాటియందు నుద్వేగస్పృహాలు పుట్టఁదగి యున్నప్పటికిని దృఢముగా నభ్యసించిన వివేకము కలవాఁ డౌటచేత నాస్థితప్రజ్ఞునకు సుఖదుఃఖప్రాప్తియందు నుద్వేగస్పృహాలుపుట్టనేరవు. రాగభయక్రోధములు తమోగుణవృత్తులు గనుక బొత్తిగా పుట్టనేరవు. ఇటువంటి పురుషుఁడే స్థితప్రజ్ఞుఁడని చెప్పఁబడును. ఈస్థితప్రజ్ఞుఁడు తనయొక్క అనుభవమును బ్రకాశింపఁజేయుచు శిష్యుల కుపదేశించుటకొఱకు సుఖదుఃఖాదిప్రాప్తికాలములయందు తనకు స్పృహోద్వేగములు లేవని వ్యక్థానకాలమందు చెప్పుచుండు నని తాత్ప

ర్యము. ఇందుచేత స్థితప్రజ్ఞుఁడు వ్యుత్థానదశయందు లౌకిక పురుషవిలక్షణముగా నేమి భాషించు ననుప్రశ్నకు నుత్తరము చెప్పఁబడినది.

శ్లో॥ యః సర్వత్రానభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభాశుభమ్,
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

తా. ఏచిత్తవృత్తి యుండఁగా సర్వవస్తువులయొక్క హానివృద్ధులు తనయం దారోపింపఁబడునో ఆచిత్తవృత్తి స్నేహ మనఁబడును. ఇటువంటి స్నేహము పుత్రమిత్రకళత్రాదుల యం దెవనికి నివృత్తమైయుండునో సుఖహేతువులగుకళత్ర పుత్రాదు లనుశుభవస్తువులను బొంది వానియొక్క గుణము లను కీర్తించుట గాని అసూయోత్పాదకము లగుటచే దుః ఖకారణములైన పరకీయధనసమృద్ధి మొదలగు నశుభవస్తువు లను చూచి వానియొక్క దోషములను కీర్తించుటగాని యెవ నికిలేదో వాఁడు స్థితప్రజ్ఞుఁ డనఁబడును. అనఁగా తనయొక్క పుత్రకళత్రాదులయొక్క గుణములను శ్లాఘించుట నిష్ప్రయోజనము ఆప్రకారమే అన్యపురుషులయొక్క ధనసమృద్ధ్యాదులను దూషించుటయును నిష్ప్రయోజనము ఇటువం టినిష్ప్రయోజనము లగు కృత్యములు తామసములు కనుక వివేకము గలపురుషునకు జనింపవు.

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఙ్గానీవ సర్వశః,
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

తా. కూర్మము సర్వకాలములయందు తనయవయవము లను ఏప్రకారము ముడుచుకొనుచునేయుండునో, యాప్ర

కారము ఏతత్త్వజ్ఞాని తన యింద్రియముల నన్నిటిని శబ్దాది విషయములయందు వ్యాపింపనియ్యక యుపసంహారమునే చేసికొనుచునుండునో అతఁడే స్థితప్రజ్ఞుఁడని చెప్పఁబడును. వ్యుత్థానదశయందే తామసవృత్తులు పుట్టని మహాపురుషునకు సమాధిదశయం దేలాగున పుట్టును.

శ్లో. విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే.

తా ప్రారబ్ధకర్మసుఖదుఃఖములకు కారణములగు చంద్రోదయము అంధకారము మొదలగు కొన్ని విషయములను స్వయముగా నిర్మించును. మఱికొన్ని గృహక్షేత్రాదివిషయములను పురుషయత్నముద్వారా నిర్మించును. ఇందులో చంద్రోదయాదివిషయములు సంపూర్ణమగు నింద్రియనిరోధ మను సమాధిచేతఁ గాని నివర్తించవు. గృహక్షేత్రాదివిషయములు సమాధిలేకపోయినను కొంతకాలమునకు స్వయముగానే నివర్తించును గాని వాటియం దుండు తృష్ణమాత్రము నివర్తించదు ఆతృష్ణయును సమాధ్యభ్యాసముచేతఁ గలుగు బ్రహ్మసాక్షాత్కారముచేత నివర్తించును. అనఁగా పరమానందస్వరూపమగు పరబ్రహ్మయొక్క ప్రాప్తి కలుగఁగానే స్వల్పానందకారణములగు గృహక్షేత్రపుత్రకళత్రాదులయం దాశ నివర్తించును.

శ్లో. యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః,
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః.
తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః,
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

తా. వివేకియగు పురుషుఁడు విషయత్యాగ బ్రహ్మదర్శనములయందుఁ బ్రయత్నమున్ను చేయుచున్నప్పటికిని బలిష్ఠములగు నింద్రియములు అభ్యాసియగు పురుషునియొక్క చిత్తమును విషయములయందు బలాత్కారముగాఁ జేర్చును. కాఁబట్టి యింద్రియముల నన్నిటిని విషయదేశసంగతములు గాకుండ నిరోధించి చిత్తమును భగవంతునియందుఁ జేర్చి నిలుపవలయును. ఎవనికింద్రియములు స్వాధీనములై యుండునో, అతనియొక్క జ్ఞానము స్థితమని చెప్పఁబడును. అనఁగా, బ్రహ్మదర్శనమందుఁ బ్రయత్నము చేయుచున్నప్పటికిని బుద్ధికి సంభవించు ప్రమాదమును నివారించుకొనుటకు మధ్యమధ్య సమాధి నభ్యసించుచుండవలయు నని భావము. ఇందుచేత స్థితప్రజ్ఞునియొక్క ఆచరణము ఏలాగంటిది యను ప్రశ్నకు సమాధానము చెప్పఁబడినది.

శ్లో. ధ్యాయతో విషయాన్ పుంసస్సంగ స్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే.
క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి.

తా. మధ్యమధ్య సమాధి నభ్యసింపనియెడల, బుద్ధికి ప్రమాదము కలుగు ప్రకారమును నిరూపించుచున్నారు. శబ్దాది విషయముల ధ్యానించువానికి ఆవిషయములయొక్క సాన్నిధ్యము ప్రాప్తించును. సాన్నిధ్యము కలుగఁగానే వాటియం దాశ కలుగును. ఆశకు ప్రతిహతి కలిగితే క్రోధము సంభవించును. క్రోధము పుట్టఁగానే యుక్తాయుక్తవివేకము నశించును. వివేకము నశించఁగానే పరబ్రహ్మతత్త్వానుసంధానము పలాయనము

నొందును అనంతరము విపరీతజ్ఞానము వృద్ధినొందుటచే తత్వ జ్ఞానమునకు మోక్షప్రదానసామర్థ్యము లేకపోవును. కనుక తత్త్వజ్ఞానమునందుఁ బ్రయత్నముచేయుపురుషుఁడు మధ్యే మధ్యే సమాధిని విడువక యాచరించవలయునని భావము.

శ్లో. రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్,
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి.

తా. విడువక చేయుసమాధియొక్క సామర్థ్యముచేత వ్యుత్థానదశయందును స్వాధీనములై రాగద్వేషాదులు లేని ఇంద్రియములచేత విషయముల ననుభవించుచున్నప్పటికిని వశీకృతాంతఃకరణము గలవాఁడౌటచేత బంధరాహిత్యము నొందును. ఇందుచేత స్థితప్రజ్ఞునియొక్క స్థితి లౌకికపురుషస్థితికంటె నేప్రకారముచేత విలక్షణమైయుండు నను ప్రశ్నకు సమాధానము చెప్పఁబడినది. ఈప్రకారము బహుశ్లోకములచేత స్థితప్రజ్ఞునియొక్క ధర్మములు చెప్పఁబడినవి.

ప్రశ్న—తత్త్వజ్ఞానమునందు కూడ వేదాంతశ్రవణమునకు సాధనముగా సంపాదింపఁబడియున్న రాగద్వేషాదిరాహిత్యమునకు తత్త్వజ్ఞానోత్తరకాలమందుండు రాగద్వేషాదిరాహిత్యమునకును భేదమేమయినా కలదా?

ఉత్తరము—కలదు. ఆభేదము శ్రేయోమార్గ మను గ్రంథమందు చెప్పఁబడినది.

శ్లో. విద్యాస్థితయే ప్రాగ్యే సాధనభూతాః ప్రయత్ననిష్పాద్యాః
లక్షణభూతాస్తు పునః స్వభావతస్తే స్థితాః స్థితప్రజ్ఞే,

జీవన్ముక్తిరితీమాం వదంత్యవస్థాం స్థితాత్మసంబంధాం
బాధితభేదప్రతిభానబాధితాత్మావబోధసామర్థ్యాత్. ఇతి.

తా. తత్వజ్ఞానోత్పత్తికి పూర్వమునందుఁ బ్రయత్నముచేత సంపాదింపఁబడియె శమదమ రాగద్వేషాదిరాహిత్యము మొదలగు గుణములు తత్త్వజ్ఞానమునకు సాధనములుగా నుండెనో ఆగుణములే తత్త్వజ్ఞానము పుట్టినతరువాత తత్త్వజ్ఞానికి స్వభావములుగా నుండులక్షణము అని చెప్పఁబడును. ఈశమదమాదిగుణములు లక్షణములుగాఁగలిగి తత్త్వజ్ఞానస్థైర్యముగల దశయే జీవన్ముక్తిదశ యని చెప్పఁడును. ఈదశయందు తత్త్వజ్ఞానస్థైర్యముచేత భేదప్రపంచము కొంచెముగానైనా స్ఫురించనేరదు.

అనఁగా తత్వజ్ఞానోత్పత్తికి పూర్వమునం దుండు రాగద్వేషరాహిత్యాదిగుణములు ప్రయత్నసంపాద్యములుగాను సాధనరూపములుగాను నుండును. ఉత్తరకాలమునం దుండు రాగద్వేషరాహిత్యాదిగుణములు అప్రయత్నసిద్ధములై స్వాభావికములుగానుండును. ఇదియే భేదము అని అర్థము.

తా. ఈజీవన్ముక్తుఁడు భగవద్గీతాద్వాదశాధ్యాయమునందు భగవద్భక్తశబ్దముచేత వ్యవహరింపఁబడియున్నాఁడు. అదియెటువలెనంటే?

శ్లో. అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ.

సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తః స మే ప్రియః.

తా. సమస్తభూతములయందు ద్వేషము లేనివాఁడును, అన్నిభూతములను మిత్రులనుగా (స్నేహితులనుగా) భావించువాఁడును, ఏభూతమునకైనా ప్రారబ్ధకర్మచేత దుఃఖము ప్రాప్తించినప్పుడు ఆదుఃఖమును చూచి సహించలేని మృదువైన చిత్తము కలవాఁడును, గృహక్షేత్రపుత్రకళత్రాదులయందు మమకారము లేనివాఁడును. దేహేంద్రియాదులయందహంకారము లేనివాఁడును, సమాధిదశయందు పరమేశ్వరార్పితచిత్తవృత్తికలవాఁడౌటచేత శత్రుమిత్రాదివిభాగజ్ఞానమే లేనందువల్లను, వ్యుత్థానదశయందు ఆత్మేతరములయం దుదాసీనత్వజ్ఞానమే యున్నందున హర్షవిషాదములు లేకపోవుటచేత సుఖదుఃఖములయందు సమత్వబుద్ధికలవాఁడును, శీతోష్ణాది ద్వంద్వములను సహించెడి స్వభావము కలవాఁడును, సర్వకాలములయందు సర్వకామప్రాప్తికలవానివలె నానందభరితుఁడై యుండువాఁడును, చిత్తమును విషయములయందుఁ బ్రవేశించకుండ చేయువాఁడును, కుటిలయుక్తులచేత నిరాకరింపఁ దగని దృఢమైన తత్త్వజ్ఞానము కలవాఁడును, పరమేశ్వరునియందు చేర్చిన మనోబుద్ధులు కలవాఁడును భగవద్భక్తుఁ డనఁబడును.

శ్లో. యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః,
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో యః స చ మే ప్రియః.

తా. సర్వభూతముల కభయము నిచ్చి పరమహంసాశ్రమము నంగీకరించినందున నెవనివల్ల సర్వభూతములకు భయము

లేదో, నిష్కారణముగా సాధుజనులను భయపెట్టెడి స్వభావము గల దుష్టజనులవలన నెవఁడు అద్వైతాత్మసాక్షాత్కారము కలవాఁడగుటచే భయము నొందఁడో, ప్రియవస్తువులయొక్క లాభమునందు హర్షము లేనివాఁడును, ఎదుటివారియొక్క సమృద్ధిని చూచి సహింపలేనిస్వభావము లేనివాఁడును, సర్పవ్యాఘ్రాది జంతువులవల్ల భయము లేనివాఁడును, విజనస్థలమందు నేను ఒంటరిగా ఏప్రకారము నివసింపఁగలనను బుద్ధి లేనివాఁడును ఏపురుషుఁడో, అతఁడు భగవద్భక్తుఁ డనఁబడును.

శ్లో. అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః.

తా. అప్రయత్నముగా సంభవించిన భోగసాధనముల యందును స్పృహ లేనివాఁడును బాహ్యాభ్యంతరశౌచము కలవాఁడును తెలుసుకోతగి, చేయతగిన కార్యములను తెలుసుకోవడమునకును, చేయడమునకును సామర్థ్యము కలవాఁడును, తనయొక్క శత్రువుఁడును, మిత్రుఁడును పరస్పరవివాదమును పొందుచుండఁగా తా నేపక్షమును అవలంబించక యుండు వాఁడును, సుఖప్రాప్తియందును దుఃఖప్రాప్తియందును చిత్తవైకల్యము లేనివాఁడును, ఐహికాముష్మికఫలములుగల సర్వకర్మలను విడచిన పురుషుఁడు భగవద్భక్తుఁ డనఁబడును.

శ్లో. యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యః స మే ప్రియః.

తా. ఇష్టవస్తుప్రాప్తియందు హర్షమును, అనిష్టవస్తుప్రాప్తియందు ద్వేషమును ప్రాప్తములైన ప్రియవస్తువులయొక్క

నాశమునందు శోకమును, అప్రాప్తములైన ప్రియవస్తువులయం దాసయును లేనివాఁడును, సుఖదుఃఖములకు సాధనభూతము లగు శుభాశుభకర్మల నన్నిటిని సవాసనముగాఁ బరిత్యజించు స్వభావముకలవాఁడు భగవద్భక్తుఁ డనఁబడును.

శ్లో. సమః శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః,
శీతోష్ణసుఖదుఃఖేషు సమః సంగవివర్జితః.
తుల్యనిందాస్తుతిర్మౌని సంతుష్టో యేన కేనచిత్,
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్మే ప్రియో నరః.

తా. వెనుకటిశ్లోకములయందు చెప్పిన లక్షణములనే యీశ్లోకములయందు విస్తరముగా చెప్పుచున్నారు.—ఈప్రకారమే వెనుకటిశ్లోకములయందును పునరుక్తపదముల కర్థమును నిశ్చయింపవలయును. శత్రుమిత్రులయందు, సుఖదుఃఖములయందు, మానావమానములయందు, శీతోష్ణములయందు, సమానబుద్ధి కలవాఁడును సకలవిషయములయందును ఇది మంచిది, ఇది మంచిది కాదను అధ్యాస (ఆరోపణ) లేనివాఁడును నెదటిమనుష్యులు తనయందు దోషములను చెప్పి నిందించినా? గుణములను చెప్పిస్తుతించినా! వికారముల నొందనిచిత్తవృత్తి కలవాఁడును, ఎదటిమనుష్యులయొక్క గుణదోషములను కీర్తించుటయందు మౌనము కలవాఁడును, స్వప్రయత్నము లేకయే కేవలప్రారబ్ధకర్మచేత ప్రాప్తించిన భిక్షాన్నాదులచేత తృప్తి నొందువాఁడును, నియతమగు నివాసములేనివాఁడును, పరమాత్మయందు వ్యాపారాంతరశూన్యమైన నిష్ఠ కలవాఁడును, భగవద్భక్తుఁ డనఁబడును. ఈప్రకారముగా భగవద్భక్తశబ్దముచేత జీవన్ముక్తుఁడు

వ్యవహరింపఁబడెను. భగవత్కృష్ణుఁడగు జీవన్ముక్తునియందు చెప్పిన అద్వేష్టృత్వసర్వభూతమిత్రత్వాదిగుణములు జ్ఞానోత్పత్తికి పూర్వకాలమునందు సంపాదింపఁబడినవై నప్పటికి జ్ఞానోత్తరకాలమునం దీ గుణములయందు విశేషములు సురేశ్వరాచార్యులవారు-

శ్లో. ఉత్పన్నాత్మప్రబోధస్య హ్యద్వేష్టృత్వాదయో గుణాః,
అయత్నతో భవంత్యేతే న తు సాధనరూపిణః.

తా. ఆత్మసాక్షాత్కారముకొఱకు సాధనములుగాఁ బ్రయత్నపూర్వకముగా సంపాదింపఁబడిన మైత్రీముదితాకరుణాదిగుణములు బ్రహ్మాత్మసాక్షాత్కారజ్ఞానము కలిగినతరువాత అప్రయత్నముగానే సిద్ధించి స్వభావములుగా నుండు నని చెప్పినారు.

భగవద్గీతాచతుర్దశాధ్యాయమునందు జీవన్ముక్తుఁడు గుణాతీతశబ్దముచేతఁ జెప్పఁబడినాఁడు అచ్చట-

శ్లో. కైర్లింగైస్త్రీన్ గుణానేతానతీతో భవతి ప్రభో,
కిమాచారః కథం చైతాంస్త్రీన్ గుణానతివర్తతే.

అని అర్జునిప్రశ్న.

తా. సత్త్వరజస్తమోగుణములయొక్క పరిణామము (అవస్థాంతరప్రాప్తి) చేతసమస్తసంసారము ప్రవర్తించుచున్నది. ఇటువంటిసంసారము నతిక్రమించియుండుటయే గుణాతీతత్వమని చెప్పఁదగియున్నది. ఎటువంటిలక్షణములు కలవాఁడై యుంటే గుణాతీతుఁడని యన్యులచేత తెలియఁదగియుండును.

ఈగుణాతీతునియొక్క చిత్త మేప్రకారముగాఁ బ్రవర్తించు చుండును. ఏసాధనముచేత నీపురుషుఁడు గుణాతీతుఁడగును.

ఈప్రశ్నకు శ్రీభగవానులుత్తరమ్ములు చెప్పుచున్నారు.-

శ్లో. ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ,
న ద్వేష్టిసంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి.
ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే,
గుణావర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే.

తా. ప్రకాశప్రవృత్తిమోహములనెడి సత్వరజస్తమోగుణములు జాగ్రత్స్వప్నదశలయందుఁ బ్రవర్తించుచుండును. సుషుప్తిసమాధిదశలయందు నివర్తించుచుండును. గుణములయొక్క ప్రవృత్తి అనుకూలప్రవృత్తి యని, ప్రతికూలప్రవృత్తియని రెండువిధములు. అందులో వివేకహీనుఁడగు పురుషుఁడు జాగ్రద్దశయందు గుణములయొక్క ప్రతికూలప్రవృత్తియందు ద్వేషమును, అనుకూల ప్రవృత్తియందపేక్షను చేయును. గుణాతీతుఁడగుపురుషుఁడో, సర్వవిషయములయందు ననుకూలప్రతికూలాధ్యాసము లేనివాఁడౌటచేత ననుకూల ప్రతికూలప్రవృత్తులయందు రెంటియందును రాగద్వేషములు లేనివాఁడై యుండును. లోకములో నిద్దఱు జగడమాడుచుండ, తటస్థుఁడగు పురుషుఁడు తాను కేవలముగా నుదాసీనుఁడై యుండి, ఆకలహకారులయొక్క జయపరాజయములచేత నేప్రకారము చలింపఁజేయఁబడఁడో యాప్రకారమే గుణాతీతుఁడగు తత్వజ్ఞుఁడు సత్వరజస్తమోగుణపరిణామము లగు విషయేంద్రియాదులు పరస్పరమొకటియం దొకటి వర్తించుచున్నవి? అసంగుఁడనైన నాకు

నీగుణములచేత నేమి లాభ నష్టము లున్నవి యని వివేకజ్ఞా నముచేత నుదాసీనుఁడై యుండును. ఇందుచేత గుణాతీతుని యొక్క చిత్తము ప్రవర్తించు ప్రకారము చెప్పఁబడినది.

శ్లో. సమదుఃఖసుఖస్స్వస్థః సమలోష్టాశ్మకాంచనః,
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః,
మానావమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః,
సర్వారంభపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే.

తా. సుఖదుఃఖములయందు సమబుద్ధికలవాఁడును, బంగారమును చూచినా మంటిని రీతిని చూచినట్లు ఆదరము లేనివాఁడును, ఇష్టానిష్టములయందు నిందాస్తుతులయందును తుల్యజ్ఞానము కలవాఁడును, మానావమానములయందు శత్రు మిత్రులయందును సమానబుద్ధికలవాఁడును, సకలమైనలౌకికవై దిక కర్మారంభములను బరిత్యజించినవాఁడును గుణాతీతుఁ డని చెప్పఁబడును. ఇందుచేత గుణాతీతునియొక్క లక్షణము చెప్పఁబడినది.

శ్లో. మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే,
సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.

తా. అద్వేష్టృత్వ సర్వభూతసుహృత్త్వాది గుణముల తోఁ గూడి దృఢమైన భగవద్భక్తి గలపురుషుఁ డీచెప్పఁబడిన సత్త్వరజస్తమోగుణకార్యమగుసంసారము నతిక్రమించిసచ్చి దానందపరిపూర్ణబ్రహ్మత్వప్రాప్తికి యోగ్యుఁడై యుండును. ఇందుచేత పురుషుఁ డేసాధనములచేత గుణాతీతుఁ డగు నను ప్రశ్నకు సమాధానము చెప్పఁబడినది.

వ్యాసాదిమహర్షులచేత జీవన్ముక్తుఁడగు పురుషుఁడు బ్రాహ్మణశబ్దముచేత వ్యవహరింపఁబడెను. అది యెటువలెనంటె—

శ్లో. అనుత్తరీయవసనమనుపస్తీర్ణశాయినమ్,
బాహూపధాయినం శాంతం తం దేవా బ్రాహ్మణం విదుః.

అని వ్యాసవచనము.

తా. ఉత్తరీయవస్త్రమును త్యజించినవాఁడును, ఆస్తరణమేమియు లేకయే కేవలభూప్రదేశమందు శయనించువాఁడును, దేవతలచేత బ్రాహ్మణుఁడని చెప్పఁబడును.

ఇచ్చట బ్రాహ్మణశబ్దము బ్రహ్మజ్ఞానిని చెప్పుచున్నది గాని బ్రాహ్మణజాతిని చెప్పునది కాదు. శ్రు. 'అథ బ్రాహ్మణః' అను శ్రుతి శ్రవణమనననిదిధ్యాసములచేత బ్రహ్మసాక్షాత్కారము గలిగినతరువాత బ్రాహ్మణుఁడగునని చెప్పుచున్నది గదా. బ్రహ్మజ్ఞానికి విద్వత్సన్న్యాసమునందే యధికారము గనుక-

శ్రు. "యథాజాతరూపధరోఽనాచ్ఛాదనం చరతి స పరమహంసః."

యనుశ్రుతి పుట్టిననాటి రూపముగలవాఁడును, ఉత్తరీయాదులను ధరింపనివాఁడును, పరమహంస యని చెప్పుచున్నందున సర్వపరిగ్రహరాహిత్యము పరమహంసకు ముఖ్యము గనుకనుత్తరీయాదులు లేనివాఁడు బ్రాహ్మణుఁ డని జీవన్ముక్తుఁడే చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో. యేన కేన చిదాచ్ఛన్నో యేన కేన చిదాశితః,
యత్ర క్వచన శాయీ స్యాత్తం దేవా బ్రాహ్మణం విదుః.

అని మఱియొకవచనము.

తా. దేహయాత్ర జరుపుకొనుటకు భోజనశయనవాసములు అవశ్యకములై యున్నను, మేలయిన భోజనాదులందును, తక్కువయిన భోజనాదులందును తృప్తి సమానము గనుక, ఆభోజనాదులందు నిష్ప్రయోజనమగు గుణదోషవిచారము బుద్ధిదోషము గావున, సర్వభోజనాదులయందు గుణదోషముల నాలోచింపక యథాలాభసిద్ధములగు నశనాచ్ఛాదనశయనములచేత తృప్తుండగు పురుషుండు దేవతలచేత బ్రాహ్మణుం డని చెప్పంబడును.

ఈ గుణదోషపర్యాలోచన బుద్ధిదోష మని భాగవతమునందు చెప్పియున్నది.

శ్లో. కిం వర్ణితేన బహునా లక్షణం గుణదోషయోః,
గుణదోషదృశిర్దోషో గుణస్తూభయవర్జితః.

తా. గుణదోషములయొక్క లక్షణమును ప్రతివస్తువునందు ప్రత్యేకప్రత్యేకముగా చెప్పుటము చాల కష్టమును నిష్ప్రయోజనమును గనుక ప్రతివస్తువునందు గుణదోషములను విచారించుటయే దోషము. గుణదోషములను విచారము చేయకపోవుటయే గుణ మని యెఱుంగునది.

శ్లో. కంథాకౌపీనవాసాస్తు దండధృగ్ధ్యానతత్పరః,
ఏకాకీ రమతే నిత్యం తం దేవా బ్రాహ్మణం విదుః.

అని మఱియొకవచనము.

తా. శీతమును నివారించుబొంతను కౌపీనమును కాషాయమును దండమును ధరించువాండై బ్రహ్మధ్యానమందు నిరంతరాసక్తికలవాండై ఇతరమనుష్యులతో సంబంధము లేక యుం

టరిగాఁదిరుగువాని బ్రాహ్మణుఁడని దేవతలు చెప్పుదురు. అనఁగా నీపరమహంసాశ్రమమునందుండుజీవన్ముక్తుఁడు బ్రహ్మతత్త్వోపదేశముచేత జనుల ననుగ్రహింపనిచ్ఛగలవాఁడై యుండెనేని, తత్త్వజిజ్ఞాసువు లగుజనులకు తనయందుత్తమతత్త్వజ్ఞానమును కలుగఁజేయుటకై కాషాయదండాదులను గ్రహించును.

శ్రు. కౌపీనం దండమాచ్ఛాదనం చ స్వశరీరోపభోగార్థాయ లోకో పకారార్థాయ చ పరిగ్రహేత్.

అనుశ్రుతియందు కౌపీనదండకాషాయములను స్వశరీరరక్షణార్థముగాను లోకుల కుపకారమును చేయుటకుఁగాను గ్రహింపవలయునని చెప్పియున్నది. స్వశరీరరక్షణముకూడ బ్రహ్మతత్త్వజ్ఞానమును లోకమందుఁ బ్రచరింపఁజేయుటకే కాని,

శ్రు. కృతకృత్యాః ప్రతీక్షంతే మృత్యుం ప్రియమివాతిథిమ్.

తా. బ్రహ్మతత్త్వజ్ఞానము గలమహాపురుషులకు స్వోపకారకముగా కర్తవ్యాంతర మేమియు లేనందున మరణమును ప్రియమగు నతిథినిగా నెదురు చూచుచుందు రని చెప్పినందున స్వార్థము కాదు. లోకుల ననుగ్రహింప నిచ్ఛయున్నప్పటికి వారియొక్క గృహకృత్యములనుగూర్చి యోగక్షేమములను విచారించఁగూడదు. కేవలము బ్రహ్మధ్యానపరుఁడై యుండవలయును.

శ్రు. తమేవైకం జానథాత్మానమన్యా వాచో విముంచథ.

యను శ్రుతి సర్వప్రపంచాధిష్ఠాన మగుపరమాత్మనే ధ్యానించవలయును. ఇతరశబ్దముల నేమియు నుచ్చరింపఁదగదని తత్త్వజ్ఞానికి లోకవృత్తాంతవ్యవహారమును నిషేధించుచున్నది.

తా. బ్రహ్మతత్వజ్ఞానము కలిగి పరమహంసాశ్రమము నంగీకరించినమహానుభావుఁ డొంటరిగానుండెనా? నిరంతర బ్రహ్మస్వరూపానుసంధానము గలవాఁడై యుండును. లేక యిద్దఱు చేరితే మిథున మని, ముగ్గురు చేరితే గ్రామ మని, అంతకు పైఁగా నెంతమంది చేరినా నగర మని చెప్పఁబడును. ఇటువంటిస్థితిలో నన్యోన్యసన్నికర్షము చేత గ్రామవృత్తాంతములను భిక్షావృత్తాంతములను పరస్పరముగా చెప్పుకొనుటయు నొకరియం దొకరికి స్నేహమును ఇతరులయం దుండు గుణదోషముల నితరులతో చెప్పుటయును పరులయొక్క శ్రేయస్సును చూచి సహింపలేకపోవుటయును ఈలాటిదోషములు సంభవించును.

స్మృ. నిరామిషమనారంభం నిష్నమస్కారమస్తుతిం.
అక్షీణం క్షీణకర్మాణం తం దేవా బ్రాహ్మణం విదుః.

అని మఱియొకవచనము.

ఈవచనముయొక్క తాత్పర్యము ప్రతిపదమునకు వేరువేరుగా చెప్పఁబడును.

తా. శిష్టులగువారు నమస్కారము చేయుజనుల కభిమతప్రాప్తి యగుగాత మని యాశీర్వచనములను చేయుదురు. జనులు భిన్నవిషయములయందు రుచిగలవారై యుందురు గనుక వారికిఁ బ్రత్యేకప్రత్యేకముగా నాశీర్వచనములఁ జేయుపక్షమం దీపరమహంసయగు తత్త్వజ్ఞానికి లోకవాసనలు ప్రబలించి తత్వజ్ఞానమునకు భంగమును గలుగఁజేయును. ఈయర్థము వాసిష్ఠరామాయణమునందు,

శ్లో. లోకవాసనయా జంతోశ్శాస్త్రవాసనయా తథా,
దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే.

అని చెప్పఁబడియున్నది.

తా. పురుషునకు లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన యీమూఁడువాసనలు యథార్థమగు బ్రహ్మాత్మత్వజ్ఞానమును ప్రతిబంధించి పుట్టనియ్యవని తాత్పర్యము. ఈమూఁడు వాసనలయొక్క స్వరూపలక్షణవిభాగము లుత్తరప్రకరణమునందు విశదముగా చెప్పఁబడును గనుక బ్రహ్మాత్మత్వజ్ఞాననిష్ఠ గలపురుషుఁడు నమస్కరించుజనుల కాశీర్వచనములఁ జేయఁగూడదని తాత్పర్యము. తనకు లోకవాసనలు వృద్ధిఁబొందక యుండుటకును నమస్కరించువారికి మనఃఖేదము లేకయుండుటకును సకలాశీర్వాదప్రతినిధి యగు నారాయణశబ్దోచ్చారణమును జేయుమని శాస్త్రము బోధించుచున్నందున నమస్కరించువారి కాశీర్వచనమును చేయనిపక్షమందు వారికి మనస్సునందు ఖేదము కలుగదా యని శంకింపఁదగదు. ఇందుచేత నిరాశిష మనుపదము వివరింపఁబడినది.

శ్లో. సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతా.

తా. పొగచేత నగ్ని వ్యాపింపఁబడియున్నటుల, సర్వకార్యములు ధర్మకార్యములు గాని ధర్మములేనికార్యములు గాని దోషముచేత నావరింపఁబడియున్నవి యని చెప్పియున్నందున పరార్థముగానైనా మఠోద్యానదేవాలయాది నిర్మాణమును జేయఁగూడదు. ఇందుచేత ననారంభ మనుపదము వివ

రింపఁబడినది. వివిదిషాసన్యాసమునందు నమస్కారము మాత్రము చెప్పఁబడినది.

శ్లో. యో భవేత్పూర్వ సన్యాసీ తుల్యో వైధర్మతో యది,
తస్మై ప్రణామః కర్తవ్యో నేతరాయ కదాచన.

తా. ఏపురుషుఁడు తనకంటె ముందుగా సన్యసించి శ్రవణాదులను తనతో సమానముగా నాచరించుచుండునో యాపురుషునకు మాత్రము నమస్కరించవలయును. మరియొకనికి నమస్కరించుట తగ దని యర్థము. ఈచెప్పఁబడిన నమస్కారమును పూర్వత్వధర్మతుల్యత్వవిచారమును చేయునప్పుడు చిత్తమునకు విక్షేపము కలుగును గనుక అముఖ్యమే యని నిశ్చయింపఁదగియున్నది. కనుకనే యీలోకమునం దుండు సన్యాసులు పెక్కండ్రు విశేషముగా కలహించుచున్నారు. ఈప్రకారముగా కలహించుటకు కారణమును వార్తికమునందు సురేశ్వరాచార్యులవారు-

శ్లో. ప్రమాదినో బహిశ్చిత్తాః పిశునాః కలహోత్సుకాః,
సన్యాసినోఽపి దృశ్యంతే దేవసందూషితాశయాః.

తా. కొందఱు సన్యాసాశ్రమము నంగీకరించియు వేదాంతవిచారాదులయందు శ్రద్ధలేనివారును బాహ్యవిషయములయందు అనఁగా మఠదేవాలయాదినిర్మాణములయందాసక్తమగు చిత్తముకలవారును నితరజనులయొక్క దోషములను తదితరజనులతోఁ జెప్పుస్వభావము గలవారును ఒకరితో నొకరు కలహించువారునుగా నున్నారు. ఇందుకు మనుష్యులు బ్రహ్మజ్ఞానమునుసంపాదించుట దేవతలకిష్టము లేనందున

నాదేవతలచేత నాచరింపఁబడు బుద్ధివిశేషమే కారణమని యర్థము. ముక్తుఁడగు మహాపురుషుఁ డొకనికి నమస్కారము చేయుట తగదని శ్రీశంకరభగవత్పాదాచార్యులవారు-

శ్లో. నామాదిభ్యః పరే భూమ్ని స్వారాజ్యేఽవస్థితో యథా,
ప్రణమేత్కం తదాత్మజ్ఞో న కార్యం కర్మణా తదా.

అని యానతిచ్చి యున్నారు.

తా. నారదమహాముని సనత్కుమారులయొక్క సన్నిధికిఁబోయి తన కధ్యాత్మవిద్య నుపదేశింపు మని ప్రార్థింపఁగా నాసనత్కుమారుల నామము మొదలు ప్రాణమువరకు గొన్ని యనాత్మవస్తువుల నాత్మనుగా భావించమనియుపదేశించియనంతర మీనామాదులకన్నిఁటికి నధిష్ఠానమైనస్వప్రకాశమైనసర్వవ్యాపకమైనపరమాత్మను తెలుసుకోవలయుననియుపదేశించిరి. అటువంటిపరమాత్మను నిశ్చయముగా తెలుసుకొని నిరంతరానుసంధానపరుఁడై యుండుమహాపురుషుఁ డెవనికి నమస్కరించును! అతనికి నమస్కారాదిక్రియలతోఁ బ్రయోజనమేమి యనియర్థము. చిత్తకాలుష్యకరమగునమస్కారమును చేయఁగూడదు గాని సర్వసమత్వబుద్ధిచేత చేయఁబడునమస్కారము చిత్తనైర్మల్యసంపాదకము గనుక చేయవచ్చును. ఈయర్థ మొకస్మృతి యందు-

శ్లో. ఈశ్వరో జీవకలయా ప్రవిష్టో భగవా నితి,
ప్రణమే ద్దండవద్భూమా వాశ్వచండాలగోఖరమ్.

అని చెప్పియున్నది.

తా. భగవంతుఁడైనపరమాత్మ సర్వదేహములయందు జీవరూపముగాఁ బ్రవేశించియున్నాఁ డనునభిప్రాయముతో చండాలశునక గార్ధభాది జంతువులను చూచినప్పుడును సాష్టాంగనమస్కారము సర్వాత్మకత్వజ్ఞానమునకు బలకరము గనుక చిత్తనైర్మల్యమున కుపాయమని విధింపఁబడినది. ఇందు చేత నిర్నమస్కారపదము వివరింపఁబడినది.

వా. ఆత్మతత్వజ్ఞానముగల పురుషులను స్తుతిచేయఁగూడదు గాని పరమేశ్వరుని స్తుతింపనే వలయును.

ఈయర్థము బృహస్పతిస్మృతియందు-

శ్లో. ఆదరేణ యథా స్తౌతి ధనవంతం ధనేచ్ఛయా,
తథా చేద్విశ్వకర్తారం కో న ముచ్యేత బంధనాత్.

అని ప్రతిపాదింపఁబడియున్నది.

తా. లోకమునం దొక మనుష్యుఁడు స్వల్పధనము నపేక్షించి ధనవంతుఁడగు పురుషునినెంతయాదరముతో స్తుతిచేయునో, యంతయాదరము జగత్కర్తయగునీశ్వరుని స్తుతిచేసిన యెడల నెవఁడు సంసారబంధమువలన విడువఁబడఁడు? భగవంతుఁడగు నీశ్వరుని నాదరముతో స్తుతిచేయువారందఱు సంసారదుఃఖములను విడిచి ముక్తులవుదు రని తాత్పర్యము. ఇందు చేత నస్తుతిపదము వివరింపఁబడినది. ఇది గాక-

శ్లో. అలబ్ధ్వా న విషీదేత కాలేకాలేఽశనం క్వచిత్,
లబ్ధ్వా న హృష్యేద్ధృతిమానుభయం దైవతంత్రితమ్.

అని చెప్పియున్నందున బ్రహ్మజ్ఞాని దైన్యము లేనివాఁడై యుండవలయును.

తా. భిక్షాకాలమునందు భిక్షమునకు పోయినప్పుడు భిక్షాన్నము దొరకకపోయిన దని విషాదము నొందఁగూడదు. దొరకిన దని సంతోషము నొందఁగూడదు. దొరకడము దొరకకపోవడము రెండును దైవాయత్తము లని యుదాసీనుఁడై యుండవలయునని భావము. ఇందుచేత అక్షీణపదము వ్యాఖ్యాతమయినది.

శ్లో. నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః.

తా. నిత్యము పరమాత్మయందు నిష్ఠగలపురుషునకు విధికర్మ గాని నిషేధకర్మ గాని బుద్ధిపూర్వకముగా చేయఁబడునది లేదని చెప్పియున్నందున తత్వజ్ఞుఁడు విధినిషేధములకనధీనుఁడై యుండును. ఈయభిప్రాయముతో నే భగవద్గీతలయందు

శ్లో. త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వంద్వో నిత్య సత్వస్థో నిర్యోగక్షేమఆత్మవాన్.

అని శ్రీకృష్ణభగవాను లానతిచ్చిరి.

తా. వేదములన్నియు ప్రాయశః సత్వరజస్తమోగుణములచేత వ్యాపింపఁబడినచిత్తముగల పురుషులను కూర్చి వారి వారి యధికారానుగుణముగా విధినిషేధములను జూపుచున్నవి. ఓయీ యర్జునా! నీవె గుణత్రయాతీతమైన పరమాత్మయందు నిష్ఠకలవాఁడవై సర్వదా శుద్ధసత్వప్రధానుఁడవుగాను శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వముల నోర్చువాఁడవుగాను, అప్రాప్తములగు వస్తువులను సంపాదించుటయందు, ప్రాప్త వస్తువులను రక్షించుటయందుఁ బ్రయత్నము లేనివాఁడవుగానుఁ డుండుము అని భావము.

శ్రీనారద మహర్షియును-

శ్లో. స్మర్తవ్యస్సతతం విష్ణుర్నస్మర్తవ్యో న జాతుచిత్,
సర్వే విధినిషేధాః స్యు రేతయో రేవ కింకరాః.

అని నిరూపించియున్నారు.

తా. సర్వకాలములయందు సర్వదేశములయందును పరమాత్మ యగువిష్ణువును స్మరింపవలయును. ఎప్పటికి నాపరమాత్మను మఱవఁదగదు. ఈప్రకారమనుష్ఠానము గల పురుషునకు విధినిషేధశాస్త్రము లన్నియు స్వాధీనములై యుండును. అనఁగా నిరంతరబ్రహ్మస్వరూపానుసంధానపరునియొక్క కృత్యములు ప్రమాదముచేతనైనా శాస్త్రవిరుద్ధములుగా నుండవని తాత్పర్యము. ఇందుచేత క్షీణకర్మపదము వివరింపఁబడినది. సదాశీష్ట్వాదిగుణములు కలవానిని దేవతలు బ్రాహ్మణుఁడని చెప్పుదురని పరమతాత్పర్యము.

శ్లో. యోఽహేరివ గణాద్భీతః సన్మానాన్మరణాదివ,
కుణపాదివ యః స్త్రీభ్య స్తం దేవా బ్రాహ్మణం విదుః.

అని మరియొకవచనము. ఈ శ్లో కార్థముకూడ విశేషముగా వివరింపఁబడును.

తా. తత్త్వజ్ఞుఁడగువాని కన్యజనసంగము గలిగినప్పుడు లోకవృత్తాంతముల నొకరితో నొకరు చెప్పుకొనుటచే లోకవాసన వృద్ధినొంది యాత్మనిష్ఠను మఱపించును గనుక సర్పమునకు భయము నొందునటుల నన్యజనసంగమునకు భయము నొందువాఁడు బ్రాహ్మణుఁడు; ఇతరజనులు తనవిషయమై చేయుసన్మానము (పూజానమస్కారాదులు) ఆసక్తిని కలుగఁజేసిచిత్తమునకు కాలుష్యమును చేయును గనుకనట్టిసన్మానము

నరకమని తలఁచు బ్రహ్మజ్ఞానియే బ్రాహ్మణుఁడు. ఇందువలననే,

> శ్లో. అసన్మానాత్తపోవృద్ధిః సన్మానాత్తపసః క్షయః,
> అర్చితః పూజితో విప్రో దుగ్ధా గౌరివ సీదతి.

యని చెప్పినది.

తా. జనులు గౌరవించనియెడల బ్రహ్మజ్ఞానము వృద్ధి నొందును. గౌరవించినయెడల బ్రహ్మజ్ఞానము క్షీణించును గనుక లోకులచేత స్తుతింపఁబడి భోజనవస్త్రాలంకారదానాదులచేత పూజింపఁబడునాత్మజ్ఞాని వట్టిపోయినగోవువలె ప్రయోజనము లేనివాఁడై నశించునని యర్థము. ఈయభిప్రాయముచేతనే జనులచేత చేయఁబడు నవమానమే తత్త్వజ్ఞానిచేతఁ బ్రార్థింపఁదగినదని-

> శ్లో. తథా చరేత వై యోగీ సతాం ధర్మమదూషయన్,
> జనా యథా ఽవమన్యేరన్ గచ్ఛేయుర్నైవ సంగతిమ్.

అని విష్ణుపురాణమందు చెప్పఁబడెను.

తా. బ్రహ్మతత్త్వమునందు నిరంతరనిష్ఠ నపేక్షించుపురుషుఁడు లోకులందఱు నతనియొక్క బ్రహ్మనిష్ఠాదిగుణముల నెఱుఁగక యేప్రకారము అతనితో కలియకుందురో, యేప్రకారము అతనిని పిచ్చివాఁడుగాఁదలఁచి యవమానించుచుందురో, యాప్రకారము సంచరించవలయును. అటుల సంచరించుకాలములయందుఁగూడ లోకమునందు శాస్త్రమునందు నిందింపఁబడు సురాపానాదినిషిద్ధకార్యముల నాచరింపకయే సంచరించవలయు నని తాత్పర్యము. స్త్రీలయందు రెండుదోషములు కలవు. ఒకటి శాస్త్రముచేత నిషేధింపఁ

బడియుండుట; రెండవది యసహ్యాముగా నుండుట. ఇందు లో మొదటిదోషము ప్రారబ్ధకర్మచేత నుద్రేకము నొందిన రాగముచేత దాఁటఁబడును. అనఁగా తోఁబుట్టువు మొద లగు స్త్రీలతోసంయోగము మహాపాపమని శాస్త్రము చెప్పు చున్నప్పటికి ప్రారబ్ధకర్మచేతనైన రాగప్రాబల్యముచేత నా శాస్త్రము నుల్లంఘించి యథేచ్ఛముగా సంచరించుట కలదని యర్థము. ఈయభిప్రాయముచేతనే స్వాయంభువమనువు ధర్మ శాస్త్రమునందు,

శ్లో. మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్,
బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి.

అని చెప్పిరి.

తా. ఏపురుషుఁడైనా తల్లితోఁగాని చెల్లెలితోఁగాని కూఁతురితోఁగాని యేకాంతమునం దొకచోట నుండఁగూ డదు. ఇంద్రియములు నిండువేగము గలవి గనుక నెంతశా స్త్రజ్ఞానము కలవానిని కూడ చిత్తవైకల్యము కలవానినిగా చేయు నని యర్థము.

వా. రెండవదోష మగునసహ్యాతను—

శ్లో. స్త్రీణామవాచ్యదేశస్యక్లిన్ననాడీ వ్రణస్య చ,
అభేదేఽపి మనోభేదాజ్జనః ప్రాయేణ వంచ్యతే.
చర్మఖండం ద్విధాభిన్నమపానోద్గార ధూపితం,
యే రమంతి నరాస్తత్ర క్రిమితుల్యాః కథం న తే.

అని కొన్నిశాస్త్రములు విస్పష్టముగాఁ జెప్పుచున్నవి.

తా. స్త్రీలయొక్క చెప్పరాని యవయవములనకును చీము చేత నెత్తురుచేత బుజబుజలాడు పురుగులనకు నేమియు భేద ములేదు గదా; అయినను జనులు మనోభేదముచేత స్త్రీలయొ క్కయవాచ్యప్రదేశమునందు వ్యామోహము కలవారై భ్రమించుచున్నారు. ఇదిగాక స్త్రీలయొక్క యవాచ్యప్రదేశ మనఁగా రెండుగా చీల్చఁబడిన యొక చర్మఖండము. అపాన వాయువుచేత దుర్గంధము గలదిగా నున్నది. దీనిచేత సుఖ మును పొంద నిచ్ఛగల పురుషులు పురుగులవంటివారే కదా యని యర్థము.

ఈ రెండువిధము లగుదోషములు గల స్త్రీశరీరము శవమువంటిది; ఇట్టి స్త్రీశరీరములు చూచినప్పుడు శవమును చూచినట్లు భావించువాని దేవతలు బ్రాహ్మణుఁడని చెప్పుదురు.

శ్లో. యస్య ప్రాణ్ణమినోవాసాం శవవ్రైశ స్థావరాః,
సోభ్యం యస్య మనోస్థేశం తం దేవా బ్రాహ్మణం విదుః.

తా. అవివేకు లగు జను లొంటరిగా నుండుటను భయకారణ మని తలఁచి విడుతురు; పదుగురితో కలసియుండు టను క్షేమకర మని తలఁచి గ్రహించుచుందురు; బ్రహ్మతత్వ జ్ఞానము గల పురుషుఁడొంటరిగా నుండుటను నిర్విఘ్నముగా బ్రహ్మధ్యానము చేయుట కుపయోగించు నని గ్రహించును; పదుగురితో కలసియుండుటను ధ్యానములకు విరోధి యని విడుచుచుండును. ఒంటరిగా నుండుసమయములో నిర్విఘ్న ముగా బ్రహ్మధ్యాన మావర్తింపఁబడును గనుక పరిపూర్ణమగు పరమానందస్వరూపముచేత నాకాశమంతయు నిండియున్నట్టు

ప్రకాశించును. అందువలన తత్త్వజ్ఞానికి భయము, శోకము, మోహము మొదలగుదోషములావిర్భవించనేరవు.

శ్రు. యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః,
తత్ర కో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః.

అను శ్రుతి బ్రహ్మజ్ఞానికి శోకమోహములు లేవని చెప్పుచున్నది.

తా. ఎప్పుడు సమస్తభూతములు పరమాత్మస్వరూపముగానే కనఁబడునో అప్పుడాయద్వితీయసర్వాత్మకబ్రహ్మస్వరూపజ్ఞానము గల మహానుభావునకు శోకమోహము లుండ నేరవని శ్రుతితాత్పర్యము.

ఇదిగాక బహుజనసమేత మగుదేశము లోకవృత్తాంతములను వినిపింపఁజేయుచున్నందున తత్త్వజ్ఞునియొక్క చిత్తమునందు పరమానందాత్మకబ్రహ్మస్వరూపధ్యానమును లేకుండఁజేసి తత్త్వజ్ఞునకు శోకమోహములను గలుగఁజేయును.

శ్లో. యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవో న చింత్యతే,
సా హానిస్తన్మహచ్ఛిద్రం సాభ్రాన్తిస్సా చ విక్రియా.

అను శౌనకస్మృతివచనము. బ్రహ్మధ్యానము లేకపోవడమే సర్వానర్థరూప మని వివరింపుచున్నది.

తా. ముహూర్తకాలముగాని నిమిషకాలముగాని సమస్తభూతములకు బాహ్యాభ్యంతరములయందు వ్యాపించి స్వప్రకాశస్వరూపుఁడై యున్న యేపరమాత్మ ధ్యానింపఁబడఁడో ఆధ్యానాభావమే వినాశమని సర్వానర్థములకు ద్వారమని విపరీతజ్ఞానమని ఉన్మాదమని చెప్పఁబడు నని యర్థము.

కనుక జనశూన్యప్రదేశమందాసక్తితో నుండువాఁడును జనసంకీర్ణప్రదేశమును దూరముగా విడిచిపోవువాఁడును సర్వదా పరమాత్మధ్యానానుకూలచిత్తవృత్తి గలవాఁడును బ్రాహ్మణుఁ డని దేవతలచేత చెప్పఁబడుచున్నాఁడు.

సూతసంహితయొక్క ముక్తిఖండమునందు పంచమాధ్యాయములో పరమేశ్వరునిచేత శ్రీమహావిష్ణువునుగూర్చి జీవన్ముక్తుఁ డతివర్ణాశ్రమిశబ్దముచేత చెప్పఁబడెను.

శ్లో. బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థశ్చ భిక్షుకః,
అతివర్ణాశ్రమీ చేతి క్రమాత్ శ్రేష్ఠా విచక్షణాః.

తా. బ్రహ్మచారి, గృహస్థుఁడు, వానప్రస్థుఁడు, సన్యాసి, అతివర్ణాశ్రమి వీరలైదుగురు బ్రహ్మతత్త్వజ్ఞానము కలవారలై యున్నప్పటికి, బ్రహ్మచారికంటె గృహస్థుఁడు, గృహస్థునికంటె వానప్రస్థుఁడు, వానప్రస్థునికంటె సన్యాసి, సన్యాసికంటె అతివర్ణాశ్రమియును నుత్తములని చెప్పఁబడుచున్నారు.

శ్లో. అతివర్ణాశ్రమీ ప్రోక్తో గురుస్సర్వాధికారిణాం,
న శిష్యో కస్యచిచ్ఛిష్యో యథాహం పురుషోత్తమ.

తా. అతివర్ణాశ్రమి యగు తత్త్వజ్ఞాని యందఱకు గురువుగా నుండును. పరమేశ్వరుఁడనైన నేనేప్రకార మెవరికిని శిష్యుఁడను కానో యాప్రకారమే యీ యతివర్ణాశ్రమియు నెవరికిని శిష్యుఁడు కాఁడు.

శ్లో. అతివర్ణాశ్రమీ సాక్షాద్గురూణాం గురురుచ్యతే,
తత్సమో నాధికశ్చాస్మిన్ లోకేస్త్యేవ న సంశయః.

తా. అతివర్ణాశ్రమి గురువులగువారి కందఱకును పరమగురువుగా చెప్పఁబడును. వీరితో సరి యగువారుగాని

హెచ్చువారుగాని యీలోకమునందు లేనేలేరు.

శ్లో. యశ్శరీరేంద్రియాదిభ్యో విభిన్నం సర్వసాక్షిణం,
పారమార్థికవిజ్ఞానం సుఖాత్మానం స్వయం ప్రభమ్.
పరం తత్త్వం విజానాతి సోఽతివర్ణాశ్రమీ భవేత్.

తా. అతివర్ణాశ్రమి యగువానియొక్క లక్షణములను చెప్పుచున్నారు. దేహేంద్రియమనఃప్రాణబుద్ధులకంటె విలక్షణమును దేహేంద్రియాదివ్యాపారములకు సాక్షియును నిత్యజ్ఞానస్వరూపమును పరమానందాత్మకమును స్వప్రకాశమునగు పరబ్రహ్మతత్త్వమును ప్రత్యక్షముగా తెలుసుకొనియుండు పురుషుఁ డతివర్ణాశ్రమి యనఁబడును.

శ్లో. యో వేదాంతమహావాక్యశ్రవణాదేవ కేశవ,
ఆత్మానమీశ్వరం వేద సోఽతివర్ణాశ్రమీ భవేత్.

తా. వేదాంతములయందు నుండు త్రివిధమహావాక్యముల యొక్క శ్రవణముచేతనే యేమహానుభావుఁడు తనను పరమాత్మనుగా తెలుసుకొనునో యతఁ డతివర్ణాశ్రమి యనఁబడును. అనఁగా అహంగ్రహోపాసనము లని చెప్పఁబడు దహరశాండిల్యాద్యుపాసనములయందు నుపాసకుఁడగు జీవుఁడుపాస్యుఁడగుపరమేశ్వరునికంటెభిన్నుఁడుగానుండినప్పటికి-శ్రు. "త్వంవాహామస్మి భగవో దేవతే అహం వై త్వమసి భగవో దేవతే" యనుశ్రుతి-సూ. "వ్యతిహారో విశింషంతి హీతరవత్ "అను సూత్రము చెప్పినప్రకారము నీవే నేను నేనే నీ వను ధ్యానము చేయవలసియున్నందున ధ్యానపరిపాకదశయందు నేనే పరమేశ్వరుఁడనను దృఢజ్ఞానము ఉపాసకునకు కలిగినప్పటికినాజ్ఞానము

ప్రమాణజన్యము కానందున విధురపరిభావిత కామినీసాక్షాత్కారమువలె వాస్తవముగాదు. ప్రమాణశ్రేష్ఠములగు వేదాంతమహావాక్యములచేతఁ గలిగిన నేనే బ్రహ్మానుజ్ఞానము చతుస్సన్నికృష్టకామినీసాక్షాత్కారమువలె వాస్తవమైనందున తాదృశాద్వితీయబ్రహ్మాత్మైక్యజ్ఞానముకలవాఁడే యతివర్ణాశ్రమియని చెప్పఁబడునుగాని యుపాస్యస్వరూపసాక్షాత్కారముగల పురుషుఁ డతివర్ణాశ్రమి యని చెప్పఁబడఁ డని భావము. స్వప్రకాశమూర్తివైన యోపరమేశ్వరా! నేను నీవే యైతిని. నీవు నేనేయైతిని యని శ్రుత్యర్థము. ఉపాస్యస్వరూపమును నుపాసకస్వరూపమును పరస్పరవిశేషణములుగాఁ జేర్చి ధ్యానించవలయును. ఈలాగున "త్వం వాహమస్మి" యను శ్రుతి చెప్పినది అని సూత్రార్థము.

శ్లో. యోఽవస్థాత్రయనిర్ముక్తోఽవస్థాత్రయసాక్షికః,
మహాదేవం విజానాతి సోఽతివర్ణాశ్రమీ భవేత్.

తా. జాగ్రత్స్వప్నసుషుప్తు లనునవస్థాత్రయమును విడిచినదియు, నవస్థాత్రయమును ప్రకాశింపఁజేయునదియు నైన పరమాత్మను సాక్షాత్కరింపఁ జేసుకొన్న పురుషుఁ డతివర్ణాశ్రమి యనఁబడును.

శ్లో. వర్ణాశ్రమాదయో దేహే మాయయా పరికల్పితాః,
నాత్మనో బోధరూపస్య మమ తే సంతి సర్వదా.
ఇతి యో వేద వేదాంతైః సోఽతివర్ణాశ్రమీ భవేత్.

తా. బ్రాహ్మణాదివర్ణములును బ్రహ్మచర్యాద్యాశ్రమములును పాంచభౌతికమగు దేహమునం దజ్ఞానముచేత కల్పింపఁబడినవి గాని కేవలజ్ఞానస్వరూపుఁడ నైన నాయందు లేవని

వేదాంతములచేత నెవఁ డెఱుఁగునో, అతఁడే యతివర్ణాశ్రమి యనఁబడును.

శ్లో. ఆదిత్యసంనిధౌ లోకశ్చేష్టతే స్వయమేవ తు,
తథా మత్సన్నిధావేన సమస్తం చేష్టతే జగత్.
ఇతి యో వేద వేదాంతై స్సోఽతివర్ణాశ్రమీ భవేత్.

తా. ప్రకాశరూపుఁడగు సూర్యుఁడు ప్రకాశించుచుండఁగా నేప్రకారము సమస్తజనులు స్వస్వవ్యాపారములయందుఁ బ్రవర్తించుచుదురో యాప్రకారమే జ్ఞానస్వరూపుఁడనైన నేను బ్రకాశించుచుండఁగా జడమగు నీసమస్తప్రపంచము భాసిల్లుచున్నది యని వేదాంతములచేత నెవఁ డెఱుఁగునో, అతఁడే యతివర్ణాశ్రమి యనఁబడును.

శ్లో. సువర్ణే హారకేయూర కటకస్వస్తికాదయః,
కల్పితా మాయయా తద్వ న్మయ్యేవ సకలం జగత్.
ఇతి యో వేద వేదాంతై స్సోఽతివర్ణాశ్రమీ భవేత్.

తా. బంగారమునందు కటకమకుటాద్యాభరణములు పురుషబుద్ధిచేత కల్పింపఁ బడినటుల సత్యజ్ఞానానందానంతస్వరూపుఁడనైన నాయందే సకలప్రపంచము ననాదిమాయాప్రభావముచేత కల్పింపఁబడినది యని వేదాంతములచేత నెవఁ డెఱుఁగునో, అతఁడే యతివర్ణాశ్రమి యనఁబడును.

శ్లో. శుక్తికాయాం యథా తారం కల్పితం మాయయా తథా,
మహదాదిజగన్మాయా మయం మయ్యేవ కల్పితం.
ఇతి యో వేద వేదాంతై స్సోఽతివర్ణాశ్రమీ భవేత్.

తా. ముత్యపుచిప్పయం దజ్ఞానముచేత రజతము కల్పిం

పఁబడినటుల నాయందే మహాదహంకారాదిప్రపంచమంతయు నజ్ఞానముచేతనే కల్పింపఁబడిన దని వేదాంతములచేత నెవఁ డెఱుఁగునో, అతఁడే యతివర్ణాశ్రమి యనఁబడును.

శ్లో. చండాలదేహే పశ్వాదిశరీరే బ్రహ్మవిగ్రహే,
అన్యేషు తారతమ్యేన స్థితేషు పురుషోత్తమ.
వ్యోమవత్సర్వదా వ్యాప్తః సర్వసంబంధవర్జితః,
ఏవంరూపో మహాదేవః స్థితః సోఽహం పరామృతః.
ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్.

తా. అతినికృష్టముగా తలఁపఁబడు చండాలశరీరము నందును, పశుపక్షిమృగాదులయొక్క శరీరములయందును సర్వోత్కృష్టముగా తలంపఁబడు చతుర్ముఖశరీరమునందును మరియు న్యూనాధికతారతమ్యముచేత వ్యవహరింపఁబడు బ్రాహ్మణాదిశరీరములయందును ఆకాశమువలె నెప్పటిని వ్యాపించి తత్తచ్ఛరీరగతగుణదోషములతో సంబంధమే లేక యేకరూపముగా నుండు పరమేశ్వరుఁడను నేనే యని వేదాంతములచే నెవఁ డెఱుఁగునో, అతఁడే యతివర్ణాశ్రమి యనఁబడును.

శ్లో. వినష్టదిగ్భ్రమస్యాపి యథా పూర్వా విభాతి దిక్,
తథా విజ్ఞానవిధ్వస్తం జగన్మే భాతి తన్నహి.
ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్.

తా. వంచనచేయు దిగ్భ్రాంతి గల పురుషునకు మొదట తాను పోఁదలఁచుకొన్న దిక్కు చెదరినప్పటికి పూర్వదిక్కువలెనే భాసించినటుల యథార్థజ్ఞానములోనుండి చెదరి యీ ప్రపంచము యథార్థముగా కనుఁబడుచున్నది కాని యథార్థము కాదు అని వేదాంతములచేత నెవఁ డెఱుఁగునో, అతఁడే యతివర్ణాశ్రమి యనఁబడును.

శ్లో. యథా స్వప్నే ప్రపంచోఽయం మయి మాయా ప్రకల్పితః,
తథా జాగ్రత్ప్రపంచోఽపి మయి మాయావిజృంభితః.
ఇతి యో వేద వేదాంతైస్సోఽతివర్ణాశ్రమీ భవేత్.

తా. స్వప్నమునందుఁ గనుపడు ప్రపంచమంతయు నే ప్రకారము నాయందు మాయచేతఁ బ్రకాశించుచున్నదో యాప్రకార మీజాగ్రత్ప్రపంచముకూడ నాయందు మాయచేతఁ బ్రకాశించుచున్నదని వేదాంతములచే నెవఁ డెఱుఁగునో, అతఁడే యతివర్ణాశ్రమి యనఁబడును.

శ్లో. యస్య వర్ణాశ్రమాచారో గళితః స్వాత్మదర్శనాత్,
సవర్ణా నాశ్రమాన్సర్వానతీత్య స్వాత్మని స్థితః.

తా. ఎవనికి స్వప్రకాశాత్మసాక్షాత్కారము వలన వర్ణాశ్రమధర్మములన్నియు నివర్తించినవో, అతఁడు సర్వవర్ణములను సర్వాశ్రమముల నతిక్రమించి కేవలస్వాత్మదర్శనరసికుఁడై యున్నందున నతివర్ణాశ్రమి యనఁబడును.

శ్లో. న దేహో నేంద్రియం ప్రాణో న మనో బుద్ధ్యహంకృతీ,
న చిత్తం నైవ మాయా చ న చ వ్యోమాదికం జగత్.
న కర్తా నైవ భోక్తా చ న చ భోజయితా తథా,
కేవలం చిత్సదానందో బ్రహ్మైవాత్మా యథార్థతః.

తా. ఆత్మ యనునది సావయవమగు దేహము కాదు. అనేకములగు చక్షురాదీంద్రియములు కాదు. చలనాదిక్రియలు గల ప్రాణముగాదు. సంశయవృత్తులు గల మనస్సు గాదు. నిశ్చయవృత్తులు గలఁబుద్ధి గాదు. గర్వవృత్తిగలయహంకారము కాదు. స్మృతివృత్తిగల చిత్తము కాదు. ఆవరణాత్మకమగుమాయ

కాదు. జననముగానీ కాశాదిప్రపంచము కాదు. కర్తృత్వవికారములు గలది కాదు. భోగ్యాదిక్రియలయందుఁ బ్రేరణచేయునది కాదు. ఇఁక నెటువంటిదంటే, పైఁజెప్పినయన్నిపదార్థములకంటె విలక్షణమైనదియు, సర్వపదార్థములను స్వసన్నిధానముచేతఁ బ్రకాశింపఁజేయునదియు, సర్వదా పరమానందస్వరూప మగునదియు, నుపాధులచేత పరిచ్ఛిన్నముగా నున్నప్పటికిని, వాస్తవముగా దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమై బ్రహ్మ యని చెప్పఁబడియున్నదిగా నుండును.

శ్లో. జలస్య చలనాదేవ చంచలత్వం యథా రవేః,
తథాహంకారసంసారాదేవ సంసార ఆత్మనః.

తా. జలమందు ప్రతిబింబించిన సూర్యునకు జలచలనముచేతనే చలనముగాని స్వయముగా నేప్రకారము చలనము లేదో యాప్రకారమే యంతఃకరణప్రతిబింబ మగునాత్మకును నా యంతఃకరణముయొక్క కర్తృత్వభోక్తృత్వాదివికారములచేతనే వికారిత్వము గాని స్వయముగా లేదు.

శ్లో. తస్మాదన్యగతా వర్ణా ఆశ్రమా అపి కేశవ,
ఆత్మన్యారోపితా ఏవ భ్రాంత్యా తేనాత్మనో హి తే.

తా. కనుక, బ్రాహ్మణాద్యాదివర్ణములు గృహస్థాద్యాశ్రమములును వాస్తవముగా నంతఃకరణమునందుండునవి. వీటి నజ్ఞానముచేత సర్వసంగశూన్యుఁడైన యాత్మయందారోపించుచున్నారు. గురుశాస్త్రోపదేశములచేత నివృత్తభ్రాంతిగల తత్వజ్ఞునకు వర్ణాశ్రమాదు లాత్మగతము లనుభ్రాంతి యుండనేరదని భావము.

శ్లో. న విధిర్న నిషేధశ్చ న వర్జ్యావర్జ్యకల్పనా,
ఆత్మవిజ్ఞానినామస్తి తథా నాన్యజ్జనార్దన.

తా. ఆత్మవిషయమై దృఢాపరోక్షజ్ఞానము గల మహానుభావులకు సంధ్యావందనాదులను చేయవలయునను విధిగాని సురాపానాదులను చేయఁగూడదను నిషేధము గాని పతితాన్నమును గ్రహింపఁగూడ దని గాని శ్రోత్రియాన్నమును గ్రహించవలయునని గాని యీలాటిబుద్ధివృత్తు లేవియు లేవని యర్థము. అయితే, బ్రహ్మతత్త్వజ్ఞానముగలవాఁడు సురాపానాది నిషిద్ధకర్మలను కూడ నాచరించునాయని శంకింపఁదగదు; సమాధిదశయందు వ్యాపారాంతరమే యుండదు. వ్యుత్థానదశయందు దేహేంద్రియాదులు పూర్వాభ్యాసముచేత నుచితకృత్యంబులయందే ప్రవర్తించును గాని, యనుచితకృత్యంబుల నాచరింపఁడని తెలియునది.

శ్లో. ఆత్మవిజ్ఞానినాం నిష్ఠామహం వేదాంబుజేక్షణ,
మాయయా మోహితా మర్త్యా నైవ జానంతి సర్వదా.

తా. ఆత్మతత్త్వజ్ఞానము గలవారియొక్క మనోనిష్ఠను నేనుమాత్ర మెఱుఁగుదును. అజ్ఞానముచేత నావరింపఁబడిన చిత్తము గల కించిజ్ఞులగుమనుష్యుల కెప్పటికిని తెలియదు.

శ్లో. న మాంసచక్షుషా నిష్ఠా బ్రహ్మవిజ్ఞానినామియమ్,
ద్రష్టుం శక్యా స్వతఃసిద్ధా విదుషాం నైవ కేశవ.

తా. బ్రహ్మతత్త్వజ్ఞానము గలమహాపురుషులయొక్క నిష్ఠ సామాన్యదృష్టిగల మాంసమయనేత్రములు గలవారలకు

గోచరింపదు. తత్వజ్ఞు లగుమహామునులయొక్క దివ్యదృష్టికి మాత్రము తెలియును.

శ్లో. యత్ర సుప్తా జనా నిత్యం ప్రబుద్ధస్తత్ర సంయమీ,
ప్రబుద్ధా యత్ర తే విద్వాన్ సుషుప్తస్తత్ర కేశవ.

తా. ఈలోకమునం దుండు జను లందఱు నేతత్త్వము నెఱుఁగకుందురో, ఆతత్త్వమును బ్రహ్మవేత్తయగువాఁ డెఱిఁగి చూచుచుండును. ఏతత్త్వమును లోకులంద ఱెఱిఁగి చూచుచుందురో, యాదేహేంద్రియాదితత్త్వమును బ్రహ్మవేత్తయగువాఁడు చూడకుండును.

శ్లో. ఏకమాత్మానమద్వంద్వం నిర్వికారం నిరంజనమ్,
నిత్యశుద్ధం నిరాభాసం చిన్మాత్రం పరమార్థతః.
యో జానాతి వేదాంతైః స్వానుభూత్యా చ నిశ్చితమ్,
సోఽతివర్ణాశ్రమీ ప్రోక్తస్స ఏవ గురురుత్తమః.

తా. సజాతీయవిజాతీయస్వగతభేదశూన్యమై కర్తృత్వభోక్తృత్వాదిసర్వవికారశూన్యమై పుణ్యపాపాదికర్మసంబంధము లేనిదై మాయాతీతమై తనను బ్రకాశింపఁజేయు మఱియొక వస్తువు లేకయే స్వయంప్రకాశరూపమై పరమానందరూపమైన యాత్మతత్త్వము సద్గురూపదేశపూర్వకముగా వేదాంతమహావాక్యముచేతను స్వానుభవముచేతను నెవనికి నిస్సంశయముగాఁ దెలియునో యామహాపురుషుఁ డతివర్ణాశ్రమి యనఁబడును. సర్వోత్కృష్టుఁ డగు గురువును నామహానుభావుండే కాఁదగినవాఁడు.

ఈప్రకారము పరమేశ్వరుఁడతివర్ణాశ్రమిశబ్దముచేత జీవన్ముక్తుఁడగువానిని నిరూపించెను. కనుకనే-శ్రు. "విముక్తశ్చ విముచ్యతే" యనునది మొదలగుశ్రుతులు జీవన్ముక్తస్థితప్రజ్ఞ బ్రాహ్మణభగవద్భక్తాతివర్ణాశ్రమిశబ్దములు గల స్మృతివాక్యములును జీవన్ముక్తియొక్క సద్భావమునందు ప్రమాణములుగా నున్నవి.

జీవన్ముక్తిప్రకాశికయందు జీవన్ముక్తిప్రమాణనిరూపణ మను ప్రథమప్రకరణము సమాప్తము.



శ్రీ హయగ్రీవాయ నమః.

# జీవన్ముక్తిప్రకాశిక.

## ౨-వ ప్రకరణము.

హరిః ఓమ్.

ఇంకను జీవన్ముక్తియొక్క సాధనములు చెప్పఁబడును. తత్వజ్ఞానము, మనోనాశము, వాసనాక్షయ మనునీమూఁడు జీవన్ముక్తికి సాధనములు. కనుకనే వాసిష్ఠరామాయణములోని యుపశమప్రకరణముయొక్క యంతిమభాగమునందు-

శ్లో. వాసనాక్షయవిజ్ఞానమనోనాశా మహామతే,
సమకాలం చిరాభ్యస్తా భవంతి ఫలదా మతాః.

అని వసిష్ఠమహర్షి యానతిచ్చిరి.

తా. వాసనాక్షయము, తత్త్వజ్ఞానము, మనోనాశము ఈ మూఁటిని నేకకాలమునందు చిరకాల మభ్యసింపవలయును. ఇట్లు చిరకాలాభ్యాసముచేతనే యీమూఁడు మోక్షఫలము నియ్యఁగలవని యర్థము.

ఈప్రకారము వాసనాక్షయతత్త్వజ్ఞానమనోనాశములు మోక్షసాధనము లని యన్వయక్రమముగాఁ జెప్పి వ్యతిరేకక్రమముగా కూడ చెప్పియున్నారు.

శ్లో. త్రయ ఏతే సమం యావన్న స్వభ్యస్తా ముహుర్ముహుః,
తావన్న పదసంప్రాప్తి ర్భవత్యపి సమాశతైః.

తా. ఈవాసనాక్షయము మొదలగు మూఁడుసాధనము లెంతవరకు సమకాలమునందు మాటిమాటికి చక్కఁగా నభ్యసింపఁబడవో యంతవఱకు నూఱుసంవత్సరములకైనను మోక్షము కలుగ నేరదు.

సమకాలమునం దీమూఁటిని నభ్యసింపనియెడల నొక బాధకము కల దని వసిష్ఠమహర్షి యే చెప్పిరి.

శ్లో. ఏకైకశో నిషేవ్యంతే యద్యేతే చిరమప్యలమ్,
తన్న సిద్ధిం ప్రయచ్ఛంతి మంత్రాస్సంకలితా ఇవ.

తా. సంధ్యావందనమునందు మార్జనకర్మయందు విని యోగింపఁదగిన "ఆపో హి ష్ఠామయో భువః" అను మొదలగుమంత్రములు మూఁడు నొకసారి పఠించి మార్జనమును చేసుకొన్నయెడల నామార్జనకర్మ పూర్ణముగా చేయఁబడి కార్యకారిగా నుండును. ఆప్రకారము చేయక యొక్కొక్క మంత్రము నొక్కొక్క దినమందు పఠించి మార్జనమును చేసుకొన్న పక్షమునం దామార్జనకర్మ పూర్ణముగాక యేప్రకారము కార్యకారిగా నేరదో, లోకమునందు కేవలాన్నమునుగాని కేవలవ్యంజనములనుగాని భక్షించినపక్షమునం దేప్రకారము భోజనము చేయఁబడినది కాదో, అనఁగా వ్యంజనములతో కూడ అన్నమును భక్షించుట భోజనమనియు, కేవలవ్యంజనములనుగాని కేవలాన్నమునుగాని భక్షించుట యుపవాసప్రతినిధి యనియు ధర్మశాస్త్రములయందు చెప్పియున్నందున వ్యంజనాన్నములలో నొకదానిని భుజించుట భోజన మని

చెప్పఁదగియుండదని భావము. ఆప్రకారమే వాసనాక్షయ మనోనాశతత్త్వజ్ఞానములు మూఁడు భిన్నసమయములయం దెంతకాల మభ్యసింపఁబడినను మోక్షసిద్ధిని కలుగఁజేయనేరవని యర్థము.

వాసనాక్షయాదులను మూఁటిని సమకాలముగా స్వల్పకాల మభ్యసించితే చాలదా? చిరకాలమేల యభ్యసింపవలయు నంటే, చిరకాలాభ్యాసమునకు ప్రయోజనము వసిష్ఠమహర్షిచే చెప్పఁబడినది.

శ్లో. త్రిభిరేతైశ్చిరాభ్యస్తైర్హృదయగ్రంథయో దృఢాః,
నిశ్శంకమేవ త్రుట్యంతి బిసచ్ఛేదాద్గుణా ఇవ.

తా. ఈవాసనాక్షయాదులు మూఁడు చిరకాల మభ్యసింపఁబడినపక్షమందు దృఢములైన యవిద్యాకామకర్మవాసనలన్నియు తామరకాడను త్రుంచితే దానియందుండుదారములన్నియు తెగిపోవునట్లు నిస్సంశయముగా నశించును. ఇదియే చిరకాలాభ్యాసమునకు ప్రయోజనము. స్వల్పకాలాభ్యాసమున కిట్టి ప్రయోజనము కలుగనేరదని భావము.

ఈ యర్థమే వ్యతిరేకముఖముగా కూడ చెప్పఁబడినది.

శ్లో. జన్మాంతరశతాభ్యస్తా రామసంసారసంస్థితిః,
సా చిరాభ్యాసయోగేన వినా న క్షీయతే క్వచిత్.

తా. ఓ రామా! ఈసంసారస్థితి యనేకసహస్రజన్మలనుండి యభ్యసింపఁబడి దృఢమూలమైయున్నందున విశేషకాలము తత్త్వజ్ఞానాదులయొక్క యభ్యాసము లేక నశింపనేరదు.

వాసనాక్షయము మొదలగుమూఁటిలో నొక్కొక్క దాని నభ్యసించినయెడల ఫలము మాత్రము లేకపోవుటయే కాదు. ఈ వాసనాక్షయాదిసాధనములయొక్క స్వరూపము కూడ సిద్ధింప నేరదనియు చెప్పఁబడియున్నది.

శ్లో. తత్త్వజ్ఞానం మనోనాశః వాసనాక్షయ ఏవ చ,
మిథః కారణతాం గత్వా దుస్సాధ్యాని స్థితాని హి.

తా. తత్త్వజ్ఞానము, మనోనాశము, వాసనాక్షయము ఈమూఁడు నొకదాని కొకటి కారణములుగా నున్నందున ప్రత్యేకముగా కాలభేదముచేత నభ్యసించినయెడల సిద్ధింప నేరవు.

ఈవాసనాక్షయము మొదలగు మూఁడుసాధనములను రెంటిని రెంటిని కార్యకారణములుగాఁ జేర్చితే మూఁడు ద్వంద్వము లేర్పడును. అవి యెట్లువలెనంటే-వాసనాక్షయమనోనాశములు, వాసనాక్షయతత్త్వజ్ఞానములు, మనోనాశతత్త్వజ్ఞానములు అని మూఁడుద్వంద్వములు. అందులో మనోనాశవాసనాక్షయద్వంద్వమన్యోన్యకారణముగా నున్నదని వ్యతిరేకముఖముగా చెప్పఁబడినది.

శ్లో. యావద్విలీనం న మనో న తావద్వాసనాక్షయః,
న క్షీణా వాసనా యావచ్చిత్తం తావన్న శామ్యతి.

తా. ఎంతవరకు మనస్సు నశించదో అంతవరకు వాసనలు నశించవు. ఎంతవరకు వాసనలు నశింపవో, అంతవరకు మనస్సుకూడ నశించదని యర్థము. జ్వాలాప్రవాహరూపముగా పరిణమించు వహ్నియే దీపమైనటుల వృత్తిప్రవాహరూపముగాఁబరిణమించు నంతఃకరణద్రవ్యము పదార్థములను మననము

చేయు (ఆలోచించు) స్వభావముగలది గనుక మనస్సని చెప్పఁబడును. ఇట్టి మనస్సుయొక్క నాశమనఁగా వృత్తిరూపమగు పరిణామమును విడిచి నిరోధరూపముగాఁ బరిణమించుట. ఈయర్థమును యోగశాస్త్రమునందు పతంజలిమహాముని సూత్రించిరి.

శ్లో. వ్యుత్థాననిరోధసంస్కారయోరభిభవప్రాదుర్భావౌ,
నిరోధక్షణచిత్తాన్వయో నిరోధపరిణామః.

తా. క్షిప్త, మూఢ, విక్షిప్తము లను మూఁడుభూమికలు వ్యుత్థాన మనఁబడును. ఇందులో రజోగుణముచేత విషయములయందే వృత్తిగల చిత్తము క్షిప్తమని, తమోగుణముచేత నిద్రావృత్తియందే ప్రవర్తించు చిత్తము మూఢ మని, సత్త్వగుణముచేత నేకాగ్రతను బొందుచున్నప్పటికిని మధ్యమధ్య రజోగుణముచేత విషయాంతరములయందుఁ బ్రవర్తించుచిత్తము విక్షిప్త మని చెప్పఁబడును. సత్త్వగుణోత్కర్షచేత చిత్తమునకుఁగలుగు పరిణామము నిరోధ మనఁబడును. ఈవ్యుత్థాననిరోధములచేతఁ గలుగు వాసనలు వ్యుత్థాననిరోధసంస్కారము లనఁబడును. ఇందులో వ్యుత్థానవాసన లభిభవింపఁబడి (నశించి) నిరోధవాసనలు ప్రాదుర్భవించినప్పుడు (పుట్టినప్పుడు) నిరోధ క్షణముతో చిత్తము చేరియుండుటయే మనోనాశమని తెలియవలయును. అనఁగా సత్త్వగుణాధిక్యముచేత నంతఃకరణ మేకాగ్రతను బొంది యుండుటయే మనోనాశము.

పూర్వోత్తరయుక్తాయుక్తత్వములను యోచించకయే హఠాత్తుగాఁ గలుగు క్రోధాదివృత్తులకు కారణమైన

చిత్తమం దుండుసంస్కారవిశేషము వాసన యనఁబడును. పూర్వపూర్వాభ్యాసముచేత చిత్తమందు వాసింపఁబడుచున్నందున వాసన యని చెప్పఁబడినది. ఇట్టివాసనయొక్క క్షయమనఁగా వివేకముచేత గలిగిన శమదమాదివాసనలువృద్ధిఁ బొందుచుండఁగా అధిక్షేపాదికారణము లున్నప్పటికి క్రోధాదులు పుట్టక పోవుటయే; యిందులో మనోనాశము లేకపోయెనా వృత్తులు పుట్టుచుండఁగా నధిక్షేపాదికారణములయొక్క సన్నిధియం దొకానొకప్పుడు క్రోధాదులు పుట్టును గనుక వాసనాక్షయము కలుగనేరదు. వాసన క్షయించనప్పుడు వృత్తులాప్రకారమే యుదయించుచున్నందున మనోనాశము కలుగనేరదు. కనుక వాసనాక్షయమనోనాశములు పరస్పరకారణములు.

తత్వజ్ఞానమనోనాశములు కూడ పరస్పరకారణములని వసిష్ఠమహర్షియే వ్యతిరేకముఖముగాఁ జెప్పియున్నారు.

శ్లో. యావన్న తత్త్వవిజ్ఞానం తావచ్చిత్తశమః కుతః,
యావన్న చిత్తోపశమో న తావత్తత్త్వవేదనమ్.

తా. ఎంతవఱకు తత్త్వజ్ఞానము కలుగదో అంతవఱకు చిత్తనాశము కలుగదు. ఎంతవఱకు చిత్తనాశము కలుగదో అంతవఱకు తత్వజ్ఞానము కలుగ దని యర్థము.

ఇదియంతయు పరమాత్మస్వరూపమే? ఈకనుపడురూపరసాదిప్రపంచము కేవలమాయాకల్పితము. ఈప్రపంచమను నది పరమార్థముగా లేనేలే దనునిశ్చయము తత్వజ్ఞానమనఁ

బడును. ఇటువంటి తత్వజ్ఞానము పుట్టినప్పుడు రూపరసాదివిష యములు గనఁబడుచుండఁగా, వానియందు చిత్తవృత్తులను ప్రవర్తింపకుండఁజేయుటకు కట్టెలను వేయుచుండఁగా నగ్ని యొక్కమంటను నివారింపశక్యము కానట్టు శక్యము కాదు. చిత్తనాశము లేకయుండెనా వృత్తులచేత రూపరసాదులు గ్రహింపఁబడుచుండఁగా-

శ్రు. "నేహ నానాస్తి కించన."

అని యిచ్చట భిన్నముగా కనఁబడు పదార్థమేమియు లేదు. సర్వము నవాస్తవమని శ్రుతి చెప్పుచున్నప్పటికిని, ఈశ్రుతి ప్రత్యక్షవిరుద్ధమాటచేత బ్రహ్మాస్వరూపము సర్వభేదశూన్య మను నర్థమును వాస్తవముగా చెప్పలేదను బుద్ధి కలుగును. అందువలన తత్వజ్ఞానము కలుగనేరదు. కనుక తత్వజ్ఞానమనో నాశము లన్యోన్యకారణములు.

తత్త్వజ్ఞానవాసనాక్షయములును పరస్పరకారణములని వ్యతిరేకముఖముగానే చెప్పఁబడినవి.

శ్లో. యావన్న వాసనానాశస్తావత్తత్వాగమః కుతః,
యావన్న తత్త్వసంప్రాప్తిర్న తావద్వాసనాక్షయః.

తా. ఎంతవఱకు వాసనానాశము కలుగదో, అంతవఱకు తత్వవిజ్ఞానము కలుగదు. ఎంతవఱకు తత్త్వవిజ్ఞానము కలుగదో, అంతవఱకు వాసనాక్షయము కలుగదని యర్థము.

క్రోధాదివాసనలు నశింపకపోయినా శమదమాదిగుణములు పుట్టనేరవు గనుక తత్వజ్ఞానము కలుగనేరదు. అద్వితీ

యబ్రహ్మతత్త్వము తెలియఁబడకపోయినా క్రోధాదులకు నిమిత్తము లగుతిరస్కారాదులయందు సత్యత్వబుద్ధి నశింపనందున వాసనలు నశింపవు గనుక తత్త్వజ్ఞానవాసనాక్షయములును పరస్పరకారణములు.

ఈప్రకారము వసిష్ఠమహాముని తత్వజ్ఞానవాసనాక్షయాదిద్వంద్వములకు పరస్పరకారణత్వమును వ్యతిరేకముఖముగా చెప్పిరి. అన్వయముఖముగాకూడఁ జెప్పవచ్చును. అది యెటువలె నంటే- బాహ్యవిషయములు కనుఁబడునప్పుడు సంస్కారము లుద్బుద్ధమగును. కాఁగానే మనస్సు వృత్తిరూపముగా పరిణమించును గనుక మనస్సు నిరోధమును (నాశమును) పొందినప్పుడు బాహ్యవిషయము లేవియు గనుపడనందున సంస్కారము (వాసన) పుట్టనేరదు. క్రోధాదివృత్తులు సంస్కారముచేత పుట్టునవి గనుక సంస్కారము పుట్టకపోఁగానే క్రోదాధివృత్తులు నశించును. ఈప్రకార మీఁవాసనాక్షయమనోనాశద్వంద్వము పరస్పరకారణమైయున్నది.

"శ్రు. దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా"

యనుశ్రుతి యేకాగ్రతనొందిన బుద్ధిచేత నాపరమాత్మ చూడఁబడునని చెప్పుచున్నందున, బ్రహ్మాకారవృత్తికంటె నితరములగుసర్వవృత్తులయొక్క నాశమే తత్వజ్ఞానమునకు కారణమని తోఁచుచున్నది. తత్వజ్ఞానము కలుగఁగానే మిథ్యాభూతమగు నీప్రపంచమునందు శశవిషాణాదులయందువలె బుద్ధివృత్తియుదయింపనందునను, పరమాత్మసాక్షాత్కారముకలిగియుండుటచేత తిరిగి పరమాత్మయందు వృత్తిపుట్టుట కావశ్యకము

తామర వృద్ధి నొందునటుల యన్యోన్యముగా వృద్ధి నొందు చుండు నని భావము.

ఈప్రకారము తత్త్వజ్ఞానవాసనాక్షయమనోనాశములు పరస్పరకారణముగా నున్నవి.

ఈతత్త్వజ్ఞానవాసనాక్షయమనోనాశనములయొక్క సాధనములను వసిష్ఠమహర్షి చెప్పిరి.

శ్లో. తస్మాద్రాఘవ యత్నేన పౌరుషేణ వివేకినా,
భోగేచ్ఛాం దూరతస్త్యక్త్వాత్రయమేతత్సమాశ్రయేత్.

తా. కనుక, ఓ రామా! పురుషప్రయత్నముచేతను విషయములయందుండు దోషములను విచారించుటను, వివేకముచేతను, విషయభోగములయం దాశను దూరముగా విడిచి ఈతత్త్వజ్ఞానవాసనాక్షయమనోనాశములను మూటిని సంపాదించవలయునని యర్థము.

పురుషప్రయత్నమనఁగా, ఏవిధముగానైనా యీకార్యమును నిశ్చయముగా సంపాదింపవలయు నను నుత్సాహము. పదార్థములయందుండు గుణదోషములను విభజించి బుద్ధిచేత తెలుసుకొనుటయే వివేకము. తత్త్వజ్ఞానమునకు వేదాంతగ్రంథశ్రవణము మనోనాశమునకు ప్రాణాయామాదియోగము వాసనాక్షయమునకు ప్రతికూలవాసనల నుత్పాదించుట సాధనముగా నుండును విషయభోగములయం దాశ స్వల్పముగా నున్నప్పటికి-

శ్లో. న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి,
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే.

తా. విషయములయందుండుకోరిక విషయానుభవము చేత నశించదు. కట్టెలు నెయ్యి మొదలైన వస్తువులను పైపైనఁ బడవేయుచుండఁగా నగ్ని వృద్ధినొందునటుల విషయముల ననుభవించుచుండఁగా విషయానుభవేచ్ఛ వృద్ధి నొందును గాని నశింపదు.

అని చెప్పినప్రకారము విషయములయందత్యాసక్తిని కలుగఁ జేయును గనుక నావిషయభోగాభిలాషను నిశ్శేషముగా విడువవలయును.

ఆక్షేపము—ఓయీ పూర్వ ప్రకరణమునందు వివిదిషాసన్యాసమునకు ఫలము తత్వజ్ఞానమని విద్వత్సన్యాసమునకు ఫలముజీవన్ముక్తియని చెప్పియుంటిరి. ఈయర్థమును పర్యాలోచనచేయఁగా వివిదిషాసన్యాసమును గ్రహించి వేదాంతశ్రవణముచేసి ముందుగా తత్వజ్ఞానమును సంపాదించి తరువాత విద్వత్సన్యాసము నంగీకరించి జీవించియుండుదశలో తనకు బంధకములగు వాసనామనోవృత్తులయొక్క నాశమును సంపాదింపవలయు నని తోఁచుచున్నది. ప్రస్తుతమందు తత్వజ్ఞానవాసనాక్షయమనోనాశముల నేకకాలమందే యభ్యసింపవలయు నని చెప్పితిరి. ఇందువలన పూర్వోత్తరవాక్యములు విరుద్ధములుగా నున్నవి.

సమాధానము—వివిదిషాసన్యాసికి తత్వజ్ఞానము ముఖ్యము. వాసనాక్షయమనోనాశములు అముఖ్యములు. విద్వత్సన్యాసికి వాసనాక్షయమనోనాశములు ముఖ్యములు. తత్వ

జ్ఞానము అముఖ్యము గనుక పూర్వోత్తరవాక్యములకు విరోధము లేదు.

అనఁగా, వివిదిషాసన్యాసి విద్వత్సన్యాసు లిద్దఱును తత్వజ్ఞానవాసనాక్షయమనోనాశముల నేకకాలమందే యభ్యసింపవలయును గాని వివిదిషాసన్యాసి తత్వజ్ఞానార్థమై వేదాంతశ్రవణాదుల నాచరించు కాలమునందు వాసనాక్షయమనోనాశము లావశ్యకము లయినప్పటికిని వాటిని గౌణాత్మకములుగా సంపాదించుకొని తత్వజ్ఞానమునే ప్రధానముగా సంపాదించును గాన వివిదిషాసన్యాసికి తత్వజ్ఞానము ముఖ్యము. వాసనాక్షయ మనోనాశములు అముఖ్యములై యుండును. విద్వత్సన్యాసికి తత్వజ్ఞానము పూర్వమందే కలిగియున్నందున దానివిషయమై విశేషప్రయత్నము చేయవలసినయావశ్యకము లేనందున నముఖ్యమై యుండును. అయినను వాసనాక్షయమనోనాశములకుఁగాను ప్రయత్నమును చేయుకాలమునందనువర్తించియే యుండును. వాసనాక్షయ మనోనాశము లంతకుముందు సిద్ధింపనందున విశేషప్రయత్నముతో సాధింపవలసి యుండును గాన ముఖ్యములుగా నుండును.

కనుక వివిదిషాసన్యాసి విద్వత్సన్యాసు లుభయులు తత్వజ్ఞానవాసనాక్షయమనోనాశముల నేకకాలమం దభ్యసింపవలయునని చెప్పినది విరుద్ధము కాదు.

ఆక్షేపము.—తత్వజ్ఞానము పుట్టినమాత్రాననే కృతార్థత కలుగుచుండఁగా వాసనాక్షయమనోనాశములకొఱకు సాధనాభ్యాస మెందుకు చేయవలయును?

సమాధానము—జీవన్ముక్తియొక్క ప్రయోజనమును ముందు చెప్పఁబోవుచున్నాము. దానిచేతనే యీ యాక్షేపము పరిహరింపఁబడును.

ఆక్షేపము—ఓయీ! విద్వత్సన్యాసికి తత్వజ్ఞానము పూర్వమందే సిద్ధముగా నున్నందున జ్ఞానసాధనము లగు శ్రవణాదుల ననుష్ఠించుట వ్యర్థము. తత్వజ్ఞానము వస్తుతంత్రముగాని కర్మవలె పురుషతంత్రము గానందున, శ్రవణాదులనువిడిచి కేవలముగా తత్వజ్ఞానము ననుష్ఠించుటకు శక్యము కాదు. కాఁబట్టి వాసనాక్షయమనోనాశ సాధనముల నభ్యసించుకాలమునందు తత్వజ్ఞానము అముఖ్యముగానైనా యేప్రకార మభ్యసింపఁ బడును ?

సమాధానము—తత్వజ్ఞానము స్వరూపము నభ్యసింప శక్యము కాకపోయినా, యేదో యొకమార్గముచేత నద్వితీయ బ్రహ్మతత్త్వమును మాటిమాటికి స్మరింప శక్యమై యుండును. ఈపునఃపునఃస్మరణమే తత్వజ్ఞానాభ్యాసము.

ఇటువంటి తత్వజ్ఞానాభ్యాసము వాసిష్ఠరామాయణమునం దుత్పత్తిప్రకరణములోని లీలోపాఖ్యానమునందు చెప్పఁబడినది.

శ్లో. తచ్చింతనం తత్కథనమన్యోన్యం తత్ప్రబోధనమ్,
ఏతదేక పరత్వం చ జ్ఞానాభ్యాసం విదుర్బుధాః.

తా. ఆబ్రహ్మస్వరూపమును మనస్సునందు చింతించుట, యొకరికిచెప్పుట, యొకరితో నొకరు జ్ఞాపకమును చేసుకొ

నుట, యీ బ్రహ్మతత్త్వమందే సర్వకాలములయందు బుద్ధిని చేర్చియుండుటయు జ్ఞానాభ్యాస మని చెప్పఁబడును.

శ్లో. "సర్గాదావేవ నోత్పన్నం దృశ్యం నాస్త్యేవ తత్సదా,
ఇదం జగదహం చేతి బోధాభ్యాసం విదుః పరమ్."—అని.

తా. ఈ దృశ్యమగు ప్రపంచము సృష్టియొక్క మొదటనే పుట్టలేదు. అందువలన నీప్రపంచము వంధ్యాపుత్రునివలె సుతరాం లేనిది. అంతఃకరణోపాధిక తత్వమైన జీవుఁడ నని చెప్పఁబడు నేనును లేనివాఁడనే యని మాటిమాటికి ననుసంధించుట జ్ఞానాభ్యాస మని చెప్పఁబడినది.

వాసనాక్షయమనోనాశాభ్యాసములయొక్క స్వరూపమును నా లీలోపాఖ్యానమందే చూపింపఁబడినది.

శ్లో. అత్యంతాభావసంపత్తౌ జ్ఞాతుర్జ్ఞేయస్య వస్తునః,
యుక్త్యా శాస్త్రైర్యతంతే యే తేఽప్యత్రాభ్యాసినః స్థితాః.

తా. జ్ఞాత యగు జీవుఁడు జడమగు దేహేంద్రియాది ప్రపంచము నేప్రకారమత్యంతాభావము (బొత్తిగా కనుపడక పోవుట) నొందునో యాప్రకారము యోగముచేత శాస్త్రముచేత నభ్యాసము చేయుట మనోనాశాభ్యాస మని చెప్పఁబడును.

శ్లో. దృశ్యాసంభవబోధేన రాగద్వేషాదితానవే,
రతిర్ఘనోదితా యాసౌ బ్రహ్మాభ్యాసః స ఉచ్యతే.

తా. దృశ్యమగు ప్రపంచ మంతయు వాస్తవమైనది నిత్యమైనదియు గాదు. మిథ్యయును,క్షయించుస్వభావముగల

దియు ననునిశ్చయజ్ఞానముచేత దృశ్యవిషయములయం దుండు రాగద్వేషాదులను తగ్గించుటకుఁ జేయుప్రయత్నమే వాసనాక్షయాభ్యాస మనఁబడును.

ఆక్షేపము—ఓయీ! ఈచెప్పినతత్వజ్ఞానమనోనాశ వాసనాక్షయాభ్యాసములు మూఁడును సమానములుగాఁ గనుపడుచుండఁగా వీటిలో నొకటి ముఖ్య మని మఱియొకటి యముఖ్య మని యేలాగున చెప్పవచ్చును?

సమాధానము—ప్రయోజనము ననుసరించి చెప్ప వచ్చును. అది యెటువలెనంటే, మోక్షేచ్ఛగలపురుషునకు జీవ న్ముక్తియని విదేహముక్తియని రెండుప్రయోజనములు కలవు గనుకనే "శ్రు. విముక్తశ్చ విముచ్యతే" అనుశ్రుతియందు విము క్తుఁడై విముక్తుఁ డగు నని రెండుపక్షములు చెప్పఁబడినవి.

ఇందులో జీవించియుండుపురుషునకు దైవసంపదచేత మోక్షము, ఆసురసంపదచేత బంధము కలిగియుండును. ఈ యర్థము భగవద్గీతలయొక్క పదియాఱవయధ్యాయమునందు భగవంతునిచే-

శ్లో. దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా.

అని చెప్పఁబడెను.

తా. దైవసంపద మోక్షమును కలుగఁజేయును. ఆ సురసంపద బంధమును కలుగఁజేయునని యర్థము.

ఈదైవసంపద్దయు నాసురసంపదయు నీరెండు నచ్చ టనే విశదముగా చెప్పఁబడినవి.

శ్లో. అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్.
అహింసా సత్యమక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునమ్,
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్.
తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా,
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత.
దంభో దర్పోఽతిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ,
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపదమాసురీమ్.

తా. భయము లేకపోవుట, ప్రసన్నమైన మనస్సు కలిగి యుండుట, ఆత్మజ్ఞానసాధనములయందు నిష్ఠ, తనకు కలిగిన యన్నాదిపదార్థముల నితరులకు యథాశక్తిగా నిచ్చుట, అంతరింద్రియనిగ్రహము, తన యధికారమునకు తగినట్టు శ్రౌతస్మార్తములనాచరించుట, ప్రత్యహము బ్రహ్మయజ్ఞమునందు వేదపారాయణమును చేయుట, శారీర మగు బ్రహ్మచర్యాహింసాదికము, వాచికమై, మృదువై, ప్రియమై, హితమైనవాక్యము, మానసికమగు ప్రసన్నమనస్కత్వనిర్మలాంతఃకరణత్వాదికము ఈ మూఁడువిధము లగు తపస్సు, సర్వవ్యవహారములయందు కుటిలత లేకయే వ్యవహరించుట, భూతములకు హింస కలుగకుండ సంచరించుట, చూచినదానిని చూచినట్లు చెప్పుట, ఒకఁడు తనను కొట్టినా మనస్సునందు కోపము పుట్టకపోవుట, కామ్యకర్మలను పరిత్యజించుట, బహిరింద్రియనిగ్రహము, ఒకరియొక్క దోషమును మరియొకరియెదుట చెప్పకపోవుట, సమస్తభూతములయొక్క దుఃఖమును చూచి సహించ లేకపోవుట, లోభము లేకపోవుట, మృదుత్వము అనఁగా క్రౌర్యము లేకపోవుట,

అకార్యములయందు బుద్ధిప్రమాదమునఁ బ్రవర్తించినప్పుడు లజ్జించుట, వ్యర్థములగు తృణచ్ఛేదనకండూయనాదివ్యాపారములను విడచుట, పరుల నభిభవించుటకు తగినసామర్థ్యము కలిగియుండుట, తన కొకరు పరిభవమును కలుగఁజేసినప్పుడు సహించియుండుట, దుఃఖాదులచేత బాధింపఁబడుసమయము నందు కూడ చిత్తమునందు ధైర్యము నొందియుండుట, మృజ్జలాదులచేత బాహ్యశుద్ధి, అహింసాఽక్రోధాదులచేత నంతఃకరణశుద్ధి కలిగియుండుట, ఒకరిని హింసించవలయు నను ఇచ్ఛ లేకయుండుట, నేను కులాచారపాండిత్యాదులచేత నందఱకంటె నధికుఁడను, సర్వజనులచేత పూజింపఁదగినవాఁడ నను నభిమానము లేకపోవుట యీగుణములు దైవసంపద గలవారికి నియతములుగా నుండును.

తాను చేయుధర్మమును లోకమునం దందఱికి తెలియవలయునని ప్రవర్తించుట, ధనము విద్య మొదలగువాటిచేత గర్వించియుండుట, నేను ఈలోకమునం దందఱికి పూజింపఁదగినవాఁడ నను నభిమానము, స్వల్పాపరాధము చేసినా యాగ్రహించుట, కఠినవాక్యముల నుచ్చరించుట, కఠినమనస్సుతో నుండుట, యుక్తాయుక్తజ్ఞానము దేహాత్మభేదజ్ఞానము లేకపోవుట, యీస్వభావము లాసురసంపదయందు కలిగినవానికి నియతములుగా నుండును.

ఈయాసురస్సంపద విస్తారముగా పదియాఱవయధ్యాయముయొక్క చివరనఱకు చెప్పఁడినది.

ఇందులో నశాస్త్రీయమై స్వభావసిద్ధమై యాసురసంపదయగు దుర్వాసనను శాస్త్రీయమై పురుషప్రయత్నసాధ్యమై, దైవసంపద యగు సద్వాసనచేత నశింపఁజేయఁగా జీవన్ముక్తి సంభవించును. వాసనాక్షయమే ప్రకారము జీవన్ముక్తికి సాధనమో, మనోనాశము కూడ నాప్రకారమే జీవన్ముక్తికి సాధనమని శాస్త్రములయందు చెప్పఁబడినది.

శ్లో. మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః,
బంధాయ విషయాసంగి ముక్త్యై నిర్విషయం స్మృతమ్.

తా. మనుష్యుల కందఱకు బంధమునకుఁ గాని మోక్షమునకుఁగాని కారణము చిత్తమే. చిత్తము విషయాసక్తమైతే, బంధనమునకుఁ గారణమగును. విషయములయం దాసక్తి లేక కేవలముగ నుంటే, మోక్షమునకు కారణమగును.

శ్లో. యదా నిర్విషయస్యాస్య మనసో ముక్తిరిష్యతే,
అతో నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా.

తా. మనస్సు విషయములను గ్రహించక యుండినా మోక్షము గలుగు నని చెప్పియున్నది గనుక మోక్షేచ్ఛగల పురుషుఁడు సర్వకాలములయందు మనస్సును విషయములయందు చేరి తదాకారముగాఁ బరిణమించకుండ నిరోధించవలయును.

శ్లో. నిరస్తవిషయాసంగం సన్నిరుద్ధం మనో హృది,
యదా యాత్యున్మనీభావం తదా తత్పరమం పదమ్.

తా. ఎప్పుడు మనస్సు విషయములయందు సక్తము గాక నిరోధింపఁబడి ఏకాగ్రతనొందునో అప్పుడా పరమపదమైన పరమాత్మస్వరూపము పొందఁబడును

శ్లో. తావ దేవ నిరోద్ధవ్యం యావద్హృది గతం క్షయమ్,
ఏతత్ జ్ఞానం చ ధ్యానం చ శేషోఽన్యో గ్రంథవిస్తరః.

తా. మనస్సు ఎంతకాలమునకు హృదయగోళమునం దే నిలీనమై యుండునో, అంతకాలము ప్రాణాయామప్రత్యాహారములచేతమనస్సును నిరోధించవలయును. ఇదియే జ్ఞానము. ఇదియే ధ్యానము. ఇతరమంతయు గ్రంథవిస్తారమే కాని ప్రయోజనము గలది గాదు. అనఁగా విషయములయందుఁ జేరక హృదయగోళమునందే నిరోధింపఁబడినమనస్సు ఏకాగ్రతను బొందియుండును గనుక నిర్గుణబ్రహ్మస్వరూపమును తెలుసుకొనుటకుఁగాని సగుణబ్రహ్మస్వరూపమును ధ్యానించుటకుఁగాని యోగ్యమై యుండును. ఇట్టి మనోనిరోధమును ప్రతిపాదించెడు శాస్త్రమే ప్రయోజనము కలదిగాని తదితరశాస్త్రమంతయు ఉపయోగము లేని సందర్భమును చెప్పుచున్నందున ప్రయోజనము లేని దని భావము.

బంధము తీవ్రబంధ మని మృదుబంధ మని రెండువిధములు. ఇందులో నాసురసంపద సాక్షాత్తుగా దుఃఖహేతువు గనుక తీవ్రబంధ మని చెప్పఁదగియున్నది. ద్వైతప్రపంచప్రతీతి స్వయముగా దుఃఖహేతువు కానందున సాక్షాద్దుఃఖహేతు వగు నాసురసంపదను కలుగఁజేయునది యయినందున మృదుబంధమని చెప్పఁదగియున్నది.

ఇందులో వాసనాక్షయముచేత తీవ్రబంధము మాత్రము నశింపఁజేయఁబడును. మనోనాశముచేత తీవ్రబంధమృదుబంధములు రెండు నశింపఁజేయఁబడును.

ఆక్షేపము — మనోనాశముచేత రెండుబంధములు నివర్తించునప్పుడు మనోనాశమును మాత్రము అభ్యసించితే చాలును వాసనాక్షయాభ్యాసము నిరర్థకము.

సమాధానము—భోగమునకు కారణమైన ప్రబలమైన ప్రారబ్ధకర్మచేత మనస్సు వ్యుత్థానదశను బొందింపఁబడి విషయములను గ్రహించు కాలమునందు తీవ్రబంధమును నివారించుటకు వాసనాక్షయ మావశ్యకమైనందున నిరర్థకము కాదు.

ఆక్షేపము—ద్వైతప్రపంచప్రతీతియే కదా మృదుబంధము. ఇట్టిమృదుబంధము భోగమును గలుగఁజేయునా!

సమాధానము— కలుగఁజేయును. క్రోధలోభాదితామసవృత్తులు తీవ్రబంధ మని సుఖజ్ఞానాదిసాత్త్వికవృత్తులు సత్కర్మప్రవృత్త్యాది రాజసవృత్తులును మృదుబంధ మని మా యభిప్రాయము. క్రోధలోభాదితామసవృత్తులు ఏప్రకారముగా బంధకములో ఆప్రకారమే సాత్త్విక రాజసవృత్తులును బంధకము లని భగవద్గీతాచతుర్దశాధ్యాయములో చెప్పియున్నది.

శ్లో. సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః,
నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్.

తా. ప్రకృతివలనఁ బుట్టిన సత్త్వరజస్తమోగుణములు మూఁడు ఈదేహమునందు తాదాత్మ్యాభిమానముతో నుండియు స్వతఃవికారశూన్యుఁడగు చిదాత్మను బంధించు నని

ద్వైతప్రపంచప్రతీతి యనఁగా స్రక్చందనవనితాదివిషయములయొక్క స్ఫురణము. ఇది తత్కాలమందు క్లేశకరము కానందున మృదుబంధమని చెప్పఁబడినది గాని క్రమముగా తీవ్రబంధమునకు కారణమగును. వ్యుత్థానదశయందు చిత్తమున కీవిషయములు స్ఫురించఁగానే వాసనాక్షయాభ్యాసము లేనందున చిత్త మీవిషయములయందు గుణదోషములను విచారించకయే యాసక్తమగును. అనంతరము తత్ప్రాప్తియందుఁ బ్రయత్నమును తదలాభమునందు విషాదమును బొంది క్రమముగా తీవ్రబంధము ననుభవించును. వాసనాక్షయ మభ్యసింపఁబడినపక్షమందు స్రక్చందనాదివిషయములు స్ఫురించినా వాటియం దనిత్యత్వాదిదోషములు దోఁచుచున్నందున చిత్తమాసక్తము కాదు. కనుక తీవ్రబంధము ననుభవింపదు. కాఁబట్టి వ్యుత్థానదశయందు తీవ్రబంధమును నివారించుటకుఁగాను, వాసనాక్షయాభ్యాస మావశ్యకము గనుక నిరర్థక మని శంకింపఁదగదు.

ఆక్షేపము—మృదుబంధము సాక్షాత్తుగా బాధకము కానందువల్లను,తీవ్రబంధము వాసనాక్షయముచేతనే నివర్తించినందువల్లను, మనోనాశాభ్యాసము నిష్ప్రయోజనము.

సమాధానము—ప్రారబ్ధకర్మచేత సంపాదింపఁబడి యవశ్యముగా సంభవించుభోగములను నివారించుటకుఁ గాను మనోనాశాభ్యాస మావశ్యకము గనుక నిష్ప్రయోజనము కాదు. అనఁగా ప్రారబ్ధకర్మచేత సంభవించుసుఖదుఃఖాదిభోగములలోఁ గొన్ని వైరాగ్యవాసనాక్షయాభ్యాసములచేత నివారింపఁబడును. మరికొన్ని తప్పక యనుభవింపఁబడును. తప్పక

యనుభవింపఁబడుభోగములు మనోనాశముచేతఁగాని చిత్తవిక్షేపమును చేయక యుండనేరవు. పుత్రభార్యాదిమరణము చేతఁ గలిగిన దుఃఖము సుషుప్తిదశయందు మనోనాశము కలుగుటచేత విక్షేపము నేప్రకారము చేయఁజాలదో యాప్రకారమే తత్పూర్వక యనుభవింపఁబడు భోగములును మనోనాశముచేత చిత్తవిక్షేపకములు గాక యుండు నని భావము. కనుకనే-

శ్లో. అవశ్యంభావిభోగానాం ప్రతీకారో భవేద్యది,
తదా దుఃఖై ర్నలిప్యేరన్ నలరామయుధిష్ఠిరాః.

అని చెప్పఁబడినది.

నా. తత్పూర్వక కాఁదగిన సుఖదుఃఖాది భోగములు చిత్తవిక్షేపకములు గాకుండ చేయునది మనోనాశము; ఇట్టిమనోనాశము లేకపోవుట చేతనే నలమహారాజు శ్రీరాములవారు ధర్మరాజు వీరు మహాదుఃఖముల ననుభవించిరి. నలాదులకు మనోనాశమే కలిగియున్నచో వారును మహాదుఃఖముల ననుభవించకయే యుండెదరు.

కనుక, ప్రారబ్ధకర్మసంపాదితావశ్యంభావిభోగములను నిరాకరించుటకుఁగాను మనోనాశాభ్యాస మావశ్యకము.

కనుక నీప్రకారము వాసనాక్షయమనోనాశములు జీవన్ముక్తినిగూర్చి సాక్షాత్సాధనము లగుటవలన ముఖ్యములు. తత్త్వజ్ఞానము గలిగెనో, అది వాసనాక్షయమనోనాశములకు కారణమై తద్ద్వారా జీవన్ముక్తికి సాధనమైనందున నముఖ్యము.

శ్రు. జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః
క్షీణైః క్లేశైర్జన్మమృత్యుప్రహాణిః.

తా. స్వప్రకాశస్వరూపుఁడైన పరమాత్మను తెలుసుకొని యుండుపురుషునకు సమస్తమైనబంధకము లగు కామక్రోధాదివాసన లనుపాశములు నివర్తించును వాసనలు నివర్తించఁగానే జన్మమరణప్రవాహరూపమైన యీసంసారము నివర్తించు నని యర్థము.

శ్రు. అధ్యాత్మయోగాధిగ మేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి.

తా. శ్రవణమనననిదిధ్యాసనము లనుసాధనములయొక్క యనుష్ఠానముచేత పరమాత్మను తెలుసుకొని యాపరమాత్మ సాక్షాత్కారము గల పురుషుఁడు హర్షశోకములకు కారణము లగు రాగద్వేషాదివాసనలను త్యజించు నని యర్థము.

శ్రు. తరతి శోకమాత్మవిత్.

తా. ఆత్మతత్త్వజ్ఞానము కలవాఁడు శోకమును దాఁటును.

శ్రు. తత్ర కో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః.

తా. జీవాభిన్నబ్రహ్మస్వరూపసాక్షాత్కారము గలవానికి అట్టికాలమందు మోహశోకము లుండనేరవు.

శ్రు. జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః.

తా. పరమేశ్వరుని తెలుసుకొని పురుషుఁడు సమస్తబంధములచేత విడువఁబడును.

ఇవి మొదలగుశ్రుతులయందు తత్త్వజ్ఞానము వాసనాక్షయమునకు కారణ మని యనేకపర్యాయములు వినఁబడుచున్నది.

మనోనాశమునకుఁగూడ తత్త్వజ్ఞానము సాధన మని శ్రుతులయందే ప్రసిద్ధమై యున్నది.

శ్రు. యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్? తత్కేన కం జిఘ్రేత్?.

తా. ఏకాలమందు పరిదృశ్యమాన మగుజ్ఞాతృజ్ఞానజ్ఞేయాది త్రిపుటీప్రపంచ మంతయు బ్రహ్మస్వరూపముగానే స్ఫురించునో యటువంటి కాలమందు ఎవఁడు దేనిచేత నెవరిని జూచును? దేనిచేత దేనిని నాఘ్రాణించును.

అనఁగా సర్వము నఖండబ్రహ్మాకారముగానుండు కాలమునందు దర్శనశ్రవణాదివృత్తులేవియునుండనేర వని తాత్పర్యము.

ఈశ్రుతి జ్ఞానదశ నుద్దేశించి చెప్పినది గాని విదేహముక్తిదశ నుద్దేశించి చెప్పినది కాదు.

శ్రీగౌడపాదాచార్యులవారును-

శ్లో. ఆత్మసత్యానుబోధేన న సంకల్పయతే యదా,
అమనస్తాం తదా యాతి గ్రాహ్యాభావే తదగ్రహం.

అని యానతిచ్చిరి.

తా. దృఢమైన పరమాత్మతత్త్వజ్ఞానముచేత నెప్పుడితరవిషయములయందు వృత్తులు పుట్టకయుండునో అపుడు అమనస్కయోగము సిద్ధించిన దని యెఱుఁగవలయును. గ్రహింపఁదగినవిషయములు మిథ్యాత్వజ్ఞానముచేత బాధింపఁబడినందున వాటియందు తిరిగి యెప్పటికి వృత్తులు పుట్ట వని భావము.

జీవన్ముక్తికి వాసనాక్షయమనోనాశము లేప్రకారము సాక్షాత్ సాధనములైనందున ముఖ్యములో యాప్రకారము విదేహముక్తికి తత్వజ్ఞానము సాక్షాత్సాధనమైనందున ముఖ్యము. ఈయర్థ మొకస్మృతియందు చెప్పఁబడియున్నది.

శ్లో. జ్ఞానాదేవ తు కైవల్యం ప్రాప్యతే యేన ముచ్యతే.

తా. దేనిచేత ముక్తుఁ డగునో యట్టికైవల్యము జ్ఞానముచేతనే పొందఁబడు నని సామాన్యముగా స్మృత్యర్థము. ఈస్మృతివచనము విశేషముగా వివరింపఁబడును. కేవలమైన యాత్మయొక్కభావము కైవల్యము. అనఁగా దేహేంద్రియాదిశూన్యత్వము. ఇది జ్ఞానముచేతనే పొందఁబడును. దేహేంద్రియాదిసహితత్వ మాత్మయం దజ్ఞానముచేత కల్పింపఁబడినందున నదిజ్ఞానముచేతనే నివర్తించుటకు యోగ్యమైయుండును. జ్ఞానముచేతనే యని చెప్పిన అవధారణార్థక మగు ఏవకారము జ్ఞానమే మోక్షసాధనముగాని కర్మ గాదని కర్మను నివర్తింపఁజేయుచున్నది. ఇదిగాక "న కర్మణా న ప్రజయా ధనేన" యనుశ్రుతి కర్మచేత,సంతానముచేత, దానముచేత మోక్షము పొందఁబడ దని స్పష్టముగా చెప్పుచున్నది. ఏపురుషుఁడు తత్త్వజ్ఞానప్రతిపాదకమగు శాస్త్రము నభ్యసింపక యోగశాస్త్రాభ్యాసముచేత యథాసంభవముగా వాసనాక్షయ మనోనాశముల నభ్యసించి సగుణబ్రహ్మోపాసనములగు దహార శాండిల్య వైశ్వానరాంతరాదిత్యాదివిద్యల నుపాసించునో, యాపురుషుఁ డర్చిరాదిమార్గముచేత బ్రహ్మలోకమును పొం

దును గనుక నతని కింగ దేహము నశించనందున కైవల్యము లేదు. కనుక నేత త్త్వజ్ఞానసహితములుగాని కేవలవాసనాక్షయ మనోనాశములు కూడ కైవల్యసాధనములు గావని యీపవ కారము ప్రతిపాదించుచున్నది. "యేనముచ్యతే" నుఅపదముల కుఏజ్ఞానము చేత పొందింపఁబడిన కైవల్యము చేత సకలబంధము లవలన విడువఁబడునో యని అర్థము. అవిద్యాగ్రంథి, అబ్రహ్మ త్వము, హృదయగ్రంథి, సంశయము, కర్మలు, అసర్వకామత్వము, మృత్యువు, పునర్జన్మ ఇవి మొదలైన శబ్దములచేత నాయాప్రదే శములయందు వ్యవహరింపఁబడియున్నందున బంధము నానా ప్రకారములుగా నున్నవి. ఈబంధములన్నియు నజ్ఞానము చేత కల్పింపఁబడినందున జ్ఞానము చేత నివర్తింపఁదగియున్నవి.

శ్రు. ఏతద్యో వేద నిహితం గుహాయాం సోఽవిద్యాగ్రంథిం వికిరతీహ సోమ్య.

తా. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమ యానందమయము లనుపంచకోశములయొక్క మధ్యభాగ మను గుహాయందు నివసించియున్న యీయక్షరబ్రహ్మను ఏపురు షుఁడు "అహంబ్రహ్మాస్మి" యని ప్రత్యక్షముగా సమాధిపరిపాక జన్యజ్ఞానము చేత తెలుసుకొనునో యాపురుషుఁడు అవిద్యా గ్రంథిని విడుచును.

శ్లో. బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి.

ఏపురుషుఁడు నేనే బ్రహ్మ నని బ్రహ్మస్వరూపము నెఱుఁ గునో యాపురుషుఁ డదివరకుండు నేను బ్రహ్మను కానను నజ్ఞానము నశించి బ్రహ్మగా నేర్పడును.

శ్రు. భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే.

తా. ఆపరమాత్మ ప్రత్యక్షముగా చూడఁబడఁగా హృదయగ్రంథి భేదింపఁబడును. సకలమైన సంశయములు ఛేదింపఁబడును. సర్వకర్మలు క్షయించును.

ఈశ్రుతియొక్క తాత్పర్యము పూర్వము విశదముగా చెప్పఁబడినందున నిచ్చట సంక్షేపింపఁబడినది.

శ్రు. యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్. సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ. బ్రహ్మణా విపశ్చితేతి.

తా. పూర్వోక్తపంచకోశాత్మకమగు గుహాయందుంచఁబడి, సర్వప్రత్యక్స్వరూపుఁడై సమస్తకామములను (ఆనందములను) ఏకకాలమందనుభవించెను.

శ్రు. తమేవ విదిత్వా అతి మృత్యుమేతి.

తా. ఆపరమేశ్వరుని తెలుసుకొని మృత్యువును అతిక్రమించి పోవును.

శ్రు. యస్తు విజ్ఞానవాన్ భవత్యమనస్కస్సదాశుచిః,
స తు తత్పదమాప్నోతి యస్మాత్ భూయో న జాయతే.

తా. ఏపురుషుఁడు సర్వకాలములయందు మలినవాసనలన్నియు నశించినందున శుద్ధుఁడును, కామక్రోధాదివృత్తులు నశించినందున మనస్సు లేనివాఁడును, శ్రవణమనననిదిధ్యాసనములచేత పరమాత్మతత్త్వమును సాక్షాత్తుగా తెలుసుకొన్నవాఁడును అవునో, యాపురుషుఁడు ఏపదమును బొందిన, తిరిగి జన్మ కలుగదో, యాపరబ్రహ్మపదమును పొందును.

ఇవి మొదలైన శ్రుతులు అవిద్యాగ్రంథి మొదలగు బంధములన్నియు జ్ఞానముచేతనే నివర్తించునని విస్పష్టముగా తెలియఁజేయుచున్నవి. ఇదిగాక-

శ్రు. య ఏవం వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వం భవతి.

తా. ఎవఁడు నేనే బ్రహ్మ నని తెలియునో వాఁడు ఈ కనుపడుప్రపంచమంతయు తానే అవును. అనఁగా సర్వాత్మక బ్రహ్మస్వరూపముగా నుండు నని భావము. ఇవి మొదలయిన శ్రుతు లనేకములు జ్ఞానముచేతనే బంధము నివర్తించు నని చెప్పునవి కలవు. ఈ యవిద్యాగ్రంథి మొదలగు బంధముల యొక్క నివృత్తియే విదేహముక్తి యనఁబడును. బ్రహ్మాయందజ్ఞానముచేత కల్పింపఁబడిన యీయవిద్యాగ్రంథి మొదలగు బంధములు జ్ఞానముచేత నశించఁగానే తిరిగి జన్మము సంభవింపదు. కనుక నీవిదేహముక్తి జ్ఞానోత్పత్తిసమకాలముననందే కలుగునని తెలియవలయును.

ఈయర్థము శ్రీశంకరభగవత్పాదాచార్యులు-

సూ. తత్తు సమన్వయాత్.

అను సూత్రముయొక్క భాష్యమునందు-

భా. 'శరీరే పతితే అశరీరత్వం స్యాన్న జీవత ఇతి చేన్న'

ఇది మొదలగువాక్యములచేత నానతిచ్చి యున్నారు.

తా. శరీరము పడిపోతే గదా యశరీరత్వము సిద్ధించును. శరీరము జీవించియుండఁగా నేలాగు సిద్ధించు నంటే, యాలాగున చెప్పఁగూడదని భాష్యవాక్యమున కర్థము.

సూ. తదధిగమ ఉత్తరపూర్వాఘయోరశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్.
అను సూత్రమునందును నీయర్థము విశదముగా చెప్పఁబడి యున్నది.

తా. బ్రహ్మస్వరూప సాక్షాత్కారము కలుగఁగానే యాగామిపుణ్యపాపము లంటవు. సంచితపుణ్యపాపములు నశించునని యర్థము.

ఆక్షేపము—ఓయీ వర్తమానదేహము నశించినతరువాత విదేహముక్తి కలుగు నని యనేకపండితులు వర్ణించుచున్నారు.

శ్రు. "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యతే."
యనుశ్రుతియు నీయర్థమునే వినుపించుచున్నది.

తా. తత్త్వజ్ఞానము కలవానికి నెంతవరకు దేహము విడువఁబడదో, అంతవరకే ముక్తి కలుగుట కాలస్యము. దేహపాతానంతరము ముక్తి కలుగు నని భావము.

వాక్యవృత్తి యను గ్రంథమునందు నీప్రకారమే చెప్పియున్నది.

శ్లో. ప్రారబ్ధకర్మవేగేన జీవన్ముక్తో యదా భవేత్,
కంచిత్కాలమథారబ్ధకర్మబంధస్య సంక్షయే.
నిరస్తాతిశయానందం వైష్ణవం పరమం పదం,
పునరావృత్తిరహితం కైవల్యం ప్రతిపద్యతే.

తా. జీవన్ముక్తుఁ డగుపురుషుఁడు ప్రారబ్ధకర్మయొక్క వేగముచేత కొంతకాలము సంచరించుచుండి తరువాత నాప్రారబ్ధకర్మ క్షీణించఁగానే సర్వాధికసుఖస్వరూపమై పునరావృత్తి

శూన్యమై దేహేంద్రియాది సర్వవికారరహితమైన పరబ్రహ్మ స్వరూపమును బొందును.

సూ. భోగేన త్వితరే క్షపయిత్వాఽథ సంపద్యతే.

అను సూత్రమునందు సూత్రకారులగు వ్యాసమహర్షియు నీ ప్రకారమే చెప్పియున్నారు.

తా. ప్రారబ్ధకర్మచేత సంపాదింపఁబడిన పుణ్యపాపముల ననుభవముచేత నివర్తింపచేసుకొని దేహపాతానంతరము పరమాత్మస్వరూపము నొందు నని సూత్రార్థము.

వసిష్ఠమహర్షియు-

శ్లో. జీవన్ముక్తపదం త్యక్త్వా శరీరే కాలసాత్కృతే,
విశత్యదేహముక్తత్వం పవనోఽస్పందతామివ.

అని శరీరపాతానంతరమే విదేహముక్తి కలుగు నని చెప్పియున్నారు.

కనుక తత్త్వజ్ఞానోత్పత్తి సమకాలమునందే విదేహముక్తి కలుగు నని చెప్పుట యుక్తము కాదు.

సమాధానము—దేహపాతానంతరమందు విదేహముక్తి కలుగు ననుపూర్వాచార్యులమతమును తత్వజ్ఞానోత్పత్తికాలమునందే విదేహముక్తి కలుగు ననుమామతమును ఈ రెండునభిప్రాయభేదముచేత నిర్దోషములుగానే యున్నవి.అది యెటువలెనంటే విదేహముక్తియను పదమునందు దేహశబ్దముచేత వర్తమానదేహములు భవిష్యద్దేహములు యావత్తు చెప్పఁబడినవని పూర్వాచార్యులయభిప్రాయము.ఇందుచేత వర్త

మాన దేహనాశానంతరముగాని తత్వజ్ఞానికి సర్వదేహబంధము నశించదు. కనుక నదియే విదేహముక్తియని పూర్వాచార్యమత ముయుక్తముగానే యున్నది. విదేహముక్తిశబ్దమునం దుండు దేహపదమునకు భవిష్యద్దేహముమాత్ర మర్థమని మాయభిప్రాయము. ఇందుచేత భవిష్యద్దేహమునకు కారణమైన యవిద్య తత్త్వజ్ఞానోత్పత్తికాలమునందే నశించినందున భవిష్యద్దేహనాశరూపమైన విదేహముక్తి జ్ఞానసమకాలమునందే కలుగు నను మామతమును యుక్తమే.

భవిష్యద్దేహము పుట్టకయుండుట కేకదా తత్వజ్ఞానమును సంపాదించుట. ఈవర్తమానదేహము తత్వజ్ఞానోత్పత్తికి పూర్వమందే పుట్టినందున దీనియొక్క ఉత్పత్తిని తత్వజ్ఞానము నివారించఁజాలదు. తత్వజ్ఞానములేనివానికి కూడ ప్రారబ్ధకర్మ నశించఁగానే వర్తమానదేహము నశించుచున్నందున వర్తమానదేహనివృత్తి తత్త్వజ్ఞానముయొక్క ఫలమని చెప్పఁదగదు. జీవన్ముక్తులగువారికి తత్వజ్ఞానము కలిగియున్నప్పటికి లింగదేహము నశించక యున్నందున లింగదేహనివృత్తియును తత్వజ్ఞానఫల మని చెప్పఁదగదు.

ఆక్షేపము—తత్వజ్ఞానము లింగదేహమును నివర్తింపఁజేయుసామర్థ్యము కలదిగా నున్నప్పటికి ప్రారబ్ధకర్మచేత ప్రతిబంధింపఁబడి కొంతకాలము లింగదేహమును నివర్తింపఁజేసిపోయినా, ప్రతిబంధము నశించఁగానే లింగదేహమును నివర్తింపఁజేయును గనుక, లింగదేహనివృత్తి తత్వజ్ఞానముయొక్క ఫల మని చెప్పవచ్చును.

సమాధానము—పంచపాదిక యను గ్రంథమును రచించిన శ్రీపద్మపాదాచార్యులు.

"యతో జ్ఞానమజ్ఞానస్య నివర్తకమ్."

పై గ్రంథమునందు తత్త్వజ్ఞానము అజ్ఞానమునే నివర్తింపఁజేయును గాని తదితరములగువానిని నివర్తింపఁ జేయదని చెప్పినందున లింగదేహానివృత్తి తత్త్వజ్ఞానఫలమని చెప్పఁగూడదు?

ప్రశ్న.—అయితే లింగదేహానివృత్తికి ఏమి సాధనము?

ఉత్తరము.— కారణముయొక్క నివృత్తియే సాధన మని చెప్పెదము.

కార్యమును నివర్తింపఁజేయునది విరోధిసద్భావము సామగ్రినివృత్తి యని రెండువిధములు. అది యెటువలెనంటే, దృష్టాంతమును చెప్పెదము. దీప మనునది కార్యము. దీనికి విరోధి వాయువు. వర్తితైలములు సామగ్రి. ఇందులో వాయువుచేతనైనా దీపము నివర్తించును. వర్తితైలములు నశించినా, నివర్తించును. ప్రకృతమందు దీపమునకు వాయువువలె లింగదేహమునకు నివర్తక మగు సాక్షాద్విరోధిపదార్థమును కానము. లింగదేహముయొక్క సామగ్రి కర్మ. ఇది ప్రారబ్ధకర్మ యని యనారబ్ధకర్మ యని రెండువిధములు. ఇందులో ప్రారబ్ధకర్మ యనఁగా వర్తమానదేహమును కలుగఁజేసి సుఖదుఃఖముల ననుభవింపఁజేయుచున్న కర్మ; అనారబ్ధకర్మ యనఁగా భవిష్యద్దేహమును కలుగఁజేసి దానియందు సుఖదుఃఖములను కలుగఁజేయుటకు కనిపెట్టియున్న కర్మ; యీ రెండుకర్మలచేతనే

జ్ఞానహీనులగువారియొక్క లింగదేహ మీలోకమునందును సంచరించుచుండును.

తత్వజ్ఞానికి వనారబ్ధకర్మ తత్వజ్ఞానముచేత ప్రారబ్ధకర్మ భోగముచేత నశించినందున వర్తితైలములు నశించినందున దీపము నశించినట్టు సామగ్రినివృత్తిచేత తత్వజ్ఞానియొక్క లింగదేహము నశించును. కనుక లింగదేహముయొక్క నివృత్తి తత్వజ్ఞానఫలము కానేరదు.

శ్రు. యస్మాద్భూయో న జాయతే.

అను మొదలైన శ్రుతులు పునర్జన్మనివృత్తి మొదలగునవి తత్వజ్ఞానఫలమని చెప్పుచున్నందున పునర్జన్మ అబ్రహ్మత్వము మొదలగు బంధములయొక్క నివృత్తియే జ్ఞానఫల మని నిశ్చయము.

ఆక్షేపము—పునర్జన్మనివృత్త్యాదికము కూడ తత్వజ్ఞానఫలమని చెప్పితే-

వా. "యతో జ్ఞానమజ్ఞానస్యైవ నివర్తకమ్."

అని పూర్వమందు చెప్పిన పంచపాదికాచార్యవచనమునకు విరుద్ధముకాదా ?

సమాధానము—అజ్ఞానముతోఁ గూడ నెప్పటికి నియతములుగా నుండు అబ్రహ్మత్వము సంశయము మొదలగునన్నియు నజ్ఞానశబ్దముచేత గ్రహించఁబడినందున విరుద్ధము కాదు. ఈప్రకారముగా చెప్పనిపక్షమందు తత్వజ్ఞానముగలపండితుల యొక్కఅనుభవమునకు విరుద్ధముగా నుండును.తత్త్వజ్ఞులగు

పండితులకు తత్త్వజ్ఞానము కలుగఁగానే అజ్ఞానమువలె నేను బ్రహ్మను కాను అను మొదలగు విపరీతజ్ఞానాదులన్నియు నశించుచున్నవిగదా. కనుక భవిష్యద్దేహానివృత్తియే విదేహముక్తి తత్త్వజ్ఞానోత్పత్తి సమకాలమునందే కలుగునని చెప్పుట నిందయుక్తముగా నున్నది.

శ్రు. అభయం వై జనక ప్రాప్తోఽసి ఇతి హోవాచ యాజ్ఞవల్క్యః.

అను బృహదారణ్యకశ్రుతివాక్యము లీయర్థమును స్పష్టపఱచుచున్నవి.

తా. ఓ జనకమహారాజా! నీవు మోక్షమును బొందితివి. ఓ మైత్రేయీ! ఇదియే మోక్షమని శ్రుతుల కర్థము.

ఈశ్రుతులయందు యాజ్ఞవల్క్యమహర్షి జనకునకు మైత్రేయీదేవికిని తత్త్వజ్ఞానము నుపదేశించిన కాలమునందే మోక్షము నొందితిరని చెప్పినందున విదేహముక్తి జ్ఞానసమకాలమునందే కలుగు నని నిశ్చయింపఁ దగియున్నది.

శ్రు. తమేవం విద్వానమృత ఇహ భవతి.

అను మఱియొకశ్రుతియందును జ్ఞానసమకాలమునందే ముక్తి యని చెప్పఁబడినది.

తా. ఆత్మను నీప్రకారముగా తెలుసుకొన్న పురుషుఁ డీలోకమునందే ముక్తుఁడగు నని శ్రుత్యర్థము.

ఇదిగాక తత్త్వజ్ఞానఫలమగు విదేహముక్తి తత్త్వజ్ఞానము పుట్టఁగానే సంభవించక కాలాంతరమునందు సంభవించు పక్షమునందు జ్యోతిష్టోమాదియాగములయందువలె తత్త్వజ్ఞానమువలన నొకయపూర్వము సంపాదనము పుట్టు నని కల్పిం

వలసివచ్చును. అనఁగా జ్యోతిష్టోమాదియాగములయొక్క ఫలమగు స్వర్గము యజమానునియొక్క మరణానంతరము సంభవించును. జ్యోతిష్టోమాదియాగము లనుష్ఠానోత్తరకాలము నందే నశించును. తత్కాలమందునశించిన యాగాదికర్మలు కాలాంతరమందు కలిగెడి స్వర్గమునకేప్రకారము సాధనము లగునని శంక రాఁగా యాగాదికర్మానుష్ఠానముచేత నొక యపూర్వ మనుసంస్కారము పుట్టు ననియు, నది యజమానుని యొక్క చిత్తమునందు స్వర్గఫలము ప్రాప్తించువరకునిలిచి స్వర్గఫలమును గలుగఁజేసి తరువాత నశించు నని పూర్వమీమాంసకులు నిర్వహించిరి. ఆప్రకారమే తత్వజ్ఞానముఫలమగు మోక్షము మరణానంతరమందే సంభవించుపక్షమున "శబ్దబుద్ధికర్మణాంత్రిక్షణావస్థాయిత్వమ్" శబ్దము, జ్ఞానము, కర్మ యీమూడును మూఁడుక్షణములు మాత్రముండును. తరువాత నశించు నను న్యాయమునుబట్టి తత్త్వజ్ఞానముకూడ ఉత్పత్త్యుత్తరకాలమునందే నశించును గనుక తత్వజ్ఞానమువలన నొకయపూర్వ మను సంస్కారము పుట్టి మోక్షము ప్రాప్తించువరకు తత్వజ్ఞనియొక్క చిత్తమందుండి మోక్షానంతరము నశించు నని చెప్పవలసివచ్చునని తాత్పర్యము.

ఆప్రకారము చెప్పినపక్షమునను తత్వజ్ఞానశాస్త్రము కర్మశాస్త్రములోనే యంతర్భవించును. తత్వజ్ఞానముకూడ కర్మలలో నొకటిగా నుండవలసివచ్చును. ఇది తత్వజ్ఞానము చేత దేహాంతమందు ముక్తి కలుగు నని వాదించువారికి సమ్మతము కాదు.

తనఫలము నేలాగున నియ్యఁగలదు. తత్వజ్ఞానాంతరము చరమ సాక్షాత్కారమను మఱియొకజ్ఞానము జన్మించును. దానిచేత విదేహమోక్షము కలుగు ననియును, జ్ఞానసాధనములు లేనందున శంకింపఁదగదు. తత్వజ్ఞానప్రతిబంధకమైన ప్రారబ్ధము నశించఁగానే జ్ఞానసాధనములగు గురుశాస్త్రదేహేంద్రియాదు లన్నియు నశించుచుండఁగా నేప్రకారము చరమసాక్షాత్కారమను జ్ఞానముపుట్టును? తత్త్వజ్ఞానమే చరమసాక్షాత్కారమునకు సాధన మంటిరా, క్షణికమైనతత్త్వజ్ఞానము పూర్వమందే నశించినందున చరమ సాక్షాత్కారమున కేలాగు సాధనము కాఁగలదు? కనుక తత్త్వజ్ఞానోత్పత్తి సమకాలమందే భవిష్యద్దేహనివృత్తి యను విదేహమోక్షము గలుగు నని మామతమే యుక్తముగా నున్నది.

ప్రశ్న.—అయితే-

శ్రు. "భూయశ్చాంతే విశ్వమాయా నివృత్తిః."

అని చెప్పినశ్రుతికి ఏమి తాత్పర్యము?

ప్రతివచనము.—ప్రారబ్ధకర్మావసానమందు దేహేంద్రియములు మొదలయిన సమస్తవికారములు నశించు నని తాత్పర్యము గాని చరమసాక్షాత్కారమునందు సర్వావిద్యాతత్కార్యములు నశించునని కాదు. అవ్యవహితపూర్వగ్రంథమునందు చరమసాక్షాత్కారమునుగూర్చి యుపపత్తులను కనుపఱచియున్నారము. కనుక మీకు సమ్మత మైన విదేహముక్తి దేహపాతానంతరమందే కలుగవచ్చును. మాకు సమ్మత

మైన విదేహముక్తి తత్త్వజ్ఞానసమకాలమందే కలుగు నను టకు సంశయము లేదు.

ఈయభిప్రాయముతోనే ఆధ్యాత్మపంచశతి యను గ్రంథ మునందు భగవంతుఁడగు శ్రీసంకర్షణమూర్తి.

శ్లో. తీర్థే శ్వపచగృహే వా నష్టస్మృతిరపి పరిత్యజన్ దేహం,
జ్ఞానసమకాలముక్తః కైవల్యం యాతి హతశోకః.

అని చెప్పియున్నారు.

తా. తత్త్వజ్ఞానసమకాలమందే విదేహముక్తి నొందిన బ్రహ్మవేత్త పరమపవిత్రమైన గంగాదిపుణ్యతీర్థముల యందైన గాని అత్యంతాపవిత్రమైన చండాలవాటికయందైనఁగాని వర్తమానదేహమును త్యజించి ప్రారబ్ధకర్మప్రాపకము లగు శోకహర్షాదులను విడిచి కేవలబ్రహ్మస్వరూపావస్థానము నొందు నని భావము.

కనుక విదేహమోక్షమునకు సాక్షాత్సాధన మగు తత్త్వజ్ఞానము వాసనాక్షయమనోనాశములకంటె ప్రధాన మని సిద్ధము.

వాసనాక్షయమనోనాశములు తత్త్వజ్ఞానసాధనములై నందున మోక్షమునుగూర్చి వ్యవహితసాధనములు కాఁబట్టి అప్రధానములు.

కామక్రోధాద్యాసురవాసనలను నశింపఁజేయు దైవవాసన జ్ఞానసాధన మని శ్రుతిస్మృతులయందు విశేషముగా చెప్పఁబడినది.

శ్రు. శాంతోదాంత ఉపరతస్తితిక్షుస్సమాహితో భూత్వాఽఽత్మన్యే వాత్మానం పశ్యేత్.

తా. బహిరింద్రియనిగ్రహము, అంతరింద్రియనిగ్రహము, సకలకామ్యకర్మపరిత్యాగము, శీతోష్ణాదిద్వంద్వసహనము, చిత్తైకాగ్రత యీగుణములుగలవాఁడై యద్వితీయప్రత్యగభిన్న బ్రహ్మతత్త్వము నెఱుఁగవలయును.

స్మృ: అమానిత్వమదంభిత్వ మహింసా క్షాంతిరార్జవం,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః.
ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ,
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనం.
అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు,
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు,
మయి చా నన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ.
వివిక్తదేశ సేవిత్వమరతిర్జనసంసది,
అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనం,
ఏతత్ జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా.

తా. తనగుణములను తాను శ్లాఘించకయుండుట, దంభరాహిత్యము, పరులను పీడించక యుండుట, మొదటివారు తనవిషయమై చేయుతిరస్కారాదులుసహించుట, సర్వవ్యవహారములయందు కౌటిల్యము లేకపోవుట, అనఁగా మనోవాక్కాయముల నేకరూపముగాఁ బ్రవర్తింపఁజేయుట, తనకుతత్త్వజ్ఞానము నుపదేశించినగురువును సేవించియుండుట, మృజ్జలములచేత శరీరమును క్షాళనమును చేయడమను బాహ్యశుద్ధియు; రాగ

ద్వేషరాహిత్యమును మనశ్శుద్ధియును గలిగియుండుట, సన్మార్గమునందుఁ బ్రవర్తించి దానియందే నిష్ఠగలిగియుండుట, శరీరమును దుష్కార్యములను చేయనీయక నిరోధించుట, ఇహలోకపరలోకములయందు శబ్దాదివిషయములయం దిచ్ఛ లేకయుండుట, గర్వము లేకయుండుట, జన్మయందు, మరణమునందు, ముసలియందు, రోగములయందు, దుఃఖములయందును ప్రసిద్ధములైనదోషములు విచారించుట, పుత్రులు, భార్య, గృహము, క్షేత్రము మొదలగు విషయములయందు ప్రీతిలేకయుండుట. పుత్రాదులయందే యధిక ప్రీతి లేకయుండుట. అనఁగా (పుత్రకళత్రాదుల క్లేశమును కొంచెము హాని కలిగితే తాను వహించినట్టు చేయుప్రేమ యధిక ప్రేమ యనఁబడును. అటువంటి యధిక ప్రేమ లేకయుండుట యని అర్థము.) ప్రారబ్ధకర్మచేత సుఖదుఃఖములు ప్రాప్తించినప్పుడు హర్షవిషాదములను బొందక సమానచిత్తము గలిగియుండుట, సర్వేశ్వరుఁడైన భగవంతునియం దేకాగ్రభక్తి గలిగియుండుట, జనసంపర్కశూన్యమైన యేకాంతదేశమందునికియు, జనులచే నిండియుండు ప్రదేశములయందు నివసించుట కిచ్ఛ లేకపోవుట, ఆత్మజ్ఞానకారణములైనశాస్త్రములయం దాసక్తి గలిగియుండుట, ఆత్మతత్వజ్ఞానము చేత గలుగు మోక్షమునందు సర్వాధికత్వజ్ఞానము. ఈగుణములు తత్వజ్ఞానమునకు సాధనములు. వీనికంటె నితరములగు డంబదర్పాదులు జ్ఞానమును నశింపఁజేసి నానావిధానర్థములను సంపాదించును.

ఇవి మొదలైనశ్రుతిస్మృతులయందు ద్వైతసంబంధముగాఁ జెప్పఁ

బడు శుభవాసన యాసురసంపదయగు నశుభవాసనను నశింపఁజేయును. దానివలన తత్వజ్ఞానము కలుగునని చెప్పినందున వాసనాక్షయము తత్వజ్ఞానమునకు సాధన మని చెప్పఁదగియున్నది.

ఈప్రకారమే మనోనాశము తత్వజ్ఞానమునకు సాధన మని శ్రుతిస్మృతులయందు ప్రసిద్ధమైయున్నది.

శ్రు. తతస్తు తం పశ్యతి నిష్కళం ధ్యాయమానః.

తా. శ్రవణమననములచేత పరబ్రహ్మతత్వమును పరోక్షముగా తెలుసుకొన్నతరువాత ధ్యానమును చేయుచున్నవాఁడై ఆనిర్గుణమైన పరబ్రహ్మను ప్రత్యక్షముగా తెలుసుకొనుచున్నాఁడు. ధ్యాన మనఁగా నేకాగ్రచిత్తత. మధ్యేమధ్యే యితరవిషయముల నాలోచింపక యొకటేవస్తువును నిరంతరముగా నాలోచించుట ధ్యాన మనఁబడును. ఇదియే మనోనాశము; దీనిచేతనే బ్రహ్మాపరోక్షజ్ఞానము కలుగు నని భావము.

శ్రు. అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి.

తా. పరమాత్మయందవిచ్ఛిన్నధ్యానముచేత నాపరమాత్మను ప్రత్యక్షముగా దెలుసుకొని తత్వజ్ఞుఁడగు పురుషుఁడు హర్షశోకాదిబంధములను విడుచును.

స్మృ. యం వినిద్రాజితశ్వాసాః సంతుష్టాస్సంయతేంద్రియాః,
జ్యోతిః పశ్యంతి యుంజానా స్తస్మై యోగాత్మనే నమః.

ఆలస్యాదితామసవృత్తులు లేనివారును అనఁగా అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము ఈయైదు యమములు కలవారని అర్థము. శౌచ, సంతోష, తపః,

స్వాధ్యాయ, ఈశ్వరప్రణిధానము లను నియమములు కల
వారును; రేచక పూరక కుంభకములను ప్రాణాయామములచే
త సర్వేంద్రియములను వాటివాటి విషయములయందు ప్రవ
ర్తింపనియ్యక నిరోధించినవారును అగు యోగులు ధార
ణాధ్యానసమాధులచేతనే స్వప్రకాశస్వరూపుండైన పరమే
శ్వరుని చూచుచుందురో, యాయష్టాంగయోగాభ్యాససా
ధ్యుండైన శ్రీకృష్ణపరబ్రహ్మకొఱకు నమస్కరించెదను.

ఈశ్రుతిస్మృతులయందు మనోనాశముచేత తత్త్వజ్ఞాన
ము కలుగు నని చెప్పియున్నది. కనుక నీప్రకారము తత్త్వజ్ఞాన
మనోనాశవాసనాక్షయములు మూఁడును యథాయోగ్యము
గా ముఖ్యములుగా నముఖ్యములుగా నుండునని తెలియఁ
దగినది.

ఆక్షేపము — ఓయీ! విద్వత్సన్యాసిచేత ప్రయత్న
పూర్వకముగా సంపాదింపఁబడిన తత్త్వజ్ఞానమనోనాశవాసనాక్ష
యములు ముందు విద్వత్సన్యాసానంతరము అనువర్తించుచుం
డిన చాలునా? లేక విద్వత్సన్యాసిచేత ప్రత్యేకము ప్రయత్న
పూర్వకముగా నభ్యసింపవలసియుండునా? మొదటిపక్షమం
దు విద్వత్సన్యాసికి తత్త్వజ్ఞానము పూర్వసిద్ధమైనందున నప్రధాన
ముగా నముఖ్యమని చెప్పితిరో యాప్రకారమే వాసనాక్షయ
మనోనాశములు కూడ పూర్వసిద్ధములైనందున నముఖ్యము
లని చెప్పవలసియుండును. కనుక విద్వత్సన్యాసికి ప్రధానమని
వాసనాక్షయమనోనాశములు ప్రధానము లని చెప్పుట యుక్త
ముకాదు. రెండవపక్షమందు విద్వత్సన్యాసికి వాసనాక్షయమ
నోనాశము లేప్రకారము ప్రయత్నసాధ్యములో యాప్రకా

రమే తత్త్వజ్ఞానము కూడఁ బ్రయత్నసాధ్యమైనందున ముఖ్యముగానే యుండును. కనుక విద్వత్సన్యాసికి వాసనాక్షయమనోనాశములే ప్రధానములు. తత్వజ్ఞానము ప్రధానము కాదని చెప్పుట యుక్తము గాదు. అని యంటిరా చెప్పెదము.

సమాధానము — వివిదిషాసన్యాసమునం దభ్యసించిన తత్వజ్ఞానముమాత్రము విద్వత్సన్యాసికి ననువర్తించియుండు నని వాసనాక్షయమనోనాశములు ప్రయత్నముఁ జేసి సంపాదించ వలసియుండు ననియు మే మంగీకరించుచున్నారము గనుక మీరు చెప్పినదోషములు రానేరవు. అది యెటువలెనంటె- బ్రహ్మజ్ఞానాధికారి 'కృతోపాస్తి' యని 'అకృతోపాస్తి' యని రెండువిధములుగా నుండును; అదివరకే యుపాసనమును చేసియున్నవాఁడు 'కృతోపాస్తి' యని, ఉపాసనమును చేయకయున్నవాఁడు 'అకృతోపాస్తి' యని చెప్పఁబడును. ఉపాసనకు ఫలము ఉపాస్యవస్తుసాక్షాత్కారమే కనుక నుపాస్యస్వరూపము సాక్షాత్కరించువరకు ఉపాసనమును చేసి తత్వజ్ఞానమునందుఁ బ్రవర్తించుపురుషునకు వాసనాక్షయమనోనాశము లదివరకే యుపాసనకాలమందే దృఢముగా సిద్ధించియున్నందున తత్వజ్ఞానము పుట్టఁగానే విద్వత్సన్యాసజీవన్ముక్తులు స్వయముగానే సిద్ధించును. ఇటువంటి పురుషుఁడే శాస్త్రములయందు చెప్పఁబడిన ముఖ్యజ్ఞానాధికారి. ఈకాలమునం దుండు జ్ఞానాధికారు లందఱు ప్రాయశః ఉపాసనమును యనివారుగానే యున్నారు. వీరు వాసనాక్షయమనోనాశములను తత్కాలమందు సంపాదించుకొని తత్వజ్ఞానసాధనము లగు

శ్రవణమననిదిధ్యాసనములయందుఁ బ్రవర్తించుచున్నాడు. ఈశ్రవణమనననిదిధ్యాసనములను దృఢముగా నభ్యసించినందున, అజ్ఞానసంశయ విపర్యయములు నశించి తత్త్వజ్ఞానము పుట్టుచున్నది. ఈతత్త్వజ్ఞానము నిత్యనిర్దోషమైన వేదవాక్యప్రమాణముచే నుదయించినందున నెట్టియుక్తి ప్రమాణజ్ఞానముచేత బాధింపఁబడదు. ఈ తత్త్వజ్ఞానముచేత నివర్తించిన యజ్ఞానము తిరిగి పుట్టుటకు హేతువు లేనందున తత్త్వజ్ఞానమునకు లోపము సంభవింపదు. వాసనాక్షయమనోనాశములైతే నో యింతవరకు నానాకాలికముగా సంపాదింపఁబడినందునను, దృఢాభ్యాసము లేనందునను సుఖదుఃఖాదిభోగములను గలుగఁజేయు ప్రారబ్ధకర్మచేత మధ్యమధ్య బాధింపఁబడుచున్నందునను గాలివీచెడిప్రదేశములోఁ బెట్టిన దీపము వలె నతిశీఘ్రముగా నివర్తించుచుండును.

ఈయర్థమే —

శ్లో. పూర్వాభ్యాసప్రయత్నాభ్యాం విషమోఽయం హి వాసనాః,
మనసో వాసనాత్యాగ స్సుమేరూన్మూలనాదపి.

అని వసిష్ఠమహర్షిచేఁ జెప్పఁబడినది.

తా. వెనుక చెప్పినసముద్రపానాదిప్రయత్నముకంటె మేరుపర్వతమును సమూలముగా పెల్లగించి వేయుటకంటె కూడ నీవాసనాత్యాగము అశక్యమైనది యని అర్థము.

భగవద్గీతలయందును.—

శ్లో. చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్.

అని అర్జునుఁడు చెప్పియున్నాఁడు.

తా. ఓస్వామీ! ఈమనస్సునది మిక్కిలి చంచలస్వభావము కలది. దేహేంద్రియాదులను క్షోభింపఁ జేయునదియు, తత్త్వవిచారముచేతకూడ జయించుటకు శక్యము కానిదియు విషయావాసనలతోఁ జుట్టఁబడియున్నందున ఛేదింప శక్యము కానిదియును గనుక నాకాశమందు విసరుచుండు వాయువును నిరోధించుట యేప్రకారముగా నశక్యమో? యాప్రకారమే యీమనస్సును నిగ్రహించుటయు నశక్యమని యర్థము. ఇందుచేత మనోనాశము శక్యమైనది కాదని తెలియుచున్నది.

కనుక నిప్పటివిద్వత్సన్న్యాసులకు తత్వజ్ఞానముమాత్రము వివిదిషాసన్న్యాసదశయందు దృఢముగా నభ్యసించియున్నందున అనువర్తించి యుండును. వాసనాక్షయమనోనాశములుమట్టుకు దృఢప్రయత్నముచేత నిప్పుడు సంపాదించవలసి యుండునని సిద్ధము.

ప్రశ్న.—ఓయీ! వాసనాక్షయముకొఱకుఁ బ్రయత్నముచేయవలయు నంటిరి; వాసన యనఁగా నేమి?

ఉత్తరము.—వాసనయొక్కస్వరూపము వసిష్ఠమహర్షిచే చెప్పఁబడినది.

శ్లో. దృఢభావనయా త్యక్త్వా పూర్వాపరవిచారణం,
యదా దానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా.

తా. చాలకాలమునుండి దృఢముగా భావింపఁబడియున్నందున వెనుకముందు మంచిచెడ్డలను యోచించకయే యొకవస్తువును గ్రహించుటకు కారణము వాసన యని చెప్పఁబడును. అనఁగా నేదైనా యొకవస్తువును మంచి దనికాని, మంచిది

కాదని కాని, చిరకాలమునుండి దృఢముగా నిశ్చయించుకొని యుండి దానియొక్క గుణదోషములను కనిపెట్టకయే మంచి దని కాని, చెడుదని కాని యథేష్టమానించుటకు కారణము వాసన యని భావము.

శ్లో. భావం తీవ్రసంవేగాదాత్మనా [illegible],
[illegible].

తా॥ పురుషుఁడు ఏతద్వస్తువులను [illegible]రించవలెనని తీవ్రమైనభావనచేత (అనఁగా నిశ్చలజ్ఞానముచేత యని యర్థము.) ఏవస్తువును భావించునో, యావస్తువుగానే యేర్పడును.

శ్లో. [illegible] పురుషో [illegible],
[illegible] యదేవ [illegible].

తా॥ భావనాభావితవస్తుస్వరూపుఁడగు పురుషుఁడు [illegible] యావస్తుభావనలచేత కలిగినసంస్కారములు [illegible] భావనచేత [illegible] శుద్ధుఁడై యేవస్తువును [illegible]చునో యావస్తువు మంచి[illegible] [illegible]పోయినా మంచిదిగానే తలఁచును.

శ్లో. వాసనా వేగవైచిత్ర్యాత్స్వరూపం ప్ర[illegible],
భ్రాం[illegible] [illegible].

తా॥ అతితీక్ష్ణమగు వాసనలచేత నాకర్షింపఁబడిన తనస్వరూపమునే తాను వాస్తవముగా తెలిసికొనఁజాలక మత్తతచేత కనులు తిరుగువాఁడు సర్వపదార్థములను తిరుగుచున్నట్టు లేలాగు తలఁచునో యాప్రకారము సర్వపదార్థములను విపరీతముగానే చూచును. (అనఁగా మంచివానిని చెడుగుగా చెడువానిని మంచిగా తలఁచు నని భావము.)

ఇట్టివాసనయందు తమతమదేశాచారకులధర్మభాషాత ద్గతసుశబ్దాపశబ్దములయందు జనుల కందఱికి సాధారణము గాఁగల యభినివేశమే దృష్టాంతము. అనఁగా నొకపురుషు నకు తాను నివసించి యుండుదేశము చాలమంచి దనునభిమా నము గలిగియుండఁగా, మఱియొకపురుషుఁడు మఱియొక దేశ ము మంచిదని దానియందు చాల గుణములు కల వని యెంత చెప్పినను స్వదేశమందే యభిమానము కలిగియుండును. ఇం దుకు కారణమే వాసన. వాసనయందు దేశాద్యభిమానమే దృష్టాంత మని భావము. ఈప్రకారమే కులాచారాదులయం దును అభినివేశమును చూడవలయును. ఈవాసనయొక్క భేదములను ముందుగా చూపించి తరువాత నీవాసనావిశే షమును చెప్పెదము.

ఇట్టివాసన నుద్దేశించియే బృహదారణ్యమందు—

శ్రు. స యథాకామో భవతి తత్క్రతుర్భవతి,
తత్కర్మకురుతే యత్కర్మకురుతే తదభి సంపద్యతే.

అని చెప్పఁబడినది.

తా. పురుషుఁ డేవస్తువును తాను కోరునో అందును తగిన సంకల్పమును చేయును. యెటువంటి సంకల్పమును చేయునో అటువంటికర్మను చేయును యెటువంటికర్మను చేయునో అటు వంటిఫలమును బొందును. అనఁగా కామనాసంకల్పాదులచేత సంస్కారమను వాసన కలిగి యావాసనచేతనే సంకల్పకర్మా ద్యుత్తరకృత్యములయందుఁ బ్రవర్తించు నని భావము.

ఈవాసనయొక్క భేదము వాసిష్ఠరామాయణమందు వాల్మీకిమహర్షిచే చెప్పఁబడినది.

శ్లో. వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధా చ మలినా తథా,
మలినా జన్మహేతుస్స్యా చ్ఛుద్ధా జన్మవినాశినీ.

తా. వాసన యనునది మలినవాసన యని, శుద్ధవాసన యని రెండువిధములు. అందులో మలినవాసన జన్మకారణముగాను, శుద్ధవాసన జన్మవినాశమునకు (అనఁగా మోక్షమునకు) కారణముగాను చెప్పఁబడుచున్నది.

శ్లో. అజ్ఞానసుఘనాకారా ఘనాహంకారశాలినీ,
పునర్జన్మకరీ ప్రోక్తా మలినా వాసనా బుధైః.

తా. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయము లను పంచకోశములను నాధారమై ప్రకాశకమై సాక్షియైన చిదాత్మను స్వతః భేదము కలిగియున్నప్పటికి, భేదము కనుపడకుండ నాచ్ఛాదించునది యజ్ఞానము. ఇట్టి యజ్ఞానముచేత మజ్జిగయొక్క మేళనముచేత పాలవలెను మంచుభూమిలో నుంచినందుచేత నెయ్యివలెను వాసన ఘనీభవించును. అనఁగా అజ్ఞానముయొక్క సహాయముచేత నీవాసన యనునది భ్రమపరంపరను గలుగఁజేయు నని భావము. అజ్ఞానముతో చేరి భ్రమపరంపరను కలుగచేయునదియు, ప్రబలమయిన యహంకారముతో కలిసియుండునదియు ఉత్తరకాలమునందు జన్మపరంపరను కలుగఁజేయు • సామర్థ్యము కలదియు మలినవాసన యని పండితులచేతఁ జెప్పఁబడినది.

అజ్ఞానసహితమగు వాసనచేతం బుట్టింపంబడు భ్రమ పరంపరను భగవద్గీతలయొక్క పదియాఱవయధ్యాయమునం దాసురసంపత్తును నివర్తించేటప్పుడు శ్రీకృష్ణభగవాను లానతిచ్చియున్నారు.

శ్లో॰ ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః,
న శౌచం నాఽపి చాచారో న సత్యం తేషు విద్యతే.

తా॰ ఆసురప్రకృతిగల పురుషులు ధర్మకార్యముల యందుం బ్రవర్తించుటను గాని యధర్మకార్యములలోనుండి నివర్తించుటనుగాని యెఱుంగరు. ఏప్రకారము తమబుద్ధికి తోంచునో యాప్రకారముగా చేయుచుందురు. బాహ్యాభ్యంతరశౌచముగాని శ్రుతిస్మృతులయందు చెప్పిన యాచారము గాని యథార్థముగా మాట్లాడుటగాని యసురప్రకృతిగల పురుషులయం దుండనేరదు.

శ్లో॰ అసత్య మప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్,
అపరస్పరసంభూతం కిమన్య త్కామహైతుకమ్.

తా॰ ఈప్రపంచమునందు శ్రుతిస్మృతీతిహాసపురాణములు వాస్తవములును ప్రమాణములును కావనియు, సుఖదుఃఖములకు హేతుభూతములైన ధర్మాధర్మములు లేవనియు, ఈప్రపంచమును సృష్టించునీశ్వరుండు సుతరాం లేండనియు, స్త్రీపురుష వ్యక్తులయొక్క పరస్పరసంయోగముచేతనే యీ ప్రపంచ మనాదిగాం బుట్టుచున్నదిగాని దీనికి మఱియొక కారణము లేదనియు చెప్పుచుందురు.

శ్లో. ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోల్పబుద్ధయః.
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోహితాః.

తా. ఈప్రకారముగా చార్వాకమతమం దుండువారి యొక్క అభిప్రాయము ననుసరించి కేవలమలినాంతఃకరణము కలవారై దృష్టపురుషార్థము లగు కామ్యగృహాదిద్రవ్యముల యొక్క సంపాదనమం దాసక్తమగు బుద్ధిగలవారై, కనుకనే పరహింసాప్రధానములగు కార్యములను జేయుచు సర్వజనవిరోధులై లోకవినాశముకొఱకే యుద్యమప్రవృత్తిగల పురుషులు పుట్టుచుందురు.

శ్లో. కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః.
మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్ ప్రవర్తన్తేశుచివ్రతాః.

తా. ఈపురుషులు లోకములో నుండు మనసునకు పదార్థములు యెంతవస్తు లభించినా తృప్తినిబొందని దురాశగల వారై దంభము అభిమానము మదము వీనితో గూడినవారై అవివేకముచేత దుర్గ్రాహ్యములను బట్టి (అనఁగా నీమంత్రముచేత నీభూమియందుండే యీమహానిధిని సాధించవలయు ననే దురాగ్రహముఁ బొంది యని యర్థము.) అపరిశుద్ధములైన మద్యమాంసాదిద్రవ్యములను సహాయములుగాఁ జేర్చుకొని సర్వలోకనింద్యమగు వ్రతము నవలంబించి ప్రవర్తించుచుందురు.

శ్లో. చిన్తామపరిమేయాం చ ప్రలయాన్తాముపాశ్రితాః.
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః.

తా. ఇదిగాక శరీరము నశించువఱకు పరిమితి లేనివిచారము కలవారును ప్రత్యక్షంబనవనితాది కామముల ననుభవించు

టయే పరమపురుషార్థ మని తలఁచువారును మనుష్యులకు పర మపురుషార్థము కామానుభవమే కాని మఱియొకటి లేదనే నిశ్చయము గలవారునునై ద్రవ్యమును సంపాదించుచుందు రని ముందటిశ్లోకముతో సంబంధము.

శ్లో. ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః,
ఈహంతే కామభోగార్థ మన్యాయే నార్థసంచయాన్.

తా. అనేకదురాశాపాశములచేత నీడ్వఁబడుచు కామ క్రోధముల నాశ్రయించి కామభోగముల ననుభవించుటకొఱకే దొంగతనము జూదము మోసము మొదలగు నన్యాయవ్యాపా రములచేత ద్రవ్యము నార్జింపఁ దలఁచుచుందురు.

ఈశ్లోకములచేత దుర్వాసనలయొక్క భ్రాంతి పరంపర చెప్పఁబడినది.

ఈప్రకారమే యహంకారమును చెప్పఁబడినది.

శ్లో. ఇద మద్య మయాలబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథం,
ఇద మస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్.

తా. ఇట్టి యాసురప్రకృతిగల పురుషు లీప్రకారము గా తలఁచుచుందురు. "నామనస్సుకు సమ్మతమైన యీవిషయ ము నిప్పుడు పొందినాను. ఇంకొకవిషయమును కూడ పొందఁ గలను. ఇంతధన మిప్పటికి నాకు కలదు. ఇంక కొంతధనము రాఁగలదు.

శ్లో. అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరానపి,
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ.

తా. ఈశత్రుఁ డిప్పటికి నాచేతఁ జంపఁబడినవాఁడు; ఇఁక నితరశత్రువుల నందఱిని చంపివేయఁగలను. నేనే ప్రభువును; నేనే సమస్తభోగముల ననుభవించువాఁడను; నేనే పుత్రపౌత్రాదులతోఁ గూడుకొని కృతార్థుఁడనై యున్నాను; నేను సామాన్యమైన మనుష్యమాత్రుఁడను గాను; మహాబలవంతుఁడను; పరమసుఖము ననుభవించువాఁడను; నేనొక్కఁడనే భూమండలమున కంతటికి నలంకారముగా నున్నాను; మిగిలినవా రందఱు భూమికి భారమే గాని ప్రయోజనము కలవారు గారు.

శ్లో. ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః.

తా. నేనే ద్రవ్యము కలవాఁడను, గొప్పకులమందుఁ బుట్టినవాఁడను, నాతో సమానమగు మనుష్యుఁ డొకఁడును లేఁడు; నేనును యాగములను చేయుచున్నాను; నటవిట గాయకగణికలకు బహుద్రవ్యమును దానము చేయుచున్నాను; నాకంటె నెక్కువగా యాగదానములను చేయువాఁ డెవఁడు? కనుక నేనే మహానందభరితుఁడనై యున్నాను; అని యిటువంటియజ్ఞానముచేత మోహమును బొంది వివేకహీనులై, నరకములయందు పడుదురని ముందరి శ్లోకముతో నన్వయము.

శ్లో. అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ.

తా. అనేక మనోరథములయందుఁ బ్రవర్తించుచిత్తముచేత నాకర్షింపఁబడుచున్నవారై యజ్ఞానమను వలయందుఁ బడి చిక్కి శబ్దాదివిషయభోగములయం దత్యంతాసక్తి

కలవారై కొంతకాలము బ్రతికియుండి చివరకు మరణానంతరమందు మహారౌరవాది నరకములయందుఁ బడుదురు.

ఇందుచేత నాసురసంపదయను మలినవాసన పునర్జన్మకు కారణ మని సూచింపఁబడినది. ఈసూచితమైనయర్థమే విస్తారముగాఁ బ్రతిపాదింపఁబడుచున్నది.

శ్లో. ఆత్మసంభావితాస్స్తబ్ధా ధనమానమదాన్వితాః,
యజంతే నామ యజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్.

తా. ఆసుర ప్రకృతి గలవారలు తమబుద్ధిచేతనే తమ్మును పూజ్యులఁగా దలఁచువారును, ఎటువంటియోగ్యత గల పురుషులకు కూడ నమ్రులు కానివారును, ద్రవ్యము చేత నభిమానము గర్వముగలవారు నై లోకమందు సోమయాజులవా రని యీలాగంటికీర్తిని బొందుటకు మాత్రము కొన్నియాగముల నశాస్త్రీయముగాఁ జేయుచుందురు.

శ్లో. అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః,
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః.

తా. తనయందుఁ గలిగియున్న గుణములచేత లేకయున్నగుణములచేతఁ దనను సర్వజనులకంటె హెచ్చుగాఁ దలఁచుచిత్తవృత్తి యహంకార మనఁబడును. అన్యజనులను పరిభవించుటకు నిమిత్తమైన చిత్తవృత్తి బలమనఁబడును. ఏవృత్తి పుట్టినందున పురుషుఁడు ధర్మమార్గమును దాఁటి సంచరించునో ఆవృత్తి దర్ప మనఁబడును. కామక్రోధములు ప్రసిద్ధములు. అహంకారబలదర్పకామక్రోధములతోఁ గూడుకొని, తనశరీరము

నందు నితర జనులయొక్క శరీరములయందును పరమాత్మ విద్రోహముగా నున్న పరమేశ్వరునియందు ద్వేషము కలవారై (అనఁగా పరమేశ్వరాజ్ఞారూపములగు శ్రుతిస్మృతులను యథావత్తు ప్రమాణములని విశ్వసింపక తమకిష్టమైన విషయములయందు మాత్రము ప్రమాణముగా నమ్ముచుందురని భావము.) సన్మార్గమందు ప్రవర్తించు మహాపురుషులయొక్క గుణములను చూచి యోర్వలేనివారై యుందురు.

శ్లో. తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు.

తా. పరమేశ్వరునియందు ద్వేషము కలవారై క్రూరస్వభావము గల యీ యధములైన మనుష్యులను అసురస్వభావముగల జన్మలయందు (అనఁగా సర్పవ్యాఘ్రాదిజన్మలయందే) ప్రవేశింపఁజేయుచుందును అని శ్రీకృష్ణభగవానులు చెప్పుచున్నారు.

శ్లో. ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని,
మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్.

తా. మూఢులగు నీమనుజాధములు క్రూరస్వభావముగల సర్పవ్యాఘ్రాదిజన్మలను బొంది పరమేశ్వరుఁడనైన నన్ను లభించు సన్మార్గమును చెందక అతినీచమైన గతిని పొందుచుందురు.

ఈప్రకారముగా మలినవాసనయొక్క స్వరూపస్వభావఫలవిశేషములు చెప్పఁబడెను. ఇఁకను శుద్ధవాసనను గూర్చి చెప్పెదము.

శ్లో. పునర్జన్మాంకురం త్యక్త్వా స్థితా సంభృష్టబీజవత్,
దేహార్థం ధ్రియతే జ్ఞాతా జ్ఞేయా శుద్ధేతి చోచ్యతే.

తా. వేయించిన విత్తనపుగింజ లేప్రకారము మొక్క మొలచుటకు యోగ్యత లేకయుండునో యాప్రకారమే పునర్జన్మకు కారణముగాక దేహధారణమాత్రమున కుపయోగముగా నుండి తెలియఁదగిన తత్త్వమును చక్కఁగా తెలుసుకొనియుండువాసన శుద్ధవాసన యనఁబడును. తెలియఁదగిన తత్త్వముయొక్క స్వరూపము భగద్గీత పదుమూఁడవయధ్యాయమునందుఁ జెప్పఁబడినది.

శ్లో. జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యత్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే,
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే.

తా. వెనక చెప్పిన యమానిత్వాదిసాధనములచేత దేనిని తెలియవలయునో యాతత్త్వమును దెల్పియఁజెప్పెదము. ఏతత్త్వమును తెలిసినపురుషుఁడు మోక్షమును బొందునో ఆతత్త్వము జన్మలేకయున్న సర్వాధికమైన పరబ్రహ్మస్వరూపమే. ఈ పరమాత్మస్వరూప మవాఙ్మానసగోచరమైనందున వేదమునం దుండు విధివాక్యములచేతఁ గాని నిషేధవాక్యములచేతఁ గాని ప్రతిపాదింపఁబడునది కాదు.

శ్లో. సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖం,
సర్వతశ్శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి.

తా. ఇదిగాక యీపరబ్రహ్మ సర్వవ్యాపకమైనపాదాత్మకమైయున్నందున, సర్వప్రదేశములయం దుండు హస్తపాద్యవయవములు తనవిగాను, సర్వప్రదేశములయం దుండు

న్నందున విస్పష్టముగా తెలియ శక్యమైనది కాదు. జ్ఞానహీను లగువారికి ననేకలక్షలయోజనములదూరమున కావల నున్నట్లు తోఁచును. జ్ఞానము కలవారికైననో ప్రత్యగాత్మస్వరూపముగా నున్నందున నతిసమీపమునందే యున్నట్లు కనుపడును.

శ్లో. అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితం,
భూతభర్తృ చ తత్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ.
జ్యోతిషామపి తత్ జ్యోతి స్తమసః పరముచ్యతే.

తా. ఇదిగాక సమస్తభూతములయందు సత్తాస్వభావముచేత నేకమైయున్నప్పటికి తత్తత్పదార్థరూపముచేత భిన్నముగా కనుపడుచుండును. అనఁగా లోకమునందు ఘటము కలదు; పటము కలదు; కుడ్యము కల దని యీలాగంటి వ్యవహారములయందు ఘటపటకుడ్యములు పరస్పరభిన్నములుగా నున్నప్పటికి కల దని చెప్పఁబడుసత్త సర్వత్ర యేకరూపముగా నున్నందున పరబ్రహ్మసత్తాస్వరూపముచేత నంతట నభేదముగా నుండియు ఘటపటాదిపదార్థోపాధిభేదముచేత భిన్నముగా కనుపడుచుండు నని భావము.

సమస్తభూతములను స్థితికాలమునందు పోషించుచు లయకాలమునందు నశింపఁజేయుచు సృష్టికాలము రాఁగానే తిరిగి యథాపూర్వముగా స్వమాయాశక్తి నవలంబించి సృజించుచుండును. ఇదిగాక ప్రకాశింపఁజేయు స్వభావము గల సూర్యాదితేజస్సులను కూడ ప్రకాశింపఁజేయు స్వభావము గలదియు, అజ్ఞానముచేత నెంతమాత్రమునైనను స్పృశింపఁబడని దనియు చెప్పఁబడుచున్నది.

ఇది జ్ఞేయమగు పరబ్రహ్మయొక్క లక్షణము.

జ్ఞేయస్వరూపమును ప్రతిపాదించెడు నీశ్లోకములయందు తటస్థలక్షణముచేత ప్రతిపాదించుటవలనను సోపాధికబ్రహ్మస్వరూపమును స్వరూపలక్షణముచేత ప్రతిపాదించుటవలనను నిరుపాధికబ్రహ్మస్వరూపమును ప్రతిపాదింపఁబడినది. ఒకానొకసమయమునందు లక్ష్యవస్తువుతో సంబంధించి లక్ష్యవస్తువును తెలియఁ జేయునది తటస్థలక్షణ మని చెప్పఁబడును. ఇందును దృష్టాంతమును జెప్పెదము. యజ్ఞదత్తుఁడనువాఁడు కాశీపట్టణములో దేవదత్తుఁడను బ్రాహ్మణుని గృహమునను పోవలెనని యచ్చట దేవదత్తగృహ మేదియో తెలియక దానిఁ దెలియఁగోరి సమీపమందు కనుపడిన యొక మనుష్యునిఁ జూచి దేవదత్తగృహ మెద్ది యని యడిగెను. అప్పుడా దేవదత్తగృహమం దొక కాక మెక్కి యుండఁగాఁ జూచి యామనుష్యుఁడు కాకము కలది దేవదత్తగృహ మని చెప్పిపోయెను. ఇందుచేత యజ్ఞదత్తుఁడు దేవదత్తగృహమును నెఱిఁగి యందులోఁ బ్రవేశించెను. ఇచ్చట దేవదత్తగృహము లక్ష్యము. కాకము లక్షణము. ఈలక్షణమైన కాకము ఎప్పటికిని దేవదత్తగృహమందు సంబంధించి యుండునది కాదు. యజ్ఞదత్తుఁడు దేవదత్తగృహ మేది యని యడుగుకాలమునందు మాత్రము సంబంధించి యుండెను. కనుక నీకాకము దేవదత్తగృహమును తెలియఁజేయు విషయమై తటస్థలక్షణ మని చెప్పఁబడినది. ప్రకృతమునందు నీప్రపంచముయొక్క జన్మస్థితిలయములకు కారణమైనది పరబ్రహ్మ యని చెప్పితే, యిచ్చట

పరబ్రహ్మ లక్ష్యము. జన్మస్థితిలయకారణత్వము లక్షణము. ఈ పరబ్రహ్మసృష్టికి పూర్వకాలమునందు ప్రళయమున కనంతరకాలమునందును నిష్ప్రపంచమై నిర్విశేషముగా నున్నందున నీజన్మస్థితిలయకారణత్వ మీజన్మస్థితిలయకాలములయందుఁ దప్ప తక్కిన కాలములయం దీపరబ్రహ్మయం దుండునది కాదు. అయినను, పరబ్రహ్మస్వరూపమును తెలియఁజేయుచున్నందున నీజగజ్జన్మస్థితిలయకారణత్వము పరబ్రహ్మను తెలియఁజేయువిషయమై తటస్థలక్షణమని చెప్పఁబడును. ఎప్పటికిని లక్ష్యవస్తువుతో సంబంధించి లక్ష్యవస్తువును తెలియఁజేయునది స్వరూపలక్షణ మనఁబడును. ఇందుకు దృష్టాంతమును చెప్పెదను. ఎప్పుడును చంద్రస్వరూపమును జూచి యెఱుఁగనిపురుషుఁడు మఱియొక పురుషునిఁ జూచి ఈనక్షత్రమండలమునందు చంద్రుఁ డనువాఁ డెవ్వఁడని యడుగఁగా ప్రకృష్టప్రకాశము కలవాఁడు చంద్రుఁ డని చెప్పెను. ప్రకృష్టప్రకాశము కలవాఁ డనఁగా విశేషకాంతి కలవాఁడని యర్థము. ఇందుచేత నాపురుషుఁడు చంద్రస్వరూపమును తెలుసుకొనెను. ఇచ్చట చంద్రుఁడు లక్ష్యము. ప్రకృష్టప్రకాశము లక్షణము. ఈప్రకృష్టప్రకాశము చంద్రునియం దొకానొకప్పుడు మాత్రము సంబంధించియుండునది కాదు. సర్వకాలములయందు సంబంధించి యుండును. సర్వకాలములయందు సంబంధించియుండి చంద్రుని తెలియఁజేయుచున్నందున నీప్రకృష్టప్రకాశము స్వరూపలక్షణమని చెప్పఁబడెను. ప్రకృతమందును సత్యజ్ఞానానందములు బ్రహ్మకు స్వరూపలక్షణము. ఇందులో పరబ్రహ్మలక్ష్యము సత్యజ్ఞానానంద

ములు లక్షణము. ఈసత్యజ్ఞానానందము లెప్పుడుమా త్రము బ్రహ్మతో సంబంధించియుండి మఱియెప్పుడు సంబం ధించక యుండునవి కావు. కనుక నీసత్యజ్ఞానానందములు బ్రహ్మస్వరూపమును దెలియఁజేయునవియగుట స్వరూపలక్షణ మని చెప్పఁబడినవి.

ఆక్షేపము—గురూ! వాసనయొక్క లక్షణమును ప్రతిపాదించునప్పుడు వెనుక ముందు యుక్తాయుక్తములను విచారించకయే ప్రవర్తించునది వాసన యని చెప్పియుంటిరి. జ్ఞేయమగు పరబ్రహ్మను తెలుసుకొనుజ్ఞానము విచారముచేత కలుగునది గాని అవిచారముచేత కలుగునది కాదు. కనుక జ్ఞాతృజ్ఞేయమగు పరబ్రహ్మజ్ఞానము ఏలాగున శుద్ధవాసన యని చెప్పవచ్చును?

సమాధానము—వాసనాలక్షణమును చెప్పినప్పుడే దృఢ భావనచేత పూర్వాపరములను విచారించక ప్రవర్తించు నది వాసన యని చెప్పినారము గనుక అనేకజన్మలయందు దృఢ ముగా నభ్యసింపఁబడియున్నందున, అహంకార మమకార కామక్రోధలోభాదిమలినవాసన లేప్రకారము పరులచేత నుప దేశింపఁబడకపోయినా స్వయముగానే పుట్టుచుండునో యాప్ర కారమే బ్రహ్మతత్త్వజ్ఞానమును మొదట గురూపదేశవేదాంత వాక్యవిచారాదులచేత నుదయించినప్పటికి చిరకాలము విచ్ఛే దములేకుండ శ్రద్ధాభక్తులతో బ్రహ్మతత్త్వమును ధ్యానించుటచే కొంతకాలమున కాపరబ్రహ్మస్వరూపము ప్రయత్నములేకయే

ఘటాదివస్తువులవలె స్ఫురించుచుండు. ఇటువంటి అప్రయత్నముగాఁ గలిగిన బ్రహ్మజ్ఞానముతోఁ గలిసి ప్రవర్తించు చక్షుర్జ్ఞానేంద్రియవ్యవహారము శుద్ధవాసన యని చెప్పఁబడినది. ఇట్టిశుద్ధవాసన దేహముఁ బ్రతికియుండుటకుమాత్ర ముపయోగించును గాని దంభాహంకారాద్యసురసంపదనుబుట్టించుటకు జన్మాంతరమును సంపాదించుధర్మము నార్జించుటకును మంటలోఁబడి మాడినగింజలు బొట్టలో పోసి దానిని నిండించుటకు మాత్ర ముపయోగించును గాని మంచియన్నమును చేయుటకుఁగాని పైరును మొలిపించుటకుఁగాని యేప్రకార ముపయోగింపవో యాప్రకారమే ఉపయోగించదు. మలినవాసన లోకవాసన యని, శాస్త్రవాసన యని, దేహవాసన యనిమూఁడు విధములుగా నున్నది. ఇందులో లోకములో నుండుజనులందఱు నన్ను నేప్రకారముగా నిందించకయుందురో, యేప్రకారము స్తుతిచేయుదురో యాప్రకారము సంచరించెద నను నభినివేశము లోకవాసన యనఁబడును. ఈవాసన సంపాదించుటకు శక్యమైనది కానందున మలినవాసన యని చెప్పఁదగియున్నది.

అది యెటువలె నంటే—

శ్లో. కోఽన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్,
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యోధృఢవ్రతః.

తా. వాల్మీకిమహర్షి తమసానదీతీరమందు తనయాశ్రమములో తపస్సు చేయుచుండఁగా త్రైలోక్యసంచారశీలుఁడగు నారదమహర్షి యచ్చటికి విచ్చేయఁగా వాల్మీకిమహర్షి

యానారదమహర్షికి సకలవిధపూజనలఁ గావించి యోస్వామీ! యీభూలోకమునం దీకాలమునందు సమస్తమైన గుణములు కలపురుషుఁ డెవఁడుగా నుండును. శత్రుసైన్యములోనికిని స్వగృహములోనికివలె ప్రవేశించు సామర్థ్యము కలవాఁడును, సకలమైన ధర్మములను తెలిసినవాఁడును, ఎవరివారిచేత చేయఁబడిన యుపకారమును కొంచమైనా గొప్పగాఁ దలఁచి యెప్పటికిని మఱువనివాఁడును, ఆడిబొంకనివాఁడును తా నవలంబించినవ్రతమును ప్రాణావసానకాలమందైనను విడువనివాఁడును ఎవఁడుగా నుండును? ఇంకను సమస్తగుణవిశిష్టుఁడై లేశమైన దోషము కూడ లేనిపురుషుని నాకుఁ జెప్పవలయు నని యనేకప్రకారములుగాఁ బ్రశ్న చేయఁగా నానారదమహర్షియు చిరకాల మాలోచించి,

శ్లో. ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః.

తా. ఇక్ష్వాకువంశమునం దవతరించిన రాముఁ డను నొకపురుషుఁడు కలఁడు. సమస్తజనులచేత తెలియఁబడినవాఁడు. నీ వడిగిన సమస్తగుణములు కలవాఁడని ప్రత్యుత్తరమును చెప్పిరి.

ఈప్రకారము నారదాదిమహామునులచేత కూడ నాదరింపఁదగిన మహాగుణములుగల శ్రీరాములవారికిని పతివ్రతా శిరోమణియై జగన్మాతయగు సీతాదేవికిని వినుటకు శక్యము కాని లోకాపవాద ప్రాప్తించినది; ఇఁకను సాధారణమైన మనుష్యులు ఏప్రకారముగా లోకవిరోధము లేకుండ సంచరింపఁ గలరు? ఇదిగాక దక్షిణదేశపుబ్రాహ్మణులచేత నుత్తరదేశపు

బ్రాహ్మణులు వేదవేదాంగములను చదివినవారైనప్పటికి మాంసభక్షణమును చేయుచున్నారని నిందింపఁబడుచున్నారు. ఉత్తరదేశబ్రాహ్మణులచేత దక్షిణదేశబ్రాహ్మణులు మేనరికమును చేయుచున్నారని నిందింపఁబడుచున్నారు. ఋగ్వేదులగు బ్రాహ్మణులు శుక్లయజుర్వేదముకంటె ఋగ్వేదము హెచ్చని తలఁచెదరు. కాణ్వశాఖీయులగు బ్రాహ్మణులు ఋగ్వేదాదివేదములకంటె శుక్లయజుర్వేదము శ్రేష్ఠమని తలఁచెదరు. ఈప్రకారము తమతమ కులగోత్రబంధువర్గేష్టదేవతాదులను శ్రేష్ఠముగా తలఁచి స్తుతిచేయడము ఇతరులయొక్క కులగోత్రాచారాదులను తక్కువగాఁ దలఁచి నిందించడము, పండితులు మొదలు పామరులవఱకు సుప్రసిద్ధముగా కనుపడుచున్నది.

ఈప్రకారము గుణదోషములు ఆయాపురుషులయొక్క రుచిభేదముచేత నేర్పడియున్నందున సకలజనులచే నిందింపఁబడకుండఁ బ్రవర్తించుట కెవ్వరికిని శక్యము కాదు.

ఈయర్థమే—

శ్లో. శుచిః పిశాచో వికలో విచక్షణః
క్షమోఽప్యశక్తో బలవాంశ్చ దుర్బలః,
నిఃస్వోఽప్యచోరః సుభగోఽప్యకామీ
కో లోక మారాధయితుం సమర్థః.

అని పూర్వగురువులచేఁ జెప్పఁబడినది.

తా. లోకమున్నం దొకఁడు సదాచారము గలవాఁడుగా మఱియొకఁడు దురాచారము కలవాఁడుగా నుండును.

ఒకఁడు విద్యాహీనుఁడై మూర్ఖుఁడుగానుండును. మఱియొకఁడు పండితుఁడుగానుండును. ఒకఁడు మంచి దేహపుష్టికలవాఁడై సమర్థుఁడుగా నుండును. మఱియొకఁడు దేహపాటవము లేక యసమర్థుఁడుగా నుండును. ఒకఁడు ద్రవ్యబలమనోబలములు గలవాఁడై యుండును. మఱియొకఁడు యీ రెండును లేకయుండును. ఒకఁడు ద్రవ్యములేక దరిద్రుఁడుగా నున్నప్పటికి దొంగతనము మొదలగు దుష్టవృత్తులు లేకయుండును. మఱియొకఁడు ద్రవ్యము సంపూర్ణముగాఁ గలిగియున్నను దొంగతనము మొదలగు దుష్టవృత్తులు కలిగియుండును. ఒకఁడు మన్మథునివంటి సౌందర్యము కలవాఁడై యున్నను కాముకుఁడు గాకయుండును. మఱియొకఁడు కేవలకురూపిగా నున్నను అతి కాముకుఁడై యుండును. వీరందఱు నొకరి యొక్క స్థితిని మఱియొకరు నిందించుచుందురు. కనుక లోకమునందుండు సకలమైన జనము యొక్క చిత్తము ననుసరించి సంచరించుట కెవనికి నశక్యమై యుండు నని యర్థము. అదిగాక,

శ్లో. విద్యతే న ఖలు కశ్చిదుపాయ స్సర్వలోకపరితోషకరో యః,

సర్వథా స్వహితమాచరణీయం కిం కరిష్యతి జనో బహుజల్పః.

అని కూడ వినఁబడుచున్నది.

తా. సకలజనులయొక్క మనస్సును సంతోషింపఁజేయు నుపాయము లోకమునం దొకటియుఁ గనఁబడదు గనుక తనకు హితమైనమార్గము నాలోచించి సంచరింపవలయునే కాని లోకులు శ్లాఘించెదరో నిందించెదరో యని ఆలోచించఁదగదు. భిన్నభిన్నప్రకారముగా మాటలాడుజనులు ఏమి చేయుదురని యర్థము.

కనుక నీలోకవాసన మలినమను నభిప్రాయముచేతనే తత్వజ్ఞాని తుల్యనిందాస్తుతియై యుండవలయునని మోక్ష శాస్త్రములయందుఁ జెప్పఁబడినది. అనఁగా బ్రహ్మతత్వజ్ఞానము గల పురుషుఁడు తనయధికారానుగుణముగా శాస్త్రముల యందు విధించిన ధర్మముల నాచరించునప్పుడు లోకులు దూషించినా శ్లాఘించినా సమానబుద్ధి కలవాఁడై యుండవ లయు నని భావము.

శాస్త్రవాసన యనునది పాఠవ్యసన మని బహుశాస్త్ర వ్యసన మని అనుష్ఠానవ్యసన మని మూఁడువిధములు. పాఠ వ్యసనము భరద్వాజుఁ డను మునియందు కనుఁ డుచున్నది. భరద్వాజుండనుముని మూఁడు పురుషాయుష్య కాలములచేత మూఁడు వేదముల నభ్యసించఁగా దేవేంద్రుఁడువచ్చి మీ కేమి కావలయునని యడుగఁగా నాకు నాలుగవ పురుషాయుష్యము లలో నాలుగవ వేదమును సమగ్రముగా నధ్యయనము చేయవలయు నని యున్నది! ఇదియే కావలయునని భర ద్వాజముని విన్నవింపఁగా దేవేంద్రుఁ డిది యొకపురుషునకు శక్యము కానందున మలినవాసన యని బోధించి యీభర ద్వాజునియొక్క ప్రయత్నమును చూచి ఈవృథాపాఠము ప్రయోజనకారి కాదని నిషేధించి మోక్షసాధన మగు సగుణ బ్రహ్మవిద్య నుపదేశించె నని పురాణములయందు వినఁబడు చున్నది.

ఈప్రకారమే పరమపురుషార్థమగు మోక్షమునకు సాధనము కానందున బహుశాస్త్రవ్యసనముకూడ మలినవా సన యనియే చెప్పఁదగియున్నది.

దూర్వాసుండను నొకముని యనేకవిధములగు శాస్త్ర పుస్తకములను సంపాదించి వానితో కూడ సాంబమూర్తిని గూర్చి నమస్కరించుటకుంగాను కైలాసమునకుం బోయెను. అప్పుడాసాంబమూర్తియొక్క సభలో నుండుమునులలో నారదమహాముని యాదూర్వాసులను జూచి నీవు బహు శాస్త్రములను సంపాదించి మోయుచున్నావు. వీనిలో సారము నీకు తెలియదు గనుక కస్తూరికర్పూరాదిభారమును మోయు గార్దభమునకు నీకు భేదమేమియును లేదని యుపదేశించిరి. అందువలన నాదూర్వాసులు నిండ శోకింపుకొని తన యొక్క పుస్తకములన్నిటిని సముద్రమునందు బడవేసి సాంబమూర్తిచేత నాత్మవిద్య నుపదేశింపబడి కృతార్థుం డాయెనని కావషేయగీతలయందు చెప్పంబడియున్నది. బ్రహ్మవిద్య యనునది బహిర్ముఖుడై విషయములయం దాసక్తిగలిగి గురుకటాక్షపాత్రుండు గానివానికి సర్వశాస్త్రములనుజూచిన కలుగనేరదు.

ఈయర్థమే—

శ్రు. నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన.

అను శ్రుతియందు చెప్పంబడినది.

తా. ఈపరమాత్మ గురుకటాక్షపాత్రులు కానివారికి కేవల వేదాంతశాస్త్రమును అనేకపర్యాయములు శ్రవణము చేసినా దానియర్థమును మననముచేసినాంమనస్సునం దనేకపర్యాయములు ధ్యానమును చేసినా తెలియంబడదని యర్థము.

శ్లో. బహుశాస్త్రకథాకంథా రోమంథేన వృథైవ కిమ్,
అన్వేష్టవ్యం ప్రయత్నేన తత్త్వజ్ఞైర్జ్యోతిరాంతరమ్.

తా. అనేకశాస్త్రములను మాటిమాటికి పాఠప్రవచనములచేత నావృత్తిచేసినందునఁ బ్రయోజన మేమియును లేదు గనుక తత్వజ్ఞులగు పురుషులు హృదయపుండరీకమునందుండు స్వప్రకాశస్వరూపమైన పరబ్రహ్మను ప్రయత్నపూర్వకముగా తెలుసుకోవలయును.

శ్లో. అధీత్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణ్యనేకశః,
బ్రహ్మతత్వం న జానాతి దర్వీ పాకరసం యథా.

తా. ఋగ్యజుస్సామాథర్వణములను నాలుగు వేదములను మనుస్మృతి మొదలగుధర్మశాస్త్రములను మీమాంస మొదలగు సమస్తశాస్త్రములను చదివియు, అన్నాదిపదార్థములను పాకముచేయుగరిటె వాటియొక్క రుచిని యెఱుఁగనట్టు సమస్తశాస్త్రసార మగు పరబ్రహ్మతత్త్వమును ఎఱుఁగడు.

అని గురుకటాక్షపాత్రుఁడు గానివానికి సమస్తశాస్త్రములు తెలిసినా వాటియొక్క సారార్థమైనపరబ్రహ్మతత్త్వము తెలియఁబడదని చెప్పియున్నది.

ఛాందోగ్యములో నారదమహాముని ఋగ్వేదము మొదలగు సమస్తవేదములను అఱువదినాలుగు విద్యలను సమగ్రముగా చదివి బ్రహ్మతత్వజ్ఞానము లేనివాఁడై సనత్కుమారునియొద్దకు పోయి వారివలన నాత్మతత్వమును తెలిసి కృతార్థుఁడాయెనని వినఁబడుచున్నది.

అనుష్ఠానవ్యాపన మనునది విష్ణుపురాణములో ఋభుమ హామునియొక్క శిష్యుఁడగు నిదాఘునియందును వాసిష్ఠరా మాయణములో దాశూరుఁడను బ్రాహ్మణునియందు నున్న ట్టు చెప్పబడియున్నది.

నిదాఘుఁడను బ్రాహ్మణుఁడు ఋభుమహామునియొద్ద సమ స్తవేదవేదాంగములను చదివి సమావర్తనమును బొంది గృహ స్థాశ్రమము నంగీకరించి యథాశాస్త్రముగా కర్మల నాచరించ వలయునను నభినివేశముతో కర్మల నాచరించుచుండఁగా నా చార్యులగు ఋభుమహాముని శిష్యునికి బ్రహ్మవిద్యయందాభి ముఖ్యమును కలుగఁ జేయుటకై శిష్యగృహమునకుఁ బోయి కొన్ని ఉపాయములచేత బ్రహ్మవిద్య నుపదేశించి తిరిగి తన యాశ్రమమునకు పోయి మరికొంతకాలమునకు శిష్యుఁడు బ్రహ్మవిద్యానిష్ఠకలవాఁడై యున్నాఁడా! లేదా యని తెలిసికొను టకుగాను నాఋభుమహాముని తిరిగి శిష్యుఁడైన నిదాఘుని యింటికి వెళ్ళఁగా నప్పటికి నానిదాఘుఁడు కర్మలయందే శ్రద్ధక లిగి ప్రవర్తించుటను చూచి ఖిన్నుఁడై యతనికి బ్రహ్మవిద్య యందు నిష్ఠ దృఢముగా కలుగులాగున బోధించెనని విష్ణు పురాణమునందు వినఁబడుచున్నది.

దాశూరుఁడను బ్రాహ్మణుఁడు కర్మానుష్ఠానమునందు చా లశ్రద్ధకలవాఁడై యోగ్యమైన దేశమును పరీక్షించుటకై భూమి యందంతట తిరిగియు నెచ్చటను యోగ్యమైన దేశమును కా నకపోయె నని వాసిష్ఠరామాయణమునందు చెప్పఁబడినది. ఈ

కర్మవాసన పునర్జన్మకు కారణమైనందున మలినవాసన యని తెలియఁదగినది.

ఈకర్మవాసన మలిన మని ముండకోపనిషత్తులో పఠింపఁబడుచున్నది.

శ్రు. ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా
అష్టాదశోక్తమవరం యేషు కర్మ,
ఏతత్ శ్రేయో యేఽభినందంతి మూఢా
జరామృత్యుం తే పునరేవాపియంతి.

తా. బ్రహ్మ, అధ్వర్యుఁడు, హోత, ఉద్గాత, ప్రతిప్రస్థాత, మైత్రావరుణుఁడు, సోమప్రవాకుఁడు వీరు మొదలగు పదియాఱుగురు ఋత్విక్కులు పత్నీయజమానులిద్దఱు సమష్టికి పదునెనిమిదిపురుషులచేత సంపాదింపఁబడి శరీరాయాససాధ్యమై స్వల్పఫలమును కలుగఁజేయునదియైనందున నికృష్టమగు కర్మయే స్వరూపముగాఁగల యజ్ఞములు సంసారసముద్రమును దాఁట నిచ్ఛగలవారికి వోటివాడలవంటి సాధనములు ఈయజ్ఞములని శ్రేయస్సాధనములుగా నమ్మి యెవరు అనుష్ఠించుచుందురో వారు సర్వదా మాటిమాటికి జన్మజరామృత్యురూప మగు సంసారమునే పొందుచుందురు గాని యొకనాటికైనా సంసారములోనుండి తరింపఁజాలరు.

శ్రు. అవిద్యాయామంతరే వర్తమానాః
స్వయంధీరాః పండితంమన్యమానాః,
జంఘన్యమానాః పరియంతి మూఢా
అంధేనైవ నీయమానా యథాంధాః.

తా. అజ్ఞానములోఁ బడి యేమియు తెలియకుండనుం డియు తాము సమస్తమును తెలిసినపండితుల మని తలంచి జరారోగాద్యనేకానర్థవ్రాతములచే పీడింపఁబడి జాత్యంధుల చేత దారి చూపింపఁబడినచెడి జాత్యంధులవలె నెప్పటికిని దారినిగానక అనర్థములయందే పడుచుఁ దిరుగుచుందురు.

శ్రు. అవిద్యాయాం బహుధా వర్తమానాః
వయం కృతార్థా ఇత్యభిమన్యంతి బాలాః,
యత్కర్మిణో న ప్రవేదయంతి రాగాత్
తేనాతురాః క్షీణలోకాశ్చ్యవంతే.

తా. అజ్ఞానకార్యములగు యజ్ఞాదికర్మలయందనేకప్రకారములుగాఁ బ్రవర్తించి మేము కృతార్థుల మైతిమని యవివేకులగువారు తలంచుచుందురు; ఏకారణముచేత కర్మనిష్ఠులగువారు కర్మఫలము లగుస్వర్గాదులయందుండు రాగము చేత పరమార్థతత్వమును నెఱుఁగజాలరో, అందుచేతనే యాగాదికర్మలచేత సంపాదింపఁబడిన స్వర్గాదిఫలములు నశింపఁగానే కడుదుఃఖాక్రాంతచిత్తులై స్వర్గలోకమునుండి తిరిగి ఈలోకమునను ప్రవేశింతురు.

శ్రు. ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం
నాన్యచ్ఛ్రేయో వేదయంతే ప్రమూఢాః,
నాకస్య పృష్ఠే తే సుకృతేఽనుభూత్వా
ఇమం లోకం హీనతరం వా విశంతి.

తా. యాగాదిశ్రౌతకర్మలను వాపీకూపతటాకనిర్మాణాదిస్మార్తకర్మలను ముఖ్యముగా పురుషార్థసాధనములుగా

తలఁచి మూఢులగు జనులు మోక్షమును పరమపురుషార్థమున్నదని దానికిసాధన మగు ఆత్మతత్వజ్ఞాన మొకటి యున్నదని తలచక యుందురు. ఇట్టిమూఢులు సుకృతకర్మసాధ్య మగు స్వర్గలోకమునందు కొంతఫలము ననుభవించి అతిహీనమగు నీమనుష్యలోకమును గూర్చి తిరిగి ప్రవేశింతురు.

భగవద్గీతలయొక్క రెండవ యధ్యాయమునందుఁగూడ చెప్పియున్నది.

శ్లో. యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః,
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః,
కామాత్మానస్స్వర్గపరా జన్మకర్మఫలప్రదాం,
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి.

తా. ఓయర్జునా! అవివేకులగు పురుషులు వేదములయందు ఫలవిశేషములను స్తుతిచేయునర్థవాదవాక్యములయందుప్రామాణ్యబుద్ధి గలవారై యర్థవాదవాక్యములయందు ప్రతిపాదింపఁబడినస్వర్గమే ప్రాప్యము గాని మరియొక్క ఈశ్వరుఁ డనుప్రాప్యము లేదని చెప్పుచున్నవారై సర్వదా ఫలవిశేషములను కామించువారై స్వర్గమే పరమపురుషార్థముగా తలఁచినవారై ఊర్వశి పరిష్వంగపారిజాత కుసుమధారణాదిభోగములగల దేవైశ్వర్యమును బ్రాప్తించుటకు సాధనములగు జ్యోతిష్టోమాదిక్రియావిశేషములఁ బ్రతిపాదించునవి గనుకనే మనుష్య త్వాదిజన్మలను వాటియందు చేయఁబడుకర్మలను వాటికి ఫలముగానుండు సుఖదుఃఖాదులను కలుగఁజేయునట్టి పుష్పించినవిషవృక్షము

వలె నవిచారసుందర మగు కొన్ని వాక్యములను చెప్పు చుందురు.

శ్లో. భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసాం,
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ నవిధీయతే.

తా. వెనుకఁ జెప్పిన భోగైశ్వర్యములయం దాసక్తి కలిగి ఫలవిశేషప్రతిపాదక వేదవాక్యముల చేత నాకర్షింపఁబడిన చిత్తము గల యాపురుషులకు పరమేశ్వరునివిషయమైన నిశ్చయాత్మక మైన బుద్ధి కలుగనేరదు. అనఁగా వేదములయం దచ్చటచ్చట నన్యాభిప్రాయముతో నిత్యము లని చెప్పిన స్వర్గాదిఫలమును నిత్యముగా విశ్వసించి సాభిప్రాయముగా చెప్పిన పరమేశ్వరునియందు సత్యత్వజ్ఞానము లేని వివేకహీను లగు పురుషులకు పరబ్రహ్మజ్ఞానమందు బుద్ధి పుట్ట నేర దని యభిప్రాయము.

శ్లో. త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వంద్వోనిత్యసత్త్వస్థోనిర్యోగక్షేమఆత్మవాన్.

తా. సత్వరజస్తమోగుణమయులగుచు ఫలవిశేషము లయం దాసక్తి గల పురుషులను గూర్చి ఆయా ఫలవిశేషములకు సాధనము లగు యాగదానాదిక్రియావిశేషములను వేదములు బోధించుచున్నవి. ఓయర్జునా! నీవు ఫలవిశేషములయం దాసక్తి గలవాఁడవు కావలదు. శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వములను సహించు స్వభావము కలిగి ధైర్యము నవలంబించి యోగక్షేమముల నపేక్షించక యోగక్షేమములను పరమేశ్వరుఁడే సర్వజ్ఞత్వసర్వశక్తిత్వములు కలవాఁడు

గనుక నెఱవేర్పునను మహావిశ్వాసమును బొందియుంటివేని, నిష్కామత్వమును బొందఁగలవు.

శ్లో. యావా నర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే,
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః.

తా. కొద్దికొద్దిజలము గల గుంటలలో స్నానపానాది క్రియలు ప్రత్యేకప్రత్యేకముగా చేయవలసియున్నప్పటికి విశేషజలము గలమహాతటాకమునందు స్నానపానాదిక్రియలన్నియు నొకచోటనే చేయుటకు నేప్రకారము శక్యమై యుండునో యాప్రకారమే యొక్కొకకర్మ చేత ప్రత్యేకప్రత్యేకముగా పొందఁదగిన ఫలము లన్నియు నొక బ్రహ్మజ్ఞానము చేతనే బ్రహ్మవేత్త యగువానికి లభించును. అనఁగా బ్రహ్మతత్వజ్ఞానము చేతనే పరమానందస్వరూపమైన మోక్షము ప్రాప్తింపఁగానే దానియందే కర్మఫలము లగు స్వల్పానందము లన్నియు నంతర్భూతములై యుండు నని భావము.

ఈప్రకారముగా నీశ్రుతిస్మృతులయందు కర్మవాసన యనునది పునర్జన్మకు కారణ మని విస్పష్టముగా చెప్పఁబడినది.

శాస్త్రవాసనయును గర్వమునకు కారణమైనందున మలినవాసన యనియే చెప్పఁబడును. శ్వేతకేతు వను మునికుమారుఁడు స్వల్ప కాలములో వేదవేదాంగములనన్నియుని చదువుకొని మహాగర్వముకలవాఁడై తండ్రి యగు నారుణివిషయమై కూడ వినయము లేక యుండె నని ఛాందోగ్యముయొక్క యాఱవయధ్యాయమునందు పఠింపఁబడుచున్నది. ఇదిగాక బాలాకియను బ్రాహ్మణుఁ డొకఁడు కొన్ని ప్రతీకోపాసనములను

నేర్చుకొని గర్వించి దిగ్విజయము చేయ నారంభించి మాళవాదిదేశములయం దుండు బ్రాహ్మణుల ననేకుల నిర్జించి కాశీదేశమునకుం బోయి అచ్చట బ్రహ్మవేత్తలలోను శ్రేష్ఠుం డగు అజాతశత్రుం డను కాశీరాజును కూడ శిక్షించుటకు యత్నించె నని కౌషీతకీబ్రాహ్మణమునందు చెప్పంబడియున్నది.

దేహవాసన యనునదియు, దేహాత్మత్వభ్రాంతి యని, గుణాధానభ్రాంతి యని, దోషాపనయనభ్రాంతి యని మూఁడు ప్రకారములుగా నున్నది. అందులో దేహము నాత్మత్వభ్రాంతి లోకములో కల దని-

భా. దేహమాత్రం చైతన్యవిశిష్ట మాత్మేతి,
ప్రాకృతా లౌకాయతికాశ్చ ప్రతిపన్నాః.

అని భాష్యకారులచే చెప్పంబడినది.

తా. జ్ఞానముతో కూడియున్న యీ దేహమే యాత్మ యని శాస్త్రజ్ఞానము లేనిపురుషులును శాస్త్రజ్ఞానము కలవారిలో చార్వాకులును తలంచుచున్నా రని యర్థము.

చార్వాకమతము లౌకాయతిక మను నామాంతరముకలదై యున్నది. ఈమతము దేవగురు వగు బృహస్పతిచే చేయఁబడినది. ఇందులో పృథివి, జలము, తేజస్సు, వాయువు ఈనాలుగే భూతములు. ఇవి స్త్రీపురుషశరీరములయందు శుక్లశోణితములుగా నేర్పడి పరస్పరమేళనముచేత దేహాకారమును బొందినప్పుడు వీటియందు చైతన్య మను నొకవిశేషగుణము పుట్టును. ఇట్టి చైతన్యముతో కూడినదేహమే ఆత్మ

యని చెప్పఁబడును గాని యీదేహముకంటె విలక్షణమై చైతన్యమునకు (జ్ఞానమునకు) ఆశ్రయభూతమైన యాత్మ యను జీవుఁ డొకఁడు లేఁడు. ప్రత్యక్షమొకటియే ప్రమాణము. కనుకనే శివలోకవిష్ణులోకాదులు వైదికులచేత కల్పింపఁబడినవిగాని వాస్తవముగా లేవు. ఈలోకమునందు సుఖానుభవమే స్వర్గము; దుఃఖానుభవమే నరకము; దేహాకారముగా పరిణమించిన నాలుగు భూతములకు వియోగము కలుగుట మరణ మని చెప్పఁబడును; ఇదియే మోక్షము; ఇట్టి మోక్షము సర్వజనులకు సాధారణముగా సంభవించుచుండును గనుక దీనిఁగూర్చి విశేషప్రయత్నమును చేయ గిట్టదు. వైదికులచేత చెప్పఁబడు శాస్త్రములన్నియు ప్రత్యక్షవిరుద్ధము లైనందున నమ్మఁదగినవి కావు. ఇదిగాక వైదికులచేత పరమప్రమాణ మని చెప్పఁబడు వేదమునందే తైత్తిరీయోపనిషత్తులో-

శ్రు. స వా ఏష పురుషోఽన్నరసమయః, తస్మాదన్నం తదుచ్యత ఇతి.

అని దేహమే యాత్మ యని చెప్పఁబడినది.

తా. పితృభుక్తాన్నపానాదిరసముచేత నావిర్భవించిన యీదేహమే పురుషుఁడు అని యర్థము. ఈప్రకారముగా చార్వాకులు చెప్పుచుందురు గనుక దేహమం దాత్మత్వభ్రాంతి చార్వాకులకు కలదు.

బలిచక్రవర్తికుమారుఁడగు విరోచనుఁడు ఆత్మతత్త్వమును దెలియఁగోరి బ్రహ్మయొద్దకుఁబోయి ముప్పదిమూఁడుసంవత్సరములు బ్రహ్మచర్యముతో శుశ్రూష చేసి కూడ చిత్త

దోషము నివర్తించునంచిన బ్రహ్మచేత నుపదేశింపఁబడిన దేహాతిరిక్తాత్మతత్వము నెఱుంగఁజాలక దేహమునే యాత్మగాఁ దెలిసుకొని దైత్యదానవుల కందఱికి నాప్రకారమే యుపదేశం బొనరించె నని ఛాందోగ్యములోని యునిమిదవప్రపాఠకములో వినఁబడుచున్నది.

ఈదేహమునందు గుణములను గలుగఁజేయవలయు నను భ్రాంతి గుణాధానభ్రాంతి యనఁబడును. ఇది లౌకికగుణాధానభ్రాంతి యని శాస్త్రీయగుణాధానభ్రాంతి యని రెండువిధములు. ఇందులో లోకప్రసిద్ధములగు సౌందర్యాదిగుణములను నీదేహమునకు సంపాదింపవలయు ననునది లౌకికగుణాధానభ్రాంతి యని శాస్త్రమునందు చెప్పినపావనత్వాదిగుణముల నీదేహమునకు సంపాదింపవలయు ననునది శాస్త్రీయ గుణాధానభ్రాంతి యని చెప్పఁబడును. ఈలోకమునందు కొందఱు జనులు మధురముగా గానము చేయుటకు తైలమును పుచ్చుకోవడమును మిరియపుగింజలను భక్షించడమును చేయుచున్నారు. దేహమునకు మృదుస్పర్శనును సౌందర్యమును కలుగఁజేయుటకుఁగాను అభ్యంగము సూక్ష్మవస్త్రసుగంధాదిధారణము మొదలైనవాటిని జేయుచుందురు. శాస్త్రీయగుణములగు పావనత్వాదులను గలుగఁజేయుటకు గంగాస్నానసాలగ్రామతీర్థప్రాశనాదులను చేయుచుందురు.

దోషాపనయనభ్రాంతి యనునదియు లౌకిక మని శాస్త్రీయమని రెండువిధములు; లౌకికదోషము లనఁగా ముఖదుర్గంధాదులు. శాస్త్రీయదోషము లనఁగా అపవిత్రత్వాదులు.

ఇందులో లౌకికదోషములగు ముఖదుర్గంధాదులను నివర్తింపఁజేయుటకు వైద్యులు చెప్పిన చికిత్సలను చేయుచుందురు. శాస్త్రీయదోషము లగు అపవిత్రత్వాదులను నివర్తింపఁజేయుటకుఁగాను శౌచాచమనస్నానసంధ్యావందనాదుల ననుష్ఠించుచుందురు.

శ్లో. సంధ్యాహీనోఽశుచిర్నిత్య మనర్హస్సర్వకర్మసు.

తా. సంధ్యావందనమును చేయని పురుషుఁ డపవిత్రుఁడనియు,ఇతరమైన పుణ్యకర్మలను వేటిని చేయుటకు యోగ్యుఁడు కాఁడనియు చెప్పినందున సంధ్యావందనాదికర్మ లపవిత్రత్వమును నిరాకరించుకర్మ లని తలఁచి యపవిత్రత్వమును నిరాకరించుకొనుటకు సంధ్యావందనాదికర్మల ననుష్ఠించుచుందురు. ఈ దేహవాసనలు మూఁటిలో దేహాత్మత్వజ్ఞానము సర్వప్రమాణవిరుద్ధమై యున్నందున సకలమైన అకృత్యములను చేయించి స్వర్గాపవర్గములను భంగపఱచి సమస్తదుఃఖములను కలుగఁజేయుచున్నందునను మలినవాసన యని ముఖ్యముగా చెప్పఁదగియున్నది.

ఈ దేహాత్మవాదమును సూత్రకారులు భాష్యకారులు మొదలగు పూర్వాచార్యులు విశేషముగా నిరాకరించియున్నారు. ఇచ్చట కొంచెముగా చూపెదము.

సూ. ఏక ఆత్మనః శరీరే భావాత్,

వ్యతిరేక స్తద్భావభావిత్వాన్నతూపలబ్ధివత్.

ఇది మొదలగు గ్రంథములచేత విశేషముగా నిరాకరించియున్నారు.

తా. ఆత్మ యనునది దేహముకంటె భిన్నమైనది కాదు. చైతన్యము దేహముయొక్క ధర్మమే కాని దేహభిన్నమైన మఱియొకవస్తువుయొక్క ధర్మము కాదు. ఈ చైతన్యము శరీరముండువరకు నుండి శరీరము నశించఁగానే నశించుచున్నది. కనుక, అగ్నియుండువరకునుండి అగ్ని నశింపఁగానే నశించు వేడిమి అగ్నియొక్క ధర్మమైనట్టు శరీరముయొక్క ధర్మమనియే చెప్పవలసియున్నది. మఱియొక వస్తువుయొక్క ధర్మమే అయినపక్షమున శరీరము నశించినతరువాత కూడ కనుపడవలసియుండును. చైతన్య మేప్రకారము దేహధర్మమో రాగద్వేషాదులుకూడ నాప్రకారమే దేహధర్మములని చెప్పఁదగియున్నవి. కనుక చైతన్యరాగద్వేషప్రాణాదిధర్మములు గల ఈ దేహమే ఆత్మగాని మఱియొక ఆత్మ లేదని చార్వాకులు చెప్పుచున్నారు. ఈప్రకారముగా చెప్పడము యుక్తము కాదు. ఆత్మ యను వస్తువు దేహముకంటె భిన్నమైనది. చైతన్య మనునది ఆయాత్మయొక్క ధర్మమే కాని, దేహముయొక్క ధర్మము కాదు. దేహధర్మ మని చెప్పెడిపక్షమున దేహధర్మము లగు రూపాదులవలె దేహ ముండువఱకు నుండవలసియుండును. సుషుప్తిమూర్ఛాదిదశలయందు భూతసంఘాతరూపమైన యీదేహము నశించకుండ నున్నప్పటికి చైతన్యము కనుపడనందున నీచైతన్యము దేహధర్మ మని చెప్పఁదగదు. ఇదిగాక పృథివీజలతేజోవాయువులయొక్క మేళనముచేత చైతన్యము పుట్టు నని చార్వాకులు చెప్పెదరు. నాలుగుభూతములయొక్క మేళనముచేత పుట్టినగుణము నాలుగుభూతములకు విశ్లేష గలిగితే, నశింపవలయునే కాని

విశ్లేష లేనికాలమందు నశింపఁదగదు. సుషుప్తికాలమునందు దేహాకారము లగు భూతములకు విశ్లేష లేదు. ఐనను, చైతన్యము కనుపడడము లేదు. మరణదశయందుఁగూడ నాలుగు భూతములకు విశ్లేషను గానము. తేజోవాయువులు మరణదశ యందు విశ్లేషను బొందినందున చైతన్యము నశించినది యని యంటిరా తేజోవాయువులయొక్క సంబంధ మున్నప్పుడుండి, లేనికాలమందు లేకపోయినందున చైతన్యము తేజోవాయువులయొక్క ధర్మమే యని చెప్పవలసినదే కాని నాలుగుభూతములయొక్క సముదాయధర్మ మని కాని నాలుగుభూతములయొక్క మేళనధర్మ మని కాని చెప్పఁదగదు. ఇదిగాక భూతధర్మము లగు రూపరసాదులు జ్ఞానముచేతఁ దెలియఁదగినవిగా నున్నవి. చైతన్యము జ్ఞానమే అగునందున తెలుసుకొనునది గాని తెలియఁదగినది కాదు. జ్ఞానముగూడ తెలియఁదగినదే యని యంటిరా? దేనిచేతఁ దెలియఁదగినది యని చెప్పవచ్చును. మఱియొకజ్ఞానముచేత నంటిరా? ఆజ్ఞానము మఱియొకజ్ఞానము చేత, నాజ్ఞానము మరియొకజ్ఞానముచేత నని యీప్రకారముగా అనవస్థాదోషము సంభవించును. దేహధర్మములగు రూపాదులు తెలియఁదగినవిగా నున్నందున చైతన్యము కూడ దేహధర్మమే అయినపక్షమున తెలియఁదగినదిగా నుండవలసి యుండును. చైతన్యము తెలుసుకొనునదిగా నున్నదిగాని తెలియఁదగినదిగా నుండలేదు. కనుక చైతన్య మనునది దేహముకంటె భిన్నమైన యొక యాత్మయొక్క ధర్మమే కాని దేహధర్మము కాదు. ఇదిగాక చార్వాకులు ప్రత్యక్ష మొక్క

టియే ప్రమాణ మని చెప్పెదరు. ఇది వారియొక్క అనుభవ వ్యవహారములకే విరుద్ధమై యున్నవి. చార్వాకులు కూడ అన్యపురుషానుష్ఠితము లగుకృషివాణిజ్యాదులు ప్రత్యక్షలాభకరములుగాఁ జూచి తాము కృషివాణిజ్యాదులను చేయుచున్నారు. కనుక అనుమానమును ప్రమాణముగా నమ్మవలసియుండును. ఇతరులచేత చెప్పఁబడు ప్రవృత్తిబోధకము లగు శబ్దములను విని తదనుగుణముగా వ్యవహరించుచున్నందున శబ్దమును ప్రమాణముగా నమ్మవలసియుండును. కనుక దేహముకంటె భిన్నమైన యాత్మ లేదని ప్రత్యక్షముకంటె నితరమైన ప్రమాణము లేదనికూడ చార్వాకులు చెప్పునది యెంతమాత్రము న్యాయముకాదు ఈప్రకారము పూర్వాచార్యు లందఱు చార్వాకమతఖండనమును విశేషముగా చేసియున్నారు. శ్రీవిద్యారణ్యకృత సర్వదర్శనసంగ్రహమునందు చూడవలయును.

గాయకులగువారు కొందఱు కంఠమాధుర్యమును సంపాదించుటకు నెంతప్రయత్నమును చేసినను పొందకయే యున్నారు. అభ్యంగాదులను నిరంతరముగా జేయుచున్నప్పటికి కొందఱిశరీరములు కఠినస్పర్శకలవిగానే యున్నవి. సూక్ష్మవస్త్రసుగంధధారణాదులచేత కనుబడుసౌందర్యములు సూక్ష్మవస్త్రసుగంధాదులయం దున్నవి గాని దేహమందు లేవు. కనుకనే శ్రీవిష్ణుపురాణమునందు చెప్పఁబడినది.

శ్లో. మాంసాసృక్పూయవిణ్మూత్రస్నాయుమజ్జాస్థిసంహతౌ,
దేహే చేత్ప్రీతిమాన్ మూఢో భవితా నరకేఽపి సః.

తా. మాంసము, రక్తము, దుర్గంధము, అమేధ్యము, మూత్రము, నరములు, మెదడు, ఎముకలు వీటియొక్కసంఘాతముగా నుండు నీశరీరమునందు ప్రీతి గల మూర్ఖుఁడు నరకమందుఁగూడ ప్రీతికలవాఁడై యుండును.

శ్లో. స్వదేహాశుచిగంధేన న విరజ్యేత యః పుమాన్,
విరాగకారణం తస్య కిమన్యదుపదిశ్యతే.

తా. తనశరీరమునందుండు దుర్గంధముచేత విరక్తిని బొందక ప్రవర్తించు పురుషునకు విరక్తిని సంపాదించు మఱియొక కారణ మేమి యని చెప్పఁదగియున్నది.

కనుక లోకసిద్ధములగు సౌందర్యాదిగుణముల నీశరీరమునందు సంపాదించుట శక్యమైనది కాదు. యథాకథంచిత్ సంపాదించినను మరి నిమిషమునకు స్వదోషమునే ఈశరీరము ప్రకటించుచుండును. కనుకనే-

శ్లో. సర్వాశుచినిదానస్య కృతఘ్నస్య వినాశినః,
శరీరకస్యాపి కృతే మూఢాః పాపాని కుర్వతే.

అని పూర్వులచే చెప్పఁబడినది.

తా. సకలమైన మూత్రపురీషాదివస్తువులకు నివాసమై స్నానసుగంధ లేపన మాల్యధారణధూపధారణాప్రయత్నములచేత నెంత మంచిని చేసినను ఉత్తరక్షణమందే వీటి నంతను అడుగు పఱచి తనయొక్క స్వాభావికదుర్గంధాదులనే ప్రకటన చేసి సుగంధాదులయందు కూడ దుర్గంధాదులను సంపాదించుకృతఘ్నశిరోమణియై జలబుద్బుదమువలె నస్థిరమైన యీశరీరమును పోషించుటకుఁ గూడ మూర్ఖులగు జనులు

పరహింసాదిపాపములను చేయుచున్నారే! యిదియేమి చిత్ర మని అర్థము.

శాస్త్రీయ మగు గుణాధానము ప్రబలమైన మరియొకశాస్త్రముచేత నివారింపఁబడుచున్నది. అనఁగా— శ్రు "న హింస్యా త్సర్వా భూతాని" అని. సమస్తభూతములను హింసచేయఁదగదు. హింసించినయెడల పాపము కలుగు నని చెప్పుశాస్త్రము- శ్రు. "అగ్నిషోమీయం పశుమాలభేత" అని జ్యోతిష్టోమాదియాగములయందు అగ్నిషోము లను దేవతల నుద్దేశించి ఛాగమును హింసింపవలయు నని చెప్పు మఱియొకశాస్త్రముచేత బాధింపఁబడి అగ్నిషోమీయహింస పాపము కా దని చెప్పినట్లు గంగాజలసాలగ్రామతీర్థతులసీ క్షేత్రాదులు పవిత్రము లని చెప్పుశాస్త్రములు.

శ్లో. గంగా గంగేతి గంగేతి యోజనానాం శతైరపి,
స్థితైరుచ్చారితం హంతి పాపం జన్మత్రయార్జితమ్.

తా. నూరుఆమడలదూరమునం దుండియు, గంగానామమును మూఁడుపర్యాయము లుచ్చరించినపక్షమందు ఆయుచ్చరించినవారియొక్క మూఁడుజన్మములయందు సంపాదింపఁబడిన పాపము లన్నియు నశించును.

శ్లో. సాలగ్రామశిలావారి పాపహారి విశేషతః,
ఆజన్మకృతపాపానాం ప్రాయశ్చిత్తం దినేదినే.

తా. సాలగ్రామశిలకు అభిషేకము చేసిన జలము సకలతీర్థములకంటె నెక్కువగా పాపములను హరించును. జన్మ

మొదలుకొని చేసినపాపములను ఈసాలగ్రామతీర్థము ప్రతిదినమునందు చేయఁబడు ప్రాయశ్చిత్తముగా నేర్పడి సమస్తపాపములను నశింపఁజేయును.

ఈలాగంటి శాస్త్రములు పశ్చాత్తాపశ్రవణము సత్పురుషభక్తి మొదలయినసద్గుణములు లేనివారికి గంగాస్నానాదులు పాపనివారకములు కావని చెప్పు మఱికొన్ని శాస్త్రముల చేత బాధింపఁబడి, గంగాస్నానాదులు పవిత్రత్వసంపాదకములు కావని చెప్పుచున్నవి.

భాగవతము, దశమస్కంధోత్తరభాగమునందు-

శ్లో. యస్యాత్మబుద్ధిః కుణపే త్రిధాతుకే
స్వధీః కళత్రాదిషు భౌమ ఇజ్యధీః,
యత్తీర్థబుద్ధిశ్చ జలే నకర్హిచి
జ్జనేష్వభిజ్ఞేషు స ఏవ గోఖరః.

అని చెప్పియున్నది.

తా. ఏపురుషుఁడు వాతపైత్యశ్లేష్మధాతువులచే రచింపఁబడి జడమై శవసదృశమైన యీశరీరమునం దాత్మత్వజ్ఞానమును భార్యాపుత్త్రాదులయందు మదీయత్వాభిమానమును శిలారజతతామ్రాదులచే నిర్మింపఁబడిన విగ్రహములయందు దేవత్వాభిమానమును గంగాదిజలములయందు తీర్థత్వాభిమానమును కలవాఁడై యుండి బ్రహ్మవేత్తలగు మహాపురుషులయందు ఆత్మత్వ మదీయత్వ దేవత్వ తీర్థత్వ ప్రతిపత్తి లేనివాఁడై యుండునో, అట్టిపురుషుఁడే పశువని గార్దభమని చెప్పఁదగియున్నాఁడు. అనఁగా బ్రహ్మవేత్తలగువారియందు ఆత్మత్వ మదీయత్వ దేవత్వ తీర్థత్వాదులు

ముఖ్యముగా కలిగియుండఁగా వారియం దేయభిప్రాయ ముసు చేయక అనాత్మలైన అన్యదీయములైన జడములైన నందున నపూజ్యములైన పవిత్రతాసంపాదకములు గాని దేహకళత్రాదిశిలావిగ్రహ జలములయందు ఆత్మత్వాద్యభిమానము ను చేయువాఁడు యుక్తాయుక్తవివేకము లేనివాఁడైనందున పశువులతో సమానుఁ డని యభిప్రాయము.

ఈదేహ మాత్మ కా దని యిదివరకే చెప్పఁబడినది. శిలాదివిగ్రహములు గంగాదితీర్థములు ముఖ్యముగా దేవత్వ తీర్థత్వములు కలవి కావని భాగవతమందే చెప్పఁబడినది.

శ్లో. న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
తే పునంత్యురు కాలేన దర్శనా దేవ సాధవః.

తా. జలమయములగు గంగాగోదావరిప్రభృతులు తీర్థములు కావు. మృచ్ఛిలాదినిర్మితము లగువిగ్రహములు దేవతలును కారు. ఈతీర్థములని దేవతలని యజ్ఞజనులచేత చెప్పఁబడుజలమయమృచ్ఛిలామయములు తమను సేవించుజనులను చిరకాలమునకు పవిత్రులనుగా చేయునుగాని తత్క్షణమే పవిత్రులనుగాఁ జేయఁజాలవు గనుక ముఖ్యముగా తీర్థములని దేవతలని చెప్పఁదగియుండవు. బ్రహ్మవేత్త లగు సజ్జనులు తమదర్శనమాత్రముచేతనే అజ్ఞానాంధకారమును పోనడచి చిత్తదోషముల నన్నిఁటిని నిరాకరించి బ్రహ్మజ్ఞానమును గలుగఁజేసి జనులను పరమపవిత్రులనుగాఁ జేయుదురు గనుక బ్రహ్మవేత్తలగు సజ్జనులే తీర్థము లని, దేవత లని ముఖ్యముగాఁ జెప్పఁదగియున్నారని తాత్పర్యము.

ఇది గాక-

శ్లో. అత్యంతమలినో దేహో దేహీ చాత్యంతనిర్మలః.
ఉభయోరంతరం జ్ఞాత్వా కస్య శౌచం విధీయతే.

అని మఱియొకశాస్త్రము.

తా. ఈదేహము మూత్రపురీషాదిబంధురమై యున్నందున కడుమలినమైనది; ఆత్మ యనునది సర్వదా అత్యంతపరిశుద్ధమైనపదార్థము; ఈ రెంటియొక్క స్వభావమును యోచించిన, గంగాస్నానాదులచేత దేనికి శుద్ధిని సంపాదింపఁదగియున్నది? అనఁగా దేహము సర్వదా అపరిశుద్ధమైనందున నెప్పటికిని దేహమునకు శుద్ధి కలుగదు. ఆత్మస్వరూపము ఎప్పటికి శుద్ధముగానే యున్నందున నాయాత్మస్వరూపమున కెప్పటికిని శుద్ధిని సంపాదింపవలసినయవసరము లేదు గనుక గంగాస్నానాదులు తత్త్వజ్ఞుఁ డగువానికి ప్రయోజనకరములు కావు.

కనుక నీదేహమునందు దోషములను నివారించుటకు శక్యము కానట్టు గుణములను సంపాదించుటకు కూడ శక్యము కానందున దోషములను నివారింపవలయు నను గుణములను సంపాదింపవలయునను అభిసంభ్రాంతి ప్రత్యయమైనందున మలిన వాసన యని చెప్పఁదగియున్నది.

ఈ వెనుక నుదాహరించిన శ్లోకములను యోచింపఁగా నీదేహమునందుదోషాపనయనము అశక్యమని నిషేధింపఁబడుచున్నది గాని గుణసంపాదనము నిషేధింపఁ బడ లేదు. అయినా, పవిత్రత్వాదిగుణములకు విరోధు లగు నపవిత్రత్వాదిదోష

ములు ఈశరీరమందు నుండుచుండఁగా పావిత్ర్యాదిగుణము లను సంపాదించుట యశక్యము గనుక గుణాధానము కూడ నిషేధింపఁబడినది యని తెలియఁదగినది.

ఈదేహ మత్యంతమలినమను నర్థము మైత్రాయణీ శాఖ యందు విస్పష్టముగాఁ వినఁబడుచున్నది.

శ్రు. భగవన్నస్థిచర్మస్నాయుమజ్జామాంస,
శుక్రశోణితశ్లేష్మాశ్రు దూషికాదూషితే.
విణ్మూత్రవాతపిత్తసంఘాతే దుర్గంధే,
నిస్సారేఽస్మిన్ శరీరే కిం కామోపభోగైరితి.
శరీరమిదం మైథునాదేవోద్భూతం సంవిద్వ్యపేతం,
నిరయ ఇవ మూత్రద్వారేణ నిష్క్రాంతమస్థిభిశ్చితం,
మాంసేనానులిప్తం చర్మణావబద్ధం,
విణ్మూత్రకఫపిత్తమజ్జామేదోవసాభిరన్యైశ్చ,
మలైర్బహుభిః పరిపూర్ణం కోశ ఇవ వసునేతి.

తా. ఎముకలు, చర్మము, నరములు, మెదడు, మాంసము, రేతస్సు, రక్తము, శ్లేష్మము, నాసామలము, కంటినీళ్లు, నేత్రమలము వీనిచేత దుష్టమై, అమేధ్యము, మూత్రము, వాతపిత్తధాతువులు వీనియొక్క సముదాయమై దుర్గంధమై సారములేని ఈశరీరమునందు కామముల ననుభవించుటచేత నేమిప్రయోజనము కలదు? ఇదిగాక యీశరీరము స్త్రీపురుషులయొక్క పరస్పరసంయోగముచే జన్మించి జ్ఞానహీనమై నరకమువలె మూత్రద్వారమైన యోనిలోనుండి వెలువలఁబడినది. ఎముకలచేత కట్టఁబడి మాంసముచేత పూయఁబడి చర్మము

చేత చుట్టఁబడి అమేధ్యము, మూత్రము, కఫము, పిత్తము, రక్తమాంసాంతరాళమందుండు నీరు, మెదడు, క్రొవ్వు వీటిచేత ను మఱికొన్ని జాడ్యములచేతను నిండింపఁబడి మిక్కిలి యసహ్యముగా నుండును గనుక నిట్టియపవిత్రమైన శరీరముతో కామభోగముల ననుభవించుట హేయమే కాని యుపాదేయము గాదని యర్థము.

స్వభావముచేతనే దుర్గంధభూయిష్ఠమై రోగపూర్ణమై యున్న యీశరీరమునకు వైద్యశాస్త్రోక్తచికిత్సలచేతఁ గూడ రోగములు నివర్తింపవు. ఒకానొకసమయమునందు నివర్తించి, తిరిగి ప్రాప్తించును. ఇదిగాక తొమ్మిదిరంధ్రములనుండి నానావిధమైన మలములు స్రవించుచుండఁగా రోమకూపములనుంచి నిరంతరము చెమటనీరు కాఱుచుండఁగా నీశరీరము స్నానధూపనసుగంధలేపనాదులచేత దుర్గంధాదిదోషములను ఎవఁడు పోఁగొట్టఁ గలఁడు? ఈఅర్థము పూర్వాచార్యులచే చెప్పఁబడినది.

శ్లో. నవచ్ఛిద్రకృతా దేహాస్స్రవంతి ఘటికా ఇవ,
బాహ్యశౌచైర్న శుధ్యంతి నాంతశ్శౌచం తు విద్యతే.

ఈదేహములు తొమ్మిదిరంధ్రములు కలవై యెప్పుడును చిల్లికుండవలె మలమును స్రవించుచుండును. వెలుపలిభాగమునందు మృజ్జలములచేత కడిగినందున శుద్ధిని బొందవు. లోపలిభాగమునందు క్షాళనము చేయుటకు శక్యము కాదని యర్థము.

కనుక నీమూఁడువిధము లగు దేహవాసన మలినవాసన యనియే చెప్పఁదగియున్నది.

ఈ దేహవాసన మలినమను నభిప్రాయముచేతనే వాసిష్ఠరామాయణమునందు వసిష్ఠమహామునిచే చెప్పఁబడెను.

శ్లో. ఆపాదమస్తకమహం మాతాపితృవినిర్మితః,
ఇత్యేకో నిశ్చయో రామ బంధాయాసద్విలోకనాత్.

తా. తల్లిదండ్రులచేత నిర్మింపఁబడి శిరఃపాదాద్యవయవములతోఁ గూడిన యీశరీరము నేనే అనునిశ్చయము మిథ్యాజ్ఞానమౌటచేత నీయాత్మను సంసారమందు బంధించుటకు కారణమై యున్నది.

శ్లో. సా కాలసూత్రపదవీ సా మహావీచివాగురా,
సాసిపత్రవనశ్రేణీ దేహోఽహమితి యా మతిః.

తా. శరీరము నేనే యనుబుద్ధి కాలసూత్రమను నరకమును, మహావీచియను నరకమును, అసిపత్రవనపంక్తి యను నరకసముదాయమును అయియున్నది.

అనఁగా శరీరమునం దాత్మత్వజ్ఞానము కాలసూత్రాది మహానరకములను బొందుటకు ముఖ్యసాధనము.

శ్లో. సా త్యాజ్యా సర్వయత్నేన సర్వనాశేఽప్యుపస్థితే,
స్ప్రష్టవ్యా సా న భవ్యేన సశ్వమాంసేవ పుల్కసీ. ఇతి.

తా. ఆ దేహాత్మబుద్ధిస్వరూపములకు మూలమై యున్నందున తనకు నెన్నికష్టదశలు వచ్చేటట్టులయినా, అంగీకరించి సర్వవిధములచేతఁ బ్రయత్నమును జేసి ఈ దేహాత్మబుద్ధిని విడువవలసినది. యోగ్యుఁడైన పురుషుఁడు ఈ దేహాత్మబుద్ధిని కుక్కమాంసమును చేతిలో నుంచుకొనియుండు చండాలస్త్రీవలె నెంతమాత్రము స్పృశింపఁగూడదు.

ఈచెప్పఁబడిన దేహలోక శాస్త్రవాసనలను మూఁడు ను వివేకహీనులగు జనులకు గ్రాహ్యములుగా నున్నప్పటికి జ్ఞానేచ్ఛకలవానికి జ్ఞానమును పుట్టకుండ ప్రతిబంధించునవి అయినందునను, జ్ఞానికి తత్వజ్ఞానస్థైర్యమును బాధించునవి. అయినందునను, వివేకులగువారికి త్యాజ్యములని నిశ్చయింపఁ దగియున్నవి. కనుకనే స్మృతియందుఁ చెప్పఁబడినది.

శ్లో. లోకవాసనయా జంతోశ్శాస్త్రవాసనయాఽపిచ,
దేహవాసనయా చాపి యథావన్నైవ జాయతే. ఇతి.

తా. లోకవాసనచేత శాస్త్రవాసనచేత దేహవాసన చేత నీమూఁడువాసనలచేతను లోకములో జనులకు తత్వ జ్ఞానము పుట్టకయున్నది.

దంభము, దర్పము, అహంకారము మొదలగు నసుర సంపద్రూపమగు మనోవాసన నరకపాతమునకు కారణముగా నున్నందున మలినవాసన యనుటకు సంశయమే లేదు. కనుక నుపాయముచేతనైనా ఈచెప్పఁబడిన నాలుగువాసనలను నశింపఁజేయవలయును.

ఏప్రకారము వాసనాక్షయమును ప్రయత్నపూర్వకముగా సంపాదింపవలయునో యాప్రకారమే మనోనాశము తత్వజ్ఞానియగువాఁడు సంపాదింపవలయును. మనసు అనుపదార్థము నిత్యమని, అణుపరిమాణ మని తార్కికులచేత నంగీకరింపఁబడినద్దిగాని వేదము పరమప్రమాణమని విశ్వసించి యుండు మాచేత నాప్రకార మంగీకరింపఁబడలేదు. అవయవ

ములతో కూడియున్నదని యనిత్యమని సువర్ణాదిద్రవ్యములవలె ననేకప్రకారములుగా పరిణమించు స్వభావముకలదని మాచేత నంగీకరింపఁబడినది గనుక మనస్సును నశింపఁజేయుట కవకాశము కలదు.

ఈమనస్సుయొక్క లక్షణము ప్రమాణమును బృహదారణ్యములో చెప్పఁబడినవి.

శ్రు. కామస్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధాధృతి,
రధృతిర్హ్రీర్ధీర్భీరిత్యేతత్సర్వం మన ఏవ.

అని మనస్సుయొక్క లక్షణము.

తా. కామము, సంకల్పము, విచారేచ్ఛ, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, లజ్జ, జ్ఞానము, భయము ఇవి మొదలగువృత్తులే మనస్సని చెప్పఁబడును. అనఁగా చక్షురాదీంద్రియములకు ఘటాదిపదార్థములు ప్రత్యక్షమైనట్టు సాక్షిచైతన్యమునకు ప్రత్యక్షములైయుండు కామసంకల్పాదివృత్తులు మృత్పిండమువలన ఘటాదులవలె దేనివలన పుట్టుచుండునో అది మనస్సని చెప్పఁబడు నని భావము.

శ్రు. అన్యత్రమనా అభూవం నాదర్శం
అన్యత్రమనా అభూవం నాశ్రౌషమ్.

శ్రు. మనసా హ్యేవ పశ్యతి మనసా శృణోతి.

అను శ్రుతులు మనస్సునందు ప్రమాణము.

తా. నామనస్సు మరియొకచోట నుండెను. అందువల్ల నే దీనిని చూడకపోతిని; నామనస్సు మరియొకచోట నుండె

ను. అందువలననే యీశబ్దమును వినకపోతిని; ఈపురుషుఁడు మనస్సుచేతనే చూచుచున్నాఁడు. మనస్సుచేతనే వినుచున్నాఁడని శ్రుతులకు రెంటికిని నర్థము.

అనఁగా;

కంటికి నెదురుగా మంచి వెలుతురులో నుండు ఘటమును, చెవులదగ్గర పెద్దగా చెప్పఁబడు శబ్దము ఏది అజాగ్రతగానున్నందున తెలియఁబడదో ఏది జాగ్రతగా నున్నందున తెలియఁబడునో అదియే మనసు. ఈమనస్సు అన్నివిషయములను తెలుసుకొనుటకు సామాన్యకారణమై యున్నది అని భావము.

శ్రు. తస్మాదపి పృష్ఠత ఉపస్పృష్టో మనసా విజానాతి.

అనుశ్రుతి కూడ మనస్సును నిరూపించి కనుపఱచుచున్నది.

తా. ఈప్రకారము లక్షణప్రమాణములచేత నిశ్చయింపఁబడినమనస్సును విశేషముగా నిరూపించి చూపింపవలయును. ఒకపురుషుఁడొకనిచేత వెనుకభాగమునందు స్పృశింపఁబడినవాఁడై యిప్పుడు చేతితో స్పృశించినాఁడని, యిప్పుడు వేలితోస్పృశించినాఁడని విశేషముగా తెలుసుకొనుచున్నాఁడు. ఇందులో స్పర్శమాత్రము త్వగింద్రియముచేత తెలియఁబడినా, ఇదిఅంగుళీస్పర్శయని ఇది హస్తస్పర్శయని విశేషముగా తెలుసుకొనునది మనస్సుగానే యుండవలెను. ఈవిశేషజ్ఞానము చక్షురింద్రియముచేత కలుగునది కాదు. చక్షురింద్రియము తన కెదురుగానుండు విషయములను కనిపెట్టును గాని వెనుకభాగములయందుండు విషయములను కనిపెట్టనేరదు గదా?

కనుక వెనకభాగమునం దుండు అంగులీస్పర్శాదివిశేషవిషయములను కనిపెట్టునది మనస్సే యని నిశ్చయించవలయును.

ఈమనస్సు మననమును చేయుటచేత మనస్సని చింతనమును చేయుటచేత చిత్తమని చెప్పఁబడుచున్నది. ఈచిత్తము సత్త్వరజస్తమోగుణములయొక్క కార్యములగు ప్రకాశప్రవృత్తిమోహములు కలదై యున్నందున సత్త్వరజస్తమోగుణమయమని తెలియఁబడుచున్నది.

ప్రకాశ ప్రవృత్తి మోహములు మూఁడు క్రమముగా సత్వరజస్తమోగుణకార్యము లని—

శ్లో. ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ.

అను భగవద్గీతావాక్యము చెప్పుచున్నది.

తా. ప్రకాశము, ప్రవృత్తి, మోహము ఈమూఁడు క్రమముగా సత్వరజస్తమోగుణములయొక్క ఉద్రేకముచేత కలుగుచుండు నని భావము.

సాంఖ్యశాస్త్రమునందును ప్రకాశ ప్రవృత్తి మోహములు సత్వరజస్తమోగుణములయొక్క నియతకార్యము లని చెప్పియున్నది. ఇచ్చట ప్రకాశ మని చెప్పినది జ్ఞానమే కాని తెల్లనిదై ప్రకాశించు రూపము కాదు.

శ్లో. సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ,
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ.

తా. సత్త్వగుణము చిత్తమునం దుద్రిక్తమైనసమయమునందు జ్ఞానము కలుగును; రజోగుణ ముద్రిక్తమగునప్పుడు

లోభమును, తమోగుణ ముద్రిక్తమైనపుడు ప్రమాదమ్ము, మోహము అజ్ఞానమును పుట్టుచుండును.

ఈశ్లోకమునందు సత్త్వగుణముచేత జ్ఞానము కలుగు నని చెప్పినందున ప్రకృతమందు ప్రకాశశబ్దమునకు జ్ఞానమే అర్థమని చెప్పవలయును.

జ్ఞానమువలె సుఖముకూడ సత్త్వగుణముయొక్క కార్యమే. ఈయర్థము గూడ భగవద్గీతలయందే చెప్పఁబడినది.

శ్లో. సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత,
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత. ఇతి.

తా. సత్త్వగుణము సుఖమును పుట్టించి దానియందు పురుషుని శక్తికలవానిగా చేయును; రజోగుణము కర్మయందుసక్తి కలవానిగా చేయును; తమోగుణము జ్ఞానము నావరించి ప్రమాదమునందు సక్తికలవానిగా చేయును; సముద్రమునందు తరంగములవలె సత్త్వరజస్తమోగుణములు మనస్సునందు నిరంతరము పరిణమించుచుండఁగా నొకసమయమం దొకగుణము హెచ్చుగా మిగిలిన రెండు గుణములు తక్కువగా నుండును. ఇదియును నచ్చటనే చెప్పఁబడినవి.

శ్లో. రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత,
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా. ఇతి.

తా. ఒకప్పుడు రజస్తమోగుణములను రెంటిని అడుగుపఱచి సత్త్వగుణము హెచ్చియుండును; మరి యొకప్పుడు సత్త్వతమోగుణములను అడుగుపఱచి రజోగుణము హెచ్చి

యుండును; మఱి యొకప్పుడు రజస్సత్త్వముల నడఁగునట్లు తమోగుణము హెచ్చియుండును.

శ్లో. బాధ్యబాధకతాం యాంతి కల్లోలా ఇవ సాగరే.

తా. సత్త్వరజస్తమోగుణములు మూఁడు నంతఃకరణమునందుఁ బుట్టుచు సముద్రమునందుఁ బుట్టుతరంగము లొకదానినొకటి బాధించునట్లు పరస్పర మొకటి నొకటి బాధించుచుండు నని కూడ మఱియొక గ్రంథమునందు చెప్పఁబడి యున్నది.

ఇందులో తమోగుణము హెచ్చినప్పుడు దంభదర్పములు మొదలగు నాసురసంపదయును, రజోగుణము హెచ్చినప్పుడు లోకవాసన మొదలగు మూఁడు వాసనలును, సత్వగుణము హెచ్చినప్పుడు సత్త్వశుద్ధి మొదలగు దేవసంపదయును నావిర్భవించుచుండును. ఈయర్థమును వ్యాసయమునియుంచుకొనియే భగవద్గీతలయందు చెప్పఁబడియున్నది.

శ్లో. సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్వమిత్యుత.

తా. ఈకళేబరమందు సకలమైన యింద్రియములయందు ప్రకాశమను యథార్థజ్ఞాన మెప్పుడు పుట్టుచుండునో, అప్పుడు సత్త్వగుణము వృద్ధినొంది యున్నదని తెలియవలయును. ఇచ్చట విచారించఁగా అంతఃకరణమునుని సత్వరజస్తమోగుణాత్మక మని చెప్పఁబడియున్నందున రజస్తమోగుణము లెప్పటికి నంతఃకరణములోనుండి నివర్తింపవని తోఁచుచున్నది. అయినను అంతఃకరణమునను ముఖ్యమైన యుపాదానకారణము

సత్త్వగుణమే. రజస్తమోగుణములు కావు. రజస్తమోగుణములు రెండును సత్త్వగుణమున కుపష్టంభకములే కాని ముఖ్యకారణములు కావు. ఉపాదానకారణమునకు సహాయభూతములైన యవయవములు ఉపష్టంభకము లనఁబడును. అనఁగా లోకములో ఘటమునకు మృత్తిక ఉపాదానకారణ మయినందున ముఖ్యకారణ మనఁబడును. జలము, వాయువు, తేజస్సు ఇవి మృత్తికకు సహాయములుగా నున్నందున ఉపష్టంభకము లనఁబడును. ఈప్రకారమే యంతఃకరణమునకు సత్వగుణమే ఉపాదానకారణము రజస్తమస్సులు ఉపష్టంభకములని యర్థము. కనుకనే జ్ఞానియగువాఁడు యోగము నభ్యసించితే, రజస్తమస్సులు నశించి సత్త్వగుణము మాత్రము శేషించుచున్నది. ఈయభిప్రాయముతోనే-

శ్లో. జ్ఞస్య చిత్త మచిత్తం స్యాత్ జ్ఞచిత్తం సత్త్వముచ్యతే.
అని చెప్పఁబడినది.

జ్ఞానియొక్క అంతఃకరణము అంతఃకరణ మని చెప్పఁబడదు. సత్వమని చెప్పఁబడును.

ఈసత్వము చాంచల్యమునకు కారణ మగురజోగుణముచే మిశ్రముకానందున నేకాగ్రముగాను, భ్రాంతిచేత కల్పింపఁబడి యాత్మభిన్నములైనస్థూలపదార్థములరూపముగాఁబరిణమించుటకు కారణమైన తమోగుణముచే మిశ్రము కానందున సూక్ష్మముగాఁగూడ నేర్పడును. ఇట్టిదశలోనే ఆత్మస్వరూపము గ్రహించుటకు యోగ్యమై యుండును. కనుకనే—

శ్రు. దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః,

అని శ్రుతి వినఁబడుచున్నది.

తా. రజోగుణరహితమైనదియు నేకాగ్రమై తమోగుణరహితమైనదియు నగు సూక్ష్మమగుబుద్ధిచేత సూక్ష్మవస్తుదర్శన నిపుణు లగుపురుషు లాత్మస్వరూపమును జూచుచుందు రని యర్థము.

అనఁగా నేప్రకారము విశేషమైనగాలిచే కదలింపఁబడు దీపముచేత రత్నములు, ముత్యములు మొదలగువానియొక్క లక్షణములను నిశ్చయించుటకు శక్యము కాదో, యేప్రకారము అతిస్థూలమగు గుద్దలిచేత సూదితో కుట్టినట్లు వస్త్రమును కుట్టుటకు శక్యము కాదో యాప్రకారమే యేకాగ్రము గాక స్థూలమగు బుద్ధిచేత బ్రహ్మతత్వము తెలియుటకు శక్యము కాదని భావము.

ఇటువంటి సత్త్వమే తమోగుణమిశ్రమైనరజోగుణము చేతఁబట్టుకోఁబడి నానావిధద్వైతప్రపంచము నాలోచించి కల్పించుటచేత చిత్తమని చెప్పఁబడినది. ఇట్టి చిత్తము తమోగుణము హెచ్చినప్పుడు అసురసంపదను బుట్టించుచు స్థూలదశ నొందును ఈయర్థము వసిష్ఠమహర్షిచే చెప్పఁబడినది.

శ్లో. అనాత్మన్యాత్మభావేన దేహభావనయా తథా,
పుత్రదారైః కుటుంబైశ్చ చేతో గచ్ఛతి పీనతామ్.

తా. ఆత్మగాని దేహేంద్రియాదులయం దాత్మబుద్ధిని చేయుటచేతను దేహమునందు వెనుక చెప్పిన శాస్త్రీయగు

ణాధానదోషాపనయనములను చేసినపక్షమం దాత్మకు శుద్ధి కలుగు ననుభ్రాంతిచేతను కుటుంబమందుండు పుత్రభార్యాదులయందు మమకారము చేయుటచేతను చిత్తము స్థూలముగా వృద్ధినొందుచుండును.

శ్లో. అహంకారవికారేణ మమతామలలీలయా,
ఇదం మమేతి భావేన చేతో గచ్ఛతి పీనతామ్.

తా. దేహమం దాత్మబుద్ధిని చేయడ మను పరిణామము చేతను దేహేంద్రియాదులయందు చేయఁబడు మమకారమనుమలినక్రీడచేతను గృహక్షేత్రాదులయం దిది నాదియను నభిమానముచేతను చిత్తము బలియుచుండును.

శ్లో. ఆధివ్యాధివిలాసేన సమాశ్వాసేన సంసృతౌ,
హేయాహేయవిభాగేన చేతో గచ్ఛతి పీనతామ్.

తా. మనోవ్యధలు జ్వరాదిరోగములు వీటిప్రకాశము చేతను కర్తృత్వభోక్తృత్వాదిరూప మగు నీసంసారమందు స్థితిని బొందియుండుటచేతను ఈవస్తువులు విడువఁదగినవి, ఈవస్తువులు గ్రహింపఁదగినవి యను నభినివేశముచేతను చిత్తము వృద్ధినొందుచుండును.

శ్లో. స్నేహేన ధనలోభేన లాభేన మణియోషితామ్,
ఆపాతరమణీయేన చేతో గచ్ఛతి పీనతామ్.

తా. పుత్రమిత్రకళత్రాదులయం దుండు స్నేహముచేతను, ద్రవ్యమం దాశచేతను, మాణిక్యములు, స్త్రీలు మొదలగు వస్తువులయొక్క తాత్కాలికప్రీతిజనక మగు లాభముచేతను చిత్తము బలియుచుండును.

శ్లో. దురాశాక్షీరపానేన భోగానిలబలేన చ,
ఆస్థాదానేన చారేణ చేతో గచ్ఛతి పీనతాం. అని.

తా. ఎప్పటికి తృప్తిని చెందని విషయాశ యను క్షీర పానముచేతను విషయభోగ మను వాయుభక్షణముచేతను ప్రపంచమందు సత్యత్వబుద్ధిని చేయడ మను విహారముచేతను చిత్తమనెడిసర్పము మిక్కిలి వృద్ధినొందుచుండును.

వా. ఈప్రకారము జీవన్ముక్తి సిద్ధించుకొఱకు వాసనాక్షయమనోనాశములను సంపాదించవలయు నని ప్రతిజ్ఞచేసి వాసనామనస్సులు ఎటువంటివి యని యాకాంక్ష కలుగగా వాటి యొక్క స్వరూపమును ఇంతవరకు నిరూపించినారము. ఇకను వాసనాక్షయమనోనాశములను క్రమముగా నిరూపించెదము.

ఇందులో వాసనాక్షయప్రకారము వసిష్ఠునిచే చెప్పఁబడినది.

శ్లో. బంధో హి వాసనాబంధో మోక్షస్స్యాద్వాసనాక్షయః,
వాసనాస్త్వం పరిత్యజ్య మోక్షార్థిత్వమపి త్యజ.

తా. వాసనలచే బంధింపఁబడుటయే సంసార మని, వాసనలు నశించుటయే మోక్ష మనియు చెప్పఁబడును. కనుక నోరామా! నీవు వాసనల నన్నిటిని ముందుగా వదలి తరువాత మోక్షేచ్ఛయనువాసనను కూడ వదలిపెట్టుము.

ఈశ్లోకమందు చెప్పిన యర్థము వివరించుచున్నారు.

శ్లో. మానసీర్వాసనాః పూర్వం త్యక్త్వా విషయవాసనాః,
మైత్ర్యాదివాసనానామ్నీర్గృహాణామలవాసనాః.

తా. ఓ రామా! ముందుగా మనస్సునందుండు వాసనలను విషయవాసనలను ఈ రెంటిని విడువుము. ఏ ప్రకారముగా విడువవలయునంటే చెప్పెదము. మైత్రి, ముదిత, కరుణ, ఉపేక్ష యను శుభ వాసనలను గ్రహించుము. అందుచేతనే వెనకటి యశుభ వాసనలన్నియు నశించును.

శ్లో. తా అప్యంతః పరిత్యజ్య తాభిర్వ్యవహరన్నపి,
అంతశ్శాంతసమస్నేహో భవ చిన్మాత్రవాసనః.

తా. ఆ మైత్ర్యాదివాసనలతో కూడి వ్యవహరించుచున్నప్పటికి, హృదయమందా వాసనలను కూడ విడచి శుభవిషయములయందుండు శక్తిని గూడ వదలి కేవలచిద్రూపుఁడగు పరమాత్మయందే దృఢమైన భావన కలవాఁడవై యుండుము.

శ్లో. తామప్యంతః పరిత్యజ్య మనోబుద్ధిసమన్వితాం,
శేషే స్థిరసమాధానో యేన త్యజసి తం త్యజ.

తా. మనోబుద్ధులయొక్క వృత్తులు సంకల్పనిశ్చయములు. వీటితో కలిసియున్న యాచిన్మాత్రవాసనను కూడ వదలి ద్రష్టృదర్శనదృశ్యములనెడి త్రిపుటీభేదమును మిథ్యాత్వబుద్ధిచేత నిషేధించఁగా నిషేధించుటకు శక్యము గాక యే ప్రకార మాత్మతత్త్వము మిగులునో అట్టిపరమాత్మతత్త్వమందు స్థిరముగా సమాధి కలవాఁడవై యనంతర మాసమాధిని కూడ వదలి కేవల బ్రహ్మస్వరూపముగానే యుండుము.

తా. ఈశ్లోకములయందు మానసవాసనాశబ్దముచేత వెనుక చెప్పినలోకవాసన శాస్త్రవాసన దేహవాసన యనుమూఁడువాసనలు చెప్పఁబడినవి. విషయవాసనాశబ్దముచేత దంభద

ర్వాహంకారములు మొదలగు నాసురసంపద చెప్పఁబడినది. ఇచ్చట లోకాదివాసనలు మూఁడును సంభవప్రాచుర్యమునం దయును సాధారణముగా బంధకమైనప్పటికి లోకాదివాసనలు మృదుబంధమని, ఆసురసంపద తీవ్రబంధమను తాత్పర్యముచేత రెంటిని వేరువేరుగా చెప్పినారు. లేదా శబ్దస్పర్శరూపరసగంధములు అయిన విషయములు వీనిని కోరుసమయమందుండుసంస్కారము మానసవాసన యని, అనుభవించు కాలమం దుండుసంస్కారము విషయవాసన యని యైనా చెప్పవచ్చును. ఈపక్షమందు వెనుక చెప్పిన లోకాదివాసనలు మూఁడు ఆసురసంపద యొకటి చేరి నాలుగువాసనలును ఈ మానసవాసనయును విషయవాసనలయందే యంతర్భవించును. బాహ్యవాసనాంతరవాసనలకంటె భిన్నమైన మరియొక వాసన లేదుగదా!

ఆక్షేపము.—ఓయీ! వాసనాపరిత్యాగ మే ప్రకారము చేయుటకు శక్యముగా నుండును? ఈవాసనలకు ఆకార మొకటి లేదు గదా? ఆకార మున్న ఘటమును చీపురుతో నెత్తిపారవేయవచ్చును.

సమాధానము.—ఉపవాసజాగరణములను చేసినట్లు వాసనాపరిత్యాగములను గూడ చేయవచ్చును. అది యెటు వలెనంటె-లోకములో భోజనక్రియను విడచుట యుపవాస మనియు, నిద్రనువిడచుట జాగరణ మనియు చెప్పెదరు. ఈ రెండు ఏకాదశి శివరాత్ర్యాదికాలములయందు శిష్టులచేత నాచరింపఁబడుచున్నవి. ఇచ్చట భోజనక్రియకు నిద్రకును ఒకవిధమైనయాకారము లేదు గదా! అయినా వాటిని కొన్ని

కాలములయందు శిష్టులు పరిత్యజించుచున్నారు. ఆప్రకారమే వాసనలు కూడ ఆకారము లేకపోయినను పరిత్యజింప శక్యములై యున్నవి.

శ్లో. "అద్య స్థిత్వా నిరాహారః."

ఈదివసమందు భోజనము చేయకుండనుండి రేపు భోజనమును చేయుదుననియు, ఈదినమంతయు నిద్రపోకుండ నుందుననియు సంకల్పముచేసి యాప్రకారమే సావధానముగా నుండుటయే ఉపవాసజాగరణము లని చెప్పఁబడును. కనుక భోజనక్రియానిద్రల కాకారము లేకయున్నప్పటికి పరిత్యజించుట కుశక్యమేయని యంటిరా వాసనలుకూడ నీప్రకారమే విడువ శక్యములై యుండును. సర్వవాసనలను నేను విడిచియుందును అని వైదికమంత్రముచేత దృఢముగా సంకల్పించి సావధానముగా నుండుటకు యేమియు బాధకముండదు. వైదికమంత్రములయం దధికారములేని స్త్రీశూద్రులు లౌకికవాక్యములచేతనే ఈప్రకారముగా సంకల్పముచేసి యుండవచ్చును. ఇదిగాక ఉపవాసమునందు శాకసూపాన్నాది పదార్థములయొక్క సన్నిధానమును విడిచియున్నట్లు వాసనాత్యాగమునందును స్రక్చందనవనితాదివిషయములయొక్క సన్నిధానమును విడిచియుండవలసినది. ఆకలి, దప్పి, నిద్ర మొదలైనవి జ్ఞాపకమునకు రాకుండ నుండుటకు సచ్ఛాస్త్రశ్రవణ హరినామకీర్తన నృత్యగీతాదికృత్యములచేత నుపవాసవ్రతములందు చిత్తము నేప్రకారము లాలన చేయుచుందురో యాప్రకారమే వాసనాపరిత్యాగవ్రతమునందును మైత్రీముదితాదిపుణ్యవాసనలచేత చిత్తము నుపలాలన చేయుచుండవల

యును. మైత్ర్యాదివాసనలు యోగశాస్త్రమునందు పతంజలి మహామునిచే చెప్పఁబడినవి.

సూ. మైత్రీకరుణాముదితోపేక్షాణాం, సుఖదుఃఖ పుణ్యాపుణ్యవిషయాణాం, భావనాతశ్చిత్తప్రసాదనమ్.

తా. అంతఃకరణము రాగద్వేషపుణ్యపాపములచేత కలుషముగా చేయఁబడును. రాగద్వేషము లనఁగా "సుఖానుశయీ రాగః" "దుఃఖానుశయీ ద్వేషః" అనుసూత్రములచేత చెప్పఁబడినవి. ఒకసుఖ మనుభవింపఁబడుచుండఁగా ఇట్టి సుఖములే నాకు సర్వదా సంభవించుచుండవలయునను బుద్ధి రాగమని చెప్పఁబడును. ఒక దుఃఖ మనుభవింపఁబడుచుండఁగా, ఇట్టి దుఃఖము లెప్పటికి నాకు రాకుండ నుండవలయు ననుబుద్ధి ద్వేష మనఁబడును. ఇందులో రాగము, సుఖము ననుభవించుకాలమునందు సర్వసుఖములు నాకు రావలయు ననుబుద్ధి విశేషము. ఇది సర్వసుఖములు అనఁగా ఇహలోకసుఖములు రాజ్యపుత్త్రకళత్త్రాదిప్రాప్తిజన్యములు. పరలోకసుఖములు స్వర్గాదులు. వీటిని సంపాదించుసాధనసామగ్రి లేనందున, ఈసుఖములు నాకు సంభవించకపోయెనే యని నాచిత్తము వ్యాకులపడుచుండును. రాగముచేత వ్యాకులము నొందిన పురుషుఁడు సుఖముల ననుభవించు పురుషులను చూచి వీరందఱు నాకు మిత్రులు అని వారి యందఱియం దెప్పుడు మైత్రిని భావించునో, అప్పుడు తనకుమారునియొక్క రాజ్యము తన రాజ్యమైనట్లు వారియొక్క సుఖము గానే యేర్పడును గనుక సుఖములయందు తనకు నుండిన రాగము నివర్తించును. అందువలన చిత్తము నిర్మలమై యుండును. లోకములో

నొకపురుషుఁడు తనకు రాజ్యము లేకపోయినా తనకుమారు నకు రాజ్యము ఉన్నపక్షమున తనకు రాజ్యము ఉన్నట్టుగానే సుఖము నేప్రకారము పొందుచుండునో యాప్రకారమే ఒక్కొక్కపురుషుఁడు ఒక్కొకసుఖము ననుభవించుచునే యుండును. కనుక వీరందఱు తనమిత్రులని దృఢముగా భావించినయెడ, అన్నిసుఖములు తనకు సంభవించినటు లేర్పడును. అప్పుడు సుఖములయందు తన కుండు రాగము నివర్తించును. రాగము నివర్తింపఁగానే వర్షాకాలము గడచిపోయిన పిమ్మట నదీజలము నిర్మలమైయున్నట్టు చిత్తము నిర్మలమై యుండును. ఆప్రకారమే దుఃఖ మనుభవించుచుండఁగా ఇట్టి దుఃఖము నా కెప్పటికిని రాకయుండవలయు ననుబుద్ధి ద్వేష మనఁబడును. శత్రువ్యాఘ్రసర్పాదులు దుఃఖకారణములు; ఇవియుండఁగా దుఃఖమును రాకుండఁజేయుటకు శక్యముకాదు. దుఃఖకారణము లగుసర్పవ్యాఘ్రాదుల నన్నిఁటిని నశింపఁజేయుటకును సాధ్యముకాదు గనుక నాద్వేషము సర్వదా హృదయమును తపింపఁ జేయుచుండును. ఎప్పుడు సమస్తమైన ఇతరజంతువులకు ప్రతికూలమైన దుఃఖము రాకయుండవలయునని దుఃఖవంతు లగువారియందు కరుణ దృఢముగా తలఁచునో అప్పుడు శత్రువ్యాఘ్రాదులయందు కూడ ద్వేషము నివర్తించును. అందుచేత చిత్తము ప్రసన్నమై యుండును.

కనుకనే యొక స్మృతియం దిట్లు చెప్పఁబడినది.—

శ్లో. ప్రాణా యథాత్మనో భీష్టా భూతానామపి తే తథా,
ఆత్మౌపమ్యేన భూతానాం దయాం కుర్వంతి సాధవః. అని.

తా. తనయొక్క ప్రాణములు తన కేప్రకారముగా ప్రియములై యున్నవో ఆప్రకారమే సమస్తభూతములకు ను ప్రాణములు ప్రియములై యుండును. కనుక సజ్జను లగు వారు సకలభూతములను తనతో సమానముగా తలఁచి వాటి యందు నిండు దయను చేయుచుందు రని యర్థము.

సజ్జనులగువారు సకలభూతములయందును దయను చేయు ప్రకారము కొందఱు మహాపురుషులచేత కనుపఱచఁబ డినది.

శ్లో. సర్వేఽత్ర సుఖినస్సంతు సర్వే సంతు నిరామయాః,
సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చిద్దుఃఖమాప్నుయాత్.

తా. ఈలోకమునం దుండు భూతము లన్నియు సుఖ ము కలిగి యుండవలయును. అన్ని భూతములు రోగాద్యు పద్రవములు లేకుండ నుండవలయును. సమస్తజనులు శుభ ములనే పొందుచుండవలయును. ఒకానొకభూతము కూడ దుఃఖమును బొందకుండనుండవలయును అని యర్థము. ఈ ప్రకారము సర్వకాలములయందు మనస్సునందు సంకల్పించు టయే భూతములయందు దయను చేయు ప్రకారమని భావము.

ఈలోకమునం దుండుజనులు స్వభావముగా పాపము ను చేయుచుందురు; పుణ్యమును చేయక యుందురు ; ఈవిష యము చెప్పఁబడినది.

శ్లో. పుణ్యస్య ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవాః,
న పాపఫలమిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః.

తా. జనులు పుణ్యముయొక్క ఫలమైన సుఖమును మాత్రము ఎప్పుడును కోరుచుందురు గాని పుణ్యమును మాత్రము చేయరు. పాపముయొక్క ఫలమైన దుఃఖమును కోరకయుందురు గాని పాపములను మాత్రము ప్రయత్నముతో చేయుచుందురు.—

ఈపుణ్యపాపములు రెండు పశ్చాత్తాపమును కలుగఁ చేయుచుండును. ఈపశ్చాత్తాపము

శ్రు. కిమహం సాధు నాకరవం. కిమహం, పాపమకరవ మితి.

అనుశ్రుతిచేత చెప్పఁబడినది.

తా. నేను పుణ్యకర్మను ఎందు కని చేయకపోతిని. పాపకర్మను ఎందు కని చేసితి నని పరితాపమును పుణ్యపాపములు పొందించుచుండును. అని శ్రుత్యర్థము.

ఈపురుషుఁడు పుణ్యమును చేయువారియందు ముదితమును అనఁగా సంతోషమును ఎప్పుడు దృఢముగా భావించునో అప్పుడు పుణ్యవాసనచేత తాను కూడ జాగ్రతగా పుణ్యమును చేయుచుండును. ఆప్రకారమే పాపమును చేయువారియందు ఉపేక్షను అనఁగా అనాదరమును ఎపుడు దృఢముగా భావించునో అప్పుడు తాను పాపములను చేయక మానును. అందుచేత పశ్చాత్తాపము కలుగ నేరదు గనుక చిత్తము సుప్రసన్నముగా నుండును.

సుఖము ననుభవించు జనులయందు మైత్రిని భావించినందున, చిత్తకాలుష్యకారణమగు రాగముమాత్రమే నివర్తిం

చునది కాదు. అసూయ, ఈర్ష్య మొదలగుదోషములు కూడ నివర్తించును. అసూయయనఁగా పరులయం దుండుగుణము లనుచూచి దోషములుగా గ్రహించుట. ఈర్ష్య యనఁగా పరులయొక్క గుణములను చూచి సహించలేక పోవుట. ఎప్పుడు సుఖవంతులయందు మైత్రిని భావించునో, అప్పుడు పరుల యొక్కసుఖము తనసుఖముగా నేర్పడును గనుక పరులయొక్క గుణములయందు అసూయాదులు కలుగ నేరవు. ఈప్రకారమే మఱికొన్నిదోషములు కూడ నివర్తించుప్రకారము నూహించవలయును.

దుఃఖము ననుభవించువారియందు కరుణను భావించు వారికి శత్రువధాదులను జేయించుద్వేష మేప్రకారము నివర్తించునో, యాప్రకారమే తనయొక్క సుఖముచేత తనకు గలిగియున్న దర్పమును నివర్తించును. ఈదర్ప మనుదోషము నాసురసంపదను చెప్పునప్పుడు పూర్వమే యుదాహరించి నారము.

శ్లో. ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ,
ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా. అని.

ఈశ్లోకతాత్పర్యము పూర్వమే వ్రాయఁబడియున్నది.

ఆక్షేపము.—ఓయీ! పుణ్యమును చేయువారియందు ముదితను భావించువానికి ఆవాసనచేత పుణ్యములయందు ప్రవృత్తి కలుగు నని యిప్పుడు చెప్పితిరి. మునుపు మూఁడు మలినవాసనల వివరించునప్పుడు శాస్త్రవాసనలో పుణ్యము నంతర్భవింపఁజేసి, త్యాజ్యమని చెప్పియుంటిరి గనుక ముది తను భావించుటచేత గలుగు పుణ్యప్రవృత్తి యోగికి గ్రాహ్యము కాదు.

సమాధానము.—మునుపు శాస్త్రవాసనలో నంతర్భవింపఁజేసి త్యాజ్యమని చెప్పిన పుణ్యము ఇష్టాపూర్తవత్తములను కామ్యపుణ్యము. అవి పునర్జన్మను సంపాదించును గనుక మలిన మని త్యాజ్యమని చెప్పఁబడినవి. ఇప్పుడు ముదితను భావించుటచేతఁ గలుగుపుణ్యము యోగాభ్యాసముచేత కలుగు శుక్లకృష్ట మనుపుణ్యము. ఇది పునర్జన్మను సంపాదించునది కానందున మలిన మని చెప్పఁబడదు; ఇట్టిపుణ్యము యోగికి గ్రాహ్యమే.

యోగియొక్క పుణ్యము అశుక్లకృష్ణ మని పతంజలి మహర్షిచే చెప్పఁబడినది.

సూ. కర్మాశుక్లకృష్ణం యోగినస్త్రివిధమితరేషాం. అని.

తా. స్వర్గాదిఫలములను గలుగఁజేయు అగ్నిహోత్రాదికర్మ శాస్త్రముచే విధింపఁబడినందున శుక్లమని చెప్పఁబడును. నరకఫలమును కలుగఁజేయు సురాపానపరస్త్రీగమనాదికర్మ శాస్త్రముచే నిషేధింపఁబడుచున్నందున కృష్ణమని చెప్పఁబడును. మిశ్రమగుకర్మ శుక్లకృష్ణ మనఁబడును. ఈమూఁడువిధము లగుకర్మలు యోగులుగాని పురుషులకు నేర్పడియున్నవి. యోగియొక్క కర్మ ఈమూఁటిలో నంతర్భవింపదు గనుక అశుక్లకృష్ణ మని చెప్పఁబడును.

యోగులు కానివారియొక్క త్రివిధ మగుకర్మ పునర్జన్మను కలుగఁజేయును. ఈయర్థము విశ్వరూపాచార్యులవారిచే చెప్పఁబడినది.

శ్లో. శుభైరాప్నోతి దేవత్వం నిషిద్ధైర్నారకీం గతిమ్,
ఉభాభ్యాం పుణ్యపాపాభ్యాం మానుష్యం ప్రాప్నుతే౽వశః. అని.

తా. పుణ్యకర్మలచేత దేవజన్మ నొందును; పాపకర్మల చేత నరకతిర్యక్ స్థావరజన్మల నొందును; పుణ్యపాపముల రెంటిచేత మానుషజన్మ నొందును. ఈప్రకారము జీవుఁడు కర్మపరతంత్రుఁడై సంచరించుచుండును.

ఆక్షేపము.—ఓయీ! యోగము శాస్త్రనిషిద్ధము కానందున కృష్ణము కాకపోయినా, శాస్త్రముచేత విధింపఁబడి యున్నందున శుక్లమని చెప్పఁదగియున్నది. ఈలాగున నుండఁగా యోగియొక్క కర్మ యగుయోగము అశుక్లకృష్ణమని యేలాగున చెప్పఁదగును?

సమాధానము.—శాస్త్రముచే విధింపఁబడి, స్వర్గాది ఫలములను కలుగఁజేయుకర్మ శుక్లమని మేము నిశ్చయించి యున్నందున యోగియొక్కకర్మ శాస్త్రవిహితమైనప్పటికి స్వర్గాదిఫలవిశేషములను కలుగఁజేయునది కాదు గనుక అశుక్లమని చెప్పఁదగియున్నది.

కనుక అశుక్లకృష్ణమగు యోగ మనుపుణ్యమునందు ప్రవృత్తి యోగికి ఆవశ్యకమై యున్నది. అందువలన పుణ్యకారులయందు ముదితను భావింపవలయును.

ఆక్షేపము.—ఓయీ! ఈచెప్పిన న్యాయప్రకారము యోగులు కానివారు కూడ పుణ్యవంతులయందు ముదితను యథోచితముగా భావించి పుణ్యములయందుఁ బ్రవర్తింపఁ గలరు.

సమాధానము.—ఏపురుషులు మైత్రీముదితాది వాసనలయొక్క భావనచేత చిత్తమును నిర్మలముగా చేసుకొందురో, వారే యోగు లని చెప్పఁబడుదురు గనుక మనుష్యులందఱు మైత్ర్యాదివాసనా దృఢభావనచేత పుణ్యములయందుఁ బ్రవర్తించుచుండవలయును.

ఇచ్చట చెప్పిన మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష ఈనాలుగు "అభయంసత్త్వసంశుద్ధిః" అని దైవసంపదయందు చెప్పిన గుణములకును, జ్ఞానసాధనములుగా ౧౩-వ అధ్యాయములో చెప్పిన యమానిత్వాదిగుణములకును, స్థితప్రజ్ఞభగవద్భక్తలక్షణములయందు చెప్పిన యద్వేష్టృత్వాదిగుణముల కన్నిఁటికి నుపలక్షణములుగా నుండును. అనఁగా మైత్ర్యాదిగుణములవలె భగవద్గీతలయొక్క ౨, ౧౨, ౧౩, ౧౮ అధ్యాయములలో చెప్పిన అమానిత్వాదిగుణములు కూడ శుభవాసనలే అయినందున మలినవాసన లగుకామక్రోధాదులను నివర్తింపఁజేయు సామర్థ్యము కలవి గనుక అమానిత్వాదిగుణములను కూడ మైత్ర్యాదివాసనలతో సమానముగా నభ్యసించవలయునని భావము.

ఆక్షేపము.—ఓయీ, శుభవాసనలు అనంతములుగా నున్నవి; ఇవి యన్నియు నొకపురుషునిచేత సాధింప శక్యములు కావు గనుక వీటిని నభ్యసింపవలయునని చేయుప్రయాసము నిరర్థకముగాఁ దోఁచుచున్నది.

సమాధానము.—శుభవాసనలయొక్క అభ్యాసముచేత నివర్తింపఁజేయఁబడు మలినవాసనలన్నియు నొకపురుషుని

యందు సంభవింపనేరవు. అలాగున సంభవించినను తమయందు శుభవాసనల నన్నిటిని నొకపురుషుం డభ్యసించుట యసాధ్యకము కనుక, అది యశక్యమైయుండును. కొన్ని మలినవాసనలు కొందఱియందును, మఱికొన్ని మలినవాసనలు మఱికొందఱియందు నీప్రకారముగా సంభవించుచుండును. ఎవరియందు నేమలినవాసనలు సంభవించి యుండునో, వాటిని వారు ముందుగా పరీక్షించి వాటికి అనఁగా తనచిత్తమునందుండిన మలినవాసనలకు నివర్తకములగు శుభవాసనలను మాత్రమే అభ్యసింపవలయును. ఇట్టి శుభవాసనల నభ్యసించుట యశక్యమైయుండదు గనుక శుభవాసనాభ్యాసప్రయాసము నిరర్థకము కాదు. ఇందుల కొకదృష్టాంతము చెప్పెదము. ఆయుర్వేదమను వైద్యశాస్త్రమం దనేకములగు ఔషధములు చెప్పఁబడినవి. ఆయౌషధము లన్నియు నొకపురుషునిచేత సేవించుటకు శక్యములు కావు. ఇంతమాత్రముచేతనే ఔషధసేవ నిరర్థకమని చెప్పఁదగదు. వైద్యశాస్త్రమునందు చెప్పిన ఔషధములచేత నివర్తింపఁజేయఁబడు యావత్తు జాడ్యము లొకపురుషునియందే సంభవింపనేరవు. కొందఱియందు కొన్నిరోగములు మరికొందఱియందు మరికొన్నిరోగములు సంభవించియుండును. ఎవనికి నేరోగములు సంభవించి యున్నవో వాఁడు రోగములను పరీక్షించి తన్నివర్తకములగు ఔషధములను సేవించియుండును. ఈప్రకారమే శుభవాసనలు కూడ అభ్యసింపఁబడును. శుభవాసనల నభ్యసించు పురుషుఁడు ముందుగా తనచిత్తమందు ఎటువంటి మలినవాసనలెన్నియున్నవో వాటిని పరీక్షించి, అనంతరము వాటికి విరో

ధములగు శుభవాసనలు ఏవిగా నుండునో వాటిని నిశ్చయించుకొని అభ్యసింపవలయును.

లోకములోనొకపురుషుఁడు పుత్రమిత్రకళత్రాదిపరివారముచేత పీడింపఁబడుచుండి, దాని నివర్తింపఁజేసుకొనుటకు నెట్లు తద్విరోధియగు సన్యాసాశ్రమము నంగీకరించునో, ఆ ప్రకారమే విద్యామదము, ధనమదము, ఆభిజాత్యమదము, సదాచారమదము ఇవి మొదలగు మలినవాసనలచేత పీడింపఁబడువాఁడు ఈవాసనలకు విరోధియగు వివేకము నభ్యసింపవలయును.

ఈవివేకము వాసిష్ఠరామాయణము ఉపశమప్రకరణములో జనకమహారాజుచేత చూపింపఁబడినది.

శ్లో. అద్యయే మహతాం మూర్ధ్ని తే దినైర్నిపతంత్యధః,
హంత చిత్తమహత్తాయాః క్రైషా విశ్వస్తతా తవ.

తా. ఈకాలమందు ద్రవ్యసమృద్ధిచేత నధికు లగువారికంటె హెచ్చుగా నుండుపురుషులు మరకొన్నిదినములకే ద్రవ్యమంతయు నశించి పరమదరిద్రులైయుందురు; అట్టి స్థితిని మనము చూచుచున్నారము. కనుక చిత్తమా! నీకు ద్రవ్యాధిక్యమం దింత నమ్మక మెందుకు కలుగవలయును? అనఁగా ద్రవ్యసమృద్ధి అనిత్యముగా కనుపడుచున్నది గనుక దీనిని యావత్కాలస్థాయిగా విశ్వసించి విఱ్ఱవీఁగవగదని భావము.

శ్లో. క్వధనాని మహీపానాం బ్రహ్మణః క్వజగంతి వా,
ప్రాక్తనాని ప్రయాతాని కేయం విశ్వస్తతా తవ.

తా. నలహరిశ్చంద్రాది మహారాజులయొక్క ద్రవ్యసమృద్ధులు ఎంత హెచ్చుగా నుండెను. బ్రహ్మచేత నిదివరకు

సృష్టింపఁబడిన లోకములు ఎంత సంపన్నముగా నుండెను. అవి యన్నియు నిప్పు డెక్కడికి పోయెను? వానిలో లేశమైనా, యిప్పుడు కనుపడదు గదా. కనుక ఇప్పుడు కనుపడు ఐశ్వర్య మందు ఓచిత్తమా, నీవు ఇంత విశ్వాస మెందుకు? ఇది అతి స్వల్ప కాలమందే నశించిపోవును.

శ్లో. కోటయో బ్రహ్మణాం యాతాః గతా స్సర్గపరంపరాః.
ప్రయాతాః పాంసువద్భూపాః కా ధృతిర్మమ జీవితే.

తా॥ అనేకలక్షలయుగములు జీవించు బ్రహ్మ లింతవరకు అనేకకోట్లు నశించిపోయినారు. అనేకకోట్లసంవత్సరములు రస్థిముగా నుండు బ్రహ్మాండములు అనంతములు నశించి పోయినవి; ఇఁకను నల నహుష హరిశ్చంద్రాది రాజులు అనేక కోట్లు దుమ్మువలె నెగిరిపోయినారు. ఈలాగున నుండఁగా నాజీవిత మెంతమాత్రము ఎంత కాలము నిలుచును. దీని యందు నేను విశ్వాసము నెందుకు చేయవలయును?

శ్లో. యేషాం నిమేషణోన్మేషౌ జగతాం ప్రళయోదయౌ,
తాదృశాః పురుషా నష్టాః మాదృశాం గణనైవ కా. అని.

తా. ఏమహాపురుషులు కను రెప్పను మూసినమాత్రాననే ప్రపంచమంతయు నశించునో, రెప్పను తెఱచినమాత్రాననే ప్రపంచ మంతయుఁ బుట్టుచుండునో అటువంటి మహాపురుషులందఱు నశించిపోయిరి. ఇఁకను మావంటి క్షుద్రజనులను గూర్చి యేమి చెప్పవలయును?

ఈప్రకారము ద్రవ్యాదిమదములను నివర్తింపఁజేయు వివేకము కనుపరచఁబడినది.

ఆక్షేపము.—ఓయీ, నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థఫలభోగవైరాగ్యము, శమదమాది షడ్గుణసంపత్తి, మోక్షేచ్ఛ ఈనాలుగు సాధనములచేతఁగాని బ్రహ్మజ్ఞానము పుట్టదు. ఇప్పుడు మీరు చెప్పిన వివేకము నిత్యానిత్యవస్తువివేకముగానే కనుపడుచున్నది. ఇట్టివివేకము బ్రహ్మజ్ఞానోత్పత్తికిపూర్వమే సిద్ధమై యున్నది. బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము కలిగినతరువాత జీవన్ముక్తి నొందుటకు వాసనాక్షయమనోనాశములను సంపాదింప వలయు నని చెప్పట నారంభించితిరి. ఇట్టిసమయములో వివేకమును ప్రతిపాదించుట యకాండతాండవముగాఁ దోఁచుచున్నది. అకాండతాండవ మనఁగా సమయము గానిసమయమందు నాట్యమును చేయుట. తత్త్వజ్ఞానసాధనములను ప్రతిపాదించునప్పుడు వివేకమును ప్రతిపాదించుటకు సమయము. తత్త్వజ్ఞానము కలిగినతరువాత జీవన్ముక్తిసాధనములను ప్రతిపాదించునప్పుడు వివేకమును ప్రతిపాదించుటకు సమయము కాదు. ఇట్టి అసమయములో వివేకమును ప్రతిపాదించుట అకాండతాండవ మని చెప్పఁదగియున్నది.

సమాధానము.—సాధనచతుష్టయసంపత్తి కలిగినతరువాత బ్రహ్మజ్ఞానము కలుగుననునది సర్వజనసాధారణమైన రాజమార్గము. ఉపశమప్రకరణము చెప్పఁబడిన జనకమహారాజునకు అదివరకు సాధనచతుష్టయసంపత్తి లేకపోయినా పూర్వపుణ్యపరిపాకముచేత జీవన్ముక్తు లగుకొందఱు సిద్ధులయొక్క వాక్యములను యాదృచ్ఛికముగా విన్నమాత్రాననే బ్రహ్మసాక్షాత్కారజ్ఞానము కలిగినది. అందువలన మనస్సునను విశ్రాం

తి కలుగునిమిత్తము ఇచ్చట వివేక మనుసంధింపఁబడినది. ఈ జనకమహారాజునకువలెనే యింక నేపురుషులకైనా సాధన చతుష్టయసంపత్తి లేకముందే పుణ్యవిశేషముచేత తత్వజ్ఞానము కలిగినా జీవన్ముక్తిసాధనముల నభ్యసించుసమయము నందు చిత్తవిశ్రాంతికొఱకు వివేకమును కూడ అభ్యసింప వలసియుండును గనుక జీవన్ముక్తిసాధనముల నిరూపించు సమయములో వివేకాభ్యాసమును కూడ నిరూపించినవారము; కనుక ఇది సమయమునందు చేసిన నృత్యము గాని అకాండ తాండవము కాదు.

ఆక్షేపము.—ఓయీ! ఈజనకరాజుయొక్క వివేకము తత్త్వజ్ఞానోత్పత్తికి అనంతరము కలిగినందున మలినవాసన లారాజునకు లేవు గనుక మైత్రి మొదలగు శుద్ధవాసనల యొక్క అభ్యాసము అపేక్షింపఁబడును. మలినవాసన లుంటే గదా శుద్ధవాసనల నభ్యసింపవలయును.

సమాధానము.—వాస్తవమే. మలినవాసన లుంటేనే శుద్ధవాసనల నభ్యసింపవలయును. జనకమహారాజునకు తత్వజ్ఞానోత్తరకాలమందు మలినవాసన లేవి గాని యాజ్ఞవల్క్య భగీరథాదులకు తత్వజ్ఞానోత్తరకాలమందుఁగూడ మలినవాసన లనువర్తించియున్నట్లు కనుపడుచున్నవి. కనుక నీజనకమహా రాజునకు శుద్ధవాసనాభ్యాసము అపేక్షితము గాకపోయినా యాజ్ఞవల్క్యాదులకు శుద్ధవాసనాభ్యాస మపేక్షితమై యున్నది. బృహదారణ్యపంచమాధ్యాయములోని కథాసందర్భమునునాలోచించఁగా యాజ్ఞవల్క్యమహర్షి వీరికి ప్రతివాదులగు ఉషస్తికహోళశాకల్యాదిమహర్షులు పరస్పరజయేచ్ఛ

చేత శాస్త్రవాదమును చేసినందున వీరికందఱికి చాల విద్యామదము గలదని తోఁచుచున్నది."

ఈయాజ్ఞవల్క్యకహోళాదిమహర్షులు తాము చేసినవాదమందు బ్రహ్మస్వరూపమునే ప్రతివచనములచేత నిరూపించినందున వీరు బ్రహ్మవిద్య కలవారనియె చెప్పఁదగియున్నది గాని యితరవిద్యలు మాత్రము కలవారని శంకింపఁదగియుండ లేదు.

ఆక్షేపము.—ఓయీ! యాజ్ఞవల్క్యాదులు బ్రహ్మజ్ఞానము కలవారైనప్పటికి అజ్ఞానము ఆపాతజ్ఞానమే కాని నిశ్చితజ్ఞానము కాదు.

సమాధానము.— యాజ్ఞవల్క్యాదులయొక్క బ్రహ్మజ్ఞానము నిశ్చితమైన యథార్థజ్ఞానమే కాని ఆపాతజ్ఞానము కాదు. వారికి ఆపాతజ్ఞానమే అయినపక్షమునను, ఆయాజ్ఞవల్క్యాదులయొక్క వాక్యములవలన మన కందఱికి కూడ ఆపాతజ్ఞానమే పుట్టవలయును గాని నిశ్చితజ్ఞానము పుట్టఁగూడదు.

నిశ్చితజ్ఞానమైనప్పటికి పరోక్షజ్ఞానమే కాని, అపరోక్షజ్ఞానము కాదని యంటివా?

శ్రు. "యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ."

అని ఇవి మొదలయిన వాకచక్యములచేత అపరోక్షమగు బ్రహ్మస్వరూపమును గూర్చి ప్రశ్న చేయఁబడినట్టు అందుల కటువంటి బ్రహ్మస్వరూపమునే ఉత్తరముగా చెప్పినట్టు కనుపడుచున్నందున యాజ్ఞవల్క్యాదులయొక్క జ్ఞానము పరోక్షజ్ఞానమే యని చెప్పఁదగియుండ లేదు.

ఆక్షేపము.—ఓయీ! జ్ఞానియైన పురుషునకు విద్యాగర్వ ముండునని శ్రీశంకరాచార్యులవారిచే నంగీకరింపబడ లేదు. అది యెటువలెనంటే, ఉపదేశసాహస్రియందు చెప్పఁబడినది.

శ్లో. బ్రహ్మవిత్త్వం తథా ముక్త్వా సచాత్మజ్ఞో న చేతరః. అని.

తా. నేను బ్రహ్మవేత్త నను అభిమానము లేనివాఁడే ఆత్మజ్ఞానిగాని బ్రహ్మవేత్త నను అభిమానము కలవాఁడు ఆత్మజ్ఞానికాఁడని యర్థము.

“నైష్కర్మ్యసిద్ధి” యను గ్రంథమునందు సురేశ్వరాచార్యులవారిచే చెప్పఁబడినది.

శ్లో. నచాధ్యాత్మాభిమానోఽపి విదుషోఽస్త్యాసురత్వతః,
విదుషోఽప్యాసురశ్చేత్స్యాన్నిష్ఫలం బ్రహ్మదర్శనమ్. అని.

తా. బ్రహ్మజ్ఞానము కలవానికి జ్ఞానిత్వాభిమానము అసురసంపదతో చేరిన మలినవాసన గనుక సంభవింపనేరదు. సంభవించెనో, అతఁడు బ్రహ్మజ్ఞానియే కాఁడు. అతనియొక్క బ్రహ్మజ్ఞానము నిరర్థకమైనదని యర్థము గనుక బ్రహ్మతత్త్వజ్ఞానికి విద్వత్త్వాభిమానము సంభవించు నని చెప్పఁగూడదు.

సమాధానము.—మీచేత నుదాహరింపఁబడిన ఉపదేశసాహస్రినైష్కర్మ్యసిద్ధివాక్యములయందు జీవన్ముక్తిపర్యంతము సిద్ధిగల తత్త్వజ్ఞానము వివక్షితమై యున్నది. అటువంటి తత్త్వజ్ఞానికి విద్యాగర్వము సంభవించునని మేమును చెప్పనది లేదు.

ఆక్షేపము.—ఓయీ! జయేచ్ఛ కలిగి వాదించువారికి తత్త్వజ్ఞానమే లేదని చెప్పవలయును.

అని పూర్వాచార్యులచే చెప్పఁబడియున్నది.

శ్లో. రాగో లింగ మబోధస్య చిత్తవ్యాయామభూమిషు,
కుతః శాద్వలతా తస్య యస్యాగ్నిః కోటరే తరోః.

తా. చిత్తము ప్రవర్తించు విషయములయందు ఆసక్తి కలిగియుండుటయే జ్ఞానభావమునకు చిహ్నమై యున్నది. వృక్షముయొక్క తొఱ్ఱలో నిప్పుఉన్నపక్షమునకు అవృక్షము పచ్చిగానుండదుగదా? (అనఁగా చెట్టుయొక్క తొఱ్ఱలో నగ్నియుండఁగా చెట్టు పచ్చిగా నుండనేరదు.)

సమాధానము:—

శ్లో. "రాగాదయస్సంతు కామం న తద్భావోఽపరాధ్యతి,
ఉత్ఖాతదంష్ట్రోరగవదవిద్యా కిం కరిష్యతి?"

తా. విషయములయందు రాగద్వేషాదులు ఉండినను ఉండుఁగాక. రాగద్వేషాదులు ఉన్నమాత్రముచేత తత్త్వజ్ఞానికి బాధ లేదు. అవిద్య బ్రహ్మజ్ఞానముచేత నశింపఁజేయఁబడిన శక్తిగలదై యున్నందున కోఱలు పెఱికివేసిన సర్పమువలె తత్వజ్ఞానిని బాధింపఁజాలదు. అనఁగా కేవల రాగద్వేషములు బాధకములు గానేరవు. అవిద్య యని చెప్పఁబడు నజ్ఞానము రాగద్వేషాదులను పరంపరగాఁ బుట్టించుచు పురుషుని బాధించుచుండును. ఇట్టి యవిద్య తత్వజ్ఞానముచేత నశించిపోవును గనుక నుత్తరోత్తరముగా రాగద్వేషమును పుట్టుటకు నిమి

త్తము లేనందున తాత్కాలికములగు రాగద్వేషములు తత్వ
జ్ఞానియందు కనఁబడుచుండినా బాధకములు కానేరవు.

ఈప్రకారముగా నాష్యాకారాచార్యులచేతనే చెప్పఁబడి యున్నందున తత్వజ్ఞానికి రాగాదులుకూడ నున్నట్టు కనుపడు చున్నది గనుక రాగముంటే, తత్వజ్ఞానము సంభవించదని చెప్పఁగూడదు.

ప్రశ్న.—అయితే యీ రెండు వాక్యములను విరోధము కలిగియున్నవి ఏవాక్యమును ప్రమాణ మని చెప్పవలయును?

ప్రతివచనము.—రెండు వాక్యములను ప్రమాణము గానే చెప్పవలయును.

ఇందులో రాగోలింగ మను మొదటివాక్యము జీవన్ముక్తి పర్యంతము పరిపాకమునుబొందిన తత్వజ్ఞానము కలపురుషునిఁ గూర్చి చెప్పుచున్నది.

రాగాదయస్సంతు కామ మను రెండవవాక్యము కేవల తత్వజ్ఞానినిగూర్చి చెప్పుచున్నది. కాఁబట్టి యీ రెండువాక్య ములను పరస్పరవిరోధమే లేదు గనుక తత్వజ్ఞానికి జీవన్ముక్తిదశ రాక ముందు రాగాదివాసనలు కలిగియుండును.

ఆక్షేపము.—తత్వజ్ఞానికి రాగాదివాసన లుండు నని యంగీకరించుపక్షమునను రాగద్వేషాదులనుబట్టి చేయఁబడు ధర్మాధర్మములచేత జన్మాంతరమును తత్వజ్ఞానికి రావలసి యుండును.

సమాధానము.—వేయించఁబడని విత్తనములవలె అవిద్యతో కూడియున్న రాగద్వేషాదులే పునర్జన్మకారణములు

కాని కేవలరాగద్వేషములు వేయించిన విత్తనములవలె పున ర్జన్మకు కారణములు కావు గనుక తత్త్వజ్ఞానికి అవిద్య సమూల ముగా నశించినందున కేవలరాగద్వేషము లున్నప్పటికి వాటి చేత చేయఁబడు ధర్మాధర్మములు పునర్జన్మను సంపాదించునవి కావు.

ఈయభిప్రాయముతోనే చెప్పఁబడినది.—

శ్లో. ఉత్పద్యమానా రాగాద్యా వివేకజ్ఞానవహ్నినా,
తదా తదైవ దహ్యంతే కుతస్తేషాం ప్రరోహణమ్. అని.

తా. తత్త్వజ్ఞానముగల పురుషునకు రాగద్వేషాదివాసన లెప్పుడెప్పుడు పుట్టుచుండునో అప్పుడప్పు డావాసనలు వివేక జ్ఞానమను వహ్నిచేత దహింపఁ బడుచుండును. అందువలన నా రాగద్వేషాదివాసనలకు జన్మాంతరమును సంపాదించు సామ ర్థ్యముకలిగియుండ దని యర్థము. అయితే యిట్టి రాగద్వేష ములు జీవన్ముక్తునికికూడ నుండవచ్చు నని యంటిరా? ఉండఁ గూడదు. రాగద్వేషములు భాసించుకాలమందు ముఖ్యరా గద్వేషములవలెనె ఆభాసరాగద్వేషముకూడ బాధకము లైనందున జీవన్ముక్తునకు కేవలరాగద్వేషములు కూడ నుండఁ గూడదు. భ్రాంతియందు కల్పింపఁబడిన సర్పము వాస్తవము కాకపోయినా, తాను ప్రకాశించు కాలమందు వాస్తవసర్ప మువలె భయమును కలుగఁజేయుచుండునుగదా!

రాగద్వేషములు వాస్తవములు కావు. దగ్ధపటమువలె నే ఆభాసమాత్రము లనుబుద్ధి దృఢముగా సర్వకాలములయం దనువర్తించియుండును గనుక రాగద్వేషాదివాసనలు బాధక

ములు కానేరవని యంటిరా మాతమునే మీరు సమ్మతించితిరి. ఇదియే గదా మేము చెప్పిన జీవన్ముక్తి. అనగా లౌకిక పదార్థములు భాసించుచున్నప్పటికి వానియందు మిథ్యాత్వ బుద్ధి దృఢముగా కలిగియుండుటయే జీవన్ముక్తి యని నిశ్చయించియుంటిమి.

యాజ్ఞవల్క్యమహాముని జయేచ్ఛతో వాదించు సమయములో నిష్ఠావాఁడు కాఁడు. కనుకనే చిత్తమునకు విశ్రాంతిని గలుగ చేయుటకు విద్వత్సన్యాసమును ఆయాజ్ఞవల్క్య మహాముని పరిగ్రహించిరి.

ఈయాజ్ఞవల్క్యమహామునికి జయేచ్ఛ యొకటియేగాదు. ధనాభిలాషయును విశేషముగా నుంటూవచ్చినది. ఎందువల్లనంటే జనకమహారాజు చేయు యజ్ఞమునందు నానాదేశములనుండి వచ్చియున్న యనేకబ్రహ్మవేత్తలయందర పణముగా సమర్పింపఁబడిన సాలంకారగోసహస్రములను నీయాజ్ఞవల్క్య మహాముని తానొకరే గ్రహించి పైన నాబ్రహ్మవేత్తలగు మునులనుగూర్చి-

శ్రు. "నమో వయం బ్రహ్మిష్ఠాయ కుర్మో గోకామా ఏవ వయం స్మః" అని చెప్పిరి.

తా. బ్రహ్మవేత్తయగు మహానుభావునికొఱకు మేము నమస్కరించెదము. మేము గోవులయందపేక్షకలవారమే అయితిమి అని శ్రుత్యర్థము. ఇందువలన నీ యాజ్ఞవల్క్యమహామునికి ధనాశ విశేషముగా నున్నట్టు కనుపడుచున్నది. ఇతరులైన బ్రహ్మవేత్తలను తిరస్కరించుటకుఁగానే మేము గోవుల

యం దపేక్షకలవారమని చెప్పినారుగాని వాస్తవమునకీ యాజ్ఞవల్క్యమహాముని ధనముం దాశకలవారు కారని యంటిరా? ఇతరబ్రహ్మవేత్తలను తిరస్కరించుటయను మఱియొకదోషమువీరియం దున్నట్టు మీచేతనే యంగీకరింపఁబడుచున్నది.

ఇదిగాక యితరులైన బ్రహ్మవేత్తలు తమకందఱికి దక్షిణగా నిచ్చిన గోధనమును వీరొకరే అపహరించి రని కోపము నొందిరి. ఈయాజ్ఞవల్క్యమునియును నిండకోపముఁజెంది వారితో వాదించి, అందులో శాకల్యుఁ డనునొకమహామునిని శాపమును పెట్టి చంపివేసిరి. కనుక నీయాజ్ఞవల్క్యమహామునికి ధన తృష్ణక్రోధము మొదలైనవాసనలు తత్త్వజ్ఞానోత్తరకాలమందుగూడ నుంటూవచ్చినవి యని నిశ్చయము.

అయితే శాకల్యమునిని చంపినందున నీ యాజ్ఞవల్క్యమహామునికి బ్రహ్మహత్య యను మహాపాపము సంభవించి మోక్షమును ప్రతిబంధింపలేదా యని శంకింపఁదగదు. ఎందుచేతనంటే-కౌషీతకియను ఉపనిషత్తులయందు-

శ్రు. నాస్య కేనాపి కర్మణా లోకో మీయతే న మాతృవధేన,
న పితృవధేన న స్తేయేన న భ్రూణహత్యయా.

తా. ఈబ్రహ్మతత్త్వజ్ఞానముకల పురుషునియొక్క మోక్షము మాతృహత్య, పితృహత్య, సువర్ణస్తేయము; (అనఁగా బంగారమును దొంగిలించుట) బ్రహ్మహత్య ఇవి మొదలైన పాపములచేతఁ గూడ కొంచెమైనాను హాని నొందింపఁబడదు. అని చెప్పియున్నందున తత్త్వజ్ఞశిరోమణియగు నీ మహామునియొక్క విదేహకైవల్యమున కేమియు లోపము గలుగనేరదు.

ఆర్యాపంచశతి యను గ్రంథమునందు నీ యర్థమే శ్రీ సంకర్షణమూర్తి యను నామాంతరముగల శ్రీ ఆదిశేషునిచేఁ జెప్పఁబడియున్నది.

శ్లో. హయమేధశతసహస్రాణ్యథ కురుతే బ్రహ్మఘాతలక్షాణి,
పరమార్థవిన్న పుణ్యైర్నచ పాపైః స్పృశ్యతే విమలః. అని.

తా. పరమార్థమైన పరబ్రహ్మతత్త్వమును నిశ్చయముగా తెలిసిన పురుషుఁడు అవిద్యాగ్రంథి నశించి నిర్మలుఁడై యున్నందున కోటిఅశ్వమేధయాగములను చేసినను, వాటియొక్క పుణ్యములతో సంబంధము నొందఁడు. లక్ష బ్రహ్మహత్యములను చేసినను, వాటియొక్క పాపములతో సంబంధము నొందఁడు. అనఁగా తత్త్వజ్ఞానముచేత నీమహామహునకుఁ గలిగిన విదేహకైవల్యమున కెట్టి పుణ్యపాపములచేతనైన లోపము కలుగదని భావము.

కనుక ఇంకను విశేషముగా చెప్ప నక్కఱలేదు; బ్రహ్మవేత్తలగు యాజ్ఞవల్క్యాదిమహామునులకు కూడ మలినవాసన లనువర్తించియుండనే యున్నవి.

భగీరథుఁడును బ్రహ్మస్వరూపమును బాగుగా తెలుసుకొనికూడ రాజ్యమును పరిపాలింపుచుండి వెనుకచెప్పిన మలినవాసనలచేత చిత్తమునకు విశ్రాంతి లేనందున రాజ్యాదుల నన్నిఁటినివదలిపెట్టి విద్వత్సన్యాసము నవలంబించి చిత్తవిశ్రాంతినొందెనని శ్రీ వసిష్ఠమహామునిచేఁ జెప్పఁబడినది.

కనుక తనయందు కలిగియున్న మలినవాసనలను నెద టివారిదోషములను వలె చక్కఁగా పరీక్షించి వాటిని నివ _ర్తింపఁజేయుటకు తగిన శుభవాసనల నభ్యసింపవలయును.

ఈయభిప్రాయముతో నొకస్మృతియందు చెప్పినది.

శ్లో. యథాసునిపుణః సమ్య క్పరదోషేక్షణే రతః,
తథా చేన్నిపుణః స్వేషు కోన ముచ్యేత బంధనాత్. అని.

తా. ఎవఁడు ఎదటివారియొక్క దోషములను విచా రించుటయం దెంతనైపుణ్యము గలవాఁడై యుండునో అంత నైపుణ్యము తనదోషములను వివరించువిషయమై యుండెనా, అట్టిపురుషుఁడు ముక్తుఁడు కావడమునకు సంశయము లేదని యర్థము.

ప్రశ్న:—అయితే మొదట విద్యామదమునకు నివృ _త్తి యేలాగున కలుగును?

ప్రతివచనము.—విద్యామదము రెండుప్రకారములు; ఒకటి తనయందుండి యన్యవిషయముగాఁ బ్రవర్తించునది. అనఁ గా నేనే మహాపండితుఁడను. ఇతరులందఱు నాకంటె తక్కువ గానుండువారను యభిమానము. రెండవది అన్యులయం దుండి తనవిషయముగాఁ బ్రవ _ర్తించునది. అనఁగా ఇతరులు తాము గొప్పవిద్వాంసుల మని తలఁచి తనను నిర్లక్ష్యముగా చూచి గౌరవింపకపోవుట. ఇందులో మొదటిదానికి నెచ్చట నైనా మనపాండిత్యమునకు పరాజయము కలుగనే కలుగు నను నిరంతరానుసంధానముచేత నివృ _త్తి కలుగును. శ్వేత కేతువను నొకఋషికుమారుఁడు తండ్రియొద్దనే సమ _స్త విద్య

లను నేర్చి గొప్పవైదుష్యము కలవాఁడనైతి నని గర్వించి ప్రవాహణుఁ డనునొక బ్రహ్మాపేత్త యగు రాజునొద్దకుఁబోయి వాదింప నారంభింపఁగా నారాజు పంచాగ్నివిద్యను గూర్చి ప్రశ్నలను జేయఁగా; అందుకుఁ బ్రత్యుత్తరము జెప్పఁజాలక నిరుత్తరుఁడై యుండెను. అంతట నాప్రవాహణుఁ డను రాజు ఈ శ్వేతకేతువును జూచి ఇంతేనా నీపాండిత్యము? అన్ని తెలుసునని చెప్పితివే యని అనేకవిధముల నిరాకరించగా తిరిగి తండ్రియొద్దకు వచ్చి తనకుఁగలిగిన పరిభవమును విన్నవించెను. అంతట శ్వేతకేతువుయొక్క తండ్రి విద్యామదము లేనివాఁడు గనుక నాప్రవాహణుఁ డను రాజునొద్దకుఁ బోయి శిష్యవృత్తి నవలంబించి యాపంచాగ్ని విద్యను లభించెను. ఇదిగాక బాలాకి యను నొకబ్రాహ్మణుఁడు నిండు విద్యాగర్వము కలవాఁడై యనేకదేశముల యందుండు పండితులను వాదములో పరిభవించుచు సంచరించి, ఒకసమయములో కాశీరాజయిన అజాతశత్రునితో వాదించి పరిభవము నొంది యాయజాతశత్రునిచే తిరస్కరింపఁబడి, ఆరాజునకే శిష్యభావము నొంది బ్రహ్మవిద్యను లభించెను. ఉషస్తికహోళప్రభృతిబ్రాహ్మణులు నిండు విద్యామదముతో నుండి జనకసభలో యాజ్ఞవల్క్యునితో వాదించి పరిభవము నొందిరి కనుక నెంతపండితుఁడైనా తనకంటె గొప్పవానివల్ల నెప్పటికైనా పరిభవము నొందును. ఈప్రకారముగా నాలోచించుటచేత తనయొక్క విద్యామదము నివర్తించును.

రెండవది అన్యునియందుండి తనవిషయముగాఁ బ్రవర్తించునది. ఇది అన్యుఁడగుపండితుఁడు నన్ను నిందించినా,

అవమానపఱచినా, నాకు నేమి హాని లేదని యనుసంధించుట చేత నివర్తించును.

కనుకనే యీ యనుసంధానప్రకారము విశదముగా మహర్షులచే చెప్పఁబడినది.

శ్లో. ఆత్మానం యది నిందంతి స్వాత్మానం స్వయమేవ హి,
శరీరం యది నిందన్తి సహాయాస్తే జనా మమ. అని.

తా. నన్ను నిందించుజనులు ఆత్మను నిందించుచున్నారా? లేక ఈశరీరమును నిందించుచున్నారా? ఆత్మను నిందించిరో, వారిని వారే నిందించుచున్నందున నే నావిషయమై ఖేదమును పొందవలసినపని లేదు. అనఁగా ఒకయాత్మయే సర్వశరీరములయందు నున్నందున, ఆత్మను నిందించువాఁడు తనను తానే నిందించుకొనువాఁడు కనుక నానిందకు నివిషయమై నేను ఖేదమును పొందఁ బని లేదని భావము. ఇఁకను శరీరమును నిందించిరో ఈశరీరము నాకు విరోధియగుటవలన దీనిని నిందించుట నాకు ఆవశ్యకమయ్యే యున్నది. కనుక నీశరీరమును నిందించువారు నాకు సహాయభూతులుగానే యున్నారు. ఇట్టి సహాయభూతు లగువారిని గూర్చి నేనేల యాగ్రహపడవలయునని యర్థము. మఱియొక స్మృతియందుఁ జెప్పియున్నది.

శ్లో. నిందావమానా వత్యంతం భూషణం యస్య యోగినః,
ధీవిక్షేపః కథం తస్య వాచాటైః క్రియతా మిహ. అని.

తా. బ్రహ్మవేత్తయగు నెవనికి నిందగాని అవమానముగాని అలంకారముగా సంతోషకరమైయుండునో అట్టిపురుషునకు బహుప్రలాపముగలవారిచేత నేలాగున చిత్తవిక్షే

పము కలుగఁజేయఁబడును. అనఁగా నిందావమానములచేతనే చిత్తవికారము కలుగనివానికి మఱియేవిధముచేతను చిత్తము విక్షోభము నొందదని భావము.

నైష్కర్మ్యసిద్ధియందు చెప్పియున్నది.—

శ్లో. సపదికరేఽవస్పృష్టే దోషతశ్చావధారితే,
యది దోషం వదేత్తస్మై కింతత్రోచ్చరితుర్భవేత్.

తా. కరచరణాద్యవయవములతోఁ గూడిన యీశరీరము అనేక దోషదుష్టమని విచారముచేత నిశ్చయింపఁబడియున్నది. ఇట్టి నిశ్చితదోషములుకల ఈశరీరమునందు నెవ్వరైనా దోషములను చెప్పిన, వారియం దేమినేరము కలదు? ఉన్నవాటిని ఉన్నట్టుచెప్పువాఁడు యథార్థవాది గనుక వానియం దొకనేరమును తలఁపఁగూడదని భావము.

శ్లో. యద్వత్ స్థూలే తథా సూక్ష్మే దేహే త్యక్తే వివేకతః,
యది దోషం వదేత్తాభ్యాం కిం తత్ర విదుషో భవేత్.

తా. వివేకముచేత స్థూలదేహమందాత్మాభిమానమునువిడిచినట్టు సూక్ష్మదేహమందుఁగూడ ఆత్మాభిమానమును విడిచినట్టయిన, ఆదేహములు రెంటియం దెవ్వరైన దోషములను చెప్పితే, జ్ఞానియగువానికి నేమి లోపము కలుగును? అనఁగా తాను స్వయముగానే విడిచిన దేహములయందు అన్యులు దోషములను చెప్పితే తా నాగ్రహింపవలసినపని లేదని భావము.

శ్లో. శోకహర్ష భయక్రోధలోభమోహాస్పృహాదయః,
అహంకారస్య దృశ్యంతే జన్మమృత్యూచనాత్మనః. అని.

తా. శోకము, సంతోషము, భయము, కోపము, లోభము, మోహము, ఇచ్ఛ, ఉత్పత్తి, మరణము ఇవి యన్నియు నంతఃకరణమునకే కలిగియున్నవి గాని కేవలచిద్రూపుఁడై సర్వవికారశూన్యుఁడైన యాత్మకు లేవని యర్థము.

అన్యులచే చేయఁబడు నింద కూడ తత్త్వజ్ఞానికి అలంకారముగా నుండునని జ్ఞానాంకుశమను గ్రంథమందు చెప్పియున్నది.

శ్లో. మన్నిందయా యది జనః పరితోషమేతి
నన్వప్రయత్నజనితోఽయమనుగ్రహో మే,
శ్రేయోర్థినో హి పురుషాః పరతుష్టిహేతోః
దుఃఖార్జితాన్యపి ధనాని పరిత్యజంతి.

తా. ఈలోకములో నెవ్వరైన నొకమనుష్యుఁడు నన్ను నిందించుటచేత సంతోషమును పొందెడుపక్షమునకు, అది నాకు ప్రయత్నములేకయే సిద్ధించిన అనుగ్రహమనియే తలఁచెదను. పుణ్యమును అపేక్షించుజనులు లోకమునందుండు జనులకు సంతోషమును కలుగఁజేసిన తమకు శ్రేయస్సు కలుగునేని తాము కష్టపడి సంపాదించిన సొమ్మును ఖర్చుచేసి అన్నసత్రములను చలివెంద్రలను వేయించుదురు; చెరువులను బావులను త్రవ్వించుదురు. కనుక నేను సొమ్మును ఖర్చు చేయకపోయినా యేవిధమైన ఉపకారమును జనులకు చేయకపోయినా నన్ను నిందించి నావలన సంతోషమును పొందుచున్నారు. ఇదియే నాకు మహాశ్రేయస్సు. అన్నసత్రాదులను వేసినవారికి వచ్చినఫలమును నాకును రాఁగలదని భావము.

శ్లో. సతతసులభదైన్యే నిస్సుఖే జీవలోకే
యది మమ పరివాదాత్ ప్రీతి మాప్నోతి కశ్చిత్,
పరివదతు యథేష్టం మత్సమక్షం తిరో వా
జగతి హి బహుదుఃఖే దుర్లభః ప్రీతియోగః. అని.

తా. ఈ ప్రపంచము సర్వదా దుఃఖములనే పొందు స్వభావముకలది; లేశమైనా సుఖము సంభవించుట చాలా అరుదుగా నుండును; ఇట్టి ప్రపంచమునందు నన్ను దూషించుటచేత నెవఁడైన నొకమనుష్యుఁడు సంతోషమును సుఖమును పొందునట్టులయిన, ఆమనుష్యుఁడు నాయెదుటఁగాని నామరుగునఁగాని యథేచ్ఛగా తనకిష్టమైనంతసేపు నన్ను దూషించవచ్చును. నాకు నేమియు సంకోచము లేదు; ఎప్పుడును దుఃఖముల ననుభవింపఁజేయు నీలోకమునందు కొంచెమునైనా, ఈ మనుష్యుఁడు నన్ను నిందించి ప్రీతిని బొందుట నాకు మిక్కిలి సమ్మతము అని అర్థము.

అవమానము కూడ బ్రహ్మవేత్తకు భూషణమే యని స్మరింపఁబడుచున్నది.

శ్లో. తథాచరేత వై యోగీ సతాం ధర్మ మదూషయన్,
జనా యథావమన్యేరన్ గచ్ఛేయు ర్నైవ సంగతిమ్. అని.

తా. బ్రహ్మతత్త్వజ్ఞానము కలపురుషుఁడు సత్పురుషుల యొక్క ధర్మమును దూషించకుండ అనఁగా అకార్యములను చేయకుండనుండి లోకమునం దుండు జనులు తనను అవమానించి తనతో నేప్రకారము కలియకయుందురో నాప్రకారము సంచరించవలయును.

స్వనిష్ఠ పరనిష్ఠములగు విద్యామదము లేప్రకారము చేత నిరసింపఁదగియున్నవో, ఆప్రకారమే ధనమదక్రోధములు వివేకము చేతనే నిరసింపఁదగినవి.

శ్లో. అర్థానా మార్జనే దుఃఖ మార్జితానాం చ రక్షణే,
నాశే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థాన్ క్లేశకారిణః.

తా. ద్రవ్యమును సంపాదించుట మహాదుఃఖకరమైయున్నది. సంపాదింపఁబడినతరువాత దీనిని రక్షించుట అంతకంటె బహుదుఃఖకరము. ఈద్రవ్యము దొంగలు మొదలైన వారి చేత నెత్తుకపోఁబడి నశించినా దుఃఖమే? వివాహాదికార్యములకు ఖర్చుపడినా దుఃఖమే? కనుక నెప్పటికిని దుఃఖకరములగు నీద్రవ్యముల నపేక్షించుట చాల నింద్యమైయున్నది.

ఇది ధనమందుండు తృష్ణను నిరసించు వివేకము.

ఇఁకను క్రోధమును నిరసించువివేకమును చూపెదము.

క్రోధము రెండువిధములు.—తనయందుండి ఎదటివారిని బాధించునది; ఎదటివారియందుండి తనను బాధించునది.

ఇందులో మొదటిదానికి నివర్తకమగు వివేక మీప్రకారము చెప్పఁబడినది.

శ్లో. అపకారిణి కోపశ్చే త్కోపే కోపః కథం న తే,
ధర్మార్థకామమోక్షాణాం ప్రసహ్య పరిపంథిని.

తా. ఓమిత్రుఁడా! నీకు అపకారము చేసినవానివిషయమై నీవు కోపము చేయుచున్నావే; కోపమువిషయమై నీవు ఎందుకు కోపము చేయవు? ఈకోపమనునది నీకు ధర్మార్థకామమోక్షములను పురుషార్థముల నన్నిఁటిని చెఱిపివేయు

చున్నది. కనుక నీకోపమే నీకు మహోపకారము చేయు చున్నది. దీనియందు కోపమును చేయుము.

శ్లో. బలాదితో ధర్మ్యయశోర్థనాశనః
సచేవపార్థ స్స్వశరీరతాపనః,
నచేహ నాముత్ర హితాయ యస్సతాం
మనాంసి కోప స్సముపాశ్రయే త్త్యజేత్. అని.

తా. కోపమనునది ఈలోకమునందు ధర్మమును, కీర్తిని ద్రవ్యమును వీటినన్నిఁటిని నశింపఁజేయుచున్నది. తనశరీరమును కూడ నిప్పులో వేసి కాల్చినట్లు బాధించుచున్నది. ఈలోకము నందుఁగాని పరలోకమునందుఁగాని వీనికి క్షేమమును కలుగఁ జేయునది కాదు. ఇట్టికోపము సజ్జనులయొక్క మనస్సునం దేప్రకారము నిలుచును.

అన్యులయందుండి తనవిషయముగాఁ బ్రవర్తించు రెండవకోపమును నివర్తింపఁజేయు వివేక మీవిధముగా నిరూపింపఁబడినది.

శ్లో. నమోఽస్తు కోపదేవాయ స్వాశ్రయజ్వాలినే భృశం,
కోప్యస్య మమ వైరాగ్యదాయినే దోషబోధినే.

తా. కోపము అగ్నివలెనే తాను ఏపురుషుని నాశ్రయించియుండునో యాపురుషుని మండింపఁజేయుచున్నది. ఎదటివానియందుండి నాయందు ప్రసరించి నాయందుండుదోషములను నాకుఁదెలిపి నాకు వైరాగ్యమును కలుగఁజేయుచున్నది. కనుక కోపమను అగ్నిదేవుఁడు నాకు మహోపకారిగా నున్నాఁడు. ఇతనికి నేను నమస్కరించుచున్నాను. అనఁ

గా; యజ్ఞదత్తుఁ డనువానికి దేవదత్తుఁ డనువానియందు కోపము కలుగుచున్నది. దేవదత్తునియందు కొన్ని దోషములుంటేగాని యజ్ఞదత్తునికి వీనివిషయమై కోపము కలుగదు. దేవదత్తుఁడు బుద్ధిమంతుఁడై యోజించినయెడల తనయందుండు దోషములు తనకుఁదెలియును. ఈదోషములు నాయందుండుటచేత యజ్ఞదత్తునికి నాయందు కోపము కలిగినదని తెలుసుకొని అటుమీఁదట అట్టిదోషములు తనయందు లేకుండ నుండులాగున దేవదత్తుఁడు ప్రయత్నముచేయును. ఇదిగాక యజ్ఞదత్తునియొక్క శరీరమందు వణఁకు, చెమట, పండ్లు కొఱుకుట మొదలైన సంకటములను కలుగఁజేయుచుండఁగా చూచి యీకోపము యజ్ఞదత్తుని చాల బాధించుచున్నదియని తెలుసుకొని యిట్టిస్వాశ్రయమును బాధించుకోపమును మనము ఎన్నఁటికి పొందఁగూడదని నిశ్చయించుకొని యుండును. కనుక అన్యనిష్ఠమై తనయందుఁ బ్రవర్తించు కోపము బుద్ధిమంతుఁడైనవానికి స్వదోషములను తెలియచేసి వైరాగ్యమును కలుగఁజేయును. కాఁబట్టి అన్యనిష్ఠమైన కోపము నాకు ఉపకారకమే కాని అపకారకము గాదని చింతింపవలయు నని భావము.

శ్లో. న మే ఽపరాధః కిమకారణే నృణాం
మదభ్యసూయేత్యపి నైవ చింతయేత్,
నయత్కృతాప్రాగ్భవబంధనిస్సృతి
స్తతో ఽపరాధః పరమోను చింత్యతామ్. అని.

తా. నేను ఏమియు తప్పును చేయలేదే? ఈమనుష్యులకు నాయందు నిష్కారణముగా కోపము ఎందుకు రావలయు

నని ఆలోచింపదగదు. పూర్వజన్మమందు నేను ఈసంసారబంధము నివర్తించు సదుపాయమును చేసుకొనకపోవుటయే అపరాధము. అట్టి మహాపరాధమును నేను చేసియున్నందున, వీరికందఱికి నాయందు కోపము కలిగినది గాని నిష్కారణముగా కలుగలేదని చింతింపవలయును.

ఇట్టివివేకముచేత కోపము సమూలముగా నివర్తించును.

ధనాభిలాష క్రోధములను వలెనే స్త్రీలయందు పుత్రులయందుండు ఆశనుగూడ వివేకముచేత నశింపజేయవలయును.

ఇందులో స్త్రీవిషయమైన యభిలాషను నివర్తింపఁజేయువివేకమును గూర్చి వాసిష్ఠరామాయణములో చెప్పియున్నారు

శ్లో. మాంసపాంచాలికాయాస్తు యంత్రలోలేంగపంజరే,
స్నాయ్వస్థిగ్రంథిశాలిన్యాః స్త్రియాః కి మివశోభనమ్.

తా. నరములు, ఎముకలు వీనియొక్క గ్రంథులుగల స్త్రీయనుమాంసపుబొమ్మయొక్క యంత్రముచేత చలించు శరీరపంజరమందు ఏమి మంచి కలదు! దీనిని చూచి యేలమోహించెదరు ?

శ్లో. త్వక్ మాంస రక్త బాష్పాంబు పృథక్ కృత్వా విలోచనే,
సమాలోకయ రమ్యంచే త్కిం ముధా పరిముహ్యసి.

తా. ఓరి మూర్ఖుఁడా! స్త్రీలయొక్క నేత్రములను జూచి అతి వ్యామోహమును పొందుచున్నావు; ఈనేత్రములయొక్కస్వరూపము నాలోచింపుము; ఈనేత్రములు చర్మము, మాంసము, రక్తము, నీరు వీనియొక్క సంయో

గముచేత నేర్పడినవి; ఈవస్తువులను ప్రత్యేకముగా నాలోచించితే యేమైనామంచి యున్నాదా? అంతయు నసహ్యాముగానే యుండును. కనుక స్త్రీలయొక్క నేత్రములను చూచి వ్యర్థముగా వ్యామోహాము పొందకుము.

శ్లో. మేరు శృంగతటోల్లాసి గంగాజలరయోపమా,
దృష్టా యస్మిన్ స్తనేముక్తాహారోల్లాసశాలితా.
శ్మశానేషుదిగంతేషు స ఏవలలనా స్తనః,
శ్వభిరాస్వాద్యతే కాలేలఘుపిండఇవాంధసః.

తా. మేరుపర్వతముయొక్క శిఖరమందు ఆకాశగంగా ప్రవాహాము ఏప్రకారము ప్రకాశించుచుండునో యాప్రకారమే స్త్రీలయొక్క స్తనమండలమందు ముత్యాలహారము ప్రకాశించుచున్న దని చూచి నిందు ఆనందమును బొందుచున్నావు. ఈస్త్రీస్తనమే చివరకు శ్మశానములోఁబడి అన్నపుముద్దవలె కుక్కలచేత కవిసి కవిసి భక్షింపఁబడును. ఇట్టి పర్యవసానస్థితిని ఆలోచింపఁగా స్త్రీస్తనమందు ఏమి రమ్యత యున్నదో తెలియవలయును.

శ్లో. కేశకజ్జలధారిణ్యో దుస్పర్శాలోచనప్రియాః,
దుష్కృతాగ్ని శిఖానార్యో దహంతి తృణవన్నరం.

తా. జనులయొక్క పాపములచేత సంపాదింపఁబడిన దీపజ్వాలలే స్త్రీలు. దీపములకు నల్లనికొడియున్నట్టు లీస్త్రీలకు నల్లనితలవెంట్రుకలు కలవు. దీపములు ముట్టుకొంటే కాల్చును. స్త్రీలు ముట్టుకొంటే అంటుకొనివచ్చి యావజ్జీవము బాధించు

చుందురు. సామాన్యముగా నాచూచునప్పుడు వీరు దీపముల వలెనే సొగసుగా కనుపడుచుందురు. తమతో సంబంధించిన మనుష్యులను దీపములు గడ్డిపోచలను దహించినట్లు దహించుచుందురు.

శ్లో. జ్వలతా మతి దూరేపి సరసా అపి నీరసాః,
స్త్రియోహి నరకాగ్ని నామింధనంచారుదారుణమ్.

తా. అతిదూరమందనఁగా యమలోకమునందు మండుచుండునరకము లను నగ్నులకు స్త్రీ లను పదార్థములు ఆర్ద్రములుగా నున్నప్పటికి నెండిపోయిన మంచికట్టె లని నెంచఁదగియున్నవి. అనఁగా నరకాగ్నులను ప్రజ్వలింపఁజేయుటకు స్త్రీలు మంచి యెండుకట్టెలవంటివా రని భావము.

శ్లో. కామనామ్నా కిరాతేన వికీర్ణా ముగ్ధచేతసాం,
నార్యో నరవిహంగానా మంగబంధనవాగురాః.

తా. మన్మథుఁ డను కిరాతునిచేత తెలివిలేని మనుష్యులనుపక్షులను పట్టుటకుగాను స్త్రీలను వలలు అంతట వ్యాపింపఁబడినవి. అనఁగా స్త్రీలయందాసక్తికలవారు వలలో చిక్కిన పక్షులవలె నిండుగ బాధపడి స్వరూపమును నశింపఁజేసుకొందురు. కనుక నెంతమాత్రము స్త్రీలయం దాసక్తిని బొందఁగూడ దని భావము.

శ్లో. జన్మపల్వలమత్స్యానాం చిత్తకర్దమచారిణాం,
పుంసాం దురాసనారజ్జుర్నారీ బడిశపిండికా.

తా. పురుషు లనువారు సంసారమనుస్వల్పమగు జలము గలమడుగులో నుండుమత్స్యములు. విశేషముగా మనస్సు అనుబురదలోనే తిరుగుచుందురు. ఇట్టి పురుషమ

త్స్యములకు స్త్రీలు దుర్వాసన యను త్రాటియందు కట్టిన ఆశ యను గాలముయొక్క చివర నంటింపఁబడిన మాంసశకలము వంటివారు గనుక మత్స్యములు గాలముయొక్క చివరనుండు మాంసశకలమును బట్టుకొని యేలాగున మృతినొందునో యాప్రకారముగా నీ పురుషులు దుర్వాసనచేత స్త్రీల నంగీకరించి స్వరూపహాని నొందెద రనిభావము.

శ్లో. సర్వేషాం దోష రత్నానాం సుసముద్గిక యానయా,
దుఃఖశృంఖలయానిత్య మలమస్తు మమ స్త్రియా,

తా. రత్నములను భరణివలెనే సమస్తదోషములకు నిధానమగు స్త్రీలు దుఃఖజనకములయిన కాలిసంకెలలవంటివారు. ఇట్టి స్త్రీలతో సంబంధము చాలును. ఇఁక వీరితో సంబంధము చేయఁ గూడదు.

శ్లో. ఇతో మాంస మితో రక్త మితోఽస్థీని వాసరైః,
బ్రహ్మన్ కతిపయైరేవ యాతి స్త్రీ విషచారుతామ్.

తా. ఇచ్చట రక్త మున్నవి. ఇచ్చట మాంస మున్నవి. ఇచ్చట నెముక లున్నవి. అని యీప్రకారము విచారింపఁగా కొన్నిదినములలోనే స్త్రీశరీరము విషమువలె భయమును గలుగఁజేయును.

శ్లో. యస్య స్త్రీ తస్య భోగేచ్ఛానిస్త్రీకస్య క్వ భోగభూః,
స్త్రియం త్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వా సుఖీభవేత్. అని.

తా. ఎవనికి స్త్రీ కలవో వానికి భోగమునం దభిలాష యుండును. స్త్రీలేనివానికి భోగవాంఛ యుండ నేరదు. స్త్రీని

విడిచినపక్షమునకు ప్రపంచమునంతను విడిచినవాఁడవుదు. ప్రపంచమును విడువఁగానే మోక్షసుఖమును బొందుదు.

ఇఁకను పుత్రవిషయమైన యభిలాషను నివర్తింపఁజేయు వివేకము బ్రహ్మానందమను గ్రంథమునందు శ్రీ భారతీతీర్థస్వాములవారిచేఁ జెప్పఁబడినది.

శ్లో. అలభ్యమానస్తనయః పితరౌ క్లేశయేచ్చిరం,
లబ్ధోఽపి గర్భపాతేన ప్రసవేన చ బాధతే.

తా. పుత్త్రుఁడు పుట్టనికాలమందు తలిదండ్రులకు పుత్త్రుఁడొకఁడైనా లేకపోయెనని చాలదుఃఖమును పొందించుచుండును. గర్భమందు ప్రవేశించినపిమ్మట పూర్తిగా తొమ్మిది నెలలవరకు గర్భములో నుండక మధ్యకాలమందే క్రిందఁబడిపోవుటచేత నిండు దుఃఖ పెట్టును. ఒకవేళ తొమ్మిది నెలలు గర్భములోనుండినా ప్రసవకాలమందు మహాదుఃఖమును తలిదండ్రులకుఁ గలుగఁజేయును

శ్లో. జాతస్య గ్రహరోగాదిః కుమారస్య చ మూర్ఖతా,
ఉపనీతేఽప్యవిద్యత్వ మనుద్వాహశ్చ పండితే.

తా. పుట్టినతరువాత గ్రహములచేతను రోగములచేతను తాను బాధింపఁబడుచు దలిదండ్రులను బాధించును. అయిదారు సంవత్సరముల యీడువాఁడైనపిమ్మట చెప్పినమాట వినక మూర్ఖుఁడుగా నుండెనా, తలిదండ్రులకు నుండు దుఃఖము చెప్పి తీరదు ఉపనయనమును చేసినపిమ్మట చదువుకోక తిరుగుచుండెనా అపరిమితదుఃఖముగానుండును; చదువుకొని పండితుఁడైన

పిమ్మట వానికి వివాహము కాకపోయినచో తలిదండ్రులకునుండు దుఃఖమునకు మితియే యుండదు.

శ్లో. యూనశ్చ పరదారాదిదారిద్ర్యం చ కుటుంబినః,
పిత్రోర్దుఃఖస్య నాస్త్యంతోధనీ చేన్మ్రియతే తదా. అని.

తన పుత్రుఁడు మంచివయస్సులో నుండుకాలమందు పరస్త్రీసంగమాదిదుష్కార్యములయందు ప్రవర్తించుచుండెనా తల్లికి దండ్రికి కలిగియుండు భయదుఃఖముల కవధియే యుండనేరదు; దైవవశముచే నిట్టిదుర్వ్యసనములు లేక స్వభార్యతోనే కలిసియుండి సంతానమును బడసి కుటుంబిగా నుండెనా వానికి కుటుంబరక్షణకొఱకుఁదగిన ద్రవ్యము లేక యుండును; అప్పుడు తలిదండ్రులు "అయ్యో! వీఁడు పిల్లలు గలవాఁడే సొమ్ములేక పోయెనే. ఈపిల్లలను ఏప్రకారముపోషించుకోఁగలఁ"డని నిరంతరము కన్నీరును విడుచుచుందురు; అదృష్టవిశేషముచేతకుటుంబిగా నుండి ద్రవ్యము కూడ నుండెనో, అప్పుడు వాఁడు ఆయుష్యము లేక త్వరలో చచ్చిపోవును. అప్పుడు తల్లిదండ్రుల యొక్కదుఃఖము అపారమై అవాఙ్మానసగోచరమై యుండును. గనుక పుత్రులవిషయమై తల్లిదండ్రులకు కలదుఃఖమున కెప్పటికి విచ్ఛేదము కనుపడదు.

ఇట్టివివేకాభ్యాసముచేత స్త్రీలవిషయముగా పుత్రుల విషయముగానుండు నభిలాష క్రమక్రమముగా నివర్తించును.

ఏప్రకారము మలినవాసన లగు విద్యామదధనమదములకు కామక్రోధములకు స్త్రీపుత్రవిషయాభిలాషలకు వెనుకచెప్పిన వివేకముల నభ్యసించుటచేత ప్రతికారమును చేయుదురో

యీప్రకారమే యితరములైయున్న మలినవాసనలను కూడ శాస్త్రములచేతను స్వయుక్తిచేతను ప్రతికారముల నాలోచించి నివర్తింపఁజేసుకొనవలయును. తనయందుండు సర్వమలినవాసనలకీప్రకారము ప్రతికారమును జేయఁగా జీవన్ముక్తియను పరమపదము పొందఁబడును.

ఈ యర్థము వసిష్ఠమహామునిచే చెప్పఁబడినది.

శ్లో. వాసనాసంపరిత్యాగే యది యత్నం కరోష్యలం,
తాస్తే శిథిలతాం యాంతి సర్వాధివ్యాధయః క్షణాత్.

తా. ఓ రామా! మలినవాసనలను నివర్తింపఁజేయుట యందు విశేషముగాఁ బ్రయత్నమును జేసితివా, నీమనస్సునందునుండు తాపత్రయము లన్నియును నిమిషములో నశించిపోఁ గలవు.

శ్లో. పౌరుషేణ ప్రయత్నేన బలాత్సంత్యజ్య వాసనాః,
స్థితిం బధ్నాసి చేత్తర్హి పదమాసాదయస్యలం. అని.

తా. పురుషసాధ్యమైన ప్రయత్నముచేత మలినవాసనల నన్నిటిని బలాత్కారముగా వెడలఁదఱిమి స్థిరముగా నుంటివో, జీవన్ముక్తియనుపరమపదమును పొందఁగలవు.

ఆక్షేపము.—ఓయీ యిచ్చట పురుషప్రయత్న మని చెప్పినది వెనుక చెప్పినధనదారాది విషయదోషములయొక్క పరిశీలన మనువివేకమే కదా! ఈవివేకము మాటిమాటికి చేయఁబడినప్పటికి బలవంతములగు నింద్రియవ్యాపారములచేత నాచ్ఛాదింపఁబడి కార్యకారి గాక యుండును.

ఈయర్థము భగవద్గీతలలోఁ జెప్పఁబడియున్నది.

శ్లో. యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః,
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః. అని.

తా. వివేకజ్ఞానము గల పురుషుఁడు వివేకమును అభ్యసించుచున్నప్పటికి నింద్రియములు నిండుబలవంతములు గనుక మనస్సును వివేకాభ్యాసములోనుండి తొలగించి తమతమవిషయములయందుఁ జేర్చుచుండును.

శ్లో. ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి. అనియు,

తా. ఇంద్రియములు విషయములయందు సంచరించునప్పుడు మనస్సు కూడ విషయములయందు సంచరించుచుండును. ఇట్టి విషయసంచరణశీలమగు మనస్సు సముద్రజలమందు సంచరించునావను వాయువు హరించినట్లు ఆపురుషునియొక్క వివేకజ్ఞానమును హరించును. కనుక వివేకాభ్యాసము ప్రయోజనకారిగా నుండదు.

సమాధానము.—వివేకము నభ్యసించునప్పుడు ఇంద్రియములు విక్షేపమును కలుగఁజేయుపక్షమునను నింద్రియములను ప్రత్యాహారముచేత నిరోధింపవలయును. ఈప్రకారము నిరోధింపఁబడి ఇంద్రియములు వివేకమును చెఱుపఁజాలవు. ఈఅర్థము శ్రీభగవద్గీతలయందే చెప్పబడినది.

శ్లో. తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః,
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

తా. యోగియగువాఁడు జ్ఞానేంద్రియకర్మేంద్రియముల నన్నిటిని నిరోధించి అనఁగా విషయదేశములయందు చేరనటుల నిర్బంధించి భగవంతుఁడనైన నాయందు భక్తికలవాఁడై యుండవలయును. ఎవనికి నింద్రియములు స్వాధీనములైయుండునో వానికిఁ దత్త్వజ్ఞానము స్థిరముగా నుండును.

శ్లో. తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః,
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. అని.

తా. కనుక నోయర్జునా! యేపురుషున కింద్రియములు విషయములనుండి సర్వప్రకారములచేత నివృత్తములై స్వాధీనములో నుండునో, యాపురుషుఁడేస్థిరమైనతత్త్వజ్ఞానము కలవాఁడై యుండును.

మఱియొకస్మృతియందు కూడ చెప్పఁబడియున్నది.

శ్లో. న పాణిపాదచపలో న నేత్రచపలో యతిః,
న చ వాక్చపలశ్చైవ మితిశిష్టస్య లక్షణమ్. అని

తా. బ్రహ్మవేత్తయగు సన్యాసి యోగభ్రంశకరములైనహస్తచాపల్యము, పాదచాపల్యము, నేత్రచాపల్యము, వాక్చాపల్యము ఇంక నితరేంద్రియచాపల్యములు యివి కలవాఁడై యుండఁదగదు. హస్తచాపల్యాదులు లేక యుండుటయే శిష్టుఁడగు బ్రహ్మవేత్తయొక్క లక్షణము.

ఈస్మృతియందుఁ జెప్పిన హస్తపాదాదిచాపల్యశూన్యత్వమే మరియొకస్మృతిలో ముందుగా సంక్షేపముగా చెప్పఁబడి, తరువాత వ్యాఖ్యానము చేయఁబడియున్నది.

శ్లో. అజిహ్వష్షండకః పంగురంధో బధిర ఏవచ,
ముగ్ధశ్చ ముచ్యతే భిక్షుష్షడ్భిరేతైర్న సంశయః.

తా. బ్రహ్మవేత్తయగు సన్యాసి నాలుక లేనివాఁడుగా, పుంస్త్వము లేనివాఁడుగా, కాళ్లు లేనివాఁడుగా, కండ్లు లేని వాఁడుగా, చెవులు లేనివాఁడుగా, మనస్సు లేనివాఁడుగా నుండెనా? ఈ ఆఱుధర్మములచేత ముక్తినొందును; ఇందుకు సంశయము లేదు.

ఇది సంగ్రహశ్లోకము. ఇందులో నాలుక లేనివాఁడని వాక్చాపల్యము. పుంస్త్వము లేనివాఁడని ఇతరకర్మేంద్రియ చాపల్యము, కాళ్లు లేనివాఁడని పాదచాపల్యము, కండ్లు లేనివాఁడని నేత్రచాపల్యము, చెవులు లేనివాఁడని శ్రోత్రేంద్రియచాపల్యము, మనస్సు లేనివ్వాఁడని మనశ్చాపల్యము నివారింపఁబడినవి. కాళ్లు లేనివాఁడని చెప్పుటచేతనే హస్తచాపల్యము గూడ నివారింపఁబడినది.

సన్యాసికి నుండఁదగిన నీయాఱుధర్మములు ఎటువంటివని యాకాంక్ష రాఁగా వివరింపఁబడినవి.

శ్లో. ఇదమిష్టమిదం నేతి యోఽశ్నన్నపి న సజ్జతే,
హితం సత్యం మితం వక్తి తమజిహ్వం ప్రచక్షతే.

తా. భోజనము చేయునప్పు డిది యిష్టము. ఇది అయిష్టము. ఇది రుచిగానున్నది. ఇదిరుచిగా నుండ లేదని యెవ్వఁడు సక్తుఁడు కాఁడో భూతములకు హితమై యథార్థమైన వాక్యమును కొలఁదిగాచెప్పునో యాసన్యాసి యజిహ్వుఁడని అనఁగా నాలుక లేనివాఁడని చెప్పఁబడును.

శ్లో, అద్య జాతాం యథా నారీం తథా షోడశవార్షికీం,
శతవర్షాం చ యో దృష్ట్వా నిర్వికారస్స షండకః.

తా. ఎవ్వఁ డీదినమందుఁ బుట్టినస్త్రీవ్యక్తిని నూఱుసంవత్సరములు గల స్త్రీవ్యక్తిని చూచినప్పు డేప్రకారముగా చిత్తవికారము లేనివాఁడై యుండునో యాప్రకారమే పదునాఱు సంవత్సరములువయస్సుగల స్త్రీవ్యక్తిని చూచినా, నిర్వికారుఁడై యుండెనా, అతఁడు షండుఁడని అనఁగా పుంస్త్వము లేనివాఁడని చెప్పఁబడును.

శ్లో. భిక్షార్థమటనం యస్య విణ్మూత్రకరణాయ చ,
యోజనాన్న పరం యాతి సర్వథా పంగు రేవ సః.

తా. ఎవ్వఁడు భిక్షాకాలమందు మాత్రము నడచుచుండునో, మూత్రపురీషోత్సర్గములను బాహ్యదేశమునకు నడుచుచుండునో, గ్రామాంతరమునకు వెళ్లవలసియుండెనా ఆమడదూరమునకు పైఁగా నడువఁడో, అతఁడు పంగువని, అనగా కాళ్లు లేనివాఁడని చెప్పఁబడును.

శ్లో. తిష్ఠతో వ్రజతో వాపి యస్య చక్షుర్న దూరగం,
చతుర్యుగాం భువం ముక్త్వా పరివ్రాట్ సోఽంధ ఉచ్యతే.

తా. సిలిచినప్పుడు గాని పోవునప్పుడుగాని ముందర నుండునాలుగుబారలపొడవు గల భూమిని విడిచి పైఁగా నెవని యొక్క నేత్రములు ప్రసరించవో యాసన్యాసి యంధుఁడని అనఁగా కన్నులు లేని వాఁడని చెప్పఁబడును.

శ్లో. హితం మితం మనోరామం వచశ్శోకాపహం చ యత్,
శ్రుత్వా యో న శృణోతీవ బధిరస్స ప్రకీర్తితః.

తా. ఉత్తరకాలమందు శుభమును గలుగఁజేయునదియుఁ దత్కాలమందుండు శోకమును నివర్తింపఁజేయునట్టి వాక్యములనువినికూడ నెవ్వఁడు విననివానివలె సంచరించునో యట్టిసన్యాసి బధిరుఁడని అనఁగా చెవులులేనివాఁడని (చెవిటివాఁడని) చెప్పఁబడును.

శ్లో. సాన్నిధ్యే విషయాణాం చ సమర్థోఽవికలేంద్రియః,
సుప్తవద్వర్తతే నిత్యం భిక్షుర్ముగ్ధస్స కీర్తితః.

తా. భోగ్యములైన శబ్దాదివిషయములు సన్నిధానమందున్నప్పటికి, తాను శబ్దాదివిషయముల ననుభవించుటకు సమర్థుఁడై యున్నప్పటికి, చక్షుశ్శ్రోత్రాదింద్రియములు లోపములేక యున్నప్పటికినెవ్వఁడు విషయములను తెలుసుకోకనిద్రించువానివలె కనుపడునో, యతఁడు ముగ్ధుఁడని అనఁగా మనస్సులేనివాఁడని (మూర్ఛనొందినవాఁడని) చెప్పఁబడును.

శ్లో. న నిందాం న స్తుతిం కుర్యాన్న కంచిన్మర్మణి స్పృశేత్,
నాతివాదీ భవేత్తద్వత్సర్వత్రైవ సమో భవేత్.

తా. బ్రహ్మవేత్త యగు సన్యాసి అన్యులనుగూర్చి నిందనుగాని స్తోత్రముగాని చేయఁగూడదు. అన్యజనుల యొక్క రహస్యదోషములు తనకు తెలిసియున్నా, వాటిని బయలుపఱచి యెటువంటి మనుష్యునినైనను నొప్పింపఁదగదు. అధికముగా సంభాషింపఁదగదు. తనయందు విరోధముతోఁగాని స్నేహముతోఁగాని వర్తించుజనులందఱియందు సమానమైన చిత్తవృత్తి కలవాఁడై యుండవలయును.

శ్లో. న సంభాషేత్ స్త్రియం కాంచిత్పూర్వదృష్టాం చ న స్మరేత్,
కథాం చ వర్జయేత్తాసాం న పశ్యేల్లిఖితామపి.

తా. బ్రహ్మవేత్త యగు సన్యాసి యెటువంటిస్త్రీతోనైనను సంభాషింపఁదగదు; పూర్వము చూచినస్త్రీని మనస్సులో స్మరింపఁదగదు; స్త్రీలయొక్క సమాచారమును చెప్పఁగూడదు; విశేష మేల! చిత్రమునందు వ్రాయఁబడిన స్త్రీనిఁ గూడ జూడఁగూడదు.

ఈప్రకార మింద్రియముల నిరోధించువానికి వైరాగ్యము దృఢముగా రక్షింపఁబడును.

ఈలోకములో వ్రతము నాచరించుపురుషుఁడు నక్తభోజనమును గాని ఏకవారభోజనమును గాని ఉపవాసమును గాని మౌనమును గాని చేయుదు నని సంకల్పించి సావధానుఁడై చెడిపోకుండ నేప్రకారము పరిపాలించుచుండునో యాప్రకారమే బ్రహ్మవేత్తయగు సన్యాసియు వెనుకఁ జెప్పిన యజిహ్వత్వాదివ్రతముల నవలంబించి వివేకమును చెదరిపోకుండఁ బరిపాలింపవలయును.

ఈప్రకారము పురుషుఁడు శ్రద్ధాభక్తులు గలవాఁడై చిరకాలము మధ్యమధ్య విచ్ఛేదము లేకుండ ఇంద్రియనిరోధవివేకముల నభ్యసింపఁగా మైత్రీముదితాదిశుభవాసనలు దృఢములై యాసురము లగు కామక్రోధాదిమలినవాసనలు క్షయము నొందును; అనంతరము నిశ్వాసోచ్ఛ్వాసములు నేత్రముల యొక్క నిమేషోన్మేషము లేప్రకారము పురుషప్రయత్నము లేకయే ప్రవర్తించుచుండునో యాప్రకారమే మైత్ర్యాదిశుభ

వాసనలు స్వభావముగాఁ బ్రవర్తించుచుండును. ఇట్టిమైత్ర్యాది వాసనలతోఁగూడి లోకములో వ్యవహరించుచున్నప్పటికిని జనులయొక్క సుఖదుఃఖాదిసందర్భములను తనమనస్సులో నాలోచింపక నిద్ర, ప్రమాదము, మనోరాజ్యము మొదలయిన వాటిని ప్రయత్నపూర్వకముగా శమింపఁజేసుకొని చిన్మాత్ర వాసన నభ్యసింపవలయును. చిన్మాత్రవాసన నేలాగున నభ్యసింపవలయునంటే చెప్పెదము — ఈప్రపంచ మంతయు చిద చిద్వస్తువులతోఁ చేరి యేకముగా బ్రకాశించుచున్నది. ఆ! విచారింపఁగా చక్షురాదీంద్రియము లన్నియు శబ్దస్పర్శాదిజడవస్తువులను బ్రకాశింపఁజేయుటకే నిర్మింపఁబడినవి కాని చిద్వస్తువును ప్రకాశింపఁజేయుటకు నిర్మింపఁబడలేదు ఈయర్థము.

శ్రు. పరాంచి ఖాని వ్యతృణత్స్వయంభూస్తస్మాత్పరాఙ్పశ్యతి నాంతరాత్మన్.

అను శ్రుతిచే చెప్పఁబడినది.

తా. బ్రహ్మ యీప్రపంచమును సృష్టించునపుడు చక్షురాదీంద్రియములను ఆత్మభిన్నములగు జడవస్తువులను గ్రహించుటకే నిర్మించెను. కనుక చక్షురాదీంద్రియములచేత నీపురుషుఁడు బాహ్యములగు శబ్దాదిజడవస్తువులనే చూచును. గాని అజడమగు చిద్వస్తువును చూడనేరఁడని శ్రుత్యర్థము.

కనుక జడవస్తువుతో సమానముగా చిద్వస్తువు కూడఁ బ్రకాశించుచున్న దని చెప్పుట కవకాశము లేదు.

స — అయినా, చైతన్యము జడవస్తువుల కన్నిటికి ఉపాదానకారణముగా నున్నందున జడవస్తువులు ప్రకాశించునప్పుడు

వాటికి నుపాదానకారణ మగుచైతన్యముకూడ అవర్జనీయముగాఁ బ్రకాశించుచుండును.

కారణము లేనిది యేవస్తువును పుట్టనేరదు ; కారణ మనునది ఉపాదానకారణ మని నిమిత్తకారణ మని సామాన్యముగా రెండువిధములు. అందులో నేవస్తువు కార్యరూపముగా బ్రకాశించునో యది ఉపాదానకారణమని, ఉపాదానకారణము కార్యరూపముగాఁ బ్రకాశించుటకు సాధనము లగు వస్తువులు నిమిత్తకారణ మని వేదాంతులు చెప్పుచుందురు. ఇందును దృష్టాంతమును చెప్పెదము.—లోకములో ఘటము కార్యము ; దీనికి ఉపాదానకారణము మృత్తిక ; మృత్తికయే కదా ఘటరూపముగాఁ బ్రకాశించును. మృత్తిక ఘటరూపముగాఁ బ్రకాశించుటకు సాధనములు దండచక్రకులాలాదులు ; ఇవియే నిమిత్తకారణము లని చెప్పఁబడును.

ఇట్టియుపాదానకారణము పరిణామి యని వివర్త మని రెండువిధములు. ఇందులో తాను అవస్థాంతరమును బొంది కార్యరూపముగాఁ బ్రకాశించునదిపరిణామ్యుపాదాన కారణ మని, తాను అవస్థాంతరము నొందకయే కార్యరూపముగాఁ బ్రకాశించునది వివర్తోపాదానకారణ మనియుఁ జెప్పఁబడును. ఇందులో మొదటిదానికి దృష్టాంతము మృత్తిక. మృత్తిక యనునది తాను మొదట పిండాకారముగానుండి తరువాత నిమిత్తకారణము లగు దండచక్రకులాలాదులయొక్క వ్యాపారముచేత పృథుబుధ్నోదరాకారమను నవస్థాంతరమును బొంది

కదా ఘటరూపముగాఁ బ్రకాశించును. కనుక మృత్తిక ఘటమునకు పరిణామ్యుపాదానకారణ మని చెప్పఁబడును. రెండవదానికి దృష్టాంతము రజ్జువు. రజ్జువనఁగా త్రాడు. ఇది కనుజీఁకటిలో నుండునప్పుడు సర్పమువలె ప్రకాశించును. అయితే యీరజ్జువు మొదట నేయాకారముతో నుండెనో సర్పముగా బ్రకాశించునప్పుడును నాయాకారముతోనే యుండును గాని ఆకారాంతరము నొందినది లేదు గనుక రజ్జువు సర్పమును గూర్చి వివర్తోపాదాన మని చెప్పఁబడును.

కార్యము లగు ఘటసర్పాదులు ప్రకాశించునప్పుడు ఉపాదానకారణము లగు మృత్తికారజ్జ్వాదులు కూడఁ బ్రకాశించుచుండును గాని ప్రకాశింపక యుండునది లేదు. ఈప్రకారమే యీప్రపంచమునకు చైతన్యమువివర్తోపాదానకారణము. చైతన్యము నిత్యనిర్వికార మైనందున అవస్థాంతరము పొందునది కాదు. అయినను, ఆకాశాదిప్రపంచరూపముగాఁ బ్రకాశించుచుండును. కనుకనే చైతన్యమూ ప్రపంచమునకు వివర్తోపాదానకారణ మని చెప్పఁబడినది. కార్యమగు ప్రపంచము ప్రకాశించునప్పుడు ఉపాదానకారణ మైన చైతన్యము కూడ అవర్జనీయముగాఁ బ్రకాశించుచుండును. ఈ యర్థము.

శ్రు. తమేవ భాంతమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి. అనుశ్రుతిచే చెప్పఁబడినది.

తా. చిన్మాత్రస్వరూపుఁడైన ఈపరమాత్మ ప్రకాశించుచుండఁగా నాప్రకాశమునననుసరించి యీజడమగు ప్రపంచమం

తయు బ్రకాశించుచున్నది. ఏమనఁగా చైతన్యస్వరూపముయొక్క ప్రకాశమే జడస్వరూపమునందుఁ బ్రకాశించుచున్నది గాని జడస్వరూపమునకు మరియొక ప్రకాశము లేదని తాత్పర్యము. ఇదిగాక యీపరమాత్మయొక్క ప్రకాశముచేతనే సూర్యాదు లందఱు ప్రకాశించుచున్నారు గాని సూర్యాదులచేత నీపర మాత్మ ప్రకాశింపఁజేయఁబడుట లేదు అని శ్రుత్యర్థము.

ఈశ్రుతియందు చైతన్యముయొక్క ప్రకాశము ననుస రించి ప్రపంచ మంతయుఁ బ్రకాశించుచున్నది యని చెప్పియు న్నందున జడప్రపంచము ప్రకాశించుటకు ముందుగానే చైతన్యస్వరూపము ప్రకాశించుచున్నది యని నిశ్చయింపఁబడు చున్నది ఇదియే యుక్తియుక్తముగా నున్నది. ఘటాదిజడవస్తు వులను బ్రకాశింపఁజేయు దీపము ఘటాదులు ప్రకాశించుటకు ముందుగా తాను బ్రకాశించి తరువాతఁ గదా ఘటాదులను బ్రకాశింపఁజేయును. అప్రకారమే చైతన్యము తాను ముందు బ్రకాశించినతరువాత జడవస్తువులను బ్రకాశింపఁజేయు చుండును. ఇట్టి చైతన్యము తాను బ్రకాశించునప్పుడు మరి యొకచైతన్యముచేతఁ బ్రకాశింపఁజేయఁబడునని చెప్పఁదగదు. ఆలాగున చెప్పెడియెడల అనవస్థాదోషము సంభవించును గనుక స్వయముగానే ప్రకాశించుచుండును కనుక నేస్వప్రకాశ మని శాస్త్రములచేతను బ్రహ్మవేత్తలచేతను నిశ్చయింపఁబడినది. కనుక చైతన్యాధీనప్రకాశముగల జడవస్తువులకన్నిటికి తమ కంటె ముందుగాఁ బ్రకాశించుచైతన్యమే వాస్తవమైనస్వరూ పము. చైతన్యాతిరిక్తమగు మరియొకవాస్తవరూపము జడవ

స్తువులను లేనే లేవని నిశ్చయించి జడవస్తువుల నుపేక్షించి చిన్మాత్రమునే చిత్తమునందు దృఢముగా భావింపవలయును.

ఈ యర్థము వాసిష్ఠరామాయణములో బలిచక్రవర్తి శుక్రాచార్యులయొక్క ప్రశ్నప్రతివచనవాక్యములచేత విస్పష్టముగాఁ దెలియఁబడుచున్నది.

శ్లో. కిమిహాస్తీహ కిం మాత్రమిదం కిమయమేవచ,
కస్త్వం కోఽహం క ఏతేవా లోకా ఇతి వదాశు మే.

తా. ఈప్రపంచమం దేమియున్నది? ఈప్రపంచమునకు నిమిత్తకారణ మేమి? ఉపాదానకారణ మెద్ది? నీవెటువంటివాఁడవు. నే నెటువంటివాఁడను? ఈభూరాదిలోకములు ఎటువంటివి? ఈయర్థమును నాకు శీఘ్రముగా విస్పష్టముగాఁ జెప్పుము అని బలిచక్రవర్తి ప్రశ్నచేయఁగా శుక్రాచార్యులు చెప్పుచున్నారు.

శ్లో. చిదిహాస్తీతి చిన్మాత్రమిదం చిన్మయమేవచ,
చిత్త్వం చిదహమేవేమే లోకాశ్చిదితి సంగ్రహః. అని.

తా. ఈప్రపంచమందు చైతన్యమే కలదు. ఈప్రపంచమునకు చైతన్యమే నిమిత్తకారణము; చైతన్యమే ఉపాదానకారణము; నీవు చిద్రూపుఁడవు; నేను చిద్రూపుఁడను; ఈ లోకము లన్నియు చిద్రూపములు; ఇదియే సర్వశాస్త్రములయందుఁ బ్రతిపాదింపఁబడిన సారార్థము.

ఈ లోకములో సువర్ణకారుఁడు (కంసాలి) కంకణములను విక్రయించునప్పుడు కంకణములయందుండు వట్రువను పని

విశేషముల నుపేక్షించి ఘటాదులయొక్క బరువును వర్ణమును మాత్రమునే మనస్సులో నుంచుకొని యేప్రకారము వ్యవహరింతునో ఆప్రకారమే యీప్రపంచమందు చిజ్జడములు రెండు ఉన్నప్పటికి జడమును ఉపేక్షించి చిద్వస్తువందే చిత్తమును జేర్చి వ్యవహరింపవలయును. ఎంతకాలమువరకు జడపదార్థముల నన్నిటిని సర్వప్రకారములచేత నుపేక్షించి మనస్సు చిన్మాత్రమందే నిశ్వాసాదులయందు వలె అప్రయత్నముగా స్వభావముచేతనే ప్రవర్తించునో యంతకాలమువరకు చిన్మాత్రమును ప్రయత్నముచేత భావింపవలయును.

ఆక్షేపము:—ఓయీ! ఇట్టిచిన్మాత్ర వాసనను మొదటనే యభ్యాసము చేసినయెడల మలినవాసనలన్నియు నివర్తించును. కనుక నిదివరలో చెప్పిన మైత్రీకరుణాదిశుభ వాసనలయొక్క అభ్యాసము నిరర్థకము.

సమాధానము:—మైత్రీకరుణాది శుభ వాసనలనభ్యసింపక ముందుగా చిన్మాత్ర వాసనలనే యభ్యసించినయెడల నీచిన్మాత్రవాసనదృఢముగానిలువనేరదు. అడుగుభూమినిదృఢముగాంజేయక స్తంభములను గోడలను నిలువంబెట్టి గృహమును నిర్మించినపక్షమున నాగృహమేప్రకారము స్థిరముగా నుండక క్రుంగిపోవునో యాప్రకారమే మైత్ర్యాదిశుభ వాసనలనభ్యసింపక ముందుగా చిన్మాత్ర వాసననే యభ్యసించినపక్షమున నాచిన్మాత్ర వాసన క్రమముగా క్షీణించును. ఇదిగాక విరేచనముచేత దేహమునందుండుదోషపుసిటనినివర్తింపంజేసి, అనంతరము పుచ్చుకొన్న ఔషధము ఆరోగ్యమును గలుగంజేయును. ముందుగా పుచ్చుకొన్న

ఔషధముఆరోగ్యమునుగలుగఁజేయదు. ఆప్రకారమే ముందుగా మైత్ర్యాదివాసనలచేత మలినవాసనలను నశింపఁజేసుకొని తరువాత చిన్మాత్రవాసన నభ్యసించినయెడల నిర్వాణ మను పరమసుఖమును గలుగఁజేయును గాని ముందుగా నభ్యసించితే కలుగఁజేయదు.

ఆక్షేపము — ఓయీ! శ్లో. 'తామప్యథ పరిత్యజేత్.' ఆచిన్మాత్ర వాసనను కూడ తరువాత విడువవలయునని వసిష్ఠవచనముచేత చిన్మాత్రవాసనను కూడ విడువవలయునని చెప్పఁబడుచున్నది. ఇది యుక్తముగా కనుపించదు చిన్మాత్రమునుకూడ వదలిపెట్టి, మరియొకదానిని భావించవలసినట్టు లేదు గదా.

సమాధానము — చిన్మాత్రవాసన యనునది రెండువిధములు మనోబుద్ధులతో కూడిన చిన్మాత్రవాసన మొదటిది. మనోబుద్ధులతో కూడని చిన్మాత్రవాసన రెండవది. జ్ఞానమునకు కరణము అనఁగా సాధనము. మనస్సు జ్ఞానమున కాశ్రయము బుద్ధి. ఇదియే అహంకర్త యని చెప్పఁబడును. నేను ప్రమాదము లేనివాఁడనై ఏకాగ్రమగుమనస్సుతోటి చిన్మాత్రమును భావించెద ననిచేయు భావన మొదటిచిన్మాత్రవాసన యనిపించుకొనును. ఈవాసన జ్ఞానకర్తయగు బుద్ధితోడి సాధనమగు మనస్సుతోడను కలసియున్నది. ఇదియే ధ్యానమని చెప్పఁబడును. ఇట్టివాసన త్యాజ్యమని చెప్పఁబడినది అభ్యాస విశేషముచేత కర్తృత్వకరణత్వానుసంధానము లేక యేయేచిన్మాత్రవాసన ప్రవర్తించునో, అది రెండవది. అదియే సమాధి యని చెప్పఁబడును. ఈచిన్మాత్రవాసనను విడువఁదగదు. ధ్యానము

యొక్క సమాధియొక్క లక్షణములను పతంజలిమహర్షి సూత్రములతోఁ జెప్పియున్నారు.

సూ. తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్.

తా. ధారణను అభ్యసించుచున్నపుడు చిత్తము నేవిషయమందుఁ జేర్చెనో ఆవిషయమందు విచ్ఛేదము లేనట్టి జ్ఞానమును బ్రవర్తింపఁజేయుట ధ్యానమని చెప్పఁబడును. అనఁగా ప్రత్యాహారముచేత మనస్సును విషయములలోనిఁ చేరనుండ బిగించి తరువాత శుభవిషయమైనపరమాత్మయందు కొంచెము కొంచెముగా చేర్చవలయును. ఇదియే ధారణ యనఁబడును. ధారణయందు గ్రహింపఁబడుపరమాత్మయందు నిరంతరముగా అనఁగా మధ్యవిచ్ఛేదము లేనట్టి మనస్సును చేర్చియుండుట ధ్యానమనఁబడు నని భావము.

సూ. తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః.

తా. పరమాత్మయందుఁ జేర్పఁబడినమనసు తాను లేనిదానివలెనుండి పరమాత్మస్వరూపముమాత్రము ప్రకాశించుట సమాధియనఁబడును. అనఁగా ధ్యానమందు ధ్యానముచేయఁబడుపరమాత్మ స్వరూపమును, ధ్యానమును చేయుమనోబుద్ధులును ప్రకాశించుచుండును. సమాధియందు మనోబుద్ధులుండిన, లేనివాటివలెఁ బ్రకాశింపకయుండును. పరమాత్మ స్వరూపము మాత్రము ప్రకాశించుచుండు నని భావము.

ఇట్టి సమాధి చిరకాలము నిరంతరముగా నాదరతోడ నభ్యసింపఁబడెనా? స్థైర్యమును పొందును. ఈప్రకారము

సమాధిస్థైర్యమును బొందినతరువాత ధ్యానమునందుండు కర్తృకరణములగు బుద్ధిమనస్సులయొక్క అనుసంధానమును విడుచుటను సమాధియందు ఏప్రయత్నముఁ చేయఁబడునో, అట్టి ప్రయత్నమునుకూడ విడువవలయును.

ఆక్షేపము.—ఓయీ! ఈప్రకారముగా చెప్పెడిపక్షమునకు సమాధియందు మనోబుద్ధ్యనుసంధానమును త్యజించుటకుఁ జేసినప్రయత్నమును త్యజించవలసియుండెనా? యీ త్యాగమునకు మఱియొక ప్రయత్నమును చేయవలసియుండును. ఆప్రయత్న త్యాగమునకు మఱియొక ప్రయత్నమును జేయవలయు నని యనవస్థాదోషము సంభవించును.

సమాధానము.—సమాధ్యనంతరమందుఁ జేయు త్యాగప్రయత్న మేకతరగంధన్యాయముగా స్వత్యాగమునకు పరత్యాగమునకు కూడ సాధకమైయుండును గనుక అనవస్థాదోషము రానేరదు. అనఁగా చిల్లగింజగంధము బురదనీటిలో వేయఁబడి బురదను నివర్తింపఁజేసి తాను స్వయముగానే యేప్రకారము నివర్తించునో యాప్రకారమే సమాధిదార్ఢ్యానంతరమందు చేయఁబడు కాలమందు మనోబుద్ధ్యనుసంధానత్యాగముకొఱకు చేయఁబడు ప్రయత్నము తనకుఁ దానే నివర్తింపఁజేయు నని తాత్పర్యము.

ఇట్టి త్యాగప్రయత్నమును నివర్తింపఁగా మలినవాసనల వలె శుద్ధవాసనలుకూడ నివర్తించును గనుక మనస్సు నిర్వాసనమైయుండును.

ఈయభిప్రాయముతోనే వసిష్ఠమహాముని చెప్పినారు.

శ్లో. తస్మాద్వాసనయా బద్ధం ముక్తం నిర్వాసనం మనః,
రామ నిర్వాసనీభావమాహరాశు వివేకతః.

తా. కనుక ఓ రామా! మనస్సు వాసనలతో కూడి యుండెనా బద్ధమని, వాసనలచే విడువఁబడియుండెనా ముక్తమనియుఁ జెప్పఁబడును. కనుక వివేకముచేత మనస్సు నిర్వాసనత్వమును బొందులాగున త్వరగాఁ బ్రయత్నము చేయుము.

శ్లో. సమ్యగాలోచనాత్సత్యా ద్వాసనా ప్రవిలీయతే,
వాసనావిలయే చేతః శమమాయాతి దీపవత్.

తా. సర్వపదార్థములయొక్క వాస్తవాకారమును బాగుగా నాలోచించుటచేత వాసనలు క్షీణించును. వాసనలు లయింపఁగానే మనస్సుతైలములేనిదీపమువలె శాంతినొందును.

శ్లో. యో జాగర్తి సుషుప్తస్థో యస్య జాగ్రన్న విద్యతే,
యస్య నిర్వాసనో బోధః స జీవన్ముక్త ఉచ్యతే.

ఈశ్లోకముయొక్క తాత్పర్యము వెనుకనే విస్పష్టముగా వ్రాయఁబడినది.

శ్లో. సుషుప్తవత్ప్రశమితభావవృత్తినా
స్థితం సదా జాగ్రతి యేన చేతసా,

కలాన్వితోవిధురివ యస్సదాబుధై
న్నిషేవ్యతేముక్తఇతీహసస్మృతః.

తా. సుషుప్తి దశయందువలె సమస్తవిషయవృత్తులు శమించిన కేవలమనస్సుతోఁ గూడి జాగ్రదవస్థయందుఁగూడ యే పురుషుఁడు వుండునో సంపూర్ణకళలు గల చంద్రుఁడు దేవతల చేత నేప్రకారము సేవింపఁబడుచుండునో యాప్రకారమే పురుషుఁడు తత్త్వజిజ్ఞాస గలపురుషులచేత సర్వకాలములయందు సేవింపఁబడుచుండునో యట్టి మహానుభావుఁడు ఈలోకమందు ముక్తుఁడని చెప్పఁబడును

శ్లో. హృదయాత్సంపరిత్యజ్య సర్వమేవ మహాశయః,
యస్తిష్ఠతి గతవ్యగ్రః సముక్తః పరమేశ్వరః.

తా. ఏపురుషుఁడు సకలవిషయములను మనస్సులో నుంచి తొలఁగించి కృతకృత్యుఁడైనందున నిర్విచారముగానుండునో యాపురుషుఁడే ముక్తుఁడని పరమేశ్వరుఁడనియుఁ జెప్పఁబడును.

శ్లో. సమాధి మథకర్మాణి మా కరోతు కరోతు వా,
హృదయే నాస్త సర్వాశో ముక్త ఏవోత్తమాశయః.

తా. కృతకృత్యుఁడగు పురుషుఁడు మనస్సుచేత సర్వ పదార్థములయందుండు ఆశను విడిచియున్నందున సమాధిని గాని, కర్మలనుగాని చేసినా చేయకపోయినా ముక్తుఁడని చెప్పఁబడును.

శ్లో. నైష్కర్మ్యేణ న తస్యార్థో న తస్యార్థోఽస్తి కర్మభిః,
న సమాధానజప్యాభ్యాం యస్య నిర్వాసనం మనః.

తా. ఎవనియొక్క మనస్సు నిర్వాసనమైయుండునో, అతనికి కర్మసన్న్యాసముతోఁగాని కర్మల ననుష్ఠించుటచేఁగాని సమాధితోఁగాని మంత్రజపముతోఁగాని కొంచమైనా ప్రయోజనము లేదు.

శ్లో. విచారితమలం శాస్త్రం చిరముద్గ్రాహితం మిథః,
సంత్యక్తవాసనాన్మౌనాదృతే నాస్త్యుత్తమం పదం.

తా. సమస్తశాస్త్రములు మాచేత నిపుణముగా విచారింపఁబడినవి. సమానులగుపండితులతోఁ చేరి పరస్పరము బోధింపఁబడినవి. ఎన్నివిధములచే శాస్త్రములను పర్యాలోచనచేసి నావాసనాపరిత్యాగపూర్వకముగా చేయఁబడు బ్రహ్మవిచారముకంటె మఱియొక శ్రేష్ఠమైన సాధనము కనుపడలేదు.

ఆక్షేపము.—ఓయీ! వాసనాశూన్యముగా మనస్సును చేసినవానికి జీవనహేతువగు వ్యవహారము సంభవింపనందున జీవనము కలుగనేరదు.

సమాధానము.— వాసనాశూన్యమగు మనస్సుగలవానికి చక్షురాదీంద్రియములయొక్క వ్యవహారము సంభవింపదా? లేక మనస్సుయొక్క వ్యవహారము సంభవింపదా? మనస్సు వాసనాశూన్యమైనప్పటికి చక్షురాదివ్యవహారములకు లోపము లేదని వాసిష్ఠరామాయణమందు ఉద్దాలకునిచే చెప్పఁబడినది.

శ్లో. వాసనాహీనమప్యేతచ్చక్షురాదీంద్రియం స్వతః,
ప్రవర్తతే బహిస్స్వార్థే వాసనా నాత్ర కారణమ్. అని.

తా. మనస్సునందు రాగద్వేషాదివాసనలు లేకపోయినాః చక్షురాదీంద్రియములు స్వయముగానే విషయదేశములయందు వ్యాపించుచుండును. ఇట్టివ్యాప్తియందు రాగద్వేషాదివాసనలు కారణము కాదు.

వాసనలు లేకపోయినా మనస్సుయొక్క వ్యవహారము లోపమును బొందదని వసిష్ఠమహామునిచేఁ జెప్పఁబడినది.

శ్లో. అయత్నోపనతేష్వక్షి దిగ్ద్రవ్యేషు యథా పునః,
నీరాగమేవ పతతి తద్వద్ద్రవ్యేషు ధీరధీః. అని.

తా. నేత్రము అప్రయత్నముగా నెదుటనుండు దిక్కులయందలి ద్రవ్యములయందు నేప్రకారము రాగశూన్యముగానే ప్రవేశించునో యాప్రకారముగానే నిర్వాసనుఁడగు బ్రహ్మవేత్తయొక్క మనస్సు కూడ అయత్నసిద్ధములగు విషయములయందు రాగశూన్యముగాఁ బ్రవేశించుచుండును.

ఇటిరాగశూన్యమగు బుద్ధిచేతనే ప్రారబ్ధభోగమును కూడ తత్వజ్ఞాని యగువాఁ డనుభవించుచుండు నని వసిష్ఠమహామునిచేతనేఁ జెప్పఁబడినది.

శ్లో. పరిజ్ఞాయోపభుక్తో హి భోగో భవతితుష్టయే,
విజ్ఞాయ సేవితశ్చోరో మైత్రీమేతి న చోరతామ్. అని

తా. భోగము తెలిసి యనుభవింపఁబడెనా సంతుష్టిని కలుగఁజేయును. తెలియకయే యనుభవింపఁబడెనా యెప్పటికి తుష్టినికలుగఁజేయదు. దొంగతోటి తెలిసి సహవాసముజేసినా

మిత్రుఁడగును. తెలియక సహవాసము చేసినా దొంగయే యగును. అనఁగా దొంగతనము చేయు మనుష్యుని వీఁడు దొంగయని తెలిసి వానితో సహవాసము చేసినా, వాఁడు తనను దొంగయని తెలుసుకొన్నట్టు తెలుసుకొని తెలిసి తనతో సహవాసముచేయువానియింటిలో దొంగతనమును తాను చేసిన పక్షమున తనగుట్టు వానికి తెలిసినందున తనకు హాని కలుగునని తలఁచి వానితో నిష్కపటమైన స్నేహమునే చేయును గాని వానివిషయములో తనయొక్క దొంగతనము నుపయోగపరపఁడు. ఆప్రకారమే భోగము ప్రారబ్ధకర్మచేత ప్రాప్తించినది. ఇది విశేషకాలము ఉండఁబోదు. అని భోగస్వభావమును తెలిసి యనుభవించువానికి ఆభోగము రాగమును కలుగఁజేయదు. కనుక భోగకాలమందుఁగాని నాశకాలమందుఁగాని తుష్టిని చెలుపఁజాలదు. అనుభవింపఁబడు భోగము చిరకాలము ఉండునని తలఁచి భోగస్వభావము అస్థిరమని తెలియక అనుభవించువానికి ఆభోగము నశింపఁగానే మహాపరితాపమును కలుగఁజేయునని భావము.

శ్లో. అశంకితోపసంప్రాప్తా గ్రామయాత్రా యథాఽధ్వగైః,
ప్రేక్ష్యతే తద్వదేవజ్ఞైర్భోగశ్రీరవలోక్యతే. అని.

తా. కాశీపట్టణమునకు పోతలఁచి నడుచుమనుష్యులు మధ్యమార్గములో కొన్నిగ్రామములను అనుద్దేశ్యముగా ప్రవేశించి కూడ వాటియందాసక్తులు కానట్టు బ్రహ్మాతత్వజ్ఞానము కలపురుషులు విదేహకైవల్యమును పొందుటకు పూర్వమందు

కొన్ని ప్రారబ్ధభోగములు అవర్జనీయముగా సంభవించినా వాటి యందాసక్తి కలవాడు కాడు.

ప్రారబ్ధభోగము ననుభవించునప్పుడు కూడ వాసనాసహితుఁడైన పురుషునికంటె వాసనారహితుఁ డగువానికి విశేషము కలదని వసిష్ఠవాక్యముచేతనే తెలియఁబడుచున్నది.

శ్లో. నాపది గ్లానిమాయాంతి హేమపద్మం యథా నిశి,
నేహంతే ప్రకృతాదన్యద్రమంతే శిష్టవర్త్మని. అని.

తా. వాసనాశూన్యమైన చిత్తము ప్రారబ్ధానుభవకాలమునం దెటువంటి ఆపత్తు సంభవించిన బంగారుకమలము రాత్రికాలమునందు ముకుళనమును పొందనట్లు సంకోచమును అనఁగా ఖేదమును పొందదు. ఇట్టి నిర్వాసనచిత్తు లగువారు ప్రకృతమందు అనుభవములోనికి వచ్చినసుఖముకంటె నెక్కువ సుఖము నపేక్షింపరు. శిష్టులగువారు సంచరించు సదాచారమార్గమందు సంచరించుచుందురు. ఎటువంటి సుఖదుఃఖములు ప్రాప్తించినా సన్మార్గమును లంఘించిపోరు.

శ్లో. నిత్యమాపూర్ణతామంతశ్శుభ్రాం మృదుమనోరమాం,
ఆపద్యపి న ముంచంతి శశినః శీతలామివ.

తా. వాసనాశూన్యచిత్తము కలవారు చంద్రబింబమువలె సర్వజనమనోహరమైన నిర్వికారమైన పరిపూర్ణభావమును ఆపత్కాలమందుఁ గూడ చంద్రుఁడు చల్లదనమును విడువనట్లు విడువఁజాలరు.

శ్లో. అబ్ధివత్ ధృతమర్యాదా భవంతి విగతాశయాః,
నియతిం న విముంచంతి మహాంతో భాస్కరా ఇవ. అని

తా. ఇదిగాక వాసనాక్షయముగల పురుషులు సముద్రము లేప్రకారముగా తమతమ మర్యాదను ధరించియుండునో యాప్రకారము నమర్యాదను ధరించియుందురు. సూర్యు లేప్రకారము నిరంతరసంచారమును విడువరో ఆప్రకారమే నియతిని విడువజాలరు. అనగా విచిత్రములగు ప్రారబ్ధఫలముల ననుభవించునప్పుడు ఉత్కటమైన సుఖముగాని దుఃఖముగాని సంభవించినా వాసనావిశిష్టు లగు పురుషులు అత్యంతహర్షముగాని యత్యంతదైన్యమును గాని పొంది శాస్త్రీయమార్గము నవలంబింపక యవశులుగా సంచరింతురు. వాసనాక్షయము కలవారు ఉత్కటసుఖదుఃఖములయందుఁగూడ హర్షవిషాదముల నొందక తమకు శాస్త్రములు విధించిన మర్యాదను లోఁబడి బ్రహ్మస్వరూపానుసంధానానియతిని విడువరు.

వాసిష్ఠరామాయణములోని యుపశమప్రకరణములో జనకమహారాజు సమాధిలోనుండి లేచినప్పుడు ఇటువంటి ఆచారముకలవాఁడై యున్నట్లుగానే వినఁబడుచున్నది.

శ్లో. తూష్ణీముష్య చిరం స్థిత్వా జనకో జనజీవనమ్,
వ్యుత్థితశ్చింతయామాస మనసా శమశాలినా.

తా. సమస్తమైనజనులకు ప్రాణమువలె నాదరణీయుఁడైనయాజనకరాజు చాలకాలమువరకు పరమాత్మస్వరూపమును ధ్యానించి సమాధిని చాలించి శమాదిగుణములతో నొప్పుచున్న మనస్సుతో నీప్రకారముగా నాలోచించెను.

శ్లో. కిముపాదేయమస్తీహ యత్నాత్సంసాధయామి యత్,
స్వతః స్థితస్య శుద్ధస్య చితః కా మేఽస్తి కల్పనా.

తా. ఈప్రపంచమందు గ్రహింపఁదగిన పదార్థ మేమి యున్నది? దేనిని నేను ప్రయత్నమును చేసి సాధించుదును. నిరుపాధికశుద్ధచిన్మాత్రుఁడనై యున్న నాకు నేమి కల్పన కలదు. అన్ని కల్పనలు ఉపాధియందే కలవు కాని చిన్మాత్రమందు లేవని భావము.

శ్లో. నాభివాంఛామ్యసంప్రాప్తం సంప్రాప్తం న త్యజామ్యహమ్,
స్వస్థ ఆత్మని తిష్ఠామి యన్మమాస్తి తదస్తు మే.

తా. కనుక ప్రాప్తము కాని విషయమును అపేక్షింపను. ప్రాప్తమగు విషయమును గూర్చి ద్వేషమును చేయను. రాగద్వేషములు లేనివాఁడనై యాత్మయందే నిష్ఠకలవాఁడనై యుందును. నాకు నేది కలదో అదే యుండుఁగాక? లేనిదానితో నాకు ప్రయోజనమే లేదు.

శ్లో. ఇతి సంచిన్త్య జనకో యథా ప్రాప్తక్రియామసౌ,
అసక్తః కర్తు ముత్తస్థౌ దినం దినపతిర్యథా.

తా. ఈప్రకారముగా నాజనకమహారాజు విచారించి ప్రారబ్ధానుసారముగా చేయవలసినక్రియలను కర్తృత్వాభిమానరహితుఁడై సూర్యుఁడు దినమును చేసినట్లు చేయుటను నుద్యోగించి లేచినవాఁ డాయెను.

శ్లో. భవిష్యన్నానుసంధత్తే నాతీతం చింతయత్యసౌ,
వర్తమాననిమేషం తు హసన్నేవానువర్తతే.

తా. ఈప్రకారము ప్రారబ్ధప్రాప్తము లగు కర్మలను చేయునప్పుడు ముందు రాఁబోవుదానిని యోచించుట లేదు. కడచిననాటిని చింతించుట లేదు. వర్తమానమం దుండు క్రియలను అనాదరముతో చేయుచుండును.

వా. ఈప్రకారము చెప్పఁబడిన వాసనాక్షయము నభ్యసించుటచేత వెనుకఁ జెప్పఁబడిన లక్షణముగల జీవన్ముక్తి సిద్ధించునని నిశ్చయము.

ఇది జీవన్ముక్తిప్రకాశికయందు వాసనాక్షయప్రకరణ మను

రెండవభాగము సమాప్తము.



శ్రీ హయగ్రీవాయ నమః.

# జీవన్ముక్తిప్రకాశిక.

## ౩-వ ప్రకరణము.

హరిః ఓమ్.

ఇఁకను మనోనాశప్రకరణ మను మూఁడవభాగ మారంభింపఁబడును. ఇఁకను జీవన్ముక్తికి సాధన మగుమనోనాశమును నిరూపించుచున్నారము.

విచారింపఁగా సమస్తవాసనలు నశింపఁగానే మనస్సు కూడ నశించియే పోవును. అయినను స్వతంత్రముగా మనోనాశమును చక్కఁగా నభ్యసించిరయేని, అభ్యసింపఁబడిన వాసనాక్షయము రక్షింపఁబడును. అజిహ్వాత్వ షండత్వాదిధర్మముల నభ్యసించినమాత్రమున వాసనాక్షయము రక్షింపఁబడదాయని శంకింపఁదగదు. మనస్సు నశించినపక్షమునను, అజిహ్వాత్వాదిధర్మములు స్వయముగానే సిద్ధించును గనుక వాటిని ప్రత్యేకముగా నభ్యసించుపక్షమునను చాలకాలము పట్టును. చాల ప్రయాసముగాను నుండును. మనోనాశము నభ్యసించునెడల మనస్సు ఒకటియే యయినందున త్వరగా సిద్ధించును.

అజిహ్వాత్వాదిధర్మములు శ్రేయముగానే సిద్ధించును. కనుక మనోనాశమునే యభ్యసించి వాసనాక్షయమును రక్షించు కొనవలయును.

ఆక్షేపము—ఓయీ! అజిహ్వాత్వాదుల నభ్యసించిన యెడల, మనోనాశము కూడ కలుగును.

సమాధానము—కలుగును గాని మనోనాశము ముఖ్యమైనందున ముఖ్యమైన మనోనాశమును ముఖ్యముగా నభ్యసింపనియెడల, అజిహ్వాత్వాదిధర్మములు ఎంత బాగుగ నభ్యసించినను స్థిరముగా నుండ నేరవు గనుక వాసనాక్షయరక్షణార్థమై మనోనాశమునే ముఖ్యముగా నభ్యసింపవలయును. కనుకనే మనస్సు ముఖ్యముగా నశింపఁజేయఁదగినది యని జనకునిచేఁ జెప్పఁబడినది.

శ్లో. సహస్రాంకురశాఖాత్మఫలపల్లవశాలినః,
అస్య సంసారవృక్షస్య మనోమూలమిదం స్థితమ్.

తా. అనేకవేల మొలకలు, కొమ్మలు, ఫలములు, చిగుళ్లు, పుష్పములు గలిగి వృద్ధిఁబొందుచున్న యీసంసారవృక్షమునకు మనస్సునది మూల మని తెలియఁదగినది.

ఈసంసారము 'వ్రశ్చనాద్వృక్షః' ఛేదింపఁదగియున్నందున వృక్షము అని చెప్పఁబడినది. ఇట్టి సంసారవృక్షమునకు అవిద్యాకామకర్మవాసనావిశిష్టమైన యవ్యాకృతము (మాయ) బీజము. జ్ఞానశక్తిక్రియాశక్తులతోఁ గూడియుండి సమష్టిలింగశరీరాభిమానియై ప్రథమజీవుండగు హిరణ్యగర్భుఁడు అంకు

రము. సమస్తమైన వ్యష్టిజీవులయొక్క లింగశరీరములు కొమ్మలు. తృష్ణయనునది జలసేకము. బుద్ధీంద్రియవిషయములు చిగుళ్లు. శ్రుతిస్మృతిన్యాయవిద్యలయొక్క ఉపదేశములు ఆకులు. యజ్ఞదానాదికర్మములు పుష్పములు. భిన్నభిన్నరుచిగల జంతువులచేత ననుభవింపఁబడు అనంతసుఖదుఃఖములు ఫలములు. సాత్త్వికరాజసతామస భేదభిన్నములయిన కర్మవాసనలు ఊడలు. సత్యలోకాదిలోకములు గూడులు. ఆయాలోకముల యందుండు బ్రహ్మాదిజీవులు పక్షులు. ఆయాభూతములు సుఖదుఃఖాదుల ననుభవించు కాలములో చేయు హర్షశోకాదిశబ్దములును నృత్యగీతవాదిత్రాదిశబ్దములును పక్షులచేత చేయఁబడు వైరాగ్యపూర్వకాద్వైతబ్రహ్మజ్ఞానముచేత ఛేదింపఁబడును గనుకనే వృక్షమని వ్యవహరింపఁబడినది.

శ్లో. సంకల్పమేవయన్న స్యే సంకల్పోపశమేన తత్,
శోషయామి యథాశోషమేతి సంసారపాదపః.

తా. మనస్సును సంకల్పమనియే తలఁచెదను. సంకల్పమును శమింపఁజేసి మనస్సును శోషింపఁజేసెదను. మనస్సు శోషింపఁగానే సంసారవృక్షము శోషించి క్రమముగా నశించును.

శ్లో. ప్రబుద్ధోఽస్మి ప్రబుద్ధోఽస్మి దుష్టశ్చోరో మయాత్మనః,
మనో నామ నిహన్మ్యేనం మనసాఽస్మి చిరం హృతః. అని.

తా. నేను నిశ్చయముగా తెలుసుకొన్నాను. నన్ను దొంగిలించుకొనిపోవు మనస్సనుదొంగను జూచినాను. ఈ

దొంగను ఇఁకను చంపివేయుదును. ఈమనస్సుచేతనే చిరకాలమునుండి బాధింపఁబడితిని.

వసిష్ఠమహాముని చేత కూడ నీయర్థము చెప్పఁబడినది.

శ్లో. అస్య సంసారవృక్షస్య సర్వోపద్రవదాయినః,
ఉపాయ ఏక ఏవాస్తి మనసస్స్వస్య నిగ్రహః.

తా. సమస్తమయిన ఉపద్రవములను కలుగఁజేయు సంసారమను నీవృక్షమును నశింపఁజేయుటకు తనయొక్క మనస్సును నిగ్రహించుట యొకమంచి యుపాయము. మఱియొక యుపాయము సంసారవిషవృక్షమును నశింపఁజేయుటకు లేదు.

శ్లో. మనసోఽభ్యుదయో నాశో మనోనాశో మహోదయః,
జ్ఞో మనోనాశమభ్యేతి మనోఽజ్ఞస్య హి శృంఖలా.

తా. మనస్సు వృద్ధిఁబొందుటయే నాశము. అనఁగా మనస్సు విషయములయందు వ్యాపించి ఉత్తరోత్తర మభివృద్ధినొందుచుండఁగా మనుష్యుఁడు సంసారమందుబడి నశించిపోవును గనుక మనస్సు వృద్ధినొందుటయే నాశమని భావము. మనస్సుయొక్క నాశమే అత్యంతాభివృద్ధి అనఁగా మనస్సు నశించినతోడనే సకలసంసారదుఃఖములు నశించును గనుక మనోనాశమే అభివృద్ధియని తాత్పర్యము. తత్త్వజ్ఞానియొక్క మనస్సు నశించిపోవును. జ్ఞానశూన్యునిమనస్సు వానికి సంకెలవలె బంధకముగా నుండును.

శ్లో. తావన్నిశీథవేతాళా వల్గంతి హృది వాసనాః,
ఏకతత్త్వదృఢాభ్యాసా ద్యావన్న విజితం మనః.

తా. ఎంతవఱకు అద్వితీయబ్రహ్మతత్త్వము నభ్యసించి మనస్సు నిగ్రహింపఁబడదో అంతవఱకు కామక్రోధాది మలినవాసనలు అర్ధరాత్రమునందుఁ బిశాచములవలె హృదయమునందు విహరించుచుండును. నిగ్రహింపఁబడినతరువాత సూర్యోదయానంతరమందుఁ బిశాచములు [illegible]పోవునట్లు మలినవాసన లన్నియు నివర్తించును.

శ్లో. ప్రక్షీణచిత్తదర్పస్య నిగృహీతేంద్రియద్విషః,
పద్మిన్య ఇవ హేమంతే క్షీయంతే భోగవాసనాః.

తా. చిత్తముయొక్క యాదర్పమును నశింపఁజేసి ఇంద్రియము లనుశత్రువుల గెలిచి స్వాధీనములో నుంచుకొన్న పురుషునకు హిమవంతఋతువునందు తామరతీఁగెలవలె విషయభోగవాసనలు నశించిపోవును.

శ్లో. హస్తం హస్తేనసంపీడ్య దంతైర్దంతాన్విచూర్ణ్య చ.
అంగాన్యంగైస్సమాక్రమ్య జయేదాదౌ స్వకం మనః.

తా. మనస్సును జయించుట నిండ కష్టము గనుక గొప్ప ప్రయత్నమును చేసి చేతులతోఁ జేతులను నలిపి దంతములతో దంతములను కొఱికి పాదాద్యవయవములను ఆయా యవయవములతో త్రొక్కిపట్టి మహాకోపముతో మనస్సును ముందుగా జయింపవలయును.

శ్లో. ఏతావతి ధరణితలే సుభగాస్తే సాధుచేతనాః పురుషాః,
పురుషకథాసు చ గణ్యా న జితా యే చేతసా స్వేన.

తా. ఏపురుషులు తమమనస్సుచేత జయింపఁబడక యుండిరో, ఆపురుషులే యీయావత్తుభూమండలములో మంచి

వారుగా యోగ్యమయిన జ్ఞానముకలవారుగా యోగ్యపురుషులయొక్క వృత్తాంతమును చెప్పినొనునట్టిల యందుముందుగా నెంచఁదగినవారుగా నుందురు.

శ్లో. హృదయబిలే కృతకుండల ఉల్బణకలనావిషోరగః,
యస్యోపశాంతి మగమచ్చంద్ర ఇవాభ్యుదేతి తం వందే.

తా. హృదయమను పుట్టలో చుట్ట చుట్టుకొనియుండి సర్వానర్థకల్పన యను విషమును గ్రక్కుచుండు మనస్సర్పము ఎవనికి నశించిపోయెనో, అతఁడు చంద్రబింబమువలె దినదినమును అభివృద్ధిఁ జెందుచుండును ఎప్పటికిని వినాశము లేకయుండును. అట్టి మహానుభావునికి అను నమస్కరించవలెను.

శ్లో. చిత్తం నాభిః కిలాస్యేదం మాయాచక్రస్య సర్వతః,
స్థీయతే చిత్తదంత్రస్య తస్మిం కించిన్నబాధతే. అని.

తా. మనస్సు మాయ యనుచక్రమునకు నాభివంటిది. అనఁగా కుండవంటిది. ఇట్టిమనస్సును బిగబట్టియుంటే, కుండను గట్టిగా పట్టియుంచు చక్రము తిరుగనట్లు మాయ యేయనర్థమును చేయఁజాలదు. శ్రీగౌడపాదాచార్యులవారును ఈయర్థమును చెప్పియున్నారు.

శ్లో. మనసో నిగ్రహాయత్తమభయం సర్వయోగినామ్,
దుఃఖక్షయః ప్రబోధశ్చాప్యక్షయా శాంతిరేవ చ. అని.

తా. సకలమయిన యోగులకు విదేహకైవల్యము సర్వదుఃఖక్షయము, బ్రహ్మాత్మైక్యజ్ఞానము, జీవన్ముక్తి ఇవియన్నియు మనోనిగ్రహముచేతనే కలుగుచున్నవి. కనుక మనస్సును ముఖ్యముగా జయించి స్వాధీనపఱచుకొనవలయును.

భగవద్గీతలయందు అర్జునునిచేత కూడఁ జెప్పఁబడినది.

శ్లో. చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్. అని.

తా. మనస్సు స్వభావముతోడనే మిక్కిలి చపలమయినది దేహేంద్రియాదులనుగూడ క్షోభింపఁజేయునదియు, విచారముచేతఁగూడ జయించుటను అశక్యమయినదియు, విషయవాసనలతో చుట్టఁబడి యున్నందున భేదింపశక్యము కానిదియుఁ గనుక నాకాశమునందు సంచరించు వాయువును ప్రతిబంధించుటకేప్రకారము శక్యము కాదో యాప్రకారమే మనస్సునుకూడ ప్రతిబంధించుటకు శక్యముకాదు. ఈవాక్యము హఠయోగముచేత మనస్సును నిగ్రహించుటకు శక్యము కాదని చెప్పుచున్నది కనుక మృదుయోగముచేత మనస్సు నిగ్రహింపఁబడును.

ఈయర్థము వసిష్ఠునిచేతఁ జెప్పఁబడినది.

శ్లో. ఉపవిశ్యోపవిశ్యైకచిత్తకేన ముహుర్ముహుః,
న శక్యతే మనో జేతుం వినా యుక్తిమనిందితామ్.

తా. సర్వజనస్పృహణీయమైన మంచియుపాయము లేకయే స్థిరమైన స్వస్తికపద్మకాద్యాసనములయందుఁ గూర్చుండి మాటిమాటికి నేకతత్త్వాభ్యాసము చేయుటచేత మనస్సు జయింపఁబడదు. మృదువైనయుపాయముచేత జయింపఁబడును.

శ్లో. అంకుశేన వినా మత్తో యథా దుష్టమతంగజః,
విజేతుం శక్యతే నైవ తథా యుక్త్యా వినా మనః. అని.

తా. మదించినయేనుఁగు అంకుశము లేకుండఁ గేవల బలాత్కారముచేత నేప్రకారము స్వాధీనము కానేరదో

యేప్రకారమే ఉపాయమ్ము లేక కేవలహఠయోగముచేత మనస్సు స్వాధీనము కానేరదు.

శ్లో. మనోవిలయహేతూనాం యుక్తీనాం సమ్యగీరణమ్,
వసిష్ఠేన కృతం తావత్తన్నిష్ఠస్య వశే మనః.

తా. మనోజయమునకుఁ గొన్ని కారణములను వసిష్ఠ మహాముని చెప్పియున్నారు. ఆ కారణముల ననుష్ఠించువారికి మనస్సు స్వాధీనమైయుండును.

శ్లో. హఠతో యుక్తితశ్చాపి ద్వివిధో నిగ్రహో మతః,
నిగ్రహో ధీక్రియాక్షాణాం హఠో గోళక నిగ్రహాత్.

తా. మనస్సును నిగ్రహించుటను హఠ మని యుక్తి యని రెండుసాధనములు కలవు. ఇందులో జ్ఞానేంద్రియకర్మేంద్రియములయొక్క గోళములను నిగ్రహించుటచేత తత్తదింద్రియముల నిరోధించుట హఠ మని చెప్పఁబడును. ముందు చెప్పఁబోవు సాధుసంగమాద్యుపాయములచేత నింద్రియములు నిరోధించుట యుక్తి యనఁబడును.

శ్లో. కదాచిజ్జాయతే కశ్చిన్మనస్తేన విలీయతే,

తా. ఈ రెండుసాధనములలో నొకపురుషున కొక సాధనము సంభవించును దానిచేతనే మనస్సు లయము నొందును.

శ్లో. అధ్యాత్మవిద్యాధిగమః సాధుసంగమ ఏవచ,
వాసనాసంపరిత్యాగః ప్రాణస్పందనిరోధనమ్,
ఏతాస్తా యుక్తయః పుష్టా స్సంతిచిత్తజయే కిల.

తా. వేదాంత శాస్త్రగ్రంథములను చదువుకొనుట, సత్పురుషులతోఁటి సహవాసముచేయుట, కామక్రోధాదివాసనలను విడుచుట, ప్రాణవాయువును స్మార్తప్రాణాయామము చేత నిరోధించుట; ఇవి మొదలయినయుక్తులు చిత్తమును స్వాధీనపఱచుకొనుటకు చాల కలవు. స్మార్తప్రాణాయామమని తాంత్రికప్రాణాయామ మని రెండువిధముల ప్రాణాయామములు కలవు. పాతంజలశాస్త్రమునందుఁ జెప్పఁబడిన ప్రాణాయామము తాంత్రిక మనఁబడును. దానియొక్క విశేషములను పాతంజలయోగశాస్త్రమునందే చూడవలయును. అది హఠయోగాంగము. స్మార్తప్రాణాయామ మనఁగా మన్వాదిధర్మశాస్త్రములయందుఁ జెప్పఁబడినది.

శ్లో. సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం శిరసా సహ,
త్రిః పఠేదాయతప్రాణః ప్రాణాయామ స్స ఉచ్యతే. అని.

తా. శ్వాసప్రశ్వాసముల నిరోధించి గాయత్రీమంత్రమును ప్రణవముతోడను సప్తవ్యాహృతులతోడను శిరస్సుతోడను మూఁడు పర్యాయములు పఠింపవలయును. ఇది యొక ప్రాణాయామ మగును.

ఇట్టి ప్రాణాయామము సంధ్యావందనాది నిత్యకర్మలకంగము. ఇచ్చట చిత్తజయోపాయములలోఁ జెప్పఁబడిన ప్రాణస్పందనిరోధ మనునది స్మార్తప్రాణాయామ మని తెలియఁదగినది. హఠయోగములోఁ నంతర్భూతముగా నున్నందున రెండవచిత్తజయోపాయ మగుయుక్తియందు ప్రతిపాదింపఁబడిన యీ ప్రాణాయామము స్మార్తప్రాణాయామ మని నిశ్చయింపఁబడినది.

శ్లో. సతీషు యుక్తిష్వేతాసు హఠాన్నియమయంతి యే,
చేతస్తే దీపముత్సృజ్య వినిఘ్నంతి తమోఽఞ్జనైః.

తా. చిత్తమును జయించుటను నీలాటియుక్తు లనేకము లున్నప్పటికిని వీటిని ఉపేక్షించి హఠయోగము చేతనే చిత్తమును స్వాధీనపఱచుటను నెవరు యత్నమును చేయుదురో వారు దీపమును విడిచి కాటుకమార్గము చేత సంధకారమును నివర్తింపఁజేయునట్టి వారు. అనఁగామృదు యోగము చేత చిత్తమును సులభముగా స్వాధీనపఱచుకోఁ దగియున్నట్టు హఠయోగము చేత స్వాధీనపఱచుకొనుటను శక్యమైయుండదు. అనిభావము.

శ్లో. విమూఢాః కర్తుముద్యుక్తా యే హఠాచ్చేతసో జయమ్,
తే నిబధ్నంతి నాగేంద్ర మున్మత్తం బిసతంతుభిః. అని.

తా. ఏపురుషులు హఠయోగము చేత చిత్తమును జయించుటను యత్నించెదరో, వారు మదించిన యేనుఁగును తామర కాడలో నున్న దారముల చేత కట్టివేయఁదలఁచిన మూర్ఖు లని చెప్పఁబడుదురు.

వా. హఠనిగ్రహమని క్రమనిగ్రహమని నిగ్రహము రెండు విధములు. చక్షురాదిజ్ఞానేంద్రియములను, వాగాదికర్మేంద్రియములను; ఆయాగోళమును నిరోధించుట చేత అనఁగా కన్నులు మూయుట, నోరు మూయుట మొదలగు వాటి చేతనిరోధించినట్టు చిత్తమునుకూడ నిగ్రహించెదనని మూర్ఖుఁడగు వానికి భ్రాంతి కలుగును కాని ఆప్రకారము చిత్తము నిరోధింపఁబడదు. చిత్తముయొక్క గోళము హృదయము. అది శరీరములోపల నాభికి మీఁదఁ జానయెత్తున కంఠముయొక్క యెముకకు క్రిందగా నుం

డును. ఎనిమిదిదళములుగలతామరపూవువలెనుండి అధోముఖముగా వ్రేలుచుండును. ఇట్టిహృదయము మూయుటకు శక్యముగా నుండదుగనుక గోళనిరోధముచేత చిత్తనిరోధము శక్యము కానేరదు. కనుక క్రమనిగ్రహమే చిత్తనిరోధమునకు యోగ్యమయినయుపాయము. అందులోఁగూడ వేదాంతశాస్త్రశ్రవణాదులే ముఖ్యోపాయములు. వేదాంతశాస్త్రశ్రవణముచేత దృశ్యప్రపంచము మిథ్యయని దృక్కని చెప్పఁబడు స్వప్రకాశచిద్రూపము సత్యమని తెలియఁబడును. అందుచేత తనకు గోచరించువిషయములను గ్రహించుటవలన ప్రయోజనము లేదని ప్రయోజనముగల చిద్రూపము తనకు గోచరించదని తెలిసి ఇంధనములు లేని వహ్నివలె చిత్తము తనంతటఁ దానే క్షీణించిపోవును. ఈయర్థము శాస్త్రములలో వినఁబడుచున్నది.

శ్లో. యథా నిరింధనో వహ్నిః స్వయోనా వుపశామ్యతి,
తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయోనా వుపశామ్యతి. అని.

తా. ఇంధనములు లేనివహ్ని యేప్రకారము స్వకారణమైన వాయువులో లయము నొందునో యాప్రకారమే వృత్తులు నశించినతరువాత చిత్తము స్వకారణమయిన పరమాత్మయందు లయము నొందును.

వేదాంతశాస్త్రశ్రవణముచేత తత్త్వజ్ఞానము కలిగినప్పటికి ఎవనికి అజ్ఞానము మరుపును బొందుచుండునో వానికి సజ్జనసహవాసమే చిత్తజయోపాయము. సత్పురుషు లగువారు తత్త్వమును మఱవకుండ మాటిమాటికి బోధించుచుందురు. ఏపురుషుఁడు విద్యామదధనమదములచేత గర్వించి సత్పురుషుల

ననువర్తించుటకు నుత్సహింపఁడో వానికి వెనుకఁ జెప్పిన వివేకముచేత వాసనాక్షయము నభ్యసించుటయే మనోజయోపాయము. వాసనలు నిండ ప్రబలమైనందున నెవనికి విడుచుటకు శక్యములయియుండవో, వానికి ప్రాణాయామము చేతప్రాణవాయువును నిరోధించుట యుపాయము. ప్రాణవాయువుయొక్క చలనము వాసనలు ఈ రెండు చిత్తమును ప్రవర్తింపఁ జేయుచుండును గనుక వీటిని నిరోధించుటచేత చిత్తము శాంతించును. ప్రాణస్పందము వాసనలు ఈ రెండు చిత్తప్రవర్తకములని వసిష్ఠ మహాముని చేఁ జెప్పఁబడినది.

శ్లో. ద్వే బీజే చిత్తవృక్షస్య వృత్తిప్రతతిధారిణః,
ఏకం ప్రాణపరిస్పందః ద్వితీయం దృఢవాసనా.

తా. చిత్తమను వృక్షము వృత్తులను తీగెలతోఁ జుట్టఁబడియున్నది. ఇట్టి వృక్షమునకు రెండువిత్తనములు కలవు. అందులో నొకటి ప్రాణవాయుస్పందము. రెండవది దృఢమగు వాసనలు.

శ్లో. సతీసర్వగతా సంవిత్ప్రాణస్పందేన భోధ్యతే,
సంవేదనాదనంతాని తతో దుఃఖాని చేతసః. అని.

తా. లోహకారులు అనఁగా కమ్మరవాండ్లు నివురు కప్పిననిప్పును తిత్తులతో నేప్రకారముగా నూదుదురో తిత్తులతో నూదఁగా పుట్టినవాయువు చేత నగ్ని యేప్రకారము జ్వలించునో యాప్రకారమే చిత్తమున కుపాదాన కారణమయిన యజ్ఞానముచేత నావరింపఁబడిన జ్ఞానము ప్రాణస్పందము చేత బోధింపఁబడి చిత్తవృత్తిరూపముగాఁ బ్రజ్వలించుచుండును.

ఆచిత్తవృత్తియని చెప్పఁబడు జ్ఞానజ్వాలారూపమగు సంవేదనమువలన దుఃఖములు పుట్టుచుండును. ఇదియె ప్రాణాస్పందమను బీజముచేత చిత్తోత్పత్తిప్రకారమును దృఢవాసనయను బీజముచేత చిత్తము పుట్టుప్రకారమును వసిష్ఠమహాముని చేఁ జెప్పఁబడినది.

శ్లో. భావసంవిత్ప్రకటితా మయానుభూతాం చ రాఘవ,
చిత్తస్యోత్పత్తిమపరాం వాసనాజనితాం శృణు.

తా. స్వభావజ్ఞానముచేత ప్రకటన చేయఁబడి నాచేత ననుభవింపఁబడిన చిత్తముయొక్క దృఢవాసనాజన్యమయిన యుత్పత్తిని చెప్పెదను. అనఁగా చిత్తముయొక్క యుత్పత్తి దృఢవాసనచేతఁగూడ కలుగును. ఇది నాయనుభవముచేతను చిత్తముయొక్క స్వభావము నాలోచించుటచేతను నిశ్చయింపఁబడినది. దీనిని విశదముగాఁ జెప్పెదను అని భావము.

శ్లో. దృఢాభ్యస్తపదార్థైకభావనాదతిచంచలం,
చిత్తం సంజాయతే జన్మజరామరణకారణం. అని.

తా. దృఢముగా నభ్యసింపఁబడిన శబ్దాదివిషయములను ముఖ్యముగా భావించుటచేత నతి చపలమయిన చిత్తము జన్మించును. ఈచిత్తమే జన్మజరామరణాదిసంసారమునకు కారణమై యుండును. ప్రాణస్పందవాసనలు చిత్తమునకు ప్రేరకములని చెప్పి పరస్పరమొకదాని కొకటియుఁ బ్రేరకమయి యుండునని కూడ వసిష్ఠమహామునిచేఁ జెప్పఁబడినది.

శ్లో. వాసనావశతః ప్రాణస్పందస్తేన చ వాసనా,
క్రియతే చిత్తబీజస్య తేన బీజాంకురక్రమః. అని.

తా. వాసనలచేత ప్రాణస్పందము ప్రాణస్పందముచేత వాసనలు ప్రవర్తించుచుండును. ఇదియె చిత్తబీజమునకు బీజాంకురన్యాయము. ఒకవిత్తనముచేత నొకచెట్టు పుట్టును. ఆచెట్టువలన నొకబీజము పుట్టును. దానివలన మరియొకచెట్టు, దానివలన మరియొక బీజము. ఈప్రకారము అనాదినుండి బీజాంకురములొకటికొకటి ప్రవర్తకములై యుండును. ఇదియె బీజాంకురన్యాయము.

ప్రాణస్పందవాసనలు పరస్పరప్రవర్తకములు గనుకనే వీటిలో నొకదానిని నశింపఁజేసినను రెండవదియు నశించును.

ఇదియును వసిష్ఠునిచేఁ జెప్పఁబడినది.

శ్లో. ద్వే బీజే చిత్తవృక్షస్య ప్రాణస్పందనవాసనే,
ఏకస్మిన్ చ తయోః క్షీణే క్షిప్రం ద్వే అపి నశ్యతః. అని.

తా. చిత్తవృక్షమునకు ప్రాణస్పంద మని వాసన లని రెండుబీజములు కలవు. వాటిలో నొకటి నశించినా రెండు కూడ నతిశీఘ్రముగా నశించును.

ప్రాణస్పందవాసనలు నశించునుపాయము నశించిన తరువాత కలుగుఫలమును వసిష్ఠునిచేతనే చెప్పఁబడినది.

శ్లో. ప్రాణాయామదృఢాభ్యాసైర్యుక్త్యా చ గురుదత్తయా,
ఆసనాశనయోగేన ప్రాణస్పందో నిరుధ్యతే.

తా. రేచకపూరకకుంభకము లను ప్రాణాయామములను దృఢముగా నభ్యసించుటవలన గురువుచేచూపింపఁబడిన యుక్తివలన పద్మాసన స్వస్తికాసనాది సుఖాసనాభ్యాసము వలన

శుద్ధమై మితమయిన ఆహారమును పుచ్చుకొనుటవలన ప్రాణ వాయువుయొక్క చలనము నిరోధింపఁబడును.

శ్లో. అసంగవ్యవహారత్వాద్భవభావనవర్జనాత్,
శరీరనాశవర్తిత్వాద్వాసనా న ప్రవర్తతే.

తా. లౌకికవైదికకర్మల ననుష్ఠించునపుడు కర్తృత్వాభిమానము ఫలాభిలాషయును లేకుండ వ్యవహరించుటవలన సాంసారికఫలముల నాలోచింపకపోవుటవలన శరీరము నశించునని విచారించుటవలన వాసనలు ప్రవర్తింపక నిలిచిపోవును.

శ్లో. వాసనాసంపరిత్యాగాచ్చిత్తం గచ్ఛత్యచిత్తతాం,
ప్రాణస్పందనిరోధాచ్చ యథేచ్ఛసి తథా కురు.

తా. వాసనలను విడుచుటవలనఁగాని ప్రాణాయామము నభ్యసించి ప్రాణవాయువును నిరోధించుటవలనఁగాని చిత్తము నశించును. ఓరామా! యీరెంటిలో నీకు దేనియందు రుచి కలదో దాని నాచరింపుము.

శ్లో. ఏతావన్మాత్రకం మన్యే రూపం చిత్తస్య రాఘవ,
యద్భావనం వస్తునోఽంత ర్వస్తుత్వేన రసేన చ.

తా. శబ్దాదిపదార్థములను వాస్తవములని సుఖరూపములని హృదయమందు భావించుటయే చిత్తమని తలఁచెదను. ఇంతకు అతిరిక్తమగు రూపము చిత్తమున కున్నట్టు కనుపడదు.

శ్లో. యదా న భావ్యతే కించి ద్ధేయోపాదేయరూపి యత్,
స్థీయతే సకలం త్యక్త్వా తదా చిత్తం న జాయతే.

తా. పురుషుఁడు త్యాజ్యము లగు కంటకాదిపదార్థములను గ్రాహ్యము లగు చందనాదిపదార్థములను అన్నిటిని నాలోచించుట లేకయే సర్వమును విడిచి యెప్పు డుండునో అప్పుడు చిత్తము జన్మింపక యుండును.

శ్లో. అవాసనత్వాత్సతతం యదా న మనుతే మనః,
అమనస్తా తదోదేతి పరమోపశమప్రదా. అని.

తా. వాసనలు లేకపోవుటవలన మనస్సు ఎప్పుడు విషయముల నాలోచింపక యుండునో. అప్పుడు సర్వాధికమైన శాంతిని కలుగఁజేయు అమనస్కత కలిగె నని తెలియవలయును.

అమనస్కత కలుగనిపక్షమందు శాంతి కలుగదనియుఁ జెప్పఁబడుచున్నది.

శ్లో. చిత్తక్షయాదృతాక్రాంతం న మిత్రాణి న బాంధవాః,
శక్నువంతి పరిత్రాతుం గురవో న చ మానవాః. అని.

తా. చిత్తక్షయము అనఁగా అమనస్కత. దీనితోఁ గూడుకొననివానిని మిత్రులు గాని బంధువులు గాని గురువులు గాని ఇతరులయిన దయాళు లగుమనుష్యులు గాని రక్షింపఁ జాలరు. అనఁగా పరమశాంతియను మోక్షము నియ్యఁజాలరని భావము.

ప్రాణవాయువును నిరోధించు నుపాయమును చెప్పి నప్పుడు ఆసనమును, అశనవిశేషమును అభ్యసింపవలయునని చెప్పినవాటిలో ఆసనముయొక్క లక్షణమును, ఉపాయమును,

ఫలమును మూఁడుసూత్రములచేత పతంజలిమహాముని ప్రతి పాదించియున్నారు.—

సూ. స్థిరసుఖమాసనమ్.

సూ. ప్రయత్నశైథిల్యానంతసమాపత్తిభ్యామ్.

సూ. తతోద్వంద్వానభిఘాతః. అని.

తా. దేహవిన్యాసరూపము లగు పద్మకస్వస్తికాద్యాసనములలో నెవనికి నేయాసనమువలన దేహచలనము లేకుండ స్థిరమైయుండునో, అవయవములకు పీడ లేకుండ సుఖము కలిగియుండునో, అదియే వానికి ముఖ్యమయిన యాసనము. ఇట్టి యాసనమునకు ప్రయత్నశైథిల్యము లోకసిద్ధ మగు నుపాయము. అనఁగా దూరమార్గము నడుచుటయందు గృహకృత్యములయందు తీర్థయాత్రలయందు తీర్థస్నానములయందు యాగహోమాదులయందు ఇవి మొదలయిన వాటియందుఁ గల ఉత్సాహమును విడువవలయును. ఇందువలన స్థిరమైన యాసనము సిద్ధించును అనిభావము. గమనాదులయందు ఉత్సాహమును విడువనియెడల నాయుత్సాహము శరీరమును బలాత్కారముగా లేవఁదీసి తత్తత్కార్యములయందుఁ బ్రవర్తింపఁజేయును. అందువలన స్థిరమైన యాసనము సిద్ధింప నేరదు. సహస్రఫణములచేత భూమిని ధరించి స్థిరముగా నిలిచియుండు శేషుఁడను, అనంతుఁడను నేనే యను దృఢధ్యానము శాస్త్రసిద్ధమగు నుపాయము. ఇట్టి ధ్యానమువలన స్థిరాసనము సిద్ధించుటకు సాధనమయిన పుణ్యశేష ముద్భవించును. ఆపుణ్యమువలన స్థిరాసనము

సిద్ధించును. ఆసనము సిద్ధించిన తరువాత శీతోష్ణ సుఖ దుఃఖ మానావమానాదిద్వంద్వసహనము కలుగును.

అని మూఁడు సూత్రములను క్రమముగా నర్థము. ఇందులో మొదటిసూత్రమువలన ఆసనముయొక్క లక్షణము, రెండవ సూత్రమువలన ఉపాయము అనఁగా సాధనము, మూఁడవసూత్రమువలన ఆసనముయొక్క ఫలమును చెప్పఁబడినది.

ఇట్టి ఆసనమును గూర్చి యోగ్య మయినదేశము శ్వేతాశ్వతరోపనిషత్తులోఁ జెప్పఁబడినది.

శ్రు. వివిక్తదేశే చ సుఖాసనస్థ శ్శుచిస్సమగ్రీవశిరశ్శరీరః. అని

తా. జనశూన్యమయిన ప్రదేశమందు పద్మకస్వస్తికా ద్యాసనములలో తనకు నేది సుఖకర మయిన యాసనమో, యట్టి యాసనముతో కూర్చుండి బాహ్యాభ్యంతర శౌచములు కలవాఁడై కంఠమును, శిరస్సును, శరీరమును సమముగానుంచి యోగము నభ్యసింప వలయునని భావము.

శ్రు. "సమే శుచౌ శర్కరావహ్నివాలుకావివర్జితే, శబ్దజలాశ యాదిభిః, మనోనుకూలేన చ చక్షుపీడనే గుహా నివాతాశ్రయణే ప్రయో జయేత్" అని.

మఱియొక శ్రుతియును ఆసనమునకు యోగ్యమయిన దేశమును చెప్పుచున్నది.

తా. నిమ్నోన్నతములు లేకుండ సమానముగా నుండు నదియు స్వభావమువలనఁగాని మార్జనాదిసంస్కారములవలనఁ గాని పరిశుద్ధమయినదియు సన్నరాళ్లు వేడిమి ఇసుక కర్ణకఠోర

ములగుశబ్దములు అతిశైత్యము ఇట్టిదోషములు లేనిదియు, దోమలు మొదలగు జంతువులు లేనిదియు విశేషవాయువు ప్రసరించనిదియునైన పర్వతగుహా నదీతీరను మొదలయిన ప్రదేశములయందు యోగము నభ్యసింపవలయునని భావము.

ఇందుచేత ఆసనయోగము వివరింపఁబడినది. ఇఁకను అశనయోగము వివరింపబడును. అశనమనఁగామితాహారము.

శ్లో. అత్యాహారమనాహారం నిత్యం యోగీ విసర్జయేత్.

అను స్మృతి ఆహారమును అధికముగా పుచ్చుకొనుట, నుతరాం ఆహారమును పరిత్యజించుట యీరెండు యోగికి పనికిరావని చెప్పుచున్నది.

భగవద్గీతలయొక్క షష్ఠాధ్యాయమునందుఁ జెప్పఁబడినది.

శ్లో. నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః,
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున.

తా. ఆహారము నెక్కువగా పుచ్చుకొన్నను, బొత్తిగా నాహారమును మానినను, అధికముగా నిద్రించినను, బొత్తిగా నిద్రను మానినను యోగము సిద్ధింపదని భావము.

శ్లో. యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా. అని.

తా. ఉచితమైన యాహారము, ఉచితమైన సంచారము, లౌకికవైదికకర్మలయందు యథోచితముగా వ్యవహారము, యథోచితమగునిద్ర, యథోచిత మగు జాగరణము, ఇవి కల

వానికి యోగము సర్వదుఃఖముల నివర్తింపఁజేయు నని భావము.

పద్మక స్వస్తికాద్యాసనముల నభ్యసించినపురుషునకు ప్రాణాయామమువలన మనోనాశము కలుగు నని శ్వేతాశ్వతరోపనిషత్తులో చెప్పఁబడియున్నది.

శ్రు. త్రిరున్నతం స్థాప్య సమం శరీరం హృదీంద్రియాణి మనసా సన్నివేశ్య, బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్ స్రోతాంసి సర్వాణి భయావహాని. అని.

తా. కంఠమును, శిరస్సును, మధ్యకాయమును, ఈమూటిని ఉన్నతముగా సమముగానుంచి మనస్సుతోఁగూడ చక్షురాదీంద్రియములను హృదయపుండరీకమునందుఁ జేర్చి ఆ హృదయపుండరీకమునం దుండు పరమాత్మను ధ్యానించుచు, అట్టి పరమాత్మధ్యానమను తెప్పచేతనే భయసంపాదకము లగు సంసారనదులను బ్రహ్మనిష్ఠుఁడగు పురుషుఁడు దాఁటవలయును.

శ్రు. ప్రాణాన్ ప్రపీడ్యేహ స యుక్తచేష్టః క్షీణే ప్రాణే నాసికయోః శ్వసీత, దుష్టాశ్వయుక్తమివ వాహ మేనం విద్వాన్ మనో ధారయేతాప్రమత్తః. అని.

తా. బ్రహ్మధ్యానాభ్యాసముచేయు పురుషుఁడు ఉచితమైన యాహారవిహారములు కలవాఁడై రేచకపూరకకుంభకములచేత ప్రాణవాయువులను నిరోధించి ప్రాణము క్షీణించిన తరువాత నాసికారంధ్రములద్వారా మెల్లదిగా శ్వాసమును వదలవలయును. తరువాత దుష్టాశ్వములను కట్టిన రథమును

బహుజాగ్రతగా నడిపించునట్లు మనస్సును ఇంద్రియములతోఁ
కూడ ప్రమాదము లేకుండ కనిపెట్టి నడిపించవలయును అనఁ
గా అహింసా బ్రహ్మచర్యాదిసాధనముల నభ్యసించినతరువాత
పద్మకస్వస్తికాద్యాసనములలో నొకదానియందు నిలిచి రేచక
పూరక కుంభకములను ప్రాణాయామములచేత ప్రాణవాయు
వును నిరోధించి మనస్సును, ఇంద్రియములను ప్రత్యాహారము
చేత స్వాధీనపఱచుకొని పరమాత్మస్వరూప పర్యాలోచన
నాచరింపుచు బహుజాగ్రతగా నుండవలయును.

వా. యోగి యగువాఁడు రెండువిధములు. ఒకఁడు
విద్యామదధనమదాద్యసురసంపదకలవాఁడు, మఱియొకఁ డవి
లేనివాఁడును వీరిలో రెండవవానికి బ్రహ్మాభ్యాసమువలన మన
స్సు నిగ్రహింపఁబడఁగా, తదధీనమైన ప్రాణవాయువుకూడ
నిరోధింపఁబడును. అట్టియధికారి నుద్దేశించి "త్రిరున్నతం
స్థాప్య" యనుశ్రుతి ప్రవర్తించినది. రెండవవానికి ప్రాణాయా
మాభ్యాసమువలన ప్రాణము నిరోధింపఁబడఁగా తదధీనసిద్ధిక
మైనమనస్సుకూడ నిరోధింపఁబడును. ఇట్టి అధికారి నుద్దేశించి
"ప్రాణాన్ ప్రపీడ్యేహ" యనుశ్రుతి ప్రవర్తించినది. అనఁగా
ప్రాణస్పందము మనస్పందమునకును, మనస్పందము ప్రాణస్పంద
మునకును కారణమైయుండును. కనుక బ్రహ్మాభ్యాసాభ్యాసము
వలన మనస్సును నిరోధించెనా, ప్రాణస్పందము తనం
తట తానే నిరోధింపఁబడును. ప్రాణాయామాభ్యాసము
వలన ప్రాణమును నిరోధించెనా, మనస్పందము తనంతట
తానే నిలిచిపోవును. అయితే విద్యామదధనమదాదిమలిన

వాసనలు లేనివానికి ధ్యానాభ్యాసము సుకరమైయుండును అవికలవానికి సాధుసంగమసచ్ఛాస్త్రశ్రవణపూర్వముగా సాధింపదగిన ధ్యానాభ్యాసము దుష్కరమైనందున ప్రాణాయామాభ్యాసము చేయవలసియుండును అని తాత్పర్యము.

ప్రాణమును నిరోధింపవలసినప్రకారము ముందు చెప్పఁబడును. ఇట్టి ప్రాణనిరోధమువలన మనస్సుయొక్క వ్యాపారములయినవిద్యామదధనమదాదులునిరోధింపఁబడును. ప్రాణనిరోధమువలన చిత్తదోషములు నిరోధింపఁబడు నను నర్థమందు దృష్టాంతము ఒకచోట చెప్పఁబడినది.

శ్రు. యథా పర్వతధాతూనాం దహ్యంతే దహనాన్మలాః,
తథేంద్రియకృతా దోషా దహ్యంతే ప్రాణనిగ్రహాత్. అని.

తా. పర్వతములయం దుండు రజతాదిధాతువుల యొక్క అసారాంశములు ఏప్రకారముగా నగ్నివలన దహింపఁబడునో యాప్రకారమే ఇంద్రియములయొక్క దోషములు ప్రాణవాయునిరోధమువలన దహింపఁబడు ననియర్థము.

ఈ యర్థమందు ఉపపత్తి వసిష్ఠమహామునిచేఁ జెప్పఁబడినది.

శ్లో. యః ప్రాణపవనస్పందశ్చిత్తస్పందస్స ఏవ హి,
ప్రాణస్పందక్షయే యత్నః కర్తవ్యో ధీమతోచ్చకైః. అని.

తా. ప్రాణవాయువుయొక్క స్పందమే మనస్స్పందము కాని వేఱు కాదు గనుక ప్రాణస్పందమును నిరోధించుటయందు బుద్ధిమంతుఁడగువాఁడు విశేషప్రయత్నమును జేయవలయును.

వా. మనస్సు, వాక్కు, చక్షుస్సు మొదలైన యింద్రియముల కధిష్ఠానదేవతలు చంద్రాగ్నిసూర్యాదులు. వీరు తమ తమవ్యాపారములగు మనన ప్రవచన దర్శనాదులను నిరంతరముగాఁ జేయుదు మని వ్రతము నవలంబించి శ్రమ యను మృత్యువువలననాక్రమింపఁబడిరి. అనఁగా వాగాదింద్రియములు ప్రవచనాదివ్యాపారములను కొంత కాలము చేయఁగా వాటికి శ్రమ కలిగె నని భావము. ప్రాణము తనవ్యాపారమును జేయునప్పు డామృత్యువు దాని నాక్రమింపలేక పోయెను. కనుకనే నిరంతరముగా నుచ్ఛ్వాసనిశ్వాసములను ప్రాణము చేయుచున్నప్పటికి శ్రమను పొందక పోయెను అప్పుడు ఇంద్రియాధిష్ఠానదేవత లందఱు నాలోచించి ముఖ్యప్రాణములోఁ బ్రవేశించిరి. అనఁగా ఇంద్రియము లన్నియు ముఖ్యప్రాణాధీనవృత్తులు కలవై యుండె నని భావము.

ఈ యర్థము బృహదారణ్యశాఖయందుఁ జెప్పఁబడి యున్నది.—

శ్రు. అయం వై నః శ్రేష్ఠో యః సంచరంశ్చాసంచరంశ్చ న వ్యథతే ఽథో న రిష్యతి హంతాస్యైవ సర్వే రూపమసామ ఇతి. ఏతస్యైవ సర్వే రూపమభవన్ తస్మాదేత ఏతే నాఖ్యాయంతే ప్రాణా ఇతి.

తా. వాగాదింద్రియము లన్నియు నాలోచించి "యేది ఉచ్ఛ్వాసనిశ్వాసరూపముగా సంచరించుచున్నప్పటికి వ్యథను గాని నాశమును గాని పొందదో, అట్టిప్రాణమే మనలో శ్రేష్ఠమై యున్నది. మనమందఱము నీ ప్రాణముయొక్క రూపముగానే ఉండుదము" అని నిశ్చయించి, అన్నియు ముఖ్యప్రాణము

యొక్క రూపముగానుండెను. అనఁగా ముఖ్యప్రాణాధీనవ్యాపారములు కలవై యుండెను. కనుకనే వాగాదీంద్రియము లన్నియు ప్రాణము లనివ్యవహరింపఁబడుచున్నవి. అని శ్రుతుల యొక్క భావము.

ఇంద్రియము లన్నియు ముఖ్యప్రాణాధీనవ్యాపారములు కలవై యున్నవి. అని బృహదారణ్యములోని యంతర్యామిబ్రాహ్మణములో సూత్రాత్మను నిరూపించునప్పుడు చెప్పఁబడినది.

శ్రు. వాయుర్వై గౌతమ తత్సూత్రం వాయునా వై గౌతమ సూత్రేణాయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి చ భూతాని సందృబ్ధాని భవంతి. తస్మాద్వై గౌతమపురుషం ప్రేతమాహుర్వ్యస్రంసిషతాస్యాంగానీతి. అని.

శ్రు. వాయునా వా గౌతమ సూత్రేణ సందృబ్ధాని భవంతి. అనియుం.

తా. జనకసభలో బ్రహ్మవేత్త యగు యాజ్ఞవల్క్యమహామునితో మునులందఱు వాదము చేయునప్పుడు ఉద్దాలకుఁడనునొకముని యాజ్ఞవల్క్యమహామునిని గూర్చి ఓయాజ్ఞవల్క్య, నేను మద్రదేశమునందు పతంజలియను బ్రాహ్మణుని యొక్కగృహములో యజ్ఞవిద్యను అభ్యసించుచుంటిని. అప్పుడాపతంజలిభార్యయొక గంధర్వగ్రహముచేత పట్టుకోఁబడియుండెను. ఆగంధర్వగ్రహమును నేనునాసహాధ్యాయులు నీవెవఁడవని అడిగితిమి. అందుకాగ్రహము కబంధుఁడను నామము కలవాఁడ నని చెప్పి మమ్ముమ మాయుపాధ్యాయుఁడగు పతంజలిని గూర్చి యీలోకము, పరలోకము, సకలభూతములు దేనిచేత

ధరింపఁబడియున్నవో అట్టి సూత్రాత్మను నెఱుఁగుదురా యని అడిగెను. మాయుపాధ్యాయుఁ డగు పతంజలి నేనెఱుఁగ నని చెప్పెను. తిరిగి ఆ గంధర్వగ్రహము నీలోకమును పరలోకమును, సకల మయినభూతములను ఎవఁడు లోపలనుండు సకల కార్యములయందు నియమించుచుండునో, అట్టి అంతర్యామిని నెఱుఁగుదువా యని అడిగెను. మా యుపాధ్యాయులు అంతర్యామిని కూడ నెఱుఁగ నని చెప్పెను. అంతట నాగంధర్వగ్రహముచే నడిగిన సూత్రమును అంతర్యామిని యెవ్వఁ డెఱుఁగునో, వాఁడే బ్రహ్మవేత్త యని లోకవేత్తయని వేదవేత్త యని చెప్పఁబడు నని చెప్ప ఆసూత్రాత్మను అంతర్యామిని మాకు చెప్పెను. అందుచేత నే నాసూత్రాంతర్యాములను తెలిసియున్నాను. ఓ యాజ్ఞవల్క్యా, నీవు ఆసూత్రమునుగూర్చి అంతర్యామినిగూర్చి యేమైనను తెలిసియుండె నేని, తెలియక యుండి బ్రహ్మవేత్తలకు దక్షిణగానుంచఁబడిన యీగోకదంబమును నీవు గ్రహించితివా, నీశిరస్సు పగిలిపోవునని అడిగెను. అందులకు యాజ్ఞవల్క్యమహాముని ఓయుద్దాలకా ఆగంధర్వగ్రహము మీకుచెప్పినసూత్రమును అంతర్యామిని నేనెఱుఁగుదును అని యీప్రకారము చెప్పసాగెను.

గంధర్వగ్రహముచేతఁ జెప్పఁబడిన సూత్రము వాయువు. ఈవాయువు ఆకాశమువలెనే సూక్ష్మమయినదియు, సర్వభూతములను ధరించునదియును సప్తదశావయవాత్మకమై సమష్టివ్యష్టిరూపమయిన లింగమే యీవాయువుయొక్క శరీరము.

అనఁగా వాక్పాదపాణిపాయూపస్థ లను కర్మేంద్రియము లైదు, త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణము లను జ్ఞానేంద్రియము లయిదు మనస్సు, బుద్ధి, శబ్దస్పర్శరూపరసగంధము లను పంచతన్మాత్రలు ఈ యైదు నేడింటితోఁ జేరిన లింగశరీరమగు సూత్రాత్మ యను వాయువుయొక్క శరీరము పురాణములోఁ జెప్పిన నలువదితొమ్మిది మూరుతస్కంధములు దీని వికారములు. ఇట్టి వాయువను సూత్రముచేతనే యీలోకము పరలోకము సమస్తభూతములు ముత్యములయందు దారము కూర్పఁబడి యున్నట్లు కూర్పఁబడి యున్నవి.

వాయువను సూత్రముచేతనే సర్వము కూర్పఁబడి యున్నది గనుకనే మృతినొందినపురుషునివలన సూత్రమను వ్యష్టివాయువు తొలఁగిపోయినందున అట్టి పురుషునియొక్క అవయవములు దారము తెగిపోయినముత్యములవలె శిథిలములైనవని లోకులవలనఁ జెప్పఁబడును. అని యాజ్ఞవల్క్యమహాముని చెప్పఁగా నుద్దాలకుఁడు సూత్రాత్మను చెప్పితివి యింకను అంతర్యామిని చెప్పుదువుగాక అని ప్రశ్నచేయఁగా విస్తారముగా నంతర్యామిస్వరూపమును జెప్పెను.

కనుక ప్రాణము, మనస్సు ఈ రెండు నొకటిగానున్నందున ప్రాణమును నిరోధింపఁగా మనస్సు కూడ నిగ్రహింపఁబడును.

ఆక్షేపము—ఓయీ ప్రాణమనస్సులు రెండు కూడ చలించుచుండునుగనుక నొకదానిని నిరోధించితే రెండవదికూడ నిరోధింపఁబడు నని చెప్పుట యుక్తము కాదు. సుషుప్తిదశలో

ప్రాణము చలించుచున్నప్పటికి మనస్సుయొక్క చలనము కనుపడలేదు గదా.

సమాధానము—సుషుప్తిదశలో మనస్సు ప్రాణములో లయించిపోవును. అందుచేతనే మనస్సుయొక్క చలనము వేరుగాఁ గనుపడదు. జాగ్రద్దశలో మనస్సు ప్రాణములోనుండి తొలఁగి వేఱుగానుండును గనుక ప్రాణచలనమనశ్చలనములు వేఱువేఱుగా గనుపడుచుండును. అట్టిదశలో నొకదానియొక్క నిరోధముచేత రెండవది కూడ నిరోధింపఁబడును.

ఆక్షేపము—ఓయీ "ప్రాణాన్ ప్రపీడ్య" యను శ్రుతియందు ప్రాణములు క్షీణించినతరువాత నాసికారంధ్రముల ద్వారా నెమ్మదిగా శ్వాసమును విడువవలయు నని చెప్పుట విరుద్ధముగా నున్నది.

ప్రాణము క్షయించుట యనఁగా మరణమే కదా. అట్టి మరణదశలో శ్వాసము కనుపడుట లేదు. శ్వాసము కనుపడుచుండఁగా, ప్రాణము క్షీణించుట లేదు గదా? కనుక నిది విరుద్ధము.

సమాధానము—ప్రాణముయొక్క క్షయమనఁగా అధికముగ ప్రవర్తింపక పోవుటయే కాని సుతరాం నాశము కాదు. భూమిని త్రవ్వువానికి చెట్టును కొట్టువానికి పర్వతము నెక్కువానికి బహుదూరము పరుగిడువానికి నెంత శ్వాసవేగము కలిగియుండునో, అంత వేగము నెమ్మదిగాఁ గూర్చున్నవానికి నే ప్రకారము ఉండదో, ఆ ప్రకారమే ప్రాణాయామమును విశే

షముగా నభ్యసించువానికి నాసారంధ్రములయం దతిస్వల్పమైన శ్వాసము కలిగియుండును.

ఈయభిప్రాయముచేతనే యొకచోట నిట్లు వినఁబడుచున్నది.

శ్లో. భూత్వా తత్రాయతప్రాణః శనైరేవ సముచ్ఛ్వసేత్. అని.

తా. పద్మకాద్యాసనములలో నొకదానియందు కూర్చుండి ప్రాణమును బిగఁబట్టి తరువాత నెమ్మదిగా శ్వాసమును విడువవలయు నని యర్థము.

దుష్టములగు నశ్వములు గట్టిన రథము ఆగుఱ్ఱములచేత మార్గమును తొలఁగించి యేప్రకార మీడ్వఁబడునో, సారథియగువానిచేత గుఱ్ఱములను కళ్లెములతో దృఢముగాఁ గట్టిపట్టుకొని మంచిమార్గమునందు నేప్రకారము నడిపింపఁబడునో ఆప్రకారము ఇంద్రియములచేత వాసనానురూపముగా మనస్సు నానావిషయములయందుఁ బ్రవర్తింపఁ జేయఁబడుచుండును. ప్రాణమును దృఢముగా బిగించినపక్షమునను విషయమార్గములయందు సంచరింపక సన్మార్గమందే సంచరించును.

వెనుకటి శ్రుతిలో ప్రాణములను నిరోధింపవలె నని చెప్పియున్నది. ప్రాణమును నిరోధించుప్రకారము గ్రంథాంతరమం దీప్రకారము చెప్పఁబడియున్నది.

శ్లో. సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం శిరసా సహ,
త్రిః పఠేదాయతప్రాణః ప్రాణాయామస్స ఉచ్యతే.

ఈశ్లోకార్థము పూర్వము వ్రాయఁబడియున్నది.

శ్లో. ప్రాణాయామాస్త్రయః ప్రోక్తా రేచపూరకకుంభకాః,

తా. రేచకము, పూరకము, కుంభకము అని ప్రాణాయామములు మూఁడుప్రకారములుగా నున్నవి.

శ్లో. ఉత్క్షిప్య వాయుమాకాశం శూన్యం కృత్వా నిరాత్మకం,
శూన్యభావేన యుంజీయాద్రేచకస్యేతి లక్షణః.

తా. దేహమధ్యమమునం దుండు ప్రాణవాయువును వెలుపలికి తీయుటకొఱకు శరీరమునుండి లేక నెత్తి శరీరాంతరాళమం దుండు నాకాశమును శూన్యముగాఁ జేసి అనఁగా స్వల్పమైన ప్రాణవాయువును గూడ నచ్చట లేకుండఁ జేసి శూన్యముగా నుంచుట రేచకప్రాణాయామ మనఁబడును.

శ్లో. వక్త్రేణోత్పలనాళేన తోయమాకర్షయేన్నరః,
ఏవం వాయుర్గృహీతవ్యః పూరకస్యేతి లక్షణః.

తా. కలువకాడను నోటియం దుంచుకొని జలమును పీల్చినట్లు నాసికారంధ్రములలో నొకదానిగుండా బాహ్యవాయువును పీల్చుట పూరకప్రాణాయామ మని చెప్పఁబడును

శ్లో. నోచ్ఛ్వసన్న చ నిశ్వాసేన్న చ గాత్రాణి చాలయేత్,
ఏవం తావన్నియుంజీత కుంభకస్యేతి లక్షణం. అని.

తా. దేహబాహ్యవాయువు లోపలికి దేహమధ్యవాయువును వెలుపలికిని ఆకర్షింపక నిరోధించి శరీరావయవములను కదల నియ్యకయుండుట కుంభక మని చెప్పఁబడును. కుంభకప్రాణాయామము ఆంతర మని బాహ్య మని రెండువిధములు.

ఈరెంటిని వసిష్ఠమహర్షి వివరించి చెప్పియున్నారు.

శ్లో. అపానేఽస్తంగతే ప్రాణో యావన్నాభ్యుదితో హృది,
తావత్సా కుంభకావస్థా యోగిభిర్యానుభూయతే.

తా. అపానము అనఁగా నాభికి దిగువ నుండువాయువు లయము నొందినతరువాత ప్రాణవాయువు వెంతవఱకు హృదయమునందు పుట్టకయుండునో ఆయవస్థ అంతరకుంభక మనఁబడును. ఇది యోగాభ్యాసకుశలు లగు వారిచేతనే యనుభవింపఁబడును.

శ్లో. బహిరస్తం గతే ప్రాణే యావన్నాపాన ఉద్భవః,
తావత్పూర్ణా సమావస్థా బహిస్థం కుంభకం విదుః అని.

తా. ప్రాణవాయువు బాహ్యదేశమందు లయమునొందిన తరువాత, అపానము ఎంతవరకునుత్పత్తినొందదో, అంతవరకుఁగల యవస్థ బాహ్యకుంభక మనఁబడును. అనఁగా బాహ్యవాయువును పూరకముచేత లోపలికి నాకర్షించి తిరిగి వెలుపలికి రాకుండ నిర్బంధించుట అంతరకుంభక మని, రేచకముచేత నాంతరవాయువును వెలుపలికిఁ దీసి తిరిగి లోపలికి పోకుండ నిరోధించుట బాహ్యకుంభక మని చెప్పఁబడు నని భావము. ఇందులోను చ్ఛ్వాసముఅనఁగా బాహ్యవాయువునాసారంధ్రముల గుండా లోపలికి పోవుట. ఇది బాహ్యకుంభకమునకు విరోధిగా నుండును. నిశ్శ్వాసముఅనఁగా లోపలివాయువు నాసారంధ్రములోనుండి వెలుపలికి వచ్చుట. ఇది అంతరకుంభకమునకు విరోధిగా నుండును. శరీరావయవములు చలించెనేని నిశ్శ్వాస

ముగాని ఉచ్ఛ్వాసముగాని తప్పక ప్రసరించును గనుక శరీరచలనము రెండుకుంభకములకు విరోధిగా నుండును. పతంజలిమహర్షిచేత ఆసనములను నిరూపించినతరువాత ప్రాణాయామము ప్రతిపాదింపఁబడినది.

సూ. తస్మిన్ సతి నిశ్వాసోచ్ఛ్వాసయోర్గతివిచ్ఛేదః ప్రాణాయామః.

తా. పద్మకస్వస్తికాద్యాసనములు సిద్ధించినతరువాత శ్వాసప్రశ్వాసములయొక్క సంచారమును నివర్తింపఁజేయు ప్రాణాయామము సిద్ధించును.

ఆక్షేపము —ఓయీ, కుంభకమందు నిశ్వాసప్రశ్వాసములయొక్క సంచారము లేక పోయినా, రేచకపూరకములయందు ఉచ్ఛ్వాసనిశ్వాసములు అవశ్యముగా సంచరించుచుండును గనుక అన్నిప్రాణాయామములకు నిశ్వాసప్రశ్వాసములయొక్క గతివిచ్ఛేదమే లక్షణ మని చెప్పుట యుక్తము కాదు.

సమాధానము —విశేషముగా నభ్యసించుటచేత స్వభావముగా నున్న నిశ్వాసప్రశ్వాససంచారము రేచకపూరకములయందు న్యూనతాధిక్యములను బొందును. ఇట్టి న్యూనతాధికత్వములే రేచకపూరకములయందు నిశ్వాసోచ్ఛ్వాసగతివిచ్ఛేద మని చెప్పఁబడినది. కుంభకమందు సంపూర్ణముగా గతివిచ్ఛేదము కలుగును గనుక ప్రాణాయామముల కన్నిటికి నిశ్వాసోచ్ఛ్వాసగతివిచ్ఛేదము లక్షణమని చెప్పఁదగియున్నది.

ప్రాణాయామాభ్యాసము పతంజలిమహర్షిచే సూత్రింపఁబడినది.

సూ. బాహ్యాభ్యంతర స్తంభవృత్తిః దేశకాలసంఖ్యాభిః పరిదృష్టో దీర్ఘ సూక్ష్మః. అని.

తా. రేచకము బాహ్యవృత్తి యనఁబడును. దీనియందాంతరవాయువు బాహ్యమునకు నెట్టివేయఁబడును. పూరకము ఆభ్యంతరవృత్తి యనఁబడును. దీనియందు బాహ్యవాయువు శరీరములోపలికి ఆకర్షింపఁబడును కుంభకము స్తంభవృత్తి యనఁబడును. దీనియందు బాహ్యాభ్యంతరవాయువులు రెండు కదలకుండ స్తంభింపఁబడును. ఇందులో నొకొక్కప్రాణాయామమును దేశకాలసంఖ్యలచేత పరీక్షింపవలయును. అది యెటువలెనంటే చెప్పెదను ప్రాణవాయువు స్వభావముగా హృదయదేశమునుండి బయలుదేరి నాసిక కెదురుగా నుండు ప్రదేశమునందు పన్నెండు అంగుళముల దూరము వరకు వ్యాపించి నిలిచిపోవుచుండును. అభ్యాసమును విశేషముగా చేయఁగా చేయఁగా నాభిస్థానమునుండి కాని మూలాధారము నుండికాని ప్రాణవాయువు బయలుదేరి నాసాగ్రభాగమునం దిరువదినాలు గంగుళములదూరము వ్యాపించి, అచ్చటఁగాని ముప్పదియాఱంగుళములదూరమువరకు వ్యాపించి అచ్చటఁగాని సమాప్తి నొందును. ఈరేచకమునందు ప్రయత్నాధిక్యము కలుగుచుండఁగా శరీరములోపల ప్రాణము బయలుదేఱునప్పుడు హృదయనాభ్యాదిదేశములలో నేప్రదేశము. చలించునో ఆప్రదేశమును గనిపెట్టి పరీక్షింపవలయును.

బాహ్యదేశమునందు సమాప్తినొందునప్పుడు సూక్ష్మమగు దూదిపింజను నాసాగ్రభాగమందునిచి యెన్నియంగుళముల దూరమున సమాప్తి నొందునో దానిని బరీక్షింపవలయును. అదియె దేశపరీక్ష యనఁబడును.

రేచకమును చేయునప్పుడు ప్రణవాక్షరములను పది మార్లుగాని ఇరువదిమార్లుగాని ఆవృత్తిచేసి ఎన్ని ప్రణవములను ఆవృత్తిచేయువరకు రేచింపఁబడునో దానిని బరీక్షింపవలయును. లేదా, తనమోకాలిని తనహస్తముతో నెమ్మదిగా ప్రదక్షిణముగా స్పృశించి—ఒకచిటికెవేయుకాలము ఒక మాత్ర యనబడును—ఇట్టిమాత్రాకాలములు ఎన్ని అగువరకు రేచింపఁబడునో దానిని బరీక్షింపవలయును. ఇదియె కాలపరీక్ష యనఁబడును. ఈమాసమందు దినమొకటికి పది రేచకములు, ఉత్తర మాసమునందు దినమొకటికి ఇరువది రేచకములు, తదుత్తర మాసమందు దినమొకటికి ముప్పది రేచకము లని సంఖ్యతోఁ బరీక్షింప వలయును. ఇదియె సంఖ్యాపరీక్ష యనఁబడును. పూరకమందుఁగూడ నీప్రకారమే దేశకాలసంఖ్యాపరీక్షలను చేయవలయును. యోచింపఁగా కుంభకమందు మాత్రము దేశవ్యాప్తి పరీక్ష చేయ శక్యము కాదు. అయినా కాలసంఖ్యాపరీక్షలను చేయవచ్చును. గట్టిగా నున్న దూదిపింజకడి యేప్రకారము దీర్ఘముగా సూక్ష్మముగా నేర్పడునో ఆప్రకారము దేశకాల సంఖ్యలచేత విశేషముగా నభ్యసింపఁబడి ప్రాణవాయువు కూడ దీర్ఘముగా సూక్ష్మముగా సంపాదింపఁబడును. అనఁగా లోపల హృదయకమలము వరకు వెలుపల పన్నెండంగుళములవరకు

స్వభావముగా వ్యాపించుప్రాణవాయువు రేచకపూరకాభ్యాసముచేత లోపల మూలాధారమువరకు వెలుపల ముప్పదియాఱంగుళముల దూరమువరకు స్వభావముగా ప్రసరించుచుండును. ఇదియె ప్రాణమునకుదీర్ఘత్వప్రాప్తి. లోపల స్పర్శవిశేషముచేతను వెలుపల దూదియొక్క చలనముచేతను తెలియఁబడు ప్రాణము అభ్యాసవిశేషముచేత విరళమై దుర్లక్ష్యముగా నుండును. ఇదియే ప్రాణమునకు సూక్ష్మతాప్రాప్తి. ఈ చెప్పిన రేచకపూరక కుంభకములకంటె విలక్షణమయిన మరియొక ప్రాణాయామము పతంజలిమహర్షి చేతనే సూత్రింపఁబడినది.

సూ. బాహ్యాభ్యంతరవిషయాక్షేపీ చతుర్థః. అని.

తా. దేహాంతర్గతముగ నుండు వాయువును యథాశక్తిగా వెలువరించి తరువాత చేయు కుంభకము బాహ్యకుంభకమనఁబడును. బాహ్యమునందుండు వాయువునుయథాశక్తిగా లోపలికిఁబీల్చుకొని తరువాత చేయు కుంభకను అంతరకుంభకమనఁబడును. రేచకపూరకములను రెంటిని విడిచి కేవలకుంభకమభ్యసింపఁబడినయెడల, ఇది నాలుగవప్రాణాయామ మని చెప్పఁబడును. నిద్రాలస్యాదిదోషములవలన నాక్రమింపఁబడిన వారికి రేచక పూరక కుంభకములు అనుష్ఠింపఁదగినవి. అట్టి దోషములు లేనివారికి కేవలకుంభకము అనుష్ఠేయ మని తెలియవలయును.

ఇట్టి ప్రాణాయామము నభ్యసించినందున సంభవించు ఫలము సూత్రింపఁబడినది.

సూ. తతః క్షీయతే ప్రకాశావరణం. అని.

తా. ప్రకాశమనఁగా శుద్ధసత్త్వము. దీనిని ఆవరించి యుండునది తమోగుణము. ఇది నిద్రాలస్యాదిదోషములను గలుగఁజేయును. ఇట్టితమోగుణము ప్రాణాయామాభ్యాసము చేత నశించును. ఇదియె ప్రాణాయామమునకు ఫలము.

మరియొకఫలము కూడ చెప్పఁబడినది.

సూ. ధారణాసుయోగ్యతా మనసః. అని.

తా. మూలాధారము, నాభిచక్రము, హృదయము, భ్రూమధ్యము, బ్రహ్మరంధ్రము ఇవి మొదలయిన ప్రదేశముల యందు చిత్తము నాకర్షించి స్థాపించుట ధారణ యనఁబడును.

సూ. దేశబంధశ్చిత్తస్య ధారణా.

తా. ఈసూత్రముచేత మూలాధారాదిప్రదేశముల యందు చిత్తమును నిలిపియుంచుట ధారణ యనిచెప్పఁబడినది.

ప్రాణాయామము రజోగుణోద్రేకమువలనఁగలుగు చపలత్వమును తమోగుణోద్రేకమువలనఁ గలుగు నిద్రాలస్యాది దోషములను నివారించి మనస్సును శుద్ధసత్త్వప్రధానముగాఁ జేసి శుభాశ్రయమందు స్థిరముగా నిలుచులాగునఁ జేయును.

శ్లో. ప్రాణాయామప్రధాభ్యాసై ర్వ్యస్తైశ్చ సురపత్తమా.

అను పూర్వముదాహరించిన శ్లోకములోని ముక్తిశబ్దము వలన యోగిజనప్రసిద్ధమగు శిరోరూపమునుచాలనను, జిహ్వాగ్రమువలన ఘంటికాభ్రమణము, నాభిచక్రమునందు జ్యోతిస్స్వరూపధ్యానము దేహమునువిస్మరింపఁజేయునౌషధ

ములను సేవించుట, ఇవి మొదలగుసాధనములు గ్రహింపఁబడును. ఇవి యోగశాస్త్రరహస్యము లయినందున యోగులగువారివలనఁ దెలియఁదగినవి.

ఇంతవరకు చిత్తనాశమునకు సాధనములగు వేదాంతశాస్త్రవిచారము, సత్పురుషసమాగమము, వాసనాక్షయము, ప్రాణవాయునిరోధము ఇవి చెప్పఁబడినవి. ఇఁకను చిత్తనాశసాధ్యమైన సమాధిని జెప్పెదము.

అయిదు భూమికలు గలచిత్తమునకు మొదటి మూఁడు భూమికలను విడిచి శేషించిన రెండుభూమికలు సమాధి యనఁబడును. చిత్తముయొక్క భూమికాపంచకము యోగభాష్యకారులగు వ్యాసాచార్యులవారివలన చూపింపఁబడినవి.

భా. క్షిప్తం, మూఢం, విక్షిప్తం, ఏకాగ్రం, నిరుద్ధమితి చిత్తస్య భూమయః. అని.

తా. క్షిప్తమని, మూఢమని, విక్షిప్తమని, ఏకాగ్రమని, నిరుద్ధమని చిత్తమునకు అయిదుభూమికలు కలవని అర్థము.

ఆసురసంపద యగు దంభదర్పాదివృత్తులయందు వెనుకఁ జెప్పఁబడిన లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసనలయందుఁ బ్రవర్తించు చిత్తము క్షిప్తమనఁబడును. ఈభూమి చిత్తము కేవలరజోగుణాక్రాంతమైనప్పుడు కలిగియుండును. నిద్రాప్రమాదాలస్యాదులయందు ప్రవర్తించుచిత్తము మూఢమనఁబడును. ఈభూమిక కేవలతమోగుణాక్రాంతమైనప్పుడు కలిగియుండును. లోకవాసనాదులయందుఁ బ్రవర్తించుచున్నప్పటికి ఒకా

నొకప్పుడు ధ్యానముచేయుటను యోగ్యమయిన చిత్తము విక్షిప్తమనఁబడును. ఈభూమిక సత్వగుణమిశ్రమగు రజోగుణమువలన నాక్రమింపఁబడినప్పుడు కలిగియుండును. ఇది క్షిప్తముకంటె కొంచెము మంచిది అయినందున విక్షిప్త మని చెప్పఁబడినది. ఇందులో క్షిప్తమూఢములనుభూమికలయందు సమాధి సుతరాం కలుగనేరదు. విక్షేపభూమికయందు కాదాచిత్కమగు ధ్యానము కలదుగాని విక్షేపాధిక్యమువలన మహావాయుమధ్యమందు పెట్టఁబడిన దీపమువలె అతిశీఘ్రముగా నశించిపోవును. ఇదిగాక మంటయందు వేయఁబడిన విత్తనము తత్క్షణమే ప్రకారము నశించునో, ఆప్రకారమే విక్షేపాంతర్గత మాటవలన కాదాచిత్కధ్యానమును నశించును గాని ధ్యాన సంతానమును వృద్ధిఁబొందింపనేరదు. కనుక విక్షిప్తభూమికయందుఁగూడ సమాధి సిద్ధింపదు. ఏకవిషయమందు తైలధారవలె నవిచ్ఛిన్నముగా వృత్తిసంతానమునుకలుగఁజేయుచిత్తము ఏకాగ్ర మనఁబడును. ఇది సత్త్వగుణోద్రేకమువలనఁగలుగును. ఈ భూమికయందు సమాధి నిశ్చయముగాసిద్ధించును. ఈసమాధి సంప్రజ్ఞాతసమాధి యనఁబడును. ధ్యేయవస్తుస్వరూపము తదాకారమగువృత్తియును ఈరెండునుసమాధియందుగోచరించును గనుక నిది సంప్రజ్ఞాతసమాధి యని చెప్పఁబడినది. సర్వవృత్తిశూన్యమయిన చిత్తము నిరోధమనంబడును. ఈభూమికయును శుద్ధసత్త్వోద్రేకమందే కలుగును. ఈ భూమికయందుఁగలుగు సమాధి అసంప్రజ్ఞాతసమాధి యనఁబడును. దీనియందు ధ్యేయస్వరూపముమాత్రము స్ఫురించుచుండును. ధ్యేయాకారవృత్తి

స్ఫురింపనేరదు గనుకనే యీసమాధి అసంప్రజ్ఞాతసమాధి యని వ్యవహరింపబడిన యీయుదుభూమికలలో సంప్రజ్ఞాత సమాధిని గలుగఁజేయు నేకాగ్రభూమిక పతంజలిమహామునిచేఁ జెప్పఁబడినది.

సూ. శాంతోదితౌ తుల్యప్రత్యయౌ చిత్తస్యైకాగ్రతాపరిణామః.

తా. శాంత మనఁగా భూతకాలమందు జనించిన జ్ఞానము. ఉదితమనఁగా వర్తమానకాలమందుఁ గలిగినజ్ఞానము. ఈ రెండును ఎప్పుడు సమానములుగా నుండునో, అప్పుడు చిత్తము ఏకాగ్రభూమికను పొందినదని తెలియవలయును. అనఁగా భూతకాలజ్ఞానము ఏవిషయమును తెలుసుకొనియుండెనో, ఆవిషయము వర్తమానకాలజ్ఞానమునకు గోచరించి ప్రత్యక్షముగా నుండెనా, చిత్తము ఏకాగ్రత నొందెనని తెలియవలయును. భూతభవిష్యద్వర్తమానకాలములయందుండు విషయములను ప్రత్యక్షముగా తెలుసుకొనఁదగిన నిశ్చలత్వము చిత్తమునకు కలిగెనా, ఏకాగ్రభూమిక కలిగినదని తెలియవలయు నని పరమతాత్పర్యము.

ఏకాగ్రతాభివృద్ధియె సమాధి. ఇట్టిసమాధిని పతంజలి మహర్షియే చెప్పియున్నారు.

సూ. సర్వార్థతైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య సమాధిపరిణామః. [అని.

తా. రజోగుణమువలన చలింపఁజేయఁబడు చిత్తము క్రమముగా సర్వపదార్థములను గ్రహించుచుండును. చిత్తచలన హేతు వగురజోగుణమును నివారించుటకొఱకు చేయఁబడు

యోగియొక్క ప్రయత్నవిశేషమువలన ప్రతిదినమందు సర్వ విషయగ్రహణము చిత్తమునందు క్షీణించుచుండును. స్థిరముగా నొకవిషయమును గ్రహించుట ఉదయించును. ఇట్టి చిత్తపరిణామమే సమాధి యనఁబడును. సమాధిసాధనమైన చిత్తైకాగ్రతయందు సమాధిశబ్దము ఉపచారముగాఁ బ్రయోగింపఁబడినది అని తెలియవలయును.

ఇట్టిసమాధికి ఎనిమిది అంగములు కలవు. అవి యమ నియమాసన ప్రాణాయామప్రత్యాహారధ్యానధారణాసమాధు లని చెప్పఁబడును. ఇందులో యమనియమాసనప్రాణాయామ ప్రత్యాహారము లను అయిదు సమాధికి బహిరంగసాధనములు. శేషించినమూఁడు అంతరంగసాధనము లని తెలియవలయును.

అందులో యమములు సూత్రింపఁబడినవి.

సూ. అహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహా యమాః. అని.

తా. అశాస్త్రీయమైన జంతుహత్య హింస యనఁబడును. అట్టిహింస స్వయముగాఁ జేయఁబడినది యని, అన్యులచేత చేయింపఁబడినది యని, అన్యులు చేయుచుండఁగా చూచి అంగీకరింపఁబడినది యని మూఁడువిధములు. ఇట్టి హింసను పరిత్యజించుట అహింస యనఁబడును. వినినదానికి చూచినదానికి విపరీతముగాఁ జెప్పకపోవుట, నిర్దోషి యగువానిని చంపుటకుఁ గారణమైన యథార్థవచనమును చెప్పకపోవుటయును సత్యమనఁబడును. శాస్త్రనిషిద్ధమైన మార్గముచేత పరద్రవ్యమును గ్రహించుట స్తేయమనఁబడును. దానిని పరిత్యజించుట అస్తే

యమనఁబడును. శాస్త్రనిషిద్ధక్రమముచేత పరద్రవ్యమును గ్రహింపఁదగదని భావము.

శాస్త్రనిషిద్ధమైన స్త్రీసంపర్కమును బరిత్యజించుట బ్రహ్మచర్య మనఁబడును. అనఁగా పరస్త్రీసంపర్కము బొత్తిగా నిషిద్ధము. స్వస్త్రీసంపర్కమును ఋతుకాలమందుఁ దప్ప తక్కిన కాలమందు నిషిద్ధము. ఇట్టినిషిద్ధమైన స్త్రీసంపర్కమును చేయక యుండుటయే బ్రహ్మచర్య మని భావము.

శాస్త్రనిషిద్ధమార్గముచేత శరీరయాత్రకు ఉపయోగించు భోగములకంటె అధికమయిన భోగములను స్వీకరింపక పోవుట అపరిగ్రహమనఁబడును ఈ అయిదువిధములగుహింస మొదలగు నిషిద్ధకార్యములనుండి యోగి యగువానిని నియమించును (నివర్తింపఁజేయును) గనుక యమము లని చెప్పఁబడినవి.

నియమములు అయిదు. ఇవి—

సూ. శౌచసంతోషతపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః.

అని సూత్రింపంబడినవి.

తా. శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము. ఈ అయిదు నియమము లనఁబడును. ఇందులో శౌచమనఁగా శుద్ధి. ఇది బాహ్యశౌచ మని, ఆంతర శౌచ మని రెండువిధములు. మూత్రపురీషోత్సర్జనకాలముల యందు ధర్మశాస్త్రోక్తప్రకారముగ మృత్తికచేతను జలము చేతను కరపాదాద్యవయవములను కడిగికొనుట మొదలగు నదియు, స్నానకాలమునందు దేహమంతయు మృత్తికతో శుద్ధి

స్నానముచేయుటయును, హితమితపవిత్రాన్న భక్షణమును బాహ్యశౌచ మనంబడును. మైత్రికరుణాదిశుభవాసనలచేత మనస్సుయొక్క మలమును శోధించుట అంతరశౌచ మనంబడును. తత్కాలమందు తనకుఁగల భోగోపకరణములకంటె నధికములైనభోగోపకరణములను కోరనివి తృప్తి సంతోష మనబడును. క్షుత్పిపాసలను, శీతోష్ణాదిద్వంద్వములనుసహించుటయు కాష్ఠమౌన ఆకారమౌనాది వ్రతములును తపస్సని చెప్పఁబడును. కాష్ఠమౌన మనఁగా తనయభిప్రాయమును సంజ్ఞ చేతనైనా తెలియఁజేయక పోవుట. ఆకారమౌన మనఁగా వాఙ్మాత్ర నిరోధము. ప్రణవమంత్రమును జపించుట గాని మోక్షశాస్త్రమునభ్యసనము చేయుట గాని స్వాధ్యాయ మనఁబడును. తనచేతఁ జేయఁబడు సకల వైదికలౌకికకర్మలయొక్క ఫలము నపేక్షించక వానిని పరమగురుఁడగు పరమేశ్వరునియందు సమర్పించుట ఈశ్వరప్రణిధాన మనఁబడును. ఈయైదు జన్మాంతర హేతువు లగు కామ్యధర్మములనుండి రాగిని నివారించి మోక్షకారణమైన నిష్కామధర్మములయందు నియమించును (ప్రవర్తింపఁజేయును) గనుక నియమములు అని చెప్పఁబడినవి.

యమనియమములయొక్క అనుష్ఠానము భిన్నరూపముగా నుండు నని యొకస్మృతియందుఁ జెప్పఁబడినది

శ్లో. యమాన్ సేవేత సతతం న నిత్యం నియమాన్ బుధః,
యమాన్ పతత్యకుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్. అని.

తా. అహింస మొదలగుయమములను నిత్యముగాననుష్ఠింపవలయును. శౌచము మొదలగునియమములను నిత్యముగా

నునష్ఠింపవలసినది లేదు. యమముల ననుష్ఠింపక కేవలనియమ ములనే యనుష్ఠించినయెడల యోగఫలము సిద్ధింపనేరదు.

శ్లో. పతతి నియమవాన్ యమేష్వసక్తో
న తు యమవాన్నియమాలసోఽవసీదేత్,
ఇతి యమనియమౌ సమీక్ష్య బుద్ధ్యా
యమబహులేష్వనుసంధధీత బుద్ధిమ్. అని.

తా. అహింసాదియమముల ననుష్ఠింపక కేవలనియమ ముల ననుష్ఠించువాఁడు చెడిపోవును. యమముల ననుష్ఠించుచు నియమముల ననుష్ఠింపనివాఁడు చెడిపోనేరఁడు. యమనియమ ములయొక్క స్వభావ మిట్టిదని యాలోచించి యమములనే అధికముగా ననుష్ఠింపవలయును.

యమనియమములయొక్క అనుష్ఠానముచేతఁ గలుగు ఫలములు సూత్రింపఁబడినవి.

శ్లో. తత్సన్నిధౌ వైరత్యాగః; సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వం
అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానం; బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం
వీర్యలాభః; అపరిగ్రహస్థైర్యే జన్మకథంతాసంబోధః. అని.

తా. అహింసను భావించువానికి ఆయహింస దృఢముగ చిత్తమందు ప్రతిష్ఠనొందఁగా అతనిసమీపమం దుండు స్వభావ విరోధము గలజంతువులుకూడ పరస్పరవిరోధమును వదలి అన్యోన్యమైత్రి కలవై యుండును.

సత్యము ప్రతిష్ఠనొందినవానికి యాగాదికర్మలు చేయఁ బడకపోయినను స్వర్గాదిఫలము ప్రాప్తించును.

అస్తేయ మభ్యసింపఁబడి చిత్తమందు దార్ఢ్యమును పొం దినవానికి సర్వలోకములయం దుండు ఉత్తమవస్తువు లన్నియు వాటియంతట నవియే ప్రాప్తించును.

బ్రహ్మచర్యము నభ్యసించి దార్ఢ్యమును పొందించిన వానికి శరీరేంద్రియమనస్సులయందు సర్వకార్యకరణసామర్థ్య ము ఆవిర్భవించును.

అపరిగ్రహము నభ్యసించి దానియందు దార్ఢ్యము గలవానికి తాను జన్మాంతరమందు నెవ్వరైనది యేమి పనిచేసినది యీజన్మ తనకు నేలాగునఁ గలిగినది తెలియును అనిక్రమము గా సూత్రముల కర్థము.

ఈప్రకారమే నియమములయొక్క ఫలములును సూత్రింపఁబడినవి.

సూ. శౌచాత్స్వాంగజుగుప్సా పరైరసంసర్గః, సత్వశుద్ధిసౌమనస్యైకాగ్ర్యే
ంద్రియజయాత్మదర్శనయోగ్యత్వాని చ; సంతోషాదనుత్తమసుఖ
లాభః కాయేంద్రియశుద్ధిరశుద్ధిక్షయాత్తపసః స్వాధ్యాయాదిష్ట
దేవతాసంప్రయోగః; సమాధిసిద్ధిరీశ్వరప్రణిధానాత్. అని.

తా. ఏపురుషుఁడు ద్వివిధమైనశౌచములను భావించి దృఢముగా ననుష్ఠించునో, వానికి తనశరీరమునందుఁ గూడ శరీరకారణములగు శుక్లశోణితాదివస్తువులయొక్క స్వభావము నాలోచించుటచేత అసహ్యత కలుగును. శరీరధారు లగు నితరజనులతో సంసర్గము నివర్తించును. అనఁగా ఇతరజనుల యొక్క శరీరము కూడ కారణవస్తుస్వభావముచేత అసహ్య

మనితోఁచి, వాటియందు సంప్రయోగమును (ప్రీతిని) చేయఁడని భావము.

ఇదిగాక అంతఃకరణము రజస్తమోగుణములు నశించి శుద్ధసత్త్వప్రధానమై నిర్మలముగా నుండును. దుఃఖకారణము లున్నప్పటికి ఖేదమును పొందక చిత్తము ప్రసన్నముగా నుండును. చిత్తమేకాగ్రతనొందును. ఇంద్రియములు విషయములయందు చేరక స్వాత్మస్వరూపమును గ్రహించుటయందు యోగ్యత కలిగియుండును. ఇట్టిఫలములు శౌచాభ్యాసముచేత సంభవించును.

సంతోషము నభ్యసించుటచేత నేసుఖముఁనకు విషయసుఖము శతాంశముచేత కూడ సమము గాదో అట్టిమహాసుఖము ఆవిర్భవించును.

తపస్సు నభ్యసించినపక్షమునను చిత్తముయొక్క అపవిత్రత్వము నశించి దేహేంద్రియములు ఉత్కర్షము నొందును. అనఁగా కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సుల నాచరించుటచేత చిత్తముయొక్క అపవిత్రత్వము నశించును. ఇంద్రియములు సూక్ష్మవస్తువులను దేశకాలవ్యవహితవస్తువులను తెలుసుకొను సామర్థ్యము కలవైయుండును శరీరము అణుత్వమహత్త్వాది పరిమాణములను యథేచ్ఛముగా నొందుచుండు నని భావము.

స్వాధ్యాయము నభ్యసింపఁగా, అది ఉత్కర్షను బొంది అభిమతులైన ఇంద్రచంద్రాదిదేవతలను ప్రత్యక్షముగాఁజేయును.

ఈశ్వరప్రణిధాన మను భగవద్భక్తివిశేషమును దృఢముగా నభ్యసించినయెడల వెనుకఁజెప్పిన సంప్రజ్ఞాతసమాధి అసంప్రజ్ఞాతసమాధియును సిద్ధించును. అనఁగా ఈశ్వరుఁడు ప్రసన్నుఁడై సమాధివిఘ్నకరము లగువాటిని నివారించి సమాధిని నిర్విఘ్నముగా సిద్ధింపఁజేయు నని అర్థము.

ఆసనప్రాణాయామములు ఇదివరకే వివరింపఁబడినవి.

ప్రత్యాహారము సూత్రింపఁబడినది.

సూ. స్వవిషయాసంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః. అని.

తా. శబ్దస్పర్శరూపరసగంధాదివిషయములనుండి మరలింపఁబడిన శ్రోత్రాదు లగు నింద్రియములు మనస్సులో లీనమై మనస్స్వరూపాభిన్నములైనట్లు నిలుచుట ప్రత్యాహార మనఁబడును.

ఈయర్థమును స్మృతి కూడఁ జెప్పుచున్నది.

స్మృ. శబ్దాదివిషయాన్ పంచ మనశ్చైవాతిచంచలం,
చింతయేదాత్మనో రశ్మీన్ ప్రత్యాహారస్స ఉచ్యతే. అని.

తా. శబ్దస్పర్శరూపరసగంధము లను అయిదు విషయములుగల శ్రోత్రత్వక్ చక్షూరసనాఘ్రాణము లను అయిదు ఇంద్రియములను అతిచంచలస్వభావముగల మనస్సును స్వస్వవిషయములనుండి నివర్తింపఁజేసి యీమనస్సుతోఁ గూడిన అయిదు ఇంద్రియములను ఆత్మయొక్క కిరణము లని ధ్యానించుట ప్రత్యాహార మనఁబడును.

ఇట్టిప్రత్యాహారముయొక్క ఫలమున్ను సూత్రింపఁబడినది.

సూ. తతః పరమావశ్యతేంద్రియాణామ్. అని.

ఈ ప్రత్యాహారమునభ్యసించుటచేత కర్మేంద్రియజ్ఞానేంద్రియము లన్నియుఁ తనకు అత్యంతస్వాధీనములై యుండును.

ధారణాధ్యానసమాధులను మూటిని మూఁడుసూత్రముల చేత పతంజలిమహర్షి నిరూపించియున్నారు.

సూ. దేశబంధశ్చిత్తస్య ధారణా. తత్ర ప్రత్యయైకతానతా ధ్యానం.
తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః. అని.

తా. దేశవిశేషమునందు చిత్తమును దృఢముగాఁ జేర్చుట ధ్యాన మనఁబడును.

ఆధారనాభిచక్రాది దేశములు ఇదివఱకే చెప్పఁబడినవి.

మఱియొక దేశము కూడ వినఁబడుచున్నది.

శ్లో. మనస్సంకల్పకం ధ్యాత్వా సంక్షిప్యాత్మని బుద్ధిమాన్,
ధారయిత్వా తథాత్మానం ధారణా పరికీర్తితా. అని.

తా. బుద్ధిమంతుఁడగుపురుషుఁడు సర్వవిషయములను సంకల్పించు మనస్సు సర్వవిషయములను వదలిపెట్టి పరమాత్మస్వరూపమునే సంకల్పింపవలయు నని నిశ్చయించి పరమాత్మయందే మనస్సును నిలుపవలయును. ఇది యొకధారణాయోగ మని చెప్పఁబడును.

ఏదేశమునందు చిత్తమునకు ధారణ చేయఁబడెనో, ఆ దేశమునందు జ్ఞానము ఏకతానమై యుండుట ధ్యాన మనఁబడును. అనఁగా ఇతరవిషయములను గ్రహింపక ధారణావిషయమైన పదార్థమునే చిత్తవృత్తిచేత గ్రహించుట ధ్యానమని యభిప్రాయము.

ఇట్టిధ్యానము మధ్యే మధ్యే విచ్ఛేదము లేక చిరకాలము ఏకవిషయమం దుండుటయే సమాధియనఁబడును. ఆలంబనవిషయము మాత్రమే చిత్తమునకు చిరకాలము గోచరించి యుండి ఇతరాకారపరిణామము లేకయుండుట సమాధియని యోగసూత్రార్థము.

ఈధ్యానసమాధులను రెంటిని సర్వానుభవయోగియను ఆచార్యులు విశదముగా వివరించిరి.

శ్లో. చిత్తైకాగ్ర్యాద్యతో జ్ఞానముక్తం సముపజాయతే,
తత్సాధన మతో ధ్యానం యథావదుపదిశ్యతే. అని.

తా. చిత్తము ఏకాగ్రత నొందుటచేతనే ఇదివరకు చెప్పఁబడిన జ్ఞానము పుట్టుచుండును. అజ్ఞానకారణమైన చిత్తైకాగ్రతకుసాధనమగుధ్యానముయథార్థముగా నిరూపింపఁబడును.

శ్లో. విలాప్య వికృతిం కృత్స్నాం సంభవవ్యత్యయక్రమాత్,
పరిశిష్టం చ సన్మాత్రం చిదానందం విచింతయేత్. అని.

తా. దేహేంద్రియాదివికారప్రపంచమును సర్వమును ఉత్పత్తిక్రమమునకువిపరీతక్రమముగా లయింపఁజేసి శేషించిన జ్ఞానానందస్వరూప మగు సన్మాత్రబ్రహ్మను చింతింపవలయును. ఇదియే ధ్యాన మని వ్యవహరింపఁబడును.

సచ్చిదానందాత్మకము బ్రహ్మ దీనివలన మాయ యను ప్రకృతి, దీనివలన ఈక్షణమను మహత్తత్త్వము, దీనివలన సంకల్పమను నహంకారము, దీనివలన ఆకాశము, దీనివలన వాయుతన్మాత్రము, దీనివలన తేజస్తన్మాత్రము, దీనివలన జలతన్మాత్రము, దీనివలన పృథివీతన్మాత్రము, ఈపంచతన్మాత్రలవలన ఆకా

శాదిపంచమహాభూతములు, వాటివలన బ్రహ్మాండము, దాని వలన అస్మదాదివ్యష్టిశరీరములు జన్మించెను ఇది ఉత్పత్తి క్రమము. వ్యష్టిశరీరములు సమష్టిశరీర మను బ్రహ్మాండమునందు, బ్రహ్మాండము స్థూలపంచమహాభూతములయందు, అవి పంచ తన్మాత్రలయందు, పంచతన్మాత్రలలోఁ బృథివి జలమునందు, జలము తేజస్సునందు, తేజస్సు వాయువునందు, వాయువు ఆకాశము నందు, ఆకాశము అహంకారమందు, అహంకారము మహత్తత్వ మందు, మహత్తత్వము మాయయందు, మాయ పరమాత్మ యందు లయించును. ఇది విపరీతక్రమము

శ్లో. బ్రహ్మాకారమనోవృత్తిప్రవాహోఽహంకృతిం వినా,
సంప్రజ్ఞాతసమాధిస్స్యాత్ ధ్యానాభ్యాసప్రకర్షతః.

తా. సచ్చిదానంద బ్రహ్మాకారముగా పరిణమించిన చిత్త వృత్తి ప్రవాహము అహంకారము లేకుండ ప్రవర్తించెనా, సంప్రజ్ఞాతసమాధి యని చెప్పఁబడును. ఇది ధ్యానమును విశే షముగా నభ్యసించినందునఁ గలుగును.

లయపూర్వకసమాధి యని బాధపూర్వకసమాధి యని సమాధి రెండువిధములు. లయపూర్వకసమాధి పాతంజల మతము ననుసరించి బాధాపూర్వకసమాధి బ్రహ్మవాదిమతము ననుసరించి చెప్పఁబడినది.

సూ. తదనన్యత్వమారంభణశబ్దాదిభ్యః.

తా. బ్రహ్మకార్యమగు నీప్రపంచము బ్రహ్మకంటె భిన్న మైనది కాదు. ఈప్రకారము శ్రు. 'వాచారంభణం వికారో నామధేయం.' అను శ్రుతి చెప్పుచున్నది. కార్యము కారణము

కంటె భిన్నము కాదని యుక్తిచేతఁ గూడ కనుబడుచున్నదియని సూత్రార్థము.

ఈన్యాయముచేత కారణముకంటె భిన్నమగు కార్యము లేదు. ఈజగత్తు అను కార్యము సన్మాత్రమగు పరబ్రహ్మ వలనఁ గలిగినది.

ఏ ప్రకారముగా నంటే చెప్పెదను.

సత్యజ్ఞానానందసుఖస్వరూపుఁడగు పరమాత్మ మొదట అనాదిమాయాశక్తితోఁ గూడుకొని యీక్షణము చేసి (ఆలోచించి) అనంతరము "బహు స్యాం" అని సంకల్పించి తరువాత శబ్దము గుణముగాఁ గల ఆకాశమును సృజించెను.

ఆ యాకాశము శబ్దస్పర్శగుణములు గల వాయువును సృజించెను. ఆ వాయువు శబ్దస్పర్శరూపగుణములు గల తేజస్సును, ఆ తేజస్సు శబ్దస్పర్శరూపరసగుణములు గల జలమును, ఆజలము శబ్దస్పర్శరూపరసగంధగుణములు గలపృథివిని బుట్టించెను. ఈభూతములు ఆయుడు మొదట పరస్పరమేళనము లేకయే యపంచీకృతములై యుండి తరువాత పంచీకృతపంచమహాభూతములను సృష్టించెను. వీనివలన బ్రహ్మాండరూపమైన సమష్టివిరాట్స్వరూపశరీరము పుట్టెను. వానివలన అస్మదాదుల యొక్క వ్యష్టిశరీరము ఉదయించెను.

కనుక పంచీకృతపంచమహాభూతసంఘాతరూపమగు నీవ్యష్టిశరీరము సమష్టివిరాట్ఛరీరకార్యమైనందున సమష్టిశరీరముకంటె భిన్నముగానేరదు పంచీకృతపంచమహాభూతసంఘాతమైన విరాట్ఛరీరము అపంచీకృతపంచమహాభూతములవలన

పుట్టినందున వాటికంటె భిన్నముగా నుండదు. అందులో కూడ శబ్దాదిగుణపంచముగల పృథివి జలకార్యమైనందున జలముకంటె భిన్నముగా లేదు. జలము తేజఃకార్యమైనందున తేజస్సుకంటె భిన్నముగా లేదు. తేజస్సు వాయుకార్యమైనందున వాయువుకంటె భిన్నముగా లేదు. వాయువు ఆకాశకార్యమైనందున ఆకాశముకంటె భిన్నముగా లేదు.

ఆకాశము "బహుస్యాం=అనేకముగ నౌదు" అను పరమేశ్వరసంకల్పరూప మగు అహంకారముయొక్క కార్యమైనందున ఆయహంకారముకంటె భిన్నముగా లేదు. అహంకారమును "తదైక్షత=ఆపరమాత్మ యీక్షణము చేసెను" అని చెప్పఁబడిన మాయేక్షణరూప మగు మహత్తత్త్వముయొక్క కార్యమయినందున మహత్తత్త్వముకంటె భిన్నముగా లేదు. మహత్తత్త్వము అవ్యాకృత మను మాయయొక్క కార్యమయినందున మాయకంటె భిన్నముగా లేదు. ఆమాయ యను కారణము జడమయినందునను, చిద్రూపుఁడగు పరమేశ్వరునియందారోపింపఁబడినందునను పరమేశ్వరునికంటె భిన్నముగా లేదు. అని యనుసంధించుటచేత కార్యకారణాత్మకమయిన యీప్రపంచమునందు చైతన్యస్వరూపుఁడగు పరమేశుని మాత్రము గోచరింపఁజేయుసమాధి లయపూర్వకసమాధి యని చెప్పఁబడును.

ఈసమాధియందు తత్త్వమస్యాది వేదాంతమహావాక్యార్థజ్ఞానము లేనందున అవిద్యాతత్కార్యములు నశింపవు. కనుక వెనుక చెప్పినప్రకారము చింతించినప్పటికి అవిద్యాది

కారణము లున్నందున తిరిగి యావత్ప్రపంచమునకు ఆవిర్భావము కలుగును గనుక ఈసమాధి సబీజసమాధి యని చెప్పఁబడియున్నది.

ఇందుచేతనే ఇది ముఖ్యసమాధి కాదు. తత్త్వమస్యాది వేదాంతమహావాక్యార్థ మగు ప్రత్యగభిన్నబ్రహ్మముయొక్క సాక్షాత్కారముచేత అవిద్య యావత్తు నివర్తించును గనుక తత్కార్యమగు ఆకాశాదిప్రపంచము బాధింపఁబడును. అవిద్య తిరిగి ఆవిర్భవింపనేరదుగనుక వేదాంతమహావాక్యార్థసాక్షాత్కారపూర్వకముగఁ గలుగు నీసమాధి నిర్బీజసమాధి యనఁబడును.

ఇదియే ముఖ్యసమాధి. దీనియందుఁ దత్త్వసాక్షాత్కారముచేత అవిద్యాతత్కార్యములు బాధింపఁబడును గనుక ఇది బాధాపూర్వకసమాధి యనఁబడును.

ఈసమాధిని శ్రీశంకరభగవత్పాదాచార్యులుగారు ఉపదేశసాహస్రి యను గ్రంథమునందు ఉదాహరించిరి.

శ్లో. దృశిస్వరూపం గగనోపమం పరం సకృద్విభాతం త్వజమేక మక్షరం,
అలేపకం సర్వగతం యదద్వయం తదేవ చాహం సతతం విముక్తోం.

తా. జ్ఞానమాత్రస్వరూపమై ఆకాశమువలె నిత్యమై సర్వపదార్థములను కారణమై స్వప్రకాశమై జన్మాదివికారములు లేనిదై సర్వభేదశూన్యమై నాశాదివికారరహితమై పుణ్యపాపాదికర్మసంబంధవివర్జితమై సర్వవ్యాపకమై జీవస్వరూపముకంటె అభిన్నమైన యేపరమాత్మస్వరూపము కలదో, అట్టిపరమాత్మస్వరూపమును, నేను సర్వకాలములయందు అవిద్యాది దోషములచేత విడువఁబడియున్నాను.

శ్లో. దృశిస్తు శుద్ధోఽహమవిక్రియాత్మకో
న మేఽస్తి కశ్చిద్విషయః స్వభావతః,
పురస్తిరశ్చోర్ధ్వమధశ్చ సర్వతః
సంపూర్ణభూమా త్వజ ఆత్మని స్థితః.

తా. నేను శుద్ధమయిన జ్ఞానస్వరూపుఁడను. సర్వవికార రహితుఁడను. నాకు స్వభావముచేతనే విషయము లేవియును లేవు. నానాదిక్కులయందు సంపూర్ణమై వ్యాపకమై జన్మాదులు లేక స్వస్వరూపమునం దున్నవాఁడను.

శ్లో. అజోఽమరశ్చైవ తథాఽజరో ఽమృతః
స్వయంప్రభ స్సర్వగతో ఽహమద్వయః,
న కారణం కార్య మతీవ నిర్మలః
స దైవ తృప్తశ్చ తతో విముక్త ఓం. అని.

తా. నేను జన్మలేనివాఁడను, అపక్షయము లేనివాఁడను, ముదిమి లేనివాఁడను, మరణము లేనివాఁడను, స్వయంప్రకాశస్వరూపుఁడను, సర్వవస్తువులయందు వ్యాపించియున్నవాఁడను, సజాతీయవిజాతీయస్వగతభేదములు లేనివాఁడను, కారణము లగు పృథివ్యాదిభూతములకంటె కార్యములగు దేహేంద్రియాదులకంటె విలక్షణమైనవాఁడను, అత్యంతనిర్మలుఁడను. సర్వకాలములయందు తృప్తికలవాఁడను గనుకనే నేను ముక్తుఁడను.

ఆక్షేపము.—ఓయీ! యమనియమాదులు ఎనిమిది అంగములు. సంప్రజ్ఞాతసమాధి ప్రధానము. ఈ ప్రకారము శాస్త్రమర్యాదకనుపడుచుండఁగా ధ్యానానంతరము చెప్పఁబడు నని

మిదన యంగమగు సమాధిని చెప్పునప్పుడు ఆస్థానమందు ప్రధానమగు సంప్రజ్ఞాతసమాధిని ఉదాహరించుట యుక్తము కాదు.

సమాధానము—ఎనిమిదవయంగమగు సమాధికిని ప్రధానమగు సంప్రజ్ఞాతసమాధికిని విశేషభేదము లేనందున అంగభూతసమాధిస్థానమందు సంప్రజ్ఞాతసమాధిని నుదాహరించుట యుక్తముగానే యున్నది. లోకములో వేదము చెప్పుకొను బ్రహ్మచారికి చెప్పుకొనిపోయినవానికి వేదము నధ్యయనము చేయించు నుపాధ్యాయులకు వీరిద్దరికి వేదాధ్యయనము సమానముగా నున్నప్పటికి ఏ ప్రకారము వేదమునధ్యయనము చేయు బ్రహ్మచారి ప్రతివాక్యమునందును చెప్పుచు మాటిమాటికి జాగ్రతతో నుండునో, ఆ బ్రహ్మచారియే స్వయముగా నధ్యయనము చేసి తరువాత జాగ్రత్తతో నుండి వేదవాక్యములనుండు తప్పడో, వేదమును శిష్యుల కధ్యయనము చేయించు నుపాధ్యాయులు ప్రమాదముగా నున్నప్పటికి తప్పి చెప్పడో యాప్రకారమే ధ్యానసమాధి సంప్రజ్ఞాతసమాధులు మూడును ఏకవిషయములైనప్పటికి అవాంతరభేదము కలదై యుండును. అనగా ఏకతత్త్వాభ్యాసము చేయు పురుషుడు ఆరంభములో నొకవిషయము నాలంబనముగా చేసుకొని చింతించునప్పుడు ప్రతిక్షణము చిత్తము అన్యవిషయములయందు విక్షేపము నొందుచుండగా జాగ్రత్తతోఁ గనిపెట్టి ఆలంబనమునందు చేర్చుచుండును. ఇది ధ్యాన మనబడును. ఈ ధ్యానమును కొంతకాల మభ్యసింపగా కొంచెము జాగ్రత్తతో నుండు

నప్పుడు చిత్తము విషయాంతరములయందు విక్షేపమును జెందక ఆలంబనమునందే చిరకాలము నిలిచియుండును. ఇది సమాధి యనఁబడును. ఇట్టిసమాధి కొంతకాల మభ్యసింపఁగా ప్రమాదముతో నున్నప్పటికి చిత్తము విషయాంతరముల యందు చేరక ఆలంబనమును విడువక చింతించుచుండును. ఇది సంప్రజ్ఞాతసమాధి యనఁబడును. ఈప్రకారము ధ్యానసమాధి సంప్రజ్ఞాతసమాధులు మూఁడును ఏకవిషయములైనప్పటికి కించి దవాంతరభేదములు కలవని భావము.

ధారణాధ్యానసమాధులు మూఁడు సంప్రజ్ఞాతసమాధికి అంతరంగములు. యమనియమాదులు అయిదు బహిరంగములు. ఈయర్థము పతంజలిమహర్షి చేత సూత్రింపఁబడినది.

సూ. త్రయమంతరంగం పూర్వేభ్యః. ఇది.

తా. ధారణాధ్యానసమాధులు మూఁడు వెనుకఁజెప్పిన యమనియమాదులకంటె సంప్రజ్ఞాతసమాధికి నంతరంగము లని సూత్రార్థము.

కనుక నేదో యొకపుణ్యవిశేషముచేత ధారణాధ్యాన సమాధులలో నొకటి సిద్ధించెనా యమనియమాదులనుగూర్చి విశేషముగ యత్నించ నక్కఱలేదు.

ప్రశ్న—పతంజలిమహాముని భూతతన్మాత్రేంద్రియాదుల నాలంబనముగా చేసి సంప్రజ్ఞాతసవికల్పసమాధులను అనేకముగ నిరూపించియున్నారు. వీరారు అన్యసమాధులను నిరూపించకపోవుటకు కారణ మేమి?

ప్రతివచనము—పతంజలిచేత వివరింపఁబడిన భూతతన్మాత్రాదివిషయసమాధులు అంతర్ధానపరకాయప్రవేశాదిసిద్ధులకు కారణములైనందున మోక్షమునకు కారణములు కానందునను మోక్షహేతువగు పరమాత్మవిషయసమాధికి విరోధులైనందునను మాచేత నాటియం దాదరము చేయఁబడలేదు.

ఇదియే అనమాధులను మేము నిరూపించకపోవుటకు కారణము.

భూతతన్మాత్రాదివిషయకసమాధులు అనాత్మవిషయము లైనందున మోక్షసాధనములు కానందున హేయములనియు, ఆత్మవిషయకసమాధికి విరోధులనియు పతంజలిమహర్షియే సూత్రించియున్నారు.

సూ. తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః. అని.

తా. ఈ చెప్పఁబడిన అనాత్మవిషయసమాధు లన్నియు మోక్షసాధనమైన పరమాత్మవిషయసమాధియందు విఘ్నముగానుండును. వ్యుత్థానదశయందు అంతర్ధానాదిసిద్ధులను కలుగఁజేయుచుండునని సూత్రార్థము.

సూ. స్థాన్యుపనిమంత్రణే సంగస్మయాకరణం పునరనిష్టప్రసంగాత్. అని.

తా. మోక్షసాధనమగు పరమాత్మవిషయసమాధి నాచరించునప్పుడు స్వర్గాదిస్థానములయందుండు దేవతలు వచ్చి తమతమలోకములకు రమ్మనుమని ప్రార్థింపఁగా ఆస్వర్గాదిలోకములయం దాసక్తిని గాని దేవతలచేత కూడ ఆదరింపఁదగిన ప్రభావము తనకుఁగలిగెనను గర్వమును గాని పొందఁగూడదు. సంగస్మయములను చేసినపక్షమునను ఆత్మవిషయసమాధి భంగము

నొంది మోక్షము సిద్ధింపకపోవడమే కాకుండ సాంసారికానిష్ట ములుకూడ తిరిగి సంభవించు నని సూత్రార్థము.

ఉద్దాలకుఁ డనుముని సమాధి నాచరించుచుండి దేవతలచేత పిలువఁబడి వారిలోకములయం దాసక్తి చేయక తిరిగి పరమాత్మవిషయనిర్వికల్పసమాధినే చేయుచుండె నని వాసిష్ఠ రామాయణములోఁ జెప్పఁబడినది. ఇదిగాక యీయర్థము శ్రీరామవసిష్ఠులయొక్క ప్రశ్న ప్రతివచనవాక్యములచేత విస్పష్టముగాఁ జెప్పఁబడియున్నది

అది యేప్రకారమంటే వివరించెదము.

శ్లో. జీవన్ముక్తశరీరాణాం కథమాత్మవిదాం వర,
శక్తయో నేహ దృశ్యంతే ఆకాశగమనాదికాః. అని.

తా. జ్ఞానవంతులలో నుత్తముఁడవైన యోస్వామీ! జీవన్ముక్తినొందిన మహాపురుషులయొక్క శరీరములయందు ఆకాశగమనాదిశక్తులు కనుపడుట లేదు! ఇందుకు కారణ మేమి? ఈప్రకారము శ్రీరాములు ప్రశ్నచేయగా శ్రీవసిష్ఠ మహర్షి ప్రతివచనమును జెప్పుచున్నారు.

శ్లో. అనాత్మవిదముక్తోఽపి నభోవిహరణాదికమ్,
అణిమాద్యష్టసిద్ధీనాం సిద్ధిజాలాని వాంఛతి.

తా. ఆత్మజ్ఞానహీనుఁడగు పురుషుఁడు ముక్తిని పొందనివాఁడై యుండి ఆకాశగమనాదిసిద్ధులను అణిమాద్యష్టసిద్ధులను కోరును.

శ్లో. ద్రవ్యమంత్రక్రియాకాలయుక్త్యాప్నోత్యేవ రాఘవ,
నాత్మజ్ఞస్యైష విషయ ఆత్మజ్ఞో హ్యాత్మమాత్రదృక్.

తా. ఆకాశగమనాదిసిద్ధులు, ఓషధులు, మంత్రములు, క్రియావిశేషములు, కాలవిశేషములు వీటిని సాధనములుగా నేర్పఱచుకొని పొందుచుందురు. ఆత్మతత్త్వజ్ఞానముగలవానికి ఈయోషధిమంత్రాదిసాధనములు గాని ఆకాశగమనాదిసిద్ధులు గాని ఆదరింపఁదగినవి కావు. ఆత్మజ్ఞాని ఆత్మను మాత్రము చూచుచుండును.

శ్లో. ఆత్మనాత్మని సంతృప్తో నావిద్యామనుధావతి,
యే కేచన జగద్భావా స్తానవిద్యామయాన్విదుః,

తా. ఆత్మతత్త్వజ్ఞానము గలవాఁడు స్వస్వరూపానుభవముచేతఁ దృప్తిని బొందుచుండును. అవిద్యాకల్పితవిషయములలోఁ బ్రవర్తింపఁడు. ఈప్రపంచములో నుండు విషయములన్నియునవిద్యచేత కల్పింపఁబడి మిథ్యాభూతములుగానున్నవి యని యాత్మజ్ఞులు తెలిసికొనుందురు.

శ్లో. కథం తేషు కిలాత్మజ్ఞ స్త్యక్తావిద్యో నిమజ్జతి.

తా. ఆత్మజ్ఞుఁడగుపురుషుఁడు అవిద్యను సవాసనగా వదలియున్నందున, అవిద్యాకల్పితములగు సిద్ధులలో ఆసక్తి కలవాఁడై యేప్రకారముగా నుండును?

శ్లో. ద్రవ్యమంత్రక్రియాకాలశక్తయస్సాధుసిద్ధిదాః,
పరమాత్మపదప్రాప్తౌ నోపకుర్వంతి కాశ్చన.

తా. ద్రవ్యము, మంత్రములు, క్రియలు, కాలము వీటి యొక్క సామర్థ్యములు ఆకాశగమనాదిసిద్ధులను కలుగఁజేయునవియైనప్పటికి, పరమాత్మస్వరూపమును బొందువిషయములో గొంచెమైనను ఉపకారమును జేయఁజాలవు.

శ్లో. సర్వేచ్ఛాజాలసంశాంతా వాత్మలాభోదయో హి యః,
స కథం సిద్ధివాంఛాయాం మగ్నచిత్తేన లభ్యతే. అని.

తా. సర్వవిషయములయందుఁ గల ఆశ నశించినతరువాతఁ గలుగు ఆత్మస్వరూపలాభ మను మోక్షము ఆకాశగమనాదిసిద్ధులలో కోరికగలిగి యుండఁగ నేప్రకారము సిద్ధించును అనఁగా సిద్ధింపదని భావము.

శ్లో. న కేచన జగద్భావా స్తత్త్వజ్ఞం రంజయంత్యమీ,
నాగరం నాగరీకాంతం కుగ్రామలలనా ఇవ.

తా. ఈ ప్రపంచమునందుఁగల పదార్థము లేవియును బ్రహ్మతత్త్వజ్ఞానము గల పురుషుని పట్టణములయం దుండి రసికుఁడై పట్టణస్త్రీలకు వల్లభుఁడైనవానిని గ్రామములలో నుండు రసికత్వము నెఱుఁగని స్త్రీలవలె రంజింపఁ జేయనేరవు

అనఁగా బ్రహ్మాపరోక్షజ్ఞానము గల పురుషుఁడు ఈలోకమం దెటువంటి విచిత్రపదార్థములను చూచినా, వింతను ఆశ్చర్యమును పొందఁడని భావము.

శ్లో. అపి శీతరుచావర్కే సుతీక్ష్ణే చేందుమండలే,
అప్యధః ప్రసరత్యగ్నౌ జీవన్ముక్తో న విస్మయీ.

తా. అతితీక్ష్ణస్వభావముగల సూర్యుఁడు ఒకానొక కాలమునందు చల్లని కాంతిగలవాఁడైనను, శీతస్వభావముగల చంద్రుఁడు వేడిమి గలవాఁడైనను సర్వదా ఊర్ధ్వజ్వాలలు గల అగ్ని క్రిందిభాగమునకు ప్రసరించుజ్వాలలు గలవాఁడైనను బ్రహ్మతత్త్వజ్ఞాని ఆశ్చర్యమును పొందఁడు.

శ్లో. చిదాత్మన ఇమా ఇత్థం ప్రస్ఫురంతీహ శక్తయః,
ఇత్యస్యాశ్చర్యజాలేషు నాభ్యుదేతి కుతూహలమ్.

తా. సర్వశక్తియుక్తుఁడైనపరమాత్మయందు అనేకవిధములగుశక్తులు కలవు. అవి కొన్ని కొన్ని దేశకాలములయం దావిర్భవించును. మరికొన్ని మరికొన్ని దేశకాలములయం దావిర్భవించు నను అభిప్రాయము కలవాఁడైనందున, బ్రహ్మవేత్త ఇతరజనుల కాశ్చర్యమును గలుగఁజేయు విషయముల యం దాశ్చర్యము నొందఁడు.

శ్లో. యస్తు వా భావితాత్మాపి సిద్ధిజాలాని వాంఛతి,
స సిద్ధిసాధకైర్ద్రవ్యైస్తాని సాధయతి క్రమాత్. అని.

ఏపురుషుఁడు ఆత్మతత్త్వసాక్షాత్కారము గలవాఁడై నప్పటికి, ఆకాశగమనాదిసిద్ధులను కోరునో, అట్టిపురుషుఁడు ఆ సిద్ధులను సాధించుద్రవ్యమంత్రాధిసాధనములను సంపాదించి క్రమముగా సిద్ధులను సాధించును.

ఇందువలన తత్త్వజ్ఞానము విదేహముక్తిజీవన్ముక్తులకు సాధనముగా నుండును గాని, ఆకాశగమనాదిసిద్ధులకు సాధనము కాదు కనుకనే జీవన్ముక్తులగువారికి ఆకాశగమనాదిసిద్ధులు సంభవింపనేర వని ప్రతిపాదింపఁబడినది.

ఆత్మవిషయమగు సంప్రజ్ఞాతసమాధి వాసనాక్షయమునకు నిరోధసమాధికిని కారణమై యున్నందున దానియందే మేము ఆదరముంచి దానినే నిరూపించినారము.

ఇఁకను చిత్తభూమునైదింటిలో అయిదవభూమియగు నిరోధసమాధిని నిరూపించెదము.

ఈనిరోధసమాధిని పతంజలిమహర్షి సూత్రించియున్నారు.

సూ. వ్యుత్థాననిరోధ సంస్కారయోరభిభవప్రాదుర్భావౌ నిరోధలక్షణ చిత్తాన్వయో నిరోధసమాధిః. అని.

ఈసూత్రము ఇదివరలో వ్యాఖ్యానము చేయఁబడియున్నది.

వ్యుత్థానసంస్కారములు సమాధికి విరోధులుగా నుండును. అట్టిసంస్కారము లేవి యనఁగా వాసిష్ఠరామాయణములో ఉద్దాలకమునియొక్క సమాధిలో నుదాహరింపఁబడినవి.

శ్లో. కదా ఉహం త్యక్తమననే పదే పరమపావనే,
చిరం విశ్రాంతిమేష్యామి మేరుశృంగ ఇవాంబుదః.

తా. ఉద్దాలకుఁడను ముని సమాధిని చాలించియున్న సమయములో నీప్రకార మాలోచించుచుండెను. నేనువిచారశూన్యమై అనఁగా నసందిగ్ధమై పరమపవిత్రమైన బ్రహ్మస్వరూపమునందు స్థిరముగాఁ జిత్తమునుఁ జేర్చి చిరకాలము మేరుశిఖరమునందు మేఘమువలె నెప్పుడు నిలువఁగలను?

శ్లో. ఇతి చింతాపరవశో బలాదుద్దాలకో ద్విజః,
పునఃపునస్సూపవిశ్య ధ్యానాభ్యాసం చకార హ.

తా. ఈప్రకారము చింతించుచున్నవాఁడై ఉద్దాలకుఁడనుముని బలాత్కారముగా మాటిమాటికి కూర్చుండి ధ్యానమును అభ్యసించెను.

శ్లో. విషయైర్నీయమానే తు చిత్తే మర్కటచంచలే,
న స లేభే సమాధాన ప్రతిష్ఠాం ప్రీతిదాయినీం.

తా. కోఁతివలె అతిచంచలస్వభావముగల చిత్తము శబ్దాదివిషయములచేత నీడ్వఁబడుచుండఁగా నుద్దాలకునకు సమాధియందు ఆనందజనకమైన స్థైర్యము కలుగక పోయెను.

శ్లో. కదాచిద్బాహ్యసంస్పర్శపరిత్యాగాదనంతరం,
తస్యాగచ్ఛచ్చిత్తకపిరాంతరస్పర్శపదం ముహుః.

తా॥ ఉద్దాలకునియొక్క చిత్తము విషయములాకర్షించిన ప్రకారమును చెప్పుచున్నారు. ఆయుద్దాలకునియొక్క చిత్తమను వానరము ఒకసమయములో బాహ్యవిషయములలోనుండి మరలింపఁబడి, అంతరవిషయములయందు సంచరించుచుండును. అనఁగా బాహ్యవిషయములయందుఁ బ్రవర్తించకుండఁ జేయఁబడిన చిత్తము పూర్వానుభూతవిషయములను స్మరించుచుండును అని భావము.

శ్లో. కదాచిదాంతరస్పర్శాద్బాహ్యం విషయమావిశే,
తస్యోడ్డీయ మనో యాతి కుత్రాపి త్రస్తపక్షివత్.

తా॥. మఱియొకసమయములో ఆంతరవిషయములను విడచి బాహ్యవిషయములను గ్రహించుచుండును. మరియొకసమయములో ఆయుద్దాలకునిమనస్సు బెదరినపక్షివలె నెగిరి యెక్కడికో పోవుచుండును.

శ్లో. కదాచిదుదితార్కాభం తేజః పశ్యతి విస్తృతం,
కదాచిత్కేవలం వ్యోమ కదాచిన్నిబిడం తమః.

తా. ఒకసమయములో సూర్యసమానమగు తేజస్సును జూచును. మరియొకసమయమందు కేవలాకాశమును, మరి యొకకాలమందు దట్టమైన తమస్సును చూచును.

శ్లో. ఆగచ్ఛతో యథాకామం ప్రతిభాసాత్పునఃపునః,
అచ్ఛినన్మనసా శూరః ఖడ్గేనేవ రణే రిపూన్.

తా. ఈప్రకారము యథేచ్ఛముగా సంభవించుచున్న విషయజ్ఞానములను ఆ యుద్దాలకుఁడు తనమనస్సను ఖడ్గము చేత శూరుఁ డగువాఁడు యుద్ధమునందు శత్రువులను ఖండించి నట్లు ఖండించెను.

శ్లో. వికల్పౌఘే సమాలూనే సోఽపశ్యద్ధృదయాంబరే,
తమశ్ఛన్నవివేకార్కం లోలకజ్జలమేచకం.

తా. ఈప్రకారము విషయముల నన్నిటిని ఛేదించిన తరువాత ఆముని తనహృదయాకాశమునందు అజ్ఞానముచేత నావరింపఁబడినందున కాటుకపొడివలె నల్లనై చలించుచున్న వివేక మనుసూర్యబింబమును చూచెను.

అనఁగా తమోగుణభూయిష్ఠమైన యాత్మానాత్మవివేకము చిత్తమందు స్ఫురించె నని భావము.

శ్లో. తమప్యుత్సాదయామాస సమ్యగ్జ్ఞానవివస్వతా,
తమస్యుపరతే స్వాంతే తేజఃపుంజం దదర్శసః.

తా. సమ్యగ్జ్ఞానమను సూర్యునిచేత ఆతమోగుణ మను అంధకారమును నివర్తింపఁజేసినతరువాత నాయుద్దాలకునకు తనహృదయమందొక తేజోవిశేషము కనుపడెను.

శ్లో. తల్లులావ స్థలాబ్జానాం వనం బాల ఇవ ద్విపః,
తేజస్యుపరతే తస్య ఘూర్ణమానం మనో మునేః.
నిశాబ్జవదగాన్నిద్రాం తామప్యాశు లులావ సః.

తా. మెట్టతామరను ఏనుఁగు తెంచివేసినట్టు ఉద్దాలకుఁడా తేజస్సును ఛేదించెను. తేజస్సు నివర్తింపఁగానే ఆముని యొక్క మనస్సు విహ్వలమై రాత్రికాలమందు తామరపూవు వలె ముడుచుకొనిపోయెను. అనఁగా నిద్రలో చేరెను. నిద్రను కూడ ఆముని నివారించెను.

శ్లో. నిద్రావ్యపగమే తస్య వ్యోమసంవిత్సముత్థితా,
వ్యోమసంవిది నష్టాయాం మూఢం తస్యాభవన్మనః.

తా. చిత్తమందు నిద్రయను లయదశ నివర్తింపఁగానే శూన్యతావస్థ జనించెను. ఆశూన్యతావస్థను కూడ నివారింపఁగా ఆమునియొక్క మనస్సు మూఢముగా నుండెను. అనఁగా నేవిషయమును గ్రహింపకుండ నిర్విషయముగా నుండె నని భావము.

శ్లో. మోహమప్యేష మనసస్తం ముమార్జ మహాశయః,
తతస్తేజస్తతో నిద్రామోహాదిపరివర్జితాం.
కామప్యవస్థామాసాద్య విశశ్రామ మనః క్షణం. అని.

తా. ఈ ఉద్దాలకుఁడు ప్రమాదము లేనివాఁడై తన చిత్తమునందుఁ గలిగిన యామోహమును కూడ నివారించెను.

అనంతరము నిద్రామోహాదిదోషములు లేని యవాఙ్మానసగోచరమైన స్థితిని బొంది, ఆయుద్దాలకునియొక్క మనస్సు విశ్రమము నొందెను. అనఁగా సకలవిషయములఁ బరిత్యజించి బ్రహ్మాకారమై యామునియొక్క మనస్సు హాయిని బొందెను.

ఇందుచేత బ్రహ్మతత్త్వజ్ఞానేచ్ఛ కలిగియున్నప్పటికి చిత్తమునకు క్షిప్తమూఢవిక్షిప్తభూమికలయందుండు బాహ్యాభ్యంతరవిషయములయందు సంచారము అనవస్థితత్వము దేహాంతరాళమందుండు తేజస్సును తమస్సును చూచుట నిర్విషయముగా నుండుట ఇవి మొదలగునవి వ్యుత్థానసంస్కారము లని చెప్పఁబడినవి.

ఈ వ్యుత్థానసంస్కారములు నిరోధసమాధిరూపమగు యోగిప్రయత్నముచేత ప్రతిదినమందు ప్రతిక్షణమందును నివారింపఁబడుచుండును. వ్యుత్థానసంస్కారవిరోధులగు నిరోధసంస్కారములు పుట్టింపఁబడుచుండును. ఈ ప్రకారము చేయుచుండఁగా నిరోధవ్యుత్థానములయందు రెంటియందు సంచరించుచిత్తము నిరోధమందే నిలిచియుండును.

ఆక్షేపము—ఓయీ! "(ప్రతిక్షణపరిణామినోహి భావా ఋతే చితిశక్తేః") అనున్యాయప్రకారము చిత్తమునకు సర్వకాలములయందు విచిత్రరూపమైన పరిణామము కల దని చెప్పవలయును గదా. ఈలాగున నుండఁగా పరిణామము లేకయే చిత్తము నిరోధమును బొంది యేప్రకారముగా నుండును? (చిద్రూపమగు బ్రహ్మస్వరూపము గాక, ఇతరములైన పదార్థములన్నియు ప్రతిక్షణమునం దవస్థాంతరమును పొందుచుండు నని న్యాయవాక్యమున కర్థము.)

సమాధానము.—వాస్తవము. వ్యుత్థానదశయందు విచిత్రపరిణామము కలిగియుండును. నిరోధమును పొందింపఁ

బడిన చిత్తమునకు పరిణామము ఏప్రకారముగా నుండు నని శంకించి పతంజలిమునియే

సూ. తతః ప్రశాంతవాహితా సంస్కారాత్.

అనుసూత్రముచేత సమాధానమును చెప్పిరి. చిదుగులు, నెయ్యి మొదలగు వస్తువులను వేయుచుండఁగా అగ్ని యేప్రకారము ఉత్తరోత్తరము వృద్ధినొంది ప్రజ్వలించుచుండునో సమిధలు మొదలగువాటిని వేయకుండ నుండఁగా మొదటిక్షణము నందు కొంచెము శాంతినొంది, అనంతరము ప్రతిక్షణము విశేషముగా శాంతి నొందుచుండునో, అప్రకారమే నిరోధింపఁబడిన చిత్తము ఉత్తరోత్తరము అధికమైన ప్రశమమును నొందుచుండును. ఇదియే ప్రశాంతవాహిత యనఁబడును. ఇందులో పూర్వపూర్వప్రశాంతిచేతఁ గలిగిన సంస్కారము ఉత్తరోత్తరప్రశాంతికిఁ గారణమైయుండును. ఇట్టి ప్రశాంతవాహిత యను చిత్తపరిణామమును శ్రీకృష్ణమూర్తి భగవద్గీతలయొక్క ఆఱవయధ్యాయములో విస్పష్టముగా నానతిచ్చియున్నారు.

శ్లో. యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే,
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా.

తా. విశేషముగా నిరోధింపఁబడినచిత్తము ఎప్పుడు చిద్రూపుఁడగు పరమాత్మయందే నిశ్చలముగా నుండునో, అప్పుడు సర్వకామములయందు నిస్పృహగల పురుషుఁడు యోగసిద్ధిగలవాఁడాయె నని యెఱుఁగవలయును.

శ్లో. యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా,
యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః.

తా. గాలి లేని ప్రదేశములో పెట్టఁబడిన దీపము ఏప్రకారము చలించక యుండునో, పరమాత్మవిషయమైన యోగము నభ్యసించుపురుషుని యొక్క నిరోధమును బొందిన చిత్తము ఆప్రకారముగా నుండును.

శ్లో. యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మ నాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి.
సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్,
వేత్తి యత్ర నచైవాయం స్థితశ్చలతి తత్త్వతః.
యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే,
తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితం.
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా. అని.

తా. ఏయవస్థయందు యోగాభ్యాసముచేత నిరోధింపఁబడిన చిత్తము సర్వవిషయములను విడచియుండునో ఏయవస్థయందు పరిశుద్ధమయిన మనస్సుచేత పరమాత్మస్వరూపమే చూడఁబడునో, దేహేంద్రియాదులు చూడఁబడవో ఆత్మను చూచుచు ఆత్మయందే సంతోషము పొందఁబడునో, విషయములయందు సంతోషము పొందఁబడదో ఏయవస్థయందవాఙ్మానసగోచరమై సర్వోత్కృష్టమై నిత్యమై ఇంద్రియగోచరముగాని సుఖము అనుభవింపఁబడునో ఏయవస్థలో యోగియగువాఁడు ఆత్మస్వరూపమునందు నిలచి చలింపకయుండునో, దేనియందు ఆత్మస్వరూపమును పొంది అంతకంటె అధికమైన లాభము లేదని తలంచుచుండునో ఏ యవస్థయందుండి ప్రబలమైన దుఃఖములు

ప్రాప్తించినా విక్షోభమును పొందక యుండునో అట్టియవస్థ సర్వదుఃఖస్పర్శశూన్యమయిన యోగమని చెప్పఁబడును. ఇట్టి యోగమును నిర్వేదమును బొందని చిత్తముగలిగి దృఢాధ్యవసాయముచేత సాధించవలయును. నిర్వేదమనఁగా విసుకు. ఇది చిరకాలసాధ్యమయిన కార్యముల నారంభించి చేయునప్పుడు పుట్టుచుండును. ఈవిసుకును పొందకుండ యోగము నభ్యసింపవలయును. ఇదిగాక గురుశాస్త్రోపదిష్టవిషయములయందు విశ్వాసముంచి యోగమును సాధించవలయును. ఆనిర్వేదము నిశ్చయమును లేనిమనుజుడు యోగము సిద్ధింపనేరడు.

నిరోధసమాధియొక్క సాధనమును పతంజలి సూత్రము చేత నిరూపించియున్నారు.

సూ. విరామప్రత్యయాభ్యాసపూర్వకః సంస్కారశేషోఽన్యః.

తా. వృత్తులయొక్క ఉపశమము విరామ మనఁబడును. అట్టి విరామమునకు కారణము పురుషప్రయత్నము. ఈపురుషప్రయత్నమును అడుగడుగు నభ్యసించుటచేత అసంప్రజ్ఞాతసమాధి జనించును. ఇదియె నిరోధసమాధి యనఁబడును. దీనియందు వృత్తిశూన్యమగుచిత్తము తనస్వరూపముతో కనుపడకుండ నుండి సంస్కారమాత్రముగా నుండు నని సూత్రార్థము.

నిరోధసమాధి విరామప్రత్యయాభ్యాసముచేత పుట్టు నని శ్రీకృష్ణమూర్తిచేత చెప్పఁబడినది.

శ్లో. సంకల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వానశేషతః,
మనసైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః.

తా. సంకల్పముచేత ఫుట్టుచుండు యోగప్రతికూలము లగు కామములనన్నిటిని సవాసనగా వదలివేసి చక్షురాదీంద్రియములను విషయములలోకి చేరకుండ మనస్సుచేత నాకర్షించి యోగము నభ్యసింపవలయును.

శ్లో. శనైశ్శనైరుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్.

తా. ధారణచేత స్వాధీనపఱచుకోఁబడినబుద్ధివలన మనస్సును పరమాత్మయందు నిశ్చలముగాఁ జేర్చి అభ్యాసక్రమమున నుపరతిని బొందవలయును. ఇతరవిషయములను కొంచెమైనను చింతింపఁగూడదు.

శ్లో. యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరం,
తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్. అని.

తా. ఈప్రకార మభ్యసింపఁబడుచున్నప్పటికి చిత్తము రజోగుణముచేత విషయములయందుఁ బ్రవర్తించినను, తమోగుణముచేత నిద్రాలస్యాదిదోషములను పొందినను, అట్టిలయవిక్షేపములయందుండి తొలఁగించి పరమాత్మయందు నిశ్చలముగా చేర్చి యుంచవలయును.

కోరఁబడుచున్న స్రక్చందనవనితాపుత్రమిత్రగృహక్షేత్రాదిపదార్థములు మోక్షశాస్త్రమును తెలిసిన పండితులచేత వ్యవహరింపఁబడు అనిత్యత్వాదిదోషములు కలవైనప్పటికి అనాద్యజ్ఞానవివశమువలన నాదోషములను ఆచ్ఛాదించి అవిషయములయందు యోగ్యతను (మంచిని) సంకల్పించును. అట్టి సంకల్పముచేత 'ఇది నాకు కావలయును, అది నాకు కావలయును'

అను కామములు పుట్టును అనఁగా స్రక్చందనాదిపదార్థములు అనిత్యత్వాదిదోషములు కలవైనప్పటికి, ఆదోషములు అనాద్యజ్ఞానముచేత నావరింపఁబడి కనుపడనందున ఆవిషయములు మంచి వను అభిప్రాయము కలుగును. అందువలననే ఆ విషయములయందు కామములు (కోరికలు) పుట్టుచుండును అని భావము.

ఈ యర్థ మొకస్మృతియందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో. సంకల్పమూలః కామో వై యజ్ఞాస్సంకల్పసంభవాః,
కామ జానామి తే మూలం సంకల్పాత్కిల జాయసే.
న త్వాం సంకల్పయిష్యామి సమూలో న భవిష్యసి. అని,

తా. కామము సంకల్పమువలనఁ బుట్టుచుండును. యాగదానాదులు సంకల్పమువలననే కలుగుచుండును. ఓ కామమా! నీయొక్క మూలము (వేరు) తెలిసినది. నీవు సంకల్పము వలనఁ గదా పుట్టుచున్నావు. అట్టి సంకల్పమును నేను ఇఁకఁ జేయను. అందువలన నీవు సమూలముగా నశించిపోదువు.

వివేకముచేత విషయములయందుండు దోషములు ప్రత్యక్షము కాఁగానే కుక్కచేత క్రక్కఁబడిన పాయసమందువలె విషయములయందు కామములు పుట్టవు. ఇహలోకమునందుఁ గల స్రక్చందనాదివిషయములయందు కామము విడిచినట్లు బ్రహ్మలోకాదిపరలోకములయందు అణిమాద్యష్టైశ్వర్యములయందు కూడ కామమును విడువవలయును అను అభిప్రాయము చేత 'సంకల్పప్రభవాన్ కామాన్' అను భగవద్గీతావాక్యము

నందు సర్వశబ్దము చెప్పఁబడినది. ఇదిగాక మాసోపవాసవ్ర
తము ననుష్ఠించువానికి ఆమాసమందు అన్నము విడువఁబడి
నను అన్నమందు కామము అడుగడుగుకు కలుగుచుండును.
త్యజింపఁబడిన విషయములయందు ఆప్రకారము కామముకలు
గకుండ నుండవలయును. కామమును విడిచినతరువాత బుద్ధి
పూర్వకముగా విషయములయందు ప్రవృత్తి లేకపోయినను
చక్షురాదీంద్రియములకు రూపాదివిషయములయందు స్వభా
వముచేతనే ప్రవృత్తి సంభవించుచుండును. అట్టిప్రవృత్తిని
కూడ ప్రయత్నవిశేషముతోఁ గూడిన మనస్సుచేత నివారింప
వలయును. దేవతాదర్శనాదులయందుఁగూడ చక్షురాదీంద్రియ
ములను ప్రవర్తింపనీయఁగూడదు.

భూమికాజయక్రమమునకుఁగా ఉపశమము నభ్యసింప
వలయును. జ్ఞానభూమికలు నాలుగు. అవి కఠవల్లియను ఉపనిష
త్తులో చెప్పఁబడినవి.

శ్రు. యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేత్ జ్ఞాన ఆత్మని,
జ్ఞానమాత్మని (మహతి) నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాంత ఆత్మని. అని.

తా. వాగింద్రియవ్యాపారమును మనస్సునందు నిరో
ధింపవలయును. మనోవ్యాపారమును జ్ఞానాత్మయను విశేషా
హంకారమునందును ఆవిశేషాహంకారమును మహదాత్మయను
సామాన్యాహంకారమందును ఆసామాన్యాహంకారమును శాం
తాత్మయను నిరుపాధికుఁడైన పరమాత్మయందును జేర్చి
నిరోధింపవలయునని యర్థము.

దీనియొక్క తాత్పర్యమును వివరించెదము.

వాగింద్రియము లౌకికవ్యాపారమని వైదిక వ్యాపారమని రెండువిధములు. అందులో వ్యర్థప్రలాపము లౌకిక వ్యాపారమని, అష్టాక్షరీ పంచాక్షరీ ప్రభృతిమంత్రజపము, వేదపారాయణము మొదలగునవి వైదికవ్యాపారమని చెప్పఁబడును. ఇందులో లౌకికవ్యాపారము వ్యుత్థానదశయందు కూడ చిత్తవిక్షేపకరమైనందున యోగికి సర్వదా త్యాజ్యము. కనుకనే యోగస్మృతియందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో. మౌనం యోగాసనం యోగః తితిక్షైకాంతశీలతా,
నిస్పృహత్వం సమత్వం చ సప్తైతాన్యేకదండినః. అని.

తా. వాగ్వ్యాపారపరిత్యాగము యోగమున కుపయోగమగు పద్మాసనాద్యాసనము ప్రాణాయామము శీతోష్ణాది ద్వంద్వసహనము ఏకాంతప్రదేశమందు నివాసము విషయములయం దాశ లేకపోవుట సర్వభూతములయందు సమత్వబుద్ధి యీయేడును పరమహంససన్న్యాసికి ముఖ్యధర్మములు.

మంత్రజపాదివ్యాపారము నిరోధసమాధియందు త్యాజ్యము. వ్యుత్థానదశయందు అనుష్ఠేయము. ఇట్టి వాగ్వ్యాపార పరిత్యాగము వాగ్భూమిక యని చెప్పఁబడును. ఇది మొదటి భూమిక. ఈభూమికను విశేషప్రయత్నముచేత కొన్ని దినములకుఁగాని కొన్ని మాసములకుఁగాని కొన్ని సంవత్సరములకుఁగాని జయించి (సాధించి) తరువాత మనోభూమికయందు ప్రయత్నము చేయవలయును. మొదటిభూమికను దృఢముగా సాధింపక పైభూమికలలోనికి పోవుటను అభ్యాసము చేసినపక్షమందు

మొదటిభూమిక దృఢముగా లేనందున పైభూమికలు చెడిపోవును గాని సిద్ధింపనేరవు.

ప్రశ్న.—చక్షురాదీంద్రియములను కూడ నిరోధింపవలదా? వాగింద్రియమును మాత్రము నిరోధించితే చాలునా?

ప్రతివచనము—చాలదు. చక్షురాదీంద్రియములను కూడ నిరోధింపవలసినది అవశ్యకమేను. అయితే చక్షురాది నిరోధము వాగ్భూమికయందుఁగాని మనోభూమికయందుఁగాని అంతర్భవించును.

ఆక్షేపము.—ఓయీ! వాగింద్రియమును మనస్సునందు నిరోధించవలయునని చెప్పితివి. ఒక ఇంద్రియము మరియొక ఇంద్రియమునందు ప్రవేశించుట కానము గనుక ఇది యుక్తముగా కనుపడలేదు.

పరిహారము—ఇచ్చట ఒక ఇంద్రియము మరియొక ఇంద్రియమునందు ప్రవేశించునని చెప్పలేదు. వాగింద్రియము మనస్సు ఈ రెండు నానావిధవిక్షేపములను కలుగఁజేయును గనుక మొదట వాగింద్రియవ్యాపారమును విడిచి మనోవ్యాపారములతో మాత్రము నిలిచియుండవలయునని చెప్పఁబడినది. గోమహిషాదిపశువులను వలె వాఙ్నియమము స్వాభావికముగా సిద్ధించినతరువాత మనస్సును జ్ఞానాత్మయందు నియమింపవలయును. ఆత్మ జ్ఞానాత్మ యని మహాత్మ యని శాంతాత్మ యని మూడువిధములు, విషయజ్ఞానసాధనమైనమనస్సు ఇచ్చట నియామ్యముగాఁ జెప్పఁబడినందున చిదాత్మకు జ్ఞాతృత్వమును

కలుగఁజేసిన అహంకారము ఇచ్చట జ్ఞానాత్మ యని చెప్పఁబడినది. అహంకారము సామాన్యాహంకార మని విశేషాహంకార మని రెండువిధములుగా నున్నది. నేను ఫలానివానికుమారుఁడను, ఫలానిపేరుకలవాఁడను, ఫలానివిద్యను నేర్చినవాఁడను అని విస్పష్టముగా నభిమానింపఁజేయునది విశేషాహంకారము. నేనని సామాన్యముగా నభిమానింపఁజేయునది సామాన్యాహంకారము. ఈసామాన్యాహంకారము సర్వజీవులయందు వ్యాపించియున్నందున మహాత్తని చెప్పఁబడినది. ఈరెండుఅహంకారములతోఁగూడిన ఆత్మలు ఇద్దరు సర్వోపాధిశూన్యమైన ఆత్మ శాంతాత్మ యని చెప్పఁబడినది. ఈమూఁడు ఆత్మలలో విశేషాహంకారవిశిష్టాత్మకంటె సామాన్యాహంకారవిశిష్టాత్మ అంతరము. అంతకంటె శాంతాత్మ అంతరమై యుండును. సర్వమునకాంతరమై చిద్రూపమైన శాంతాత్మయందు అవ్యక్త మని చెప్పఁబడు జడశక్తియగుమూలప్రకృతి చేరియున్నది. ఆమూలప్రకృతి సామాన్యాహంకారమైన మహత్తత్వమను నామమును బొంది వ్యక్తముగా నుండును. ఆమహత్తత్వమునకుపైఁగా, విశేషాహంకారమని అంతకుపైఁగా మనస్సని అంతకుపైఁగా వాగాదీంద్రియము లని నామములనుబొంది అతిస్ఫుటముగా పరిణమించును.

ఈయభిప్రాయముతోనే ఇంద్రియములు మొదలుకొని పరమాత్మకు ఉత్తరోత్తరము ఒకదానికంటె నొకటి అంతరమైయుండునని కఠవల్లియందు చెప్పఁబడినది.

శ్రు. ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః,
మనసస్తు పరా బుద్ధి ర్బుద్ధేరాత్మా మహాన్ పరః.
మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః,
పురుషాన్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః. అని.

తా. ఇంద్రియములకంటె విషయములు అంతరములు. వాటికంటె మనస్సు అంతరము మనస్సుకంటె బుద్ధియను విశేషాహంకారము, అంతకంటె మహత్తు యను సామాన్యాహంకారము, అంతకంటె మూలప్రకృతి అంతరస్థమై యుండును. అవ్యక్తముకంటె పరమాత్మ అంతరము. పరమాత్మకంటె అంతరమైనది మరియొకటి లేదు. ఇట్టిపరమాత్మయే అన్నిటికి పర్యవసానమం దుండునదియును ముఖ్యముగాఁ దెలియఁదగినదియు అని శ్రుతి కర్థము.

కనుకనే నానావిధసంకల్పవికల్పాత్మక మగు మనస్సును విశేషాహంకారమందు నియమింపవలయును. అనఁగా మనోవ్యాపారములైన రాగద్వేషాదివాసనలను సంకల్పవికల్పములను విడచి విశేషాహంకారముతో మాత్రము నిలుపవలయు నని భావము.

శ్లో. తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరం.

తా. అతిచపలస్వభావము గల మనస్సును నిగ్రహించుట వాయువుయొక్క నిరోధమువలెనే శక్యము కాదని తలఁచెదను.

అని యీప్రకారముగా చెప్పుచున్న అర్జుననిఁ జూచి అభ్యాసవైరాగ్యములచేత మనోనిరోధమును చేయవచ్చు నని

శ్రీకృష్ణమూర్తిచేత నుత్తరము చెప్పఁబడినందున మనోనిరోధము చేయుటకు శక్యమైయుండ దని శంకింపఁదగదు.

మనోనిరోధము శక్యము కాదని అర్జునుఁడు చేసిన ప్రశ్నకు శ్రీకృష్ణమూర్తిచేత నుత్తర మీప్రకారముగాఁ జెప్పఁబడినది.

శ్లో. అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే.

తా. ఓ అర్జునా! మనస్సు అతిచంచలమైనది. నిగ్రహించుటకు శక్యమైనదియు కాదు. ఇందుకు సంశయము లేదు. కాని అభ్యాసముచేత వైరాగ్యముచేత మనస్సు నిగ్రహింపఁబడును. అనఁగా హఠయోగముచేత నిగ్రహించుటకు శక్యము కాదు గాని మృదుయోగముచేత శక్యముగా నున్నది యని భావము.

శ్లో. అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః. అని.

తా. అభ్యాసవైరాగ్యముల నుదాహరించిన పతంజలిసూత్రముల ముందు వివరించెదము. పూర్వభూమికలను దృఢముగా నభ్యసింపనివానికి యోగము దుస్సాధ్యమై యుండును. పూర్వభూమికలను దృఢముగ నభ్యసించినవానికి ఉపాయముచేత సాధ్యమై యుండు నని అర్థము.

ఉపాయముచేత యోగము సాధ్యమై యుండు నని శ్రీగౌడపాదాచార్యులవారిచే కూడ చెప్పఁబడినది.

శ్లో. ఉత్సేక ఉదధేర్యద్వత్కుశాగ్రేణైకబిందునా,
మనసో నిగ్రహస్తద్వద్భవేదపరిఖేదతః.

తా. దర్భాగ్రముచేత నొక్కొకబిందువును వెలుపలికి విసుకు నొందకుండ చల్లుచున్నచో, ఏప్రకారము సముద్రముయొక్క జలమును యావత్తు నిశ్శేషముగా నివర్తింపఁజేయ నగునో, ఆప్రకారము మనోనిగ్రహోపాయములయందు విసుగు లేక ప్రవర్తించువానిచేత మనస్సు నిగ్రహింపఁబడును.

శ్లో. బహుభిర్న విరోద్ధవ్య మేకేనాపి బలీయసా,
స పరాభవమాప్నోతి సముద్ర ఇవ టిట్టిభాత్. అని.

తా. ఎంతబలవంతుఁడైనను బహుజనముతో విరోధము పొందఁగూడదు బహుజనముతో విరోధమును పొందిన వాఁడు సముద్రము కులింగపక్షితో విరోధపడి పరాభవమును పొందినట్లు పరిభవమును పొందును

ఇచ్చట సంప్రదాయవేత్తలొక కథను చెప్పుదురు. ఒక కులింగపక్షి (తీతపక్షి భూమియందే - రాత్రికాలము శయనించును. భూమియందే గుంటలను చేసి గుడ్లను పెట్టుచుండును.) సముద్రతీరమునందు తనభార్యతోగూడ కాపురము చేయుచుండెను. అప్పుడాకులింగపక్షిభార్య గర్భమును ధరించియుండి తనభర్తను జూచి యిఁకను నీవిచ్చట కాపురమును జేయఁగూడదు. ప్రసవసమయము సమీపించినది. ఇప్పుడు నేను ప్రసవించినయెడల, మహాసముద్రము ఉప్పొంగి, తరంగముల చేత నీడ్చుకొనిపోవును. కనుక మఱియొక ప్రదేశమునకుపోయి ప్రసవించెద నని చెప్పెను. అందుకాకులింగపక్షి భార్యను

చూచి ఓపిచ్చిదానా! నాసామర్థ్యము సముద్రునకు తెలియదా? అతఁడు మనకు అపకారమును చేయునా? భయము లేదు. ఇచ్చటనే ప్రసవింపు మని చెప్పెను అంతట నాకులింగపక్షి భర్తమాటను అతిక్రమింపఁజాలక యాసముద్రతీరమునందే గ్రుడ్లను పెట్టెను. సముద్రుఁడు కులింగపక్షియొక్క ప్రగల్భవాక్యములను విని చూచెదను. ఈపక్షి యేమి చేయునో యని దానిగ్రుడ్లను అలలచేత లోపలికి నీడ్చుకొని పోయెను. అప్పు డాకులింగపక్షిభార్య తనపెనిమిటిని జూచి నేనింతకే చెప్పలేదా? సముద్రుఁడు మనగ్రుడ్లను నీడ్చుకొని పోయెఁగదా యని దుఃఖించెను. అప్పు డాకులింగపక్షి తనభార్యతో నీవు దుఃఖింపకు నేను సముద్రపుజలమును శోషింపఁజేసి మనగ్రుడ్లను తిరిగి తెచ్చెదనని చెప్పి తనముక్కుతో నొక్కొక జలబిందువును గ్రహించి దరికి నుమియుచుండెను. అప్పు డాపక్షియొక్క బంధువులందఱువచ్చి యిది నీకు శక్యముగానిపని దీనిని మానుకొమని యెంత చెప్పినను ఆకులింగపక్షి మానక మీ రందఱు నాకు సహాయముగా నుండుఁడు. త్వరలో నేనీసముద్రుని శోషింపఁజేయుద మని ఆప్తులను సహాయముకోరెను. ఆపక్షు లన్నియు ఆకులింగపక్షికి సహాయములై తమముక్కులతో నొక్కొక జలబిందువును సముద్రములోనుండి గ్రహించి దరికి నుమియుచుండెను. అప్పు డీకులింగపక్షియొక్క అదృష్టముచేత నాత్రోవను వచ్చిన నారదమహర్షి యీకులింగపక్షియొక్క యత్నమును మొదటినుండి విని యిది నీకు శక్యముగాదు. మానుకోమని బోధించిరి. ఎంత బోధించినను ఈజన్మములోగాని మరి

యొకజన్మములోఁగాని వేయిజన్మములకైనను ఈసముద్రమును శోషింపఁజేసి నాగ్రుడ్లను నేనుగ్రహించుదునుగాని యీ సంరంభమును మానుట లే దని దృఢముగాఁజెప్పి నీటిచుక్కలను వెలుపలికి చిమ్ముచుండెను. అంతట నారదమహర్షి ఆ కులింగపక్షియొక్క దృఢనిశ్చయమునను మిక్కిలి సంతోషించి దయగలవాఁడై గరుత్మంతునియొద్దకుఁబోయి ఆయనను ఈ కులింగపక్షికి సహాయముగా ప్రేరేపించి పంపెను. అంతట నా పక్షీంద్రుని పక్షవేగమునను సముద్రుఁడు భయమునొంది ఆ పక్షి యొక్క గ్రుడ్లను దానికి నిచ్చి ప్రార్థించి స్వాపరాధమును క్షమింపఁజేసుకొనిపోయెను. ఈప్రకారమే సమర్థమైన మనో నిరోధమునందు ప్రయత్నము చేయుపురుషుఁడు విసుగు లేక చేయుచుండును వానిని పరమేశ్వరుఁ డనుగ్రహించి శీఘ్రముగా మనోనిరోధము కలుగునట్లుగఁ జేయును.

అన్నము భుజించుపురుషుఁడు సద్యస్సద్య హారలు మొదలైనవానిని అనుభవించుటచేత నేప్రకారము పుష్టిని నొందుచు నన్నమును భుజించునో యాప్రకారము మనోనిగ్రహోపాయముల నభ్యసించువాఁడు సద్యస్సద్య శమసుఖాల వ్యాపారముల నభ్యసించుటచేత పుష్టినొందుచు మనోనిగ్రహమును సాధించును.

ఈయభిప్రాయముతోనే వసిష్ఠమహర్షి చెప్పుచున్నారు.

శ్లో. [illegible],
[illegible].

తా. వివేకములేని మనస్సునను వివేకమును కలుగఁజేయునపుడు మొదట చిత్తముయొక్క రెండుభాగములను భోగములచేతను ఒకభాగమును శాస్త్రముచేతను మరియొక భాగమును గురుశుశ్రూషచేతను నింపవలయును.

శ్లో. కించిద్వ్యుత్పత్తియుక్తస్య భాగం భోగైః ప్రపూరయేత్,
గురుశుశ్రూషయా భాగౌ భాగం శాస్త్రార్థచింతయా.

తా. కొంచెము వివేకముగలిగినతరువాత నొకభాగమును, భోగముచేత రెండుభాగములను, గురుశుశ్రూషచేత మరియొకభాగమును శాస్త్రవిచారముచేత నింపవలయును.

శ్లో. వ్యుత్పత్తిమనుయాతస్య భాగౌ తు వ్యాసతో౽న్వహం,
ద్వౌ భాగౌ శాస్త్రవైరాగ్యైర్ద్వౌ ధ్యానగురుపూజనం.

తా. విశేషముగా వివేకమును బొందినతరువాత ప్రతిదినము చిత్తముయొక్క రెండుభాగములను శాస్త్రవిచారవైరాగ్యములవలనను రెండుభాగములను తద్ధ్యానానుసంధానగురుశుశ్రూషాదులవలనను నింపవలయును.

ఇచ్చట భోగశబ్దముచేత దేహధారణసాధనమైన భిక్షాటనాదివ్యాపారము వర్ణాశ్రమోచితనిత్యనైమిత్తికకర్మానుష్ఠానము చెప్పబడుచున్నది. గడియకాలముగాని రెండుగడియల కాలముగాని యథాశక్తిగా యోగము నభ్యసించి తరువాత ముహూర్తకాలము శాస్త్రశ్రవణముచేతగాని గురుశుశ్రూష చేతఁగాని గురుసన్నిధియందు నివసించి ముహూర్తకాలము స్వదేహధారణార్థమైనపనులను చేసుకొని ముహూర్తకాలము యోగశాస్త్రమును ఆలోచించి తిరిగి ముహూర్తకాలము యో

లను, కాండమును, అధ్యయనముచేసి క్రమముగా వేదమునంతటిని చదివి యధ్యాపకత్వము నేప్రకారము పొందునో వర్తకమును జేయుకోమటి మొదట నొకవరహాను తరువాత రెండువరహాలను సంపాదించి క్రమముగా లక్షద్రవ్యమార్జించి యేప్రకారము లక్షేశ్వరుండగునో ఆప్రకారము బ్రహ్మచారి, కోమటి అధ్యయనమును వర్తకమును ఆరంభించినప్పుడు తాను కూడ సమానముగా యోగాభ్యాసము నుపక్రమించి ఉత్తరోత్తరము వృద్ధిగా వారలకంటె నెక్కువగా పనిచేయువలెనని అభినివేశము నొంది యోగము నభ్యసించినయెడల బ్రహ్మచారివర్తకులు అధ్యాపకత్వలక్షేశ్వరత్వముల నెంతకాలమునకు పొందుదురో యంతకాలమునకు తాను యోగముయొక్క పరమావధిని నెందువల్ల పొందజాలడు! అవశ్యముగా యోగకాష్ఠను పొందనేపొందును.

కనుక మాటిమాటికి చిత్తమందు వచ్చుచేను సంకల్పవికల్పములను ఉద్దాలకునివలె పురుషప్రయత్నముచేత నివారించి విశేషాహంకారోపాధికుండైన జ్ఞానాత్మయందు మనస్సును చేర్చి నిరోధింపవలయును. ఇది రెండవభూమిక. ఈభూమికను జయించితే బాలురకువలె, మూగవాండ్రకువలె అమనస్కత సిద్ధించును. అట్టి నిర్మనస్కత్వము స్వభావముగా నేర్పడిన తరువాత విశేషాహంకారరూపమైన జ్ఞానాత్మను సామాన్యాహంకారరూపుడగు మహత్తత్వమునందు చేర్చి నిరోధింపవలయును కొంచెము ప్రమాదనిద్రలను బొందినవానికి విశేషాహంకార మేప్రకారము సంకోచమును పొందునో

ప్రమాదనిద్రలను పొందకపోయినా, విశేషాహంకారమును మఱచుటయందు ప్రయత్నము చేయువానికి ఆప్రకారము విశేషాహంకారమును సంకోచమును బొందును. లోకప్రసిద్ధమయిన ప్రమాదనిద్రలయందు తార్కికాదుల కభిమతమైన నిర్వికల్పకజ్ఞానముతోఁటి సమానమైన ఆమహత్తత్వమాత్రనిష్ఠ మూఁడవ భూమిక యనఁబడును.

అభ్యాసవిశేషము చేత నీభూమికలను జయించినతరువాత నీసామాన్యాహంకారరూపమైన మహత్తత్వమును సర్వోపాధిశూన్యమై చిదేకరూపమైన శాంతాత్మయందుఁ జేర్చి నిరోధించవలయును.

శ్లో. మహత్తత్త్వం తిరస్కృత్య చిన్మాత్రం పరిశేషయేత్. ఇతి.

తా. మహత్తత్త్వమును కూడ తిరస్కరించి కేవల చిన్మాత్రుఁడైన పరమాత్మను శేషింపఁజేయవలయునని శ్లోకాంతరమందుఁ జెప్పియున్నది.

ఈచిన్మాత్రస్వరూపమును పరిశేషింపఁజేయు సమయములోఁ గూడ వెనుక చెప్పిన పూర్వభూమికాలంబనవిస్మృతిప్రయత్నమే పూర్వముకంటె నధికముగా చేయఁబడి [illegible] యుండును. శాస్త్రము నభ్యసించుపురుషునకు వ్యుత్పత్తి కలుగుటకు పూర్వము ప్రతిపదమును వివరించిచెప్పుట యావశ్యకమైయున్నప్పటికి వ్యుత్పత్తి కలిగినతరువాత స్వయముగానే ఉత్తరగ్రంథముయొక్క తాత్పర్యము నే ప్రకారముగా తెలియునో ఆప్రకారమే పూర్వభూమికను చక్కఁగా [illegible]

స్వాధీనపరచుకొన్న యోగికి ఉత్తరభూమికలను సాధించు నుపాయము స్వయముగానే తోఁచుచుండును.

ఈయర్థము యోగభాష్యకారు లగు వ్యాసాచార్యులచేఁ జెప్పఁబడినది.

శ్లో. యోగేన యోగో జ్ఞాతవ్యో యోగాద్యోగః ప్రవర్తతే,
యోఽప్రమత్తస్తు యోగేన స యోగీ రమతే చిరం. ౨౨.

తా. యోగముయొక్క యుత్తరభూమికను పూర్వభూమికచేతనే తెలుసుకొనవలయును. పూర్వభూమికయొక్క సమ్యగభ్యాసమువలన నుత్తరభూమిక ప్రవర్తించును. ఏపురుషుఁడు ప్రమాదములేనివాఁడై యుండునో వాఁడు భూమికల నన్నిఁటిని సాధించి చిరకాలము విహరించును.

ఆక్షేపము—ఓయీ! మహత్తత్త్వముయొక్కయు, శాంతాత్మయొక్కయు మధ్యమునందు 'ఇంద్రియేభ్యః పరా హ్యర్థా' అనుశ్రుతిచేత అవ్యక్తము చెప్పఁబడియున్నది. 'యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞః' అనుశ్రుతియందు మహత్తత్త్వమునకు స్వకారణమైన అవ్యక్తమునందు నిరోధమును చెప్పవలసిన అవశ్యకమైయుండఁగా దాని నతిక్రమించి శాంతాత్మయందు నిరోధము ఏల చెప్పఁబడినది.

సమాధానము—అవ్యక్తమునందు నిరోధమును చేయఁగానే అహంకారముతోఁ గూడిన మహత్తత్త్వము లయమును పొందును. అట్టిలయము పురుషార్థము కాదనే అభిప్రాయముతో నవ్యక్తమునందు మహత్తత్త్వమునకు నిరోధమును చెప్పలేదు. ఘటము తనకు ఉపాదానకారణముగాని జలమునందు నిరోధిం

పంబడినప్పటికి నేప్రకారము లయమును పొందదో ఉపాదాన కారణమగు మృత్తికయందు నిరోధింపఁబడి లయమును పొందునో ఆప్రకారమే మహత్తత్త్వము శాంతాత్మయందు నిరోధింపఁబడినప్పటికి లయమునొందదు. అవ్యక్తమందు నిరోధింపఁబడెనా లయమునొందును. ఇట్టిస్వరూపలయము పరమాత్మదర్శనమున కుపాయము కానందున పురుషార్థము కానేరదు.

శ్రు. దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః.

తా. సూక్ష్మార్థగ్రహణసమర్థమై నిర్మలమైనబుద్ధిచేత నాపరమాత్మ చూడఁబడును. ఈప్రకారము పూర్వవాక్యమునందు పరమాత్మదర్శనమును చెప్పి ఇట్టి పరమాత్మదర్శనమున కుపాయమైన బుద్ధిసూక్ష్మత్వమును ప్రతిపాదించుటకుఁగాను 'యచ్ఛేద్వాఙ్మనసీ' యను శ్రుతియందు నిరోధసమాధి చెప్పఁబడినది. ఇదిగాక, ప్రతిదినము సుషుప్తికాలమునందు మహత్తత్త్వమునకు అవ్యక్తమందు లయము స్వభావముగానే కలుగుచున్నందున, అట్టిలయమును గూర్చి నిరోధసమాధిని విధించుట వ్యర్థముగా నుండును.

ఆక్షేపము — ఓయీ! ధారణా ధ్యాన సమాధులచేత సాధింపఁదగిన సంప్రజ్ఞాతసమాధి ఏకాగ్రవృత్తిరూపమైనందున పరమాత్మదర్శనమునకు సాధనమగుచున్నప్పటికి శాంతాత్మయందు నిరోధింపఁబడి యసంప్రజ్ఞాతసమాధిని పొందిన చిత్తము వృత్తిశూన్యమైనందున సుషుప్తివలె పరమాత్మదర్శనమున కుపాయము కానేరదు.

సమాధానము—పరమాత్మదర్శనము స్వాభావిక మయి నందున నివారింప శక్యము కానేరదు. అనఁగా చిత్తము సంప్రజ్ఞాతసమాధిలో వృత్తిసహితమయి యున్నందున సోపాధిక బ్రహ్మను గ్రహించుచుండును. అసంప్రజ్ఞాతసమాధిలో వృత్తి శూన్యమయియుండి ఆత్మస్వరూపమును గ్రహింపలేకపోయినను ఆత్మస్వరూపము స్వయంప్రకాశ మయినందున స్వయముగానే ప్రకాశించుచుండును.

ఈయర్థము శ్రేయోమార్గమను గ్రంథమందుఁ జెప్పఁబడినది.

శ్లో. ఆత్మానాత్మాకారం స్వభావతోఽవస్థితం సదా చిత్తం,
ఆత్మైకాకారతయా తిరస్కృతానాత్మదృష్టిం విదధీత ఇతి.

తా. చిత్తము స్వభావముగా నాత్మాకారముగాను, అనాత్మాకారముగాను కూడ నున్నది. అందులో అనాత్మాకారమును నిరోధించినపక్షమునను ఆత్మాకారము స్వభావముగా స్ఫురించును గనుక చిత్తముయొక్క అనాత్మాకారమును నిరోధించుటయందు ప్రయత్నమును జేయవలయును.

ఘటము పుట్టునప్పుడు ఆకాశముచేత సంపూర్ణమయ్యే పుట్టును. జలము, బియ్యము, అన్నము ఇత్యాదిద్రవ్యములు ఘటము పుట్టినతరువాత పురుషప్రయత్నముచేత ఘటములో నింపఁబడును. అనంతరమందు నింపఁబడిన జలతండులాదులను ఘటములోనుండి నివర్తింపఁజేసినప్పటికి ఆకాశము నివర్తింపఁజేయుటకు నేత్రకారము శక్యముగా నుండదో ముఖమును మూసినప్పటికి ఘటములోపల నాకాశము నిండియుండును.

గదా. ఆప్రకారమేచిత్తము పుట్టునప్పుడు ఆత్మచైతన్యముతోడి పూర్ణమయ్యే పుట్టును. చిత్తము పుట్టిన తరువాత సుఖదుఃఖాద్యనుభవములను కారణములైన ధర్మాధర్మములనుబట్టి ఘటపటరూపరసగంధసుఖదుఃఖాదివృత్తిరూపములు మూసలో కరిగిపోసిన రాగివలె చిత్తమునందు సంక్రమించును. మూసలో రూపరసాద్యాకారములు నిరోధసమాధిచేత నివారింపఁబడఁగానే స్వతస్సిద్ధమైన పరమాత్మాకారము ప్రకాశించును. దాని అది నివారించుటకు శక్యమై యుండదు. కనుక నిరోధసమాధిచేత వృత్తిశూన్యముగాఁ జేయఁబడి సంస్కారమాత్రముగా శేషించియున్నందున సూక్ష్మమయి చిదాత్మాభిముఖమయియున్నందున ఏకాగ్రమయియున్న చిత్తముచేత నిర్విఘ్నముగా పరబ్రహ్మ సాక్షాత్కరింపఁబడును.

ఈయభిప్రాయముచేతనే వార్తికకారులును స్వానుభవయోగియును ఉభయులు చెప్పియున్నారు.

శ్లో. సుఖదుఃఖాదిహేతుత్వం ధర్మాధర్మాదిహేతుతః,
నిర్మైతుత్వాత్మసంబోధరూపత్వం స్వస్వభావతః.

తా. చిత్తమునకు సుఖదుఃఖాదివిషయాకారము ధర్మాధర్మములచేత కలుగుచుండును. అనాదిసిద్ధమైన చిదాత్మాకారము స్వభావముచేతనే కలిగియుండును.

శ్లో. ప్రశాంతవృత్తికం చిత్తం పరమానందదీపకం,
అసంప్రజ్ఞాతనామాయం సమాధిర్యోగినాం ప్రియః. ఇతి.

తా. సర్వవృత్తిశూన్యమైన చిత్తము పరమానందస్వరూపుఁడైన పరమాత్మను ప్రకాశింపఁజేయును. ఇదియే అసం

ప్రజ్ఞాతసమాధి యనఁబడును. ఈసమాధి యోగులకు నిండ ప్రియమైనది.

పరమాత్మదర్శనము స్వతస్సిద్ధమైనప్పటికి అనాత్మదర్శనమును నివారించుటకు నిరోధసమాధిని అభ్యసింపవలయును.

కనుకనే భగవద్గీతలయందు జెప్పఁబడినది.

శ్లో. ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్. అని.

తా. చిత్తమును పరమాత్మయందు నిశ్చలముగాఁ జేర్చి యితరవిషయములను స్వల్పముగానైనా చింతింపఁగూడదు.

ఘటములో నాకాశము స్వతస్సిద్ధముగా నున్నప్పటికి జలతండులాదులచేత నాచ్ఛాదింపఁబడి విస్పష్టముగా ప్రకాశింపక యుండును. జలతండులాదులు నిరాకరించినతరువాత నాకాశము విస్పష్టముగా కనుపించును. ఈప్రకారమే చిత్తమునందుఁ బరమాత్మాకాశము స్వతస్సిద్ధముగా నున్నప్పటికి ఆగంతుకరూపరసాద్యాకారములచేత నాచ్ఛాదింపఁబడి విస్పష్టముగా కనుపింపకయుండును. రూపరసముఖ్యములగు అనాత్మాకారములను నివారింపఁగా విస్పష్టముగా సాక్షాత్కరించును. అనాత్మాకారములను నివారించుటకుఁగాను నిరోధసమాధిని అభ్యసింపవలయును

యోగశాస్త్రము చిత్తమును నిశ్చలముగాఁ జేయుటకు మాత్రము ప్రవర్తించినందున నిరోధసమాధియందు పరమాత్మదర్శనమును సాక్షాత్తుగా ప్రతిపాదింపలేదు గాని ప్రకారాంతరముగా పరమాత్మదర్శనమును ప్రతిపాదించినది.

సూ. యోగశ్చిత్తవృత్తినిరోధః.

యోగమనఁగా చిత్తవృత్తులనన్నిఁటిని నిరోధించుటయే యని చెప్పి

"తదా ద్రష్టుస్స్వరూపేఽవస్థానం."

చిత్తవృత్తుల నన్నిఁటిని నిరోధింపఁగా ద్రష్టయగు ప్రత్యగాత్మకుఁగాని చిత్తమునకుఁగాని పరమాత్మయందు నిశ్చలమయినస్థితి కలుగునని చెప్పినందున నిరోధసమాధియందు అవర్జనీయముగా పరమాత్మసాక్షాత్కారము కలుగు నని అంగీకరింపఁబడినది. విచారింపఁగా ద్రష్టయగు ప్రత్యగాత్మ నిర్వికారుఁడై యున్నందున నెప్పుడు స్వరూపమునందే యుండు నని తోఁచు చున్నది. అయినను వృత్తులు పుట్టునప్పుడు ఆవృత్తులయందు చిద్రూపము ప్రతిబింబించుచుండఁగా వృత్తులను ప్రత్యగాత్మను కలిగియున్న భేదము తెలియకుండుట స్వరూపప్రచ్యుతి కలిగి యున్నట్టు కనుపడుచుండును.

ఈయర్థమును పతంజలిచేతనే "సూ. వృత్తిసారూప్య మితరత్ర" యని సూత్రింపఁబడియున్నది.

తా. వృత్తులయొక్క నిరోధము లేనికాలమందు వృత్తులతో సమానముగా ప్రత్యగాత్మ కనుపడుచుండునని సూత్రార్థము.

మరియొక చోట కూడ నీయర్థము.

సూ. సత్త్వపురుషయోరత్యంతాసంకీర్ణయోః ప్రత్యయావిశేషో భోగః

అని సూత్రింపఁబడినది.

తా. ప్రకాశసుఖాత్మకమయిన యంతఃకరణసత్త్వము పురుషుఁడును వీరు ఉభయులు స్వతః అత్యంతభిన్నులుగా నున్నప్పటికి అభేదముగా ప్రతిభాసించుట భోగమనఁబడును. నిరోధసమాధిచేత శోధింపఁబడిన త్వంపదార్థము అనఁగా ప్రత్యగాత్మ సాక్షాత్కరింపఁబడినప్పటికి ఆప్రత్యగాత్మను బ్రహ్మత్వమును కలియఁజేయుటకొరకు తత్త్వమస్యాదిమహావాక్యముల వలన బ్రహ్మనిశ్చయము వృత్త్యంతరము పుట్టింపఁబడును. పరిశుద్ధత్వంపదార్థసాక్షాత్కారమును కలుగఁజేయుటకు నిరోధసమాధి యొకటియే యుపాయము కాదు. చిద్రూపజడరూపములయొక్క వివేకజ్ఞానముచేత కూడ త్వంపదార్థసాక్షాత్కారము గలుగును.

కనుకనే వసిష్ఠమహర్షిచే చెప్పఁబడినది. — —

శ్లో. ద్వౌ క్రమా చిత్తనాశస్య యోగో జ్ఞానం చ రాఘవ,
యోగస్తద్వృత్తిరోధో హి జ్ఞానం సమ్యగవేక్షణం.

తా. చిత్తము నశించుటకు యోగమని జ్ఞానమని రెండుమార్గములు కలవు. యోగమనఁగా చిత్తవృత్తులను నిరోధించుట; జ్ఞానమనఁగా చిద్రూపుఁడగు ప్రత్యగాత్మయొక్క జడములగు దేహప్రాణమనోబుద్ధులయొక్క స్వరూపమును విభజించి యథార్థముగ తెలియుట.

శ్లో. అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిజ్జ్ఞాననిశ్చయః,
ప్రకారౌ ద్వౌ తతో దేవో జగాద పరమేశ్వరః. అని.

తా. ఒకపురుషునకు యోగము అసాధ్యముగా నుండును. మఱియొకనికి వివేకజ్ఞాన మసాధ్యముగా నుండును కనుక

పురుషులయొక్క అధికారము నాలోచించి పరమేశ్వరుఁడు యోగమార్గజ్ఞానమార్గములను రెంటిని ఉపదేశించిరి.

ఆక్షేపము— ఓయీ! ప్రత్యగాత్మ సాక్షాత్కారకాలమందు ఆత్మమాత్రవిషయమైన చిత్తముయొక్క ఏకాగ్రవృత్తి సంప్రజ్ఞాతసమాధిలో నంతర్భూతమైనందున వివేకజ్ఞానము కూడ యోగమునందే పర్యవసించుచున్నది. యోగజ్ఞానములు భిన్నములుగా చెప్పుట కేమి కారణము?

సమాధానము— వాస్తవము. అయినను సంప్రజ్ఞాతాసంప్రజ్ఞాతసమాధులకు స్వరూపమును బట్టి చూచినను, సాధనములను బట్టిచూచినను విశేషభేదము కలదు. సంప్రజ్ఞాతసమాధియందు వృత్తి కలిగియుండును. అసంప్రజ్ఞాతసమాధియందు వృత్తిశూన్యమై యుండును. ఇది యీరెంటియొక్క స్వరూపభేదము. సంప్రజ్ఞాతసమాధికి ధారణాధ్యానసమాధులు సజాతీయములగుటచేత నంతరంగసాధనములు. అసంప్రజ్ఞాతసమాధికి విజాతీయములగుటచేత బహిరంగసాధనములు. ఇది సాధనప్రయుక్తభేదము. ధారణాధ్యానసమాధులవలెనే సంప్రజ్ఞాతసమాధి కూడ వృత్తిసహితమైనందున నివిలగు సజాతీయములు అసంప్రజ్ఞాతసమాధి వృత్తిశూన్యమైనందున ధారణాదిత్రయము దీనికి విజాతీయమని తెలియవలయును. 'సూ. తదపి బహిరంగం నిర్బీజస్య' నిర్బీజమని చెప్పఁబడు నసంప్రజ్ఞాతసమాధికి ధారణాధ్యానసమాధులుమాత్రము బహిరంగములుగా నుండు నని సూత్రముచేత కూడ నీయర్థము చెప్పఁబడినది. ధారణాదిత్రయము అసంప్రజ్ఞాతసమాధికి విజాతీయముగానున్నప్ప

టికి అనేకవిధములైన యనాత్మాకారములను విడిచియుండుట చేత ఉపకారకమయినందున బహిరంగ మని చెప్పుట విరుద్ధము కానేరదు. ఇట్టి యుపకారకత్వమును విశదపఱచుటకొరకు పతంజలిమహర్షి సూత్రించియున్నారు.

సూ. శ్రద్ధావీర్యస్మృతిసమాధిప్రజ్ఞాపూర్వక ఇతరేషాం. అని.

తా. దేవతలు మొదలగు కొందఱు జన్మచేతనే సమాధి సిద్ధికలవారై యుందు రని పూర్వసూత్రమునందు చెప్పి మనుష్యులనుగూర్చి సమాధి సిద్ధించుటకుపాయమును ఈసూత్రము చేత చెప్పుచున్నారు. నా యోగమే పరమపురుషార్థసాధన మను నిశ్చయము శ్రద్ధ యనంబడును. ఇట్టి శ్రద్ధ యోగము యొక్క ప్రభావమును విశేషముగా వినుటచేత గలుగును.

యోగప్రభావము భగవద్గీతలయందు చెప్పబడుచున్నది.

శ్లో. తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున.

తా. కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సుల నాచరించువారి కంటె యోగి ఉత్తముడు. నానావిషయములగు శాస్త్రముల నభ్యసింపకయుండి కేవలతత్త్వజ్ఞానమును మాత్రము సంపాదించిన జ్ఞానులకంటె నుత్తముడు. నిత్యనైమిత్తికాదికర్మల నాచరించు వారికంటె యోగి ఉత్తముడు గనుక ఓయి యర్జునా! నీవు సర్వోత్కృష్ట మగు యోగమునే అభ్యసింపవలయును.

ఇట్టిప్రభావము యోగమునందుఁ గల దని శాస్త్రము వలన సద్గురూపదేశమువలన వినుటచేత యోగమునందు శ్రద్ధ గలుగును ఈశ్రద్ధ దృఢముగాఁగలిగినతరువాత వీర్యము కలు

గును. వీర్యమనఁగా ఉత్సాహము సర్వప్రకారములవలన యోగమును సాధింపవలయు నను చిత్తవృత్తి ఉత్సాహమనఁబడును. ఇటువంటి యుత్సాహము కలుగఁగానే అనుష్ఠానము లయిన యోగాంగములు స్మరింపఁబడును. స్మృతిచేత సమాధి చక్కఁగా ననుష్ఠింపఁబడును. సమాధియొక్క పరిపాకమువలన చిత్తము నిర్మలమయినందున ఋతంభర యను ప్రజ్ఞ గలుగును. ఈ ప్రజ్ఞచేత నసంప్రజ్ఞాతసమాధి ననుష్ఠింతు రని సూత్రముయొక్క అర్థము

ఋతంభర యను ప్రజ్ఞ పతంజలిచే సూత్రింపఁబడినది.

సూ. ఋతంభరా తత్ర ప్రజ్ఞా. ౪౮.

ఋత మనఁగా సత్యము సర్వవస్తువులయొక్క యథార్థస్థితి. దీనిని ప్రకాశింపఁజేయు బుద్ధి ఋతంభర యనఁబడును. అనఁగా సర్వపదార్థములయొక్క యథార్థస్థితిని తెలుపు బుద్ధివిశేషము ఋతంభర యనఁబడిన దని యర్థము. ఈ బుద్ధివిశేషము సమాధిపరిపాకమువలన చిత్తము సాత్త్వికము నొందినప్పుడు సంభవించు నని సూత్రార్థము

ఋతంభర యను నామము ప్రవర్తించుటకు కారణము సూత్రింపఁబడినది.

సూ. శ్రుతానుమానప్రజ్ఞాభ్యామన్యవిషయా విశేషార్థత్వాత్. ౪౯.

తా. సూక్ష్మవస్తువులయందును దేశాంతరకాలాంతరస్థిత వస్తువులయందును యోగులు కానివారియొక్క ప్రత్యక్షము ప్రవర్తింపనేరదు. అట్టివస్తువులను శాస్త్రముచేతను యోగులు కానివారు తెలుసుకొందురు. శాస్త్రానుమానములచేత వస్తు

జ్ఞానములు ఆయావస్తువులయొక్క సామాన్యస్వరూపములను తెలియఁజేయును గాని విశేషవిషయములను తెలియఁజేయ నేరవు. యోగులయొక్క ప్రత్యక్షము సర్వపదార్థములయొక్క విశేషాకారముల నన్నిటిని విస్పష్టముగాఁ దెలియఁజేయును. ఇందువలననే యోగిప్రత్యక్షమునకు ఋతంభర యని నామ మేర్పడినది యని సూత్రార్థము. ఇట్టి యోగిప్రత్యక్షము అసంప్రజ్ఞాతసమాధికి బహిరంగ మని చెప్పుటకు యోగిప్రత్యక్షము. అసంప్రజ్ఞాతసమాధికిఁ జేయు నుపకారము సూత్రింపఁబడినది.

సూ. తజ్జస్సంస్కారోఽన్యసంస్కారప్రతిబంధీ. ౫౦.

యోగిప్రత్యక్షముచేత కలుగు సంస్కారము వ్యుత్థాన సంస్కారములను ఇతరసమాధిజన్యసంస్కారములను ప్రతిబంధించును. ఇదియె యసంప్రజ్ఞాతసమాధికి యోగిప్రత్యక్షము చేయునుపకార మని సూత్రార్థము.

అసంప్రజ్ఞాతసమాధికి బహిరంగసాధనమైన ఋతంభరయను యోగిప్రత్యక్షమును చెప్పి సంప్రజ్ఞాతసమాధిని నిరోధించుటను చేయు ప్రయత్నము అంతరంగసాధన మని సూత్రింపఁబడినది.

సూ. తస్యాపి నిరోధే సర్వనిరోధాన్నిర్బీజస్సమాధిః. ౫౧.

సంప్రజ్ఞాతసమాధిని నిరోధించుటచేత సర్వము నిరోధింపఁబడును గనుక నందుచేత నసంప్రజ్ఞాతసమాధి యను నిర్బీజసమాధి సిద్ధించు నని సూత్రార్థము. ఈసమాధి సుషుప్తి దశతో సమము.

ఇది సాక్షిచైతన్యముచే తెలుసుకొనుటకు శక్యమైనది. ఈయసంప్రజ్ఞాతసమాధి సర్వవృత్తిశూన్యమైనందున సుషుప్తియేయని శంకింపఁదగదు. అసంప్రజ్ఞాతసమాధియందు అంతఃకరణము శేషించియుండును. సుషుప్తియం దంతఃకరణముకూడ లయమును నొందును. ఈవిశేషము కలిగియున్నందున సుషుప్తిదశాసంప్రజ్ఞాతసమాధు లొకటి కానేరవు.

ఇది గౌడపాదాచార్యులవారిచే చెప్పఁబడినది.

శ్లో. నిగృహీతస్య మనసో నిర్వికల్పస్య ధీమతః,
ప్రచారస్స తు విజ్ఞేయస్సుషుప్తేऽన్యో న తత్సమః॥

తా. నిరోధింపఁబడి సర్వసంకల్పశూన్యమై వివేకయుక్తమయిన మనస్సుయొక్క ప్రచారవిశేషము సుషుప్తికంటె విలక్షణముగా నుండు నని యోగులచేత తెలియఁబడియున్నది. సుషుప్తియందు మనస్సుయొక్క ప్రచారము అవిద్యాగ్రస్తమై యనేక వాసనాబీజములతో గూడి యుండును. సమాధియందు ఆత్మతత్త్వజ్ఞానముచేత నవిద్యానాశమైనందున సంకల్ప శూన్యమై సుఖాకారమై యుండును ఈవిశేషము యోగుల యొక్క స్వానుభవముచేత తెలియఁబడినది.

శ్లో. లీయతే హి సుషుప్తే తన్నిగృహీతం న లీయతే,
తదేవ నిర్భయం బ్రహ్మ జ్ఞానాలోకం సమన్తతః. అని.

తా. మనస్సుయొక్క ప్రచారము సుషుప్తియందు సమాధియందును భిన్నముగా నుండుటను కారణమును చెప్పుచున్నారు. మనస్సు సుషుప్తికాలమందు సర్వవాసనలతోఁగూడ నవిద్యయందు లయమును పొందును. సమాధియందు వివేకజ్ఞాన

పూర్వకముగా నిరోధింపఁబడి లీనము కానేరదు. ఎప్పుడు గ్రాహ్యగ్రాహకభేదమునువిడిచి మనస్సు కేవలముగా నుండునో అప్పుడు పరబ్రహ్మాకారమై యుండును. పరబ్రహ్మ కేవల జ్ఞాన స్వరూపము సర్వదేశవ్యాపకముగా నుండును.

మాండూక్యశాఖయందు గూడ నీయర్థము వినఁబడు చున్నది.

శ్రు. ద్వైతస్యాగ్రహణం తుల్య ముభయోః ప్రాజ్ఞతుర్యయోః,
బీజనిద్రాయుతః ప్రాజ్ఞస్సా చ తుర్యే న విద్యతే.

తా. ప్రాజ్ఞతురీయులిద్దఱును ద్వైతప్రపంచము స్ఫురింపక యుండునుగాని ప్రాజ్ఞుడు విశేషవిజ్ఞానమను ప్రపంచ స్ఫురణమునకు కారణమైన యజ్ఞానముతోఁ గూడియుండును. ఇట్టి అజ్ఞానము తురీయునియందు లేకయుండును.

శ్రు. స్వప్ననిద్రాయుతా వాద్యౌ ప్రాజ్ఞస్త్వస్వప్ననిద్రయా,
న నిద్రాం నైవ చ స్వప్నం తుర్యే పశ్యంతి నిశ్చితాః.

తా. విశ్వుఁడు తైజసుఁడు వీరిద్దఱు అన్యథాజ్ఞానము తత్త్వాప్రతిబోధమనునజ్ఞానము కలవారై యుందురు. ప్రాజ్ఞుఁడు అన్యథాజ్ఞానము లేనివాఁడయి కేవలనిద్రతో కలసి యుండును. తురీయుఁడు అన్యథాజ్ఞానమను స్వప్నముగాని తత్త్వాజ్ఞానమను నిద్రగాని లేనివాఁడై యుండునని బ్రహ్మవేత్తలు చెప్పుదురు.

శ్రు. అన్యథా గృహ్ణతస్స్వప్నో నిద్రా తత్త్వమజానతః,
విపర్యాసే తయోః క్షీణే తురీయం పదమశ్నుతే.

ద్వేషాదిబంధముల నివర్తింపఁజేయునా? లేక అభ్యాసముచేత నిరంతరముగా సంపాదింపఁబడిన సుషుప్తి నివర్తింపఁజేయునా? మొదటిపక్షమునందు సుషుప్తికాలమునందుఁ గల బంధమును మాత్రము సుషుప్తి నివర్తింపఁజేయునా? లేక యితరకాలములయందు వర్తించు బంధమునుగూడ నివర్తింపఁజేయునా? ఇతరకాలములయం దుండు బంధము సుషుప్తికాలమునందు ప్రసక్తము కానందున సుషుప్తిచేత నివర్తింపఁజేయఁబడదు. తత్త్వజ్ఞానశూన్యు లగువారికిఁగూడ సుషుప్తియందు రాగద్వేషాదిక్లేశబంధము లేదు గదా. కనుక ప్రథమపక్షము యుక్తము కాదు. కాలాంతరవర్తియగు బంధమును కాలాంతరవర్తియగు సుషుప్తి నివర్తింపఁజేయనేరదు గనుక రెండవపక్షమును యుక్తము కాదు. సుషుప్తివలె నిరంతరము మనసు వర్తించియుండులాగున నభ్యసించుట శక్యము కానందున మొదటి రెండుపక్షములును యుక్తము కాదు గనుక తత్త్వజ్ఞాని మనసునకుఁగూడ రాగద్వేషాదిక్లేశబంధము నివర్తించుటకుఁ గాను సంప్రజ్ఞాతసమాధి యపేక్షింపఁబడును. ఇట్టి సమాధికి శాస్త్రాదులయందలి వాగింద్రియనిరోధము ప్రథమభూమి. బాలమూకాదులయందువలె నిర్మనస్కత్వము ద్వితీయభూమి. అలసాదులయందువలె అహంకారశూన్యత్వము మూడవభూమి. సుషుప్తియందువలె మహత్తత్త్వశూన్యత్వము అనఁగా మహాదహంకారరాహిత్యము నాలుగవభూమి. ఈనాలుగుభూమికలను హృదయమునందుంచుకొని "శనైశ్శనై రుపరమేత్" అని భగవంతునిచేఁ జెప్పఁబడినది. ఈ ఉపరమమందు సాత్త్వికధృతిచేత గ్రహింపఁబడిన

సాత్త్వికబుద్ధి కారణమైయుండును సామాన్యాహంకారము విశేషాహంకారము మనస్సు వాగాదింద్రియములు ఇవి స్వభావముగా నతితీవ్రవేగముచేత బాహ్యమునకుఁ బ్రవహించుచుండును. ఇట్టిప్రవాహముగలవాని నిరోధించుటకు నతి మహాధైర్యము ముఖ్యముగా నపేక్షింపఁబడుచున్నది. ఇట్టిధైర్యయుక్తమైన బుద్ధిచేత పూర్వభూమి సాధింపఁబడెనా? లేదా? యని పరీక్షించి, చక్కఁగా సాధింపఁబడినట్లు తెలిసినా, రెండవ భూమిని సాధించుటకు బ్రయత్నము చేయవలయును. లేదా మొదటిభూమియందే నిలిచి, అది స్వాధీనమగువరకు బ్రయత్నమును చేయవలయును. అభ్యసించుకాలమందు ఆభూమి యెంతమాత్రము సాధింపఁబడినదో దానిని పరీక్షింపవలయును. నాలుగవభూమియొక్క అభ్యాసము "యత్ర యత్ర మనః కృత్వా" యనుశ్లోకమువలనఁ బ్రతిపాదింపఁబడెను.

చతుర్థభూమికాభ్యాసము గౌడపాదాచార్యులవారి చేతఁగూడఁ జెప్పఁబడినది.

శ్లో. ఉపాయేన నిగృహ్ణీయాద్విక్షిప్తం కామభోగయోః,
సుప్రసన్నం లయే చైవ యథా కామో లయస్తథా.

తా. కామభోగములయందు విక్షేపమును బొందుచున్నచిత్తమును ఉపాయముచే మరలించవలయును. లయమునందు ప్రవేశించుచిత్తమును ఆయాసము లేనిపోయినను ప్రబోధమును పొందించవలయును లయము యెటువంటిదో కామము కూడ అటువంటిది.

శ్లో. దుఃఖం సర్వమనుస్మృత్య కామభోగాన్నివర్తయేత్,
అజం సర్వమనుస్మృత్య జాతం నైవ తు పశ్యతి.

తా. ద్వైతప్రపంచమంతయు నవిద్యావిజృంభితమగుట చే దుఃఖరూపమని విచారించి కామభోగములనుండి చిత్తమునునిరోధింపవలయును. సర్వప్రపంచము బ్రహ్మస్వరూపముగా భావించుటచేత ద్వైతప్రపంచమును చూడకయుందురు.

శ్లో. లయే సంబోధయేచ్చిత్తం విక్షిప్తం శమయేత్పునః,
సకషాయం విజానీయాత్సమప్రాప్తం న చాలయేత్.

తా. లయావస్థలోజేరిన చిత్తమును బోధింపవలయును. విక్షేపమునొందిన చిత్తమును శమింపజేయవలయును. కషాయావస్థనొందిన చిత్తమును గుర్తెఱిఁగిసామ్యావస్థను పొందింప వలయును సామ్యావస్థను పొందినతరువాత నాచిత్తమును నా యవస్థలోనుండి కదలనీయఁగూడదు.

శ్లో. నాస్వాదయేత్సుఖం తత్ర నిస్సఙ్గః ప్రజ్ఞయా భవేత్,
నిశ్చలం నిశ్చరచ్చిత్త మేకీకుర్యాత్ప్రయత్నతః.

తా. సమావస్థయందు సుఖము ననుభవింపఁదగదు సుఖమునందు నిస్పృహుండై వివేకయుక్తమయిన బుద్ధితోఁగూడు కొన్నవాఁడై యుండవలయును. నిశ్చలముగా నుంచఁబడినచిత్తము బాహ్యవిషయములలోనికి చేరఁబోవునపుడు ఆచిత్తమును నిరోధించి ప్రయత్నముచేత పరమాత్మయందే చేర్పవలయును.

శ్లో. యదా న లీయతే చిత్తం న చ విక్షిప్యతే పునః,
అనింగనమనాభాసం నిష్పన్నం బ్రహ్మ తత్తదా.

తా. ఈ ప్రకారముగా నిగ్రహింపఁబడిన చిత్తము ఎప్పుడు సుషుప్తియందు లయమును బొందదో, విషయముల యందు విక్షేపములను బొందదో, కల్పితపదార్థములచేత ప్రకాశింపకయుండునో అప్పుడు బ్రహ్మస్వరూపముగా చిత్తము పర్యవసించిన దని తెలియవలయును.

ఈశ్లోకములయొక్క తాత్పర్యము విశేషముగా వ్రాయఁబడును.

తా. లయమని, విక్షేపమని, కషాయమని, సమప్రాప్తియని చిత్తముయొక్క అవస్థలు నాలుగు. నిరోధింపఁబడు చిత్తము విషయములలోనుండి మరలింపఁబడి పూర్వాభ్యాసముచేత సుషుప్తియందు అభిముఖ్యమును బొందెనా, అప్పుడు ప్రబోధ ప్రయత్నముచేతఁ గాని సుషుప్తియునులయముయొక్క కారణములను నివారించుటచేతఁ గాని చిత్తమును చక్కఁగా ప్రబోధింపవలయును. నిద్ర అజీర్ణము అతిభోజనము ఆయాసము యీ నాలుగు లయకారణములు.

ఇవి పూర్వాచార్యులచేఁ జెప్పఁబడినవి.

శ్లో. సమారాధ్యనిద్రాం సజీర్ణాల్పభోజీ శ్రమత్యాగబాధా విముక్తప్రదేశే,
సదాసీత నిస్తృష్ణ ఏవం ప్రయత్నో ... ప్రాణరోధో నిజాభ్యా
సమాత్రాత్. అని.

తా. నిద్రాకాలమందు నిద్రను పొంది నిద్రాశేషముచేత మాంద్యము కలుగకుండఁ జేసుకొని శీఘ్రముగా సులభ

ముగా జీర్ణమగుపదార్థములను కొద్దిగా భోజనము చేసి దూరమార్గగమనాదులచే నాయాసమును బొందక విజనమయిన యేకాంతప్రదేశమునందు రాగద్వేషాదిశూన్యమయిన చిత్తము కలవాఁడై యుండవలయును. లేదా, అభ్యాసమార్గము ననుసరించి ప్రాణాయామమును నభ్యసించుచుండవలయు నని భావము. ఈప్రకారము లఘువును పొందకుండఁజేయఁగా ప్రతిదినజాగరణకాలాభ్యాసముచేత విషయాంతరములయందు చిత్తము విక్షేపము నొందును. అప్పుడు వివేకశాస్త్రమునుబట్టి వివేకిపురుషులచేత చెప్పఁబడువినాశిత్వపరిణామవిరసత్వాదిదోషములను విషయములయందు నిశ్చయించి విషయములలోనుండి చిత్తమును మరలింపవలయును. ఇదిగాక వేదాంతశాస్త్రసిద్ధమయిన అద్వితీయ సచ్చిదానందపరబ్రహ్మస్వరూపమును చింతించుచున్నయెడల విషయానుభవములు బుద్ధికి స్ఫురింపనేరవు గనుక నీమార్గమువలనఁ గూడ చిత్తమును విషయములనుండి మరలింపవలయును. తీవ్రమయిన చిత్తదోషము తీవ్రమయిన రాగద్వేషాదివాసనలు కషాయమనఁబడును. ఇట్టికషాయముచేత నాక్రమింపఁబడినచిత్తము ఒకానొకప్పుడు సమాధిని చెందినదానివలె లయవిక్షేపములు లేనిదై దుఃస్థైకాగ్రముగానుండును. అనఁగా స్తబ్ధముగా నుండును. అట్టిస్థితిని కనిపెట్టవలయును. కొందఱు వివేకహీనులగుయోగులు యీకషాయావస్థనే ఉన్మన్యవస్థగా తలంచెదరు.

ఇట్టి కషాయావస్థను బొందిన చిత్తముగూడ సమాధిని బొంద లేదని తెలుసుకొని లయవిక్షేపములవలె కషాయావస్థకూడ నివర్తించు ప్రయత్నమును జేయవలెను. 'సమప్రాప్తం న చాలయేత్' అనుస్థలమందు సమ మనఁగా పరబ్రహ్మస్వరూపము.

శ్లో. సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం. అని.

భగవద్గీతలయందు కూడ సమశబ్దము పరబ్రహ్మపరముగా ప్రయోగించఁబడియున్నది. లయవిక్షేప కషాయములను మూఁడవస్థలను పరిహరింపఁగా చిత్తముచేత సమమయిన బ్రహ్మస్వరూపము పొందఁబడును. సమప్రాప్తి నొందిన చిత్తమును లయావస్థ కషాయావస్థలను పొందియున్నదేమో యని భ్రమపడి చలింపఁజేయఁగూడదు. మిక్కిలి సూక్ష్మమగు నిశ్చలమయిన బుద్ధిచేత లయావస్థా కషాయావస్థాస్వరూపములను విభజించి తెలుసుకొని సమప్రాప్తినొందిన చిత్తమును స్థిరముగానే చిరకాలము నిలుపవలయును. ఈప్రకారము, చిత్తమును బ్రహ్మస్వరూపమునందు స్థాపింపఁగా బ్రహ్మస్వరూపభూతమయిన పరమానందము చక్కఁగా నావిర్భవించును.

ఈయర్థము భగవద్గీతలయందు ప్రతిపాదింపఁబడినది.

శ్లో. సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియం. అని.

తా. ఇంద్రియగోచరము కానిదియు, శుద్ధసాత్త్వికమైన బుద్ధివలన తెలియఁదగినదియు నెప్పటికి వినాశము లేని సుఖమేది కలదో, ఆసుఖమే బ్రహ్మస్వరూపసుఖ మని తాత్పర్యము.

శ్రుతి కూడ నీయర్థమునే చెప్పుచున్నది.

శ్లో. సమాధినిర్ధూతమలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్,
న శక్యతే వర్ణయితుం గిరా తదా స్వయం తదంతఃకరణేన గృ
హ్యతే. అని.

తా. సమాధిచేత పోఁగొట్టఁబడిన మాలిన్యములు (రాగద్వేషాదివాసనలు) గలిగి పరమాత్మయందుఁ జేర్పఁబడిన చిత్తమునకు నెట్టిసుఖము కలుగునో యాసుఖము వాక్కుచేత వర్ణించుటకు శక్యమైయుండదు. నిర్మలమైన తనబుద్ధిచేతనే గ్రహింపఁదగియుండును.

ఆక్షేపము.—ఓయీ! సమాధియందుఁగల బ్రహ్మానందము బుద్ధివలన గ్రహింపఁబడునని శ్రుతిస్మృతులయందుఁ జెప్పఁబడియున్నది. గౌడపాదాచార్యులచేత సమాధిసుఖ మనుభవింపఁ గూడ దని బుద్ధిగ్రాహ్యత్వము నిషేధింపఁబడుచున్నది గనుక నిది విరుద్ధముగా నున్నది.

సమాధానము.—ఇది విరుద్ధముగాదు ఎందువలననంటె బుద్ధివలన గ్రహింపఁబడు సమాధిసుఖము గౌడపాదాచార్యులవారిచేత నిషేధింపఁబడలేదు. మరి యేమంటె, సమాధికి విరోధముగా నుండు వ్యుత్థానకాలికసుఖము గ్రహింపఁ గూడదని నిషేధింపఁబడినది. గ్రీష్మఋతువులయందు మధ్యాహ్నవేళలలో గంగాజలమున మునిఁగిన పురుషునిచేత తజ్జలమందు శైత్యసుఖమే ప్రకారము చెప్పుటకు శక్యము కాదో, ఉదకములోనుండి లేచినతరువాత నేప్రకారము చెప్పుటకు శక్యమయి యుండునో, సుషుప్తియందలి సూక్ష్మములైన యవిద్యావృత్తులచేతను

భవించఁబడు సుఖస్వరూపము తత్కాలమందు చెప్పుట కేప్ర కారముశక్యముగానుండదో, ప్రబోధ కాలమందు స్మృతిజ్ఞానము చేత నేప్రకారము పరామర్శించఁబడునో ఆప్రకారమేవృత్తిసా ర్వమైసంస్కారమాత్ర శేషముయిందునసూక్ష్మముగానున్న చిత్త ముచేత సుఖ మనుభవించఁబడు నని శ్రుతిస్మృతులయందు చె ప్పఁబడినది వ్యుత్థితుఁడైనవానికి సమాధియందుగొప్పసుఖమను భవించఁబడినదని కలిగెడిపరామర్శయే యిచ్చట ఆస్వాదమని చెప్పఁబడినది. ఇట్టియాస్వాదమే గౌడపాదాచార్యులచే నిషే ధించఁబడినది. ఇదియే తమయభిప్రాయమని తెలియఁజేయుటను 'నిస్సంగః ప్రజ్ఞయాభవేత్' అని చెప్పిరి. అనఁగా సవికల్పకజ్ఞాన ముతోఁకూడ సుఖాసక్తిని విడువవలయునని గాని వేఱుగ చెప్పఁ బడిన సాత్త్వికధృతితోఁగూడిన బుద్ధిచేత సుఖము నాస్వాదిం చుటను సుఖమును వర్జించుటను విడువవలయు నని కాని యర్థము.

సమాధియందు బ్రహ్మానందములో మునిఁగియున్న చిత్త ము ఒకప్పుడు సుఖము నాస్వాదించుటనుఁగాని మఱొక మశ కాదిబాధలవలనఁగాని వ్యుత్థానమును పొందినయెడల చిత్త మునిశ్చలముగా నుండుటనుగాను తిరిగి పరబ్రహ్మమందా చిత్త మును జేర్చి బ్రహ్మతో నైక్యమును పొందించవలయును. ఈప్ర కారముగా చేయుటను నిరోధప్రయత్నమే సాధనము. 'అనింగనం అనాభాసం' అనుపదములవలన కషాయమును సుఖాస్వాద మును నిషేధించఁబడినవి లయ, విక్షేప, కషాయ,సుఖాస్వా

దములనెడి నాలుగువికారములు లేని చిత్తము పరమాత్మయందు నిశ్చలముగా నిలుచునని తాత్పర్యము.

ఈయభిప్రాయముతోనే కఠవల్లియందు కథించఁబడుచున్నది.

శ్రు. యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ,
బుద్ధిశ్చ న విచేష్టతి తామాహుః పరమాం గతిం.

తా. ఏ కాలమందు శ్రోత్రాదిజ్ఞానేంద్రియములైదు మనస్సుతోఁగూడ తమతమవిషయములలోనుంచి మరలి పరమాత్మయందే స్థిరముగా నిలిచియుండునో నిశ్చయవృత్తిగల బుద్ధి కూడ పరమాత్మయందే దార్ఢ్యమును పొంది నిలుచునో అట్టి స్థితియే పరమగతికిసాధనముగా పండితులచే చెప్పఁబడుచున్నది.

శ్రు. తాం యోగమితి మన్యంతే స్థిరామింద్రియధారణాం,
అప్రమత్తస్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ. ఇతి.

తా. చలించకయున్న బాహ్యాంతఃకరణములయొక్క ధారణమునే యోగమని చెప్పుదురు. ఎప్పుడిట్టి యోగమునందు ప్రవర్తించునో అప్పుడే పురుషుఁడు ప్రమాదము లేనివాఁడై యుండును. బుద్ధీంద్రియములు వ్యాపారశూన్యములయియుండఁగా ప్రమాదము కలుగనేరదుగదా. యోగముఉత్పత్తివినాశములకు కారణమైయున్నది. అనఁగా యోగము ఉపేక్షించఁబడెనా, ఇంద్రియవృత్తులను నశింపఁజేయునని తాత్పర్యము.

ఇట్టియోగముయొక్క స్వరూపమును లక్షణమును పతంజలివలన సూత్రించఁబడినది.

సూ. యోగః చిత్తవృత్తినిరోధః.

తా. అంతఃకరణముయొక్క సర్వవృత్తులను నిరోధించుట యే యోగమని చెప్పఁబడును. వృత్తులు అనేకములుగా నున్నవి. గనుక వాటిని నిరోధించుటకు శక్యము కాదనుశంకను పరిహరించుటకు

'సూ. వృత్తయః పంచతయ్యః క్లిష్టాః అక్లిష్టాః'

అని సూత్రము చేయఁబడినది.

తా. చిత్తముయొక్క వృత్తులు అయిదు. ఇవి క్లిష్టములని, అక్లిష్టము లని రెండు ప్రకారములుగా నున్నవి యని సూత్రార్థము.

రాగద్వేషాద్యాసురవృత్తులు క్లిష్టము లని అభయామానిత్వాదిదైవవృత్తులు అక్లిష్టము లని చెప్పఁబడును.

ఆక్షేపము—విచారింపఁగా క్లిష్టాక్లిష్టవృత్తులు రెండు పంచవృత్తులలో నంతర్భూతములుగానే యున్నవి. పంచవృత్తులను నిరోధించుటవలన క్లిష్టాక్లిష్టవృత్తులు రెండును నిరోధింపఁబడును. పంచవృత్తులను క్లిష్టాక్లిష్టము లని విభజించుటకు ప్రయోజనము కనుపడదు.

సమాధానము—సత్యము. అయినా, పంచవృత్తులను మాత్రము సామాన్యముగా చెప్పిన అక్లిష్టములుగానుండు అమానిత్వాదివృత్తులను నిరోధింపవలసినదని లేదనియు క్లిష్టములైన దంభదర్పాదులను మాత్రము నిరోధించినఁ జాలు నని కొందఱకు భ్రాంతి గలుగును. ఆభ్రాంతినినివారించుటకుఁగాను

పంచవృత్తులను క్లిష్టాక్లిష్టరూపములుగా విభజించి సూత్రించిరి. ఇదియు విభాగమునకుఁ బ్రయోజనము. దైవసంపదయందుఁ జేరిన యక్లిష్టవృత్తులను అసురసంపదయందుఁ జేరిన క్లిష్టవృత్తులను కూడ నిరోధింపవలయును అని తాత్పర్యము.

నామధేయమును లక్షణమును చెప్పి వృత్తులను విశద పఱచుటకొఱకు నెనిమిది సూత్రములు చెప్పఁబడినవి.

సూ. ప్రమాణవిపర్యయ వికల్పనిద్రాస్మృతయః, ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని విపర్యయోమిథ్యాజ్ఞానమతద్రూపప్రతిష్ఠం శబ్దజ్ఞానానుపాతీవస్తుశూన్యో వికల్పః అభావప్రత్యయాలంబనావృత్తిర్నిద్రా అనుభూతవిషయాసంప్రమోషః స్మృతిః. ఇతి.

తా. ప్రమాణ మని, విపర్యయ మని, వికల్ప మని, నిద్రయని, స్మృతి యని వృత్తులు ఐదు. ఇందులో ప్రత్యక్షమని, అనుమానమని, ఆగమమని మూఁడువిధములు. ఇందులో చక్షురాదిజ్ఞానేంద్రియములు ప్రత్యక్షమనిన్నీ స్వర్గాదిప్రదేశముల యందప్రత్యక్షముగానుండు వహ్న్యాదివస్తువులను తాము ప్రత్యక్షముగానుండి తెలియఁజేయు ధూమాదిపదార్థములు అనుమానమని, శ్రుతిస్మృతీతిహాసపురాణములు ఆగమమని చెప్పఁబడును. ఒక వస్తువును మఱియొకవస్తువుగా తెలుసుకొనుమిథ్యాజ్ఞానము విపర్యయమని చెప్పఁబడును. అనఁగా త్రాటిని జూచి సర్పమని, చవిటినేలయందుండు గ్రీష్మ కాలపుఎండను జూచి జలమనియు తెలుసుకొనుజ్ఞానము విపర్యయమని చెప్పఁబడునని భావము.

శబ్దమును విన్నందున కలుగు అర్థశూన్యమైన వృత్తి వికల్ప మనఁబడును. అనఁగా శశశృంగవంధ్యాపుత్రాదిశబ్దములను

వినఁగానే ఒకవృత్తి చిత్తమం దుదయించును. దానికి ఆలంబనమైన పదార్థ మొకటి లోకమునం దుండనే యుండదు. అట్టి చిత్తవృత్తి వికల్ప మనఁబడు నని భావము.

గాఢమైన తమోగుణము అభావ మనఁబడును. అట్టియభావమును (గాఢతమోగుణము) ప్రకాశింపఁజేయు చిత్తవృత్తి నిద్ర యని చెప్పఁబడును.

దేశాంతర కాలాంతరములయం దనుభవింపఁబడినవిషయముల ననుసంధించువృత్తి వృత్తి యని చెప్పఁబడునని ఎనిమిది సూత్రములకు క్రమముగా తాత్పర్యము.

ఈపంచవిధవృత్తులను నిరోధించుసాధనము సూత్రించఁబడినది.

సూ. అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః. ౧౨.

తా. అభ్యాసముచేతను వైరాగ్యముచేతను చిత్తవృత్తు లన్నియు నిరోధింపఁబడు నని సూత్రార్థము.

అతితీవ్రవేగముగల నదీప్రవాహమును ఆనకట్టచేత నిరోధించి వేఱుకాలువను త్రవ్వి క్షేత్రముల కభిముఖముగా నష్టముగా మరియొకప్రవాహ మేప్రకారము సృష్టించఁబడునో ఆప్రకారము వైరాగ్యమువలన చిత్తనదియొక్క విషయాభిముఖప్రవాహమును నిరోధించి సమాధ్యభ్యాసమువలన ప్రశాంతప్రవాహమును సంపాదింపవలయును.

మంత్రజపము దేవతాధ్యానము మొదలగునవి క్రియారూపము లగుటవలన నావృత్తి యను నభ్యాసముగానే యుం

డును. సమాధి యనఁగా సర్వవ్యాపారములయొక్క నివృత్తియే కదా. అట్టిసమాధికి అభ్యాసము ఏలాగున సంభవించు నను శంకను పరిహరించుటకు సూత్రము చెప్పఁబడినది.

సూ. తత్ర స్థితౌ యత్నోఽభ్యాసః.

అని సర్వవృత్తిదశయందు నిశ్చలముగా నిలుచుటకొఱకు చేయుప్రయత్నము అభ్యాస మని చెప్పఁబడు నని సూత్రార్థము.

స్వభావముగానే బాహ్యవిషయములయందు ప్రవర్తించుచిత్తము నేప్రకారముగా నైనను నిషేధించవలెననియుత్సాహము అవిచ్ఛిన్నముగా చేయఁబడి, యభ్యాసమని చెప్పఁబడు నని తాత్పర్యము.

ఇట్టి యభ్యాసము ఆధునికమయియుండును. చిరకాలము నుండి సంభవించియుండు దృఢమయిన వాసనలను ఏప్రకారముగా నభిభవించు నను శంకను నివారించుటకు సూత్రము చేయఁబడినది.

సూ. స తు దీర్ఘకాలనైరంతర్యసత్కారాసేవితో దృఢభూమిః.

తా. శ్రద్ధాభక్త్యాదిగుణములతోఁ గూడుకొని నిరంతరము చిరకాలము సేవించఁబడిన యభ్యాసము అనాదిసిద్ధములైన సర్వవాసనలను ఛేదించునని సూత్రార్థము.

లోకములో నొక బ్రహ్మచారి వేదాధ్యయనమును చేయుటకొఱకు గురుగృహమునకు పోయియుండఁగా నాతని తండ్రి పరమమూర్ఖుఁడు వేదము లనఁగా నాలుగు. మూఁడు

పోయి అయిదురోజులయినది యింకను రాలేదుగదాయని చెప్పి పరితపించినట్లు లోకములో నొకవాడుక కలదు. యోగాభ్యాసము చేయఁదలఁచిన పురుషుఁడు దినములచేతఁ గాని మాసములచేతఁగాని యోగముయొక్క సిద్ధిని కోరెనా, పైనఁజెప్పిన మూఢునివంటివాఁడె యగును. కనుక అనేకసంవత్సరములకుఁ గాని అనేకజన్మములకుఁగాని యోగము సిద్ధించునని తలఁచి చిరకాల మభ్యాసము చేయుచుండవలయును.

చిరకాలాభ్యాసముచేతఁగాని సిద్ధి గలుగదని శ్రీభగవద్గీతలలో చెప్పఁబడియున్నది.

శ్లో. అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిం. అని.

తా. అనేకజన్మలలో యోగము నభ్యసింపఁగా, సిద్ధి గలుగును తరువాత మోక్షమును బొందును అని యర్థము.

యోగము చిరకాలము సేవింపఁబడినప్పటికి మధ్యమధ్య విచ్ఛేదింపఁబడి సేవింపఁబడెనా, అప్పటప్పుడు పుట్టింపఁబడు యోగవాసనలు విచ్ఛేదకాలములయందుఁగలుగు వ్యుత్థానవాసనలవలన పరిభవింపఁబడుచున్నందున ఖండనకారుఁడు చెప్పిన న్యాయము ప్రాప్తించును. ముందు గ్రంథమును చదువువానికి వెనుకటి గ్రంథము మఱపు వచ్చినయెడల నేమిజ్ఞానము కలుగునని ఖండనకారోక్తన్యాయము గనుక విచ్ఛేదములేకుండ నిరంతరముగా సేవింపవలయును. సత్కారమనఁగా ఆదరము. ఆదరము లేకుండ సేవించినయెడల వసిష్ఠమహామునిచేఁ జెప్పఁబడిన న్యాయము సంభవించును.

శ్లో. అకర్తృ కుర్వదప్యేతచ్చేతశ్శ్రుతిగవాసనం,
దూరం గతమనా జంతుః కథాసంశ్రవణే యథా.

అని వసిష్ఠులచేఁ జెప్పఁబడినన్యాయము.

తా. భారతాదికథలను వినుచుండఁగాను కూర్చున్న పురుషుఁడు అన్యవిషయముల నాలోచించుచు దూరముగాఁబోయిన చిత్తము కలవాఁడైనచో నతఁడు ఆకథను ఏప్రకారముగా గ్రహించనేరఁడో ఆప్రకారమే చిత్తము సమాధిని అభ్యసించుచున్నప్పటికి శ్రద్ధ లేనిచో నతఁడు సమాధిని కొంచెముగా నైనను గ్రహింపఁజాలఁడని అర్థము.

ఇందుకొక కథ సాంప్రదాయజ్ఞులచేఁ జెప్పఁబడుచున్నది.

ఒక శిష్యుఁడొక గురువుయొక్కసన్నిధిలో శాస్త్రాభ్యాసము చేయుచుండెను. గురువుగారు పాఠమును చెప్పునపుడు శిష్యుఁడు ఒక యెలుకబొక్కలోఁ బోవఁబడుచుండఁగా దానినే చూచుచుండెను. గురువుగారు అర్థమంతయును చెప్పి దూర్చెనా యని శిష్యుని నడిగెను. నేను చెప్పిన శాస్త్రార్థము నీబుద్ధిలోఁ జేరెనా యని గురువుగారి యభిప్రాయము. అందులకు శిష్యుఁడు ఎలుకనే చూచుచున్నందున నింకను తోఁక దూరలేదని శిష్యుఁడు ప్రత్యుత్తరమును చెప్పెను.

కనుక నాదరము లేకుండఁ జేయు కార్యము సిద్ధింపనేరదు.

ఆదరమనఁగా లయ విక్షేప కషాయ సుఖాస్వాదనము. లను నాలుగింటిని పరిహరించియుండుట. కనుక ఆదరముచేతనే యోగమును సేవింపవలయును. దీర్ఘకాలాదరనైరంతర్యముల

తోఁగూడి సేవించిన యోగము విషయసుఖాస్వాదముచేతఁ గాని దుఃఖవాసనలచేతఁగాని చలింపచేయఁబడదు.

ఈయర్థము భగవద్గీతలలోఁ జెప్పఁబడినది.

శ్లో. యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః.
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే. అని.

తా. ఏయోగములభించినతరువాత మరియొకసుఖలాభ మెక్కువగా తోఁపదో యేయోగమందుండి మహా భయంకరమైన దుఃఖమువలన కూడ చలింపఁజేయఁబడఁడో అట్టి యోగ మని చెప్పఁబడు నని యర్థము.

యోగము లభించినతరువాత మరియొక సుఖము ఎక్కువగతోఁపదను నర్థము కచోపాఖ్యానములో వసిష్ఠమహాముని చే నుదాహరింపఁబడినది.

శ్లో. కచః కదాచిదుత్థాయ సమాధేః ప్రీతమానసః.
ఏకాంతే సమువాచేద మిదం గద్గదయా గిరా.

తా. కచుఁడనువేరుగల బ్రాహ్మణుఁడు ఒకానొకప్పుడు సమాధినుండి లేచి ఏకాంతమందుఁ గూర్చొని మిగుల సంతోషించిన మనస్సుగలవాఁడై గద్గదస్వరముతో నీప్రకారముగాఁ జెప్పెను.

శ్లో. కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామి కిం.
ఆత్మనా పూరితం విశ్వం మహాకల్పాంబునా యథా.

తా. ప్రళయకాలపు మహాసముద్రోదకము ఏప్రకారము ప్రపంచమంత నిండియుండునో ఆప్రకారమే పరమాత్మస్వ

రూప మీప్రపంచమునంతయు నిండియున్నది గనుక నేను ఏమి కార్యము చేయుదును? ఎచ్చటికిపోదును? దేనిని గ్రహింతును? దేనినివిడుతును? అనఁగా సర్వము బ్రహ్మస్వరూపముగా నున్నందున కర్తృకర్మక్రియలు లేవు గనుక గమనాదివ్యాపారములను జేయుటను శక్యము కాదని భావము.

శ్లో. న బాహ్యాభ్యంతరే దేహే హ్యధో చోర్ధ్వం చ దిక్షు చ,
ఇత ఆత్మా తతో వాత్మా నాస్త్యనాత్మమయం జగత్.

తా. దేహమునకు లోపలివెలుపలిభాగములయందు అధోభాగములో నూర్ధ్వభాగమునం దన్నిదిక్కులయందునుపరమాత్మస్వరూపము నిండియున్నది. పరమాత్మస్వరూపము గాని ప్రపంచము కొంచెమైన లేదు.

శ్లో. న శక్తి న యత్రాహం న తే స్తి న సాన్వయం,
కిమన్యదభిధాంతాయు సర్వం వయన్మయం తతం.

తా. ఆత్మస్వరూపుఁడనైన నే నెచ్చట లేనో నాయందేది లేదో, అట్టివస్తువు లేనేలేదు. సర్వమున్ను వ్యాపకమైన చిద్రూపము గానే యున్నది గనుక నేను దేనిని కోరను. అనఁగా చిద్రూపుఁడనైన నాకంటె భిన్నవస్తువు లేనందున ఇచ్ఛావిషయ మొకటియును లేదని తాత్పర్యము.

శ్లో. స్ఫారబ్రహ్మణి లోకాద్రిఫేనాన్యబ్ధౌ తరంగకాః,
చిదాదిత్యమహాతేజో మృగతృష్ణా జగత్స్థితిః. ఇతి.

తా. ఈలోకములఁ గనఁబడుచుండు మేరుమందరాది కులపర్వతములు స్ఫారమైన బ్రహ్మస్వరూపమను మహాసముద్రమందు నురుగుముద్దలుగా నున్నవి. ఈప్రపంచ మంతయు పర

బ్రహ్మా యను గ్రీష్మాదిత్య ప్రకాశమందు కనుపడు ఎండమావులు. కనుక పరమాత్మస్వరూప మొకటియె పరమార్థము గాని కులపర్వతాదులతోఁ గూడిన యీ ప్రపంచమంతయు గ్రీష్మకాలసూర్యకిరణములయందు కల్పింపఁబడిన యెండమావులవలె సముద్రమందు కల్పింపఁబడిన తరంగఫేనబుద్బుదములవలె మిథ్యాభూతమై యున్నది.

మహత్తరమైన దుఃఖమువలన నైనను చలింపఁజేయఁ బడదనునర్థము శిఖిధ్వజునియొక్క మూఁడుసంవత్సరములసమాధిని చెప్పునప్పుడు ప్రతిపాదింపఁబడినది.

శ్లో. నిర్వికల్పసమాధిస్థం తత్రాపశ్యన్మహీపతిం,
రాజానం తావదేకస్మాద్బోధయామి పదాత్పదాత్.

తా. శిఖిధ్వజుఁడను రాజు కొంతకాలము తపస్సు ననుభవించినతరువాత నిర్వికల్ప సమాధి నభ్యసించి యొక ఏకాంత దేశమందు నిలచి భూమి జయక్రమముగా నిర్వికల్పసమాధి యందుఁజేరి యుండఁగా అతనిభార్య యగు చూడాల యను నామె తనభర్తను వెదకుచుఁ బోయి యొకచోట నిర్వికల్ప సమాధినిష్ఠుఁడై యున్న తనభర్తయగు శిఖిధ్వజునిఁ జూచి యా సమాధిలో నుండి లేవఁదీసెద నని కోరెను.

శ్లో. ఇతి సంచింత్య చూడాలా సింహనాదం చకార సా,
భూయో భూయః ప్రభోరగ్రే వనేచరభయప్రదం.

తా. ఈవిధముగా నాలోచించి యా చూడాల యను రాజుభార్య యాశిఖిధ్వజునియెదుట మాటిమాటికి నడవిలో

తా. ఈప్రకారము నిర్వికల్పసమాధియం దున్న ప్రహ్లాదునియొద్దకు శ్రీమన్నారాయణుఁడు విచ్చేసి యో మహాత్మా, సమాధిని చాలించి లెమ్మా యని చెప్పి పాంచజన్యమను తన శంఖము చే దశదిశామధ్యము నిండునటుల ధ్వని చేసెను.

శ్లో. మహతా తేన శబ్దేన వైష్ణవప్రాంచజన్యజా,
బభూవ సంప్రబుద్ధాత్మా దానవేశశ్శనైశ్శనైః. అని

తా. నారాయణునియొక్క యోష్ఠములచే మోవఁబడిన యాశంఖధ్వనిచేత నాప్రహ్లాదుఁడు తిన్నతిన్నగా సమాధిని చాలించి వ్యుత్థితుఁ డాయెను.

ఈప్రకారమె పీతవాసుఁడు మొదలగు యోగులయొక్క సమాధిని కూడ నిర్మించుచు ఉదాహరించవలయును.

వైరాగ్యము రెండువిధములు. ఒకటి అపరవైరాగ్యము; రెండవది పరవైరాగ్యము. అందులో నపరవైరాగ్యము యతమానమని, వ్యతిరేకమని, ఏకేంద్రియమని, వశీకారమని నాలుగు విధములు. వీటిలో మొదటి మూడని అభిప్రాయముం దుంచుకొని వశీకారమునునాలుగవ వైరాగ్యము సూత్రించఁబడినది.

సూ. దృష్టానుశ్రవికవిషయవితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యం.

తా. స్రక్చందనవనితాపుత్రమిత్రధనాదివస్తువులు దృష్టవిషయములు. వేదములలో చెప్పఁబడిన స్వర్గాదులు ఆనుశ్రవిక విషయములు. ఇవియే అదృష్టవిషయములు అనికూడ చెప్పఁబడును. ఈరెండువిషయములయందు వారియొక్క స్పృహకు వివేకతారతమ్యముచేత యతమానాదివైరాగ్యములు మారుచు సంభవిం

చును. ఈప్రపంచమందు సారమైనది యేదియో అసారమైనది యేదియో వీటిని గురూపదేశశాస్త్రవిచారములచేత తెలుసుకొనుదుననియుద్యోగించుట యతమానవైరాగ్యమనఁబడును. ౧. తనచిత్తమందు పూర్వము కలిగియున్న దోషములలో నభ్యసింపఁబడు వివేకముచేత నిప్పటికి నెన్ని నివర్తించినవి. ఇఁక నెన్నిదోషములు శేషించియున్నవియని ప్రతిదినము పరిశీలన చేయుట వ్యతిరేకవైరాగ్యమనఁబడును. ౨. దృష్టాదృష్టవిషయములలోఁ బ్రవర్తించుట దుఃఖరూపమని తెలిసి యాప్రవృత్తిని విడిచిపెట్టి మనస్సునందు మాత్రము విషయరుచి కలిగియుండుట యేకేంద్రియవైరాగ్యమనఁబడును. ౩. దృష్టానుశ్రవికవిషయరుచిరూప దృష్టాదృష్టవిషయములలో లేకుండుట వశీకారవైరాగ్యమనఁబడును అని సూత్రతాత్పర్యము.

ఈయపరవైరాగ్యము అష్టాంగయోగములయందుఁ బ్రవర్తింపఁజేయునది గనుక సంప్రజ్ఞాతసమాధికి నంతరంగముగా నుండును. అసంప్రజ్ఞాతసమాధికి పరవైరాగ్యమంతరంగముగా నుండును.

పరవైరాగ్య మీసూత్రముచేఁ జెప్పఁబడినది.

సూ. తత్పరం పురుషఖ్యాతే ర్గుణవైతృష్ణ్యం. ౧౬.

తా. సంప్రజ్ఞాతసమాధిని దృఢముగా నభ్యసించుటచేత గుణత్రయాత్మకమైన ప్రధానముకంటె విలక్షణమైన ప్రత్యగాత్మస్వరూపము సాక్షాత్కరించును. అట్టిసాక్షాత్కారము చేత గుణత్రయజన్యములైన సమస్తపదార్థములయందును

గుణత్రయమందును కలిగెడి వైరాగ్యము పరవైరాగ్య మని సూత్రార్థము.

ఈపరవైరాగ్యతారతమ్యమువలన సమాధికి శీఘ్రత్వాది తారతమ్యము గలుగు నని సూత్రముచేఁ జెప్పఁబడినది.

సూ. తీవ్రసంవేగానా మాసన్నస్సమాధిలాభః. అని.

తా. సంవేగ మనఁగా వైరాగ్యము. తీవ్రవైరాగ్యము కలవారికి సమాధిసిద్ధి స్వల్పకాలముచేతనే కలుగు నని సూత్రార్థము.

మృదుసంవేగు లని, మధ్యసంవేగు లని, తీవ్రసంవేగు లని యోగులు మూఁడువిధములు. ఇందులో తీవ్రసంవేగులను తీవ్రవైరాగ్యము గలవారికే యోగము శీఘ్రకాలములో సిద్ధించును.

తీవ్రవైరాగ్యము కలవారిలో గూడ సమాధి తారతమ్యముగా సిద్ధించు నని సూత్రింపఁబడినది.

సూ. మృదుమధ్యాతిమాత్రత్వాత్తతోఽపి విశేషః. అని.

తా. మృదుతీవ్రవైరాగ్య మని, మధ్యతీవ్రవైరాగ్య మని, అధితీవ్రవైరాగ్య మని తీవ్రవైరాగ్యమే మూఁడువిధములుగా నున్నది. ఇందులో మృదుతీవ్ర వైరాగ్యము కలవారి కంటె మధ్యతీవ్రవైరాగ్యము కలవారికి, అంతకంటె అధితీవ్ర వైరాగ్యముగలవారికిని సమాధి శీఘ్రముగా సిద్ధించు నని సూత్ర తాత్పర్యము.

ఉత్తమోత్తములైన జనక ప్రహ్లాదాదులు అతితీవ్రవైరాగ్యము గలవారు. కనుకనే యొకముహూర్తమాత్రము తత్త్వవిచారము చేసినమాత్రమున దృఢసమాధిని బొందిరి. ఉద్దాలకుఁడు మొదలగుయోగులు మృదుతీవ్రవైరాగ్యముగలవారు గనుకనే చిరకాలాభ్యాసమువలనఁగాని సమాధి సిద్ధి నొందరైరి.

ఈప్రకారమే యితరసాధకులను కూడ నుదాహరించవలెను.

ఈప్రకారము అధితీవ్రవైరాగ్యము గలవానికి దృఢమైన యసంప్రజ్ఞాతసమాధిలాభముగలుగఁగా, తిరిగి వ్యుత్థానదశ నొందుటకు శక్యము కాదు. అందుచేతనే మనస్సు సమగ్రముగా నశించిపోవును.

మనోనాశముచేత వాసనాక్షయము రక్షింపఁబడఁగా, జీవన్ముక్తి సుస్థిరమై యుండును. మనోనాశము గలుగఁగానే విదేహమోక్షమే సిద్ధించును గాని జీవన్ముక్తి నిలిచి యుండ దని శంకింపఁదగదు. మనోనాశము గలిగినా, జీవన్ముక్తి నిలిచి యుండునని శ్రీరామవసిష్ఠులయొక్క ప్రశ్న ప్రతివచనముల వలన నిర్ణయింపఁబడియున్నది.

## శ్రీరాములు చేయుప్రశ్నము.

శ్లో. వివేకాభ్యుదయాచ్చిత్తస్వరూపేఽంతర్హితే మునే,
మైత్ర్యాదయో గుణాః కుత్ర జాయంతే యోగినాం వద.

తా. ఓమునివర్యా! వివేకము మిగుల వృద్ధినొందుట వలన చిత్తము నశించఁగా మైత్రీకరుణాదిశుభవాసనలు యోగులగు వారికి నెచ్చటఁ బుట్టును.

ఇందుకు వసిష్ఠమహర్షియొక్క ప్రతివచనము.

శ్లో. ద్వివిధశ్చిత్తనాశో౽స్తి సరూపో౽రూప ఏవ చ,
జీవన్ముక్తౌ సరూపస్స్యాదరూపో౽దేహముక్తిగః.

తా. మనోనాశము సరూపమని, అరూపమనియు రెండు విధములు. అందులో జీవన్ముక్తియందు మనోనాశము సరూపముగానుండును. విదేహముక్తియందరూపముగా నుండును.

శ్లో. ప్రాకృతం గుణసంభారం మమేతి బహు మన్యతే,
సుఖదుఃఖాద్యవష్టబ్ధం విద్యమానం విదో విదుః.

తా. సుఖదుఃఖాదులకు కారణములై వర్తించుగుణత్రయాత్మక ప్రకృతిసంబంధములైన రాగద్వేషాదిగుణములను తనవిగా అభిమానించువదార్థమును మనస్సునుగా చెప్పుదురు.

శ్లో. చేతసః కథితా సత్తా మయా రఘుకులోద్వహ,
అస్య నాశమిదానీం త్వం శృణు ప్రశ్నవిదాం వర.

తా. ఓరఘువంశప్రతిష్ఠాపకుఁడవైన రామచంద్రా! మనస్సుయొక్కసత్తను జెప్పితిని. ఈమనస్సుయొక్క నాశమును జెప్పెదను వినుమా.

శ్లో. సుఖదుఃఖదశాధీరం సామ్యాన్న ప్రోద్ధరంతి యం,
నిశ్వాసా ఇవ శైలేంద్రం తస్య చిత్తం మృతం విదుః.

తా. బ్రహ్మాత్మైకత్వసాక్షాత్కారముఁ గలిగి నిరంతరబ్రహ్మానుసంధానము గల యేపురుషుని నిట్టూర్పువాయువులు పర్వ

తమును కదలింపలేనట్టు సుఖదుఃఖాద్యవస్థలు కదలింపనేరవో, యాపురుషునియొక్క చిత్తము నశించిన దని యెఱుఁగవలయును.

శ్లో. ఆపత్కార్పణ్యముత్సాహో మదో మాంద్యం మహోత్సవః,
యం న యాంతి న వైరూప్యం తస్య నష్టం మనో విదుః.

తా. పుత్రకళత్రాది నాశరూపమైన యాపదయును, దారిద్ర్యమును, పుత్రజన్మాదులవలనఁ గలుగు నుత్సాహమును, ధనికత్వప్రాండిత్యాదులవలనఁ గలుగు గర్వమును, అలసత్వమును, వివాహాదిమహోత్సవదర్శనమువలనఁ గలుగు హర్షమును ఏపురుషుని యందు సంగతములు కావో యివి యేపురుషుని వైరూప్యమును పొందింపనేరవో, ఆపురుషునియొక్క మనస్సు నశించినది యని తెలియవలయును.

శ్లో. చిత్తమాశాభిధానం హి యదా నశ్యతి రాఘవ,
మైత్ర్యాదిభిర్గుణైర్యుక్తం తదా సత్త్వముదేత్యలమ్.

తా. ఆశయే చిత్తమనఁబడును. ఇట్టి చిత్త మెప్పుడు నశించునో అప్పుడు చిత్తము మైత్ర్యాదిగుణములతోఁగూడి సత్త్వగుణప్రధానమై యావిర్భవించును. అనఁగా రాగద్వేషలోభాదిరూపములు నశించఁగానే మైత్రీముదితాదిగుణములతోఁగూడ చిత్తముయొక్క సత్త్వాంశము వృద్ధి నొందు నని భావము.

శ్లో. భూయో జన్మ వినిర్ముక్తం జీవన్ముక్తస్య విద్యతే,
సరూపోఽసౌ మనోనాశో జీవన్ముక్తస్య విద్యతే.

తా. జీవన్ముక్తునియొక్క మనస్సు పునర్జన్మకు కారణము గాక యుండును. ఇదియే సరూప మను మనోనాశము. ఇట్టి మనోనాశము జీవన్ముక్తునికి కలిగియుండును.

శ్లో. అరూపస్తు మనోనాశో యో మయోక్తో రఘూద్వహ,
విదేహముక్తావేవాసౌ విద్యతే నిష్కలాత్మకః.

తా. ఏఅరూప మనెడిమనోనాశము నాచేతఁ జెప్పఁబడెనో, అది ప్రయోజనములేనిదై విదేహముక్తియందే కలిగియుండును. అనఁగా జీవన్ముక్తియందుఁగల మనోనాశము ఆత్మమాత్రశేషముగా నున్నందునను, ఆత్మస్వరూపము నిర్గుణమై నందునను మైత్ర్యాదిగుణాశ్రయత్వముగూడ లేకయుండు నని భావము.

శ్లో. సమగ్రాగ్ర్యగుణాధారమపి తత్ర ప్రలీయతే,
విదేహముక్తావమలే పదే పరమపావనే.

తా విదేహముక్తి; యనఁగా నిర్మలమును పరమపవిత్రమయిన పరబ్రహ్మస్వరూపమే దానియందు సర్వశ్రేష్ఠములయిన సమస్త మైత్ర్యాదిగుణములతోఁగూడ తదాశ్రయమయిన మనస్సు నశించును. ఇదియె అరూపమనోనాశ మనఁబడును.

శ్లో. సంశాంతదుఃఖమజడాత్మకమేకరూప
మానందమంథరమపేతరజస్తమో యత్,
ఆకాశకోశతనవోఽతనవో మహాంతః
తస్మిన్ పదే గళితచిత్తలవా వసంతి. అని.

తా. శమించినసమస్త దుఃఖములు గలదియును స్వప్రకాశచైతన్యస్వరూపమును సజాతీయవిజాతీయస్వగతభేదములు

లేనిదియు పరమానందాత్మకమును రజస్తమోగుణశూన్యమును ప్రసిద్ధమునైన యేపరమాత్మస్వరూపముకలదో, దానియందు ఆకాశమువలె నతినిర్మలమయిన స్వరూపము గల మహాత్ములు చిత్తలేశము కూడ లేనివారై నివసించియుందురు.

కనుక జీవన్ముక్తు లగువారికి స్వరూపమనోనాశము కలిగి యుండు నని, ఇదియె జీవన్ముక్తిసాధనమని సిద్ధము.

ఇది జీవన్ముక్తిప్రకాశికయందు మనోనాశనిరూపణ ప్రకరణ మను మూడవభాగము సమాప్తము.



శ్రీ హయగ్రీవాయ నమః.

# జీవన్ముక్తిప్రకాశిక.

## ౪-వ ప్రకరణము.

హరిః ఓమ్.

ఇఁకను జీవన్ముక్తియొక్క ఫలమును నిరూపించెదము.

ఇదివరకు జీవన్ముక్తి యనఁగా నేమి? దీనికి ప్రమాణ మెద్ది? ఈజీవన్ముక్తి యేవిధముగా సిద్ధించు నను మూడు ప్రశ్నలకు సమాధానము చెప్పఁబడినది.

జీవన్ముక్తి సిద్ధించినందున నేమిప్రయోజనము కలదను నాలుగవప్రశ్నకు సమాధానము చెప్పఁబడును.

జీవన్ముక్తి సిద్ధించినందున జ్ఞానరక్షణము, తపస్సు, విసంవాదాభావము, దుఃఖనాశము, సుఖావిర్భావము అను అయిదుప్రయోజనములు కలవు.

ఆక్షేపము—అపౌరుషేయ మగుటనందున నిత్యనిర్దోషమయిన వేదాంతవాక్యప్రమాణముచేతఁ గలిగిన తత్త్వజ్ఞానమునకు బాధయసంభావితమయి యుండఁగా తత్త్వజ్ఞానరక్షణము జీవన్ముక్తి ప్రయోజన మని చెప్పుట యసంగతము. దేనికి బాధకలుగునో దానిని గదా రక్షింపవలసియుండును.

సమాధానము—చిత్తవిశ్రాంతి లేనియెడల సంశయ విపర్యయములు తత్త్వజ్ఞానబాధకములుగా సంభవించును. తత్త్వజ్ఞానబాధకమ్ములైన సంశయవిపర్యములు చిత్తవిశ్రాంతి చేత నివర్తించును.

చిత్తవిశ్రాంతి జీవన్ముక్తిసిద్ధిచేత గలుగును. కనుక జీవన్ముక్తి చిత్తవిశ్రాంతి ద్వారా సంశయవిపర్యయములను నివర్తింపఁ జేసి తత్త్వజ్ఞానమును సుస్థిరముగా జేయును. కనుక జీవన్ముక్తి తత్త్వజ్ఞానరక్షణము ప్రయోజనమని చెప్పుట యుక్తముగానే యున్నది. శ్రీరాములవారికి తత్త్వజ్ఞానము కలిగియున్నప్పటికి చిత్తవిశ్రాంతికి పూర్వమందు సంశయము కలిగియున్నట్టు వాసిష్ఠరామాయణములో విశ్వామిత్రమహర్షిచే చెప్పఁబడి యున్నది.

శ్లో. న రాఘవ తవాస్త్యన్యత్ జ్ఞేయం జ్ఞానవతాం వర,
స్వయైవ సూక్ష్మయా బుద్ధ్యా సర్వం విజ్ఞాతవానసి.

తా. ఓ రామచంద్రా! నీవు చెప్పిన సంగతులను విచారింపఁగా నీవు తెలుసుకోవలసిన సంగతి మరియొకటి లేదు. నీవు సూక్ష్మమైన స్వబుద్ధిచేతనే సమస్తమును తెలుసుకొంటివి.

శ్లో. భగవద్వ్యాసపుత్రస్య శుకస్యేవ మతిస్తవ,
విశ్రాంతిమాత్రమేవాత్ర జ్ఞాతజ్ఞేయాప్యపేక్షతే. అని.

తా. వ్యాసమహర్షికుమారుఁడైన శుకమహర్షియొక్క బుద్ధివలె నీబుద్ధికూడ తెలుసుకోవలసిన యర్థమును యావత్తు తెలుసుకొని యున్నప్పటికి విశ్రాంతిని మాత్రమపేక్షించుచున్నది.

శుకమహర్షి స్వబుద్ధిచేతనే తత్వమును సమగ్రముగా తెలుసుకొని స్వావగతార్థమునందు సంశయము కలవాఁడై తనతండ్రియగు వ్యాసమహర్షిని ప్రశ్నచేయఁగా వారు తనకు తెలిసినప్రకారమే చెప్పినందున అప్పటికిని సంశయించి జనకమహారాజుసన్నిధికి పోయి ఆయనవలనఁ గూడ నీప్రకారమే యుపదేశింపఁబడి యాజనకరాజును గూర్చి యీప్రకారముగా చెప్పెను.

శ్లో. స్వయమేవ మయా పూర్వ మేతత్ జ్ఞాతం వివేకతః,
ఏతదేవ చ పృష్టేన పిత్రా మే సముదాహృతమ్.

తా. ఓజనకమహారాజా! మీరు చెప్పిన యీతత్వార్థమును నేనిదివరకు వివేకయుక్తమయిన బుద్ధిచేత తెలుసుకొని యుంటిని. మాతండ్రియగు వ్యాసమహర్షిని నడుగఁగా వారు నిదియే చెప్పిరి.

శ్లో. భవతాఽప్యేష ఏవార్థః కథితో వాగ్మినాం వర.
ఏష ఏవ చ వాక్యార్థః శాస్త్రేషు పరిదృశ్యతే.

తా. మీచేత కూడ నీయర్థమే చెప్పఁబడినది. సమస్త శాస్త్రములయందును విచారింపఁగా, నీయర్థమే కనుపడుచున్నది.

శ్లో. యథాఽయం స్వవికల్పోత్థః స్వవికల్పపరిక్షయాత్,
క్షీయతే దగ్ధసంసారో నిస్సార ఇతి నిశ్చయః.

తా. నిస్సారమయిన యీసంసారము స్వభ్రాంతిచేత కలిగిన దనియు, స్వభ్రాంతి నివర్తింపఁగా సంసారము నివర్తించు

ననియు నేను నిశ్చయించుకొన్న యర్థము. ఈయర్థమే మా తండ్రిగారిచేత, మీచేత, శాస్త్రములచేతకూడ చెప్పఁబడినది.

శ్లో. తత్కిమేతన్మహాబాహో సత్యం బ్రూహి మమాచలమ్,
త్వత్తో విశ్రామ మాప్నోమి చేతసా భ్రమతా జగత్.

తా. ఓజనకమహారాజా! నేను నిశ్చయించుకొన్న యర్థమును మీరు చెప్పిన యర్థమును వాస్తవమా? నాకు సత్యముగా చెప్పుడు. జగత్తునుగుఱించి నేను నిశ్చయించుకొన్న యర్థము వాస్తవమా! అవాస్తవమా! యని భ్రమించుచిత్తము గల నేను మీయుపదేశముచేత విశ్రాంతిని పొందెదను.

ఈప్రకారముగ శుకమహామునిచే నడుగఁబడి జనకమహారాజు చెప్పుచున్నారు.

శ్లో. నాతః పరతరః కశ్చి న్నిశ్చయోఽస్త్యపరో మునే,
స్వయమేవ త్వయా జ్ఞాతం గురుతశ్చ యథా శ్రుతం.

తా. ఓశుకమహామునీ! ఇదియె వాస్తవార్థము. ఇంతకు మించిన వాస్తవము లేదు. నీవు స్వబుద్ధిచేతనే ఈయర్థమును తెలుసుకొంటివి. మీతండ్రిగారిచేత కూడ వినియుంటివి.

శ్లో. అవ్యుచ్ఛిన్నచిదాత్మైకః పుమానస్తీహ నేతరత్,
స్వసంకల్పవశాద్బద్ధః నిస్సంకల్పస్తు ముచ్యతే.

తా. దేశకాలవస్తుపరిచ్ఛేదములేని చిద్రూపుఁడైన పరమపురుషుఁ డొకఁడే కలఁడు. మఱియొకటి లేదు. ఆపురుషుఁడు తనసంకల్ప మను మాయాశక్తిచేతనే బద్ధుఁడై సంసారము ననుభవించును. సంకల్పహీనుఁడాయెనా, ముక్తుఁడగును.

# ౪-వ ప్రకరణము.

శ్లో. తేన త్వయా స్ఫుటం జ్ఞాతం జ్ఞేయం స్వస్య మహాత్మనః,
భోగేభ్యో విరతిర్జాతా దృశ్యాద్వా సకలాదిహ.

తా. తెలియఁదగిన యీయర్థము నీకు బాగుగ తెలిసెను. మహానుభావుఁడవైన నీకు సమస్తభోగములయందు సమస్తప్రపంచమందును విరక్తి గలిగెను.

శ్లో. ప్రాప్తం ప్రాప్తవ్యమఖిలం భవతా పూర్ణచేతసా,
న దృశ్యే పతసి బ్రహ్మన్ ముక్తస్త్వం భ్రాంతిముత్సృజ.

తా. పరిపూర్ణచిత్తముగల నీచేత పొందవలసిన ఫలమంతయు పొందఁబడినది. నీవు ఈదృశ్యప్రపంచమునం దాసక్తి గలవాఁడవు కాకపోతివి. కనుకనే నీవు ముక్తుఁడవు భ్రాంతిని విడువుము.

శ్లో. అనుశిష్టస్స ఇత్యేవం జనకేన మహాత్మనా,
విశశ్రామ శుకస్తూష్ణీం స్వస్థే పరమవస్తుని.

తా. ఈప్రకారము మహాత్ముఁడైన జనకునిచే నుపదేశింపఁబడి యాశుకమహాముని స్వమహిమ ప్రతిష్ఠితమైనపరమాత్మయందు సర్వవ్యాపారోపరమపూర్వకంబుగా విశ్రాంతి నొందెను. అనఁగా పరమాత్మస్వరూపమందు నిస్సంశయముగా నిష్ఠగలవాఁడై యుండెను.

శ్లో. వీతశోకభయాయాసో నిరీహశ్ఛిన్నసంశయః,
జగామ శిఖరం మేరోః సమాధ్యర్థమనిందితం.

తా. తరువాత నాశుకమహాముని సర్వసంశయనివృత్తి గలవాఁడై విషయములయం దాశ లేనివాఁడై శోకభయాయాసములను విడిచి జనకోపదేశముచేత నిశ్చితమైనపరమాత్మ

తత్త్వమును ప్రత్యక్షముగా జూడఁగోరి సమాధిని చేయుటకై మేరుపర్వతశిఖరమునకుఁ బోయెను.

శ్లో. యత్ర వర్షసహస్రాణి నిర్వికల్పసమాధినా,
దేహే స్థిత్వా శశామాసావాత్మన్యస్నేహదీపవత్. అని.

తా. ఆ మేరుపర్వతశిఖరమున ననేకవేలసంవత్సరములు నిర్వికల్పసమాధిని అనుష్ఠించుచుండి యాశుకమహాముని తైలము లేని దీపమువలె నాత్మయందు శమించెను. అనఁగా విదేహముక్తిని బొందె నని భావము.

కనుక తత్త్వజ్ఞానము పుట్టినప్పటికి విశ్రాంతిలేనిపక్షమందు శుకమహామునికి శ్రీరాములవారికివలె సంశయము కలుగుచుండును. అట్టి సంశయము అజ్ఞానమువలె తత్త్వజ్ఞానమునకు ప్రతిబంధకమై యుండును.

కనుకనే భగవద్గీతలయందు చెప్పఁబడినది.

శ్లో. అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః.

తా. అజ్ఞానవిపర్యయసంశయములు గల పురుషుఁడు పురుషార్థమును చెందక నశించిపోవును. అజ్ఞాన విపర్యయములు కలవాఁడు ఇహలోకమునందైనను కొంచెము సుఖమును పొందును సంశయవిశిష్టుఁడు ఈలోకమునందుఁగాని పరలోకమందుఁగాని సుఖము నెప్పటికిని పొందనేరఁడు.

ఈశ్లోకమున నశ్రద్ధయనఁగా విపర్యయము. ఈవిపర్యయము ఉత్తరగ్రంథమునందు వివరింపఁబడును. అజ్ఞానవిపర్య

యములు మోక్షమును మాత్రము ప్రతిబంధించును. సంశయము భోగమోక్షములను రెంటిని ప్రతిబంధించును సంశయమనఁగా దేనియందును నిశ్చయబుద్ధి లేకపోవుట కనుకనే యెప్పుడు సంసారసుఖములయందు ప్రవర్తించునో, అప్పుడు మోక్షమార్గ బుద్ధిసంసారసుఖప్రవృత్తిబుద్ధిని నిరోధించును. ఎప్పుడు మోక్షమార్గమందుఁ బ్రవర్తించునో ప్రవృత్తిబుద్ధిని నిరోధించును గనుక సంశయాంతఃకరణము గలవాఁడు ఇహలోక పరలోకసుఖములలో నొక సుఖమునైనను బొందనేరఁడు.

కనుకనే మోక్షాపేక్షగలవాఁడు సంశయములను ముఖ్యముగా ఛేదించుకొనవలయును. గనుకనే "శ్రు. ఛిద్యంతే సర్వ సంశయాః" అనుశ్రుతియందు ముముక్షుజనులను సర్వసంశయోచ్ఛేదమావశ్యకమని చెప్పియున్నది. పూర్వమజ్ఞానమును నిదాఘుఁడను బ్రాహ్మణుని దృష్టాంతము గాఁజెప్పఁబడినది. ఋభుమహాముని పరమకృపచేత తన శిష్యుఁడైన నిదాఘునిగృహమునకు పోయి యానిదాఘుని బహువిధములచేత బోధించి స్వాశ్రమమును బ్రవేశించెను. నిదాఘుఁడు మొదట తెలిసియును గురూపదిష్టమార్గమందు శ్రద్ధ లేనివాఁడై శ్రౌతస్మార్తకర్మలే పరమపురుషార్థసాధనము లని విపర్యయబుద్ధి (విపరీతబుద్ధి) కలవాఁడై కర్మలననుష్ఠించుటయందు పూర్వమువలెఁ బ్రవర్తించెను. గురువైన యాఋభుమహామునియును శిష్యుఁడు మోక్షమార్గభ్రష్టుఁడు కాకపోవుఁ గాక యని తిరిగి నిదాఘునియింటికి వచ్చి తత్త్వజ్ఞానమును బోధించెను. అప్పటికిని నిదాఘుఁడు విపరీతబుద్ధిని విడువకపోయెను. అంతట విడువక మూఁడవపర్య

యమును బోధింపఁబడి విపరీతజ్ఞానమును విడిచి నిదాఘుఁడు బ్రహ్మాత్మ్యమునందు విశ్రాంతి నొందెను.

ఈసంశయవిపర్యయములకే అసంభావనావిపరీతభావనలను నామాంతరములు గలవు. వీనిచేత తత్త్వజ్ఞానముయొక్క ఫలము ప్రతిబంధింపఁబడును.

ఈయర్థము వార్తికమహర్షిచేఁ జెప్పఁబడినది.

శ్లో. మణిమంత్రౌషధైర్వహ్ని స్స్పృష్టోఽపి నహి దాహకః,
ప్రత్యక్షం నైవ శక్తత్వా త్ప్రతిబద్ధస్వభావ చ.
జ్ఞానాగ్నిరపి సంశాది ప్రతిబద్ధస్స్వభావతః చ,
ప్రత్యక్షం నైవ శక్తత్వా త్ప్రతిబద్ధస్తు కల్మషమ్.

తా. మణిమంత్రములచేతను, ఔషధములచేతను, ప్రతిబంధింపఁబడిన దాహశక్తిగల అగ్ని స్పర్శవిశేషముగానుండుచున్నప్పటికి కాష్ఠముల నేప్రకారము దహింపఁజాలదో, యాప్రకారమే తత్త్వజ్ఞానము కూడ దృఢముగా నుదయించి ప్రకాశించుచున్నప్పటికి సంశయవిపర్యయములవలన ప్రతిబంధింపఁబడెనా, మోక్షప్రతిబంధకపాపములను నివర్తింపఁజేయు శక్తి గలదిగా నుండదు.

శ్లో. భావనా విపరీతా యా యా చాసంభావనా మతా,
కురుతే ప్రతిబంధం సా తత్త్వజ్ఞానస్య చాపరా. అని.

తా. విపరీతభావన యనునది అసంభావన యనునది తత్త్వజ్ఞానమునకు ప్రతిబంధకములు. ఇవి గాక యితరములు ప్రతిబంధకములు కానేరవు. జీవాభిన్నబ్రహ్మస్వరూపమును

ప్రపంచమిథ్యాత్వమును కేవలజ్ఞానముయొక్క మోక్షసాధనత్వమును శాస్త్రము, ప్రతిపాదింప దనుబుద్ధి అసంభావన యని చెప్పఁబడును. శాస్త్రము జీవేశ్వరభేదమును ప్రపంచసత్యత్వమును కర్మసముచ్చితజ్ఞానముయొక్క మోక్షసాధనత్వము నే తాత్పర్యముచేత ప్రతిపాదించు ననుబుద్ధి విపరీతభావన యని చెప్పఁబడును.

కనుక విశ్రమము నొందనిచిత్తము గలవానికి సంశయవిపర్యయములు సంభవించుచున్నందున తత్వజ్ఞానముయొక్క ఫలము ప్రతిబంధింపఁబడును. ఇష్టఫలప్రతిబంధరూపమైన బాధవలన తత్వజ్ఞానమును రక్షించవలసియుండును. విశ్రాంతిచిత్తము గలవానికి మనోనాశనముగనుండున ప్రపంచమే భాసింపదుగనుక సంశయములు సంభవింపనేరవు. ప్రపంచప్రతిభాసము లేని బ్రహ్మవేత్తయొక్క శరీరవ్యవహారము స్వప్రయత్నము లేకపోయినా, పరమేశ్వరప్రేరితమైన ప్రాణవాయువుచేతనే నిర్వహింపఁబడును.

కనుకనే ఛాందోగ్యోపనిషత్తులలో చెప్పఁబడియున్నది.

శ్రు. నోపజనం స్మరన్నిదం శరీరం స యథా ప్రయోగ్య ఆచరణే యుక్త ఏవ మేవాయమస్మిఞ్ఛరీరే ప్రాణో యుక్తః. అని.

తా. జనులయొక్క సమీపమం దుండు శరీరమును బ్రహ్మవేత్త స్మరించక యుండును. అనఁగా బ్రహ్మవేత్తయొక్క శరీరమును సమీపమం దుండు జనులు చూచుచుందురు గాని యాబ్రహ్మవేత్త తాను నిర్మనస్కుఁడై యున్నందున ఇది నా శరీరము ఇట్టివ్యాపారముల నాచరించుచున్నదియని యెఱుఁగక

యే యుండునని భావము ఏప్రకారము రథశకటాదులనీడ్చుటకు యోగ్యములైన అశ్వములు మార్గమందు నడచునపుడుగాను మొదట సారథిచేత ప్రేరణచేయఁబడి అనంతరము సారథి యొక్క ప్రేరణ నపేక్షింపక స్వయముగానే పురోవర్తి గ్రామమును గాని క్షేత్రమును గాని రథశకటాదులను పొందించునో, యాప్రకారమే యీప్రాణవాయువు కూడఁ బరమేశ్వరునిచేత నీశరీరమందు నియోగింపఁబడి జ్ఞానియొక్క యత్నము ఉండినా, లేకపోయినా శరీరవ్యవహారమును నిర్వహింపుచుండును.

ఈయర్థము శ్రీభాగవతమునందు కూడ స్మరింపఁబడి యున్నది

శ్లో. దేహం చ నశ్వరమవస్థిత ముత్థితం వా
సిద్ధో న పశ్యతి యతోఽధ్యగమత్స్వరూపం,
దైవాదుపేతమథ దైవవశాదపేతం
వాసో యథా పరికృతం మదిరామదాంధః.

తా. బ్రహ్మాత్మస్వసాక్షాత్కారముగల మహానుభావుఁడు నిరంతరము బ్రహ్మస్వరూపానుసంధానతత్పరుఁడై యున్నందున నశించుస్వభావముగల యీశరీరము కూర్చొని యుండినా, లేక, నిలిచియుండినా, ప్రారబ్ధకర్మప్రాబల్యమువలన తనతోఁ గూడియుండినా, లేక తన్ను విడిచిపోయినా దీనిని మద్యపానపరవశుఁడైన పురుషుఁడు తనపై వస్త్రము నేప్రకార మెఱుఁగక యుండునో ఆప్రకారముగానే యెఱుఁగకయుండును.

వసిష్ఠమహామునియు నీప్రకారముగానే చెప్పియున్నారు.

బ్రహ్మవిద్వరుఁడని, మూఁడవవాఁడు బ్రహ్మవిద్వరీయుఁడని. నాలుగవవాఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడని చెప్పఁబడుదురు.

ఈనలుగురు యోగభూమిక లేడింటిలో నాలుగవభూమిక మొదలుకొని క్రమముగా నాలుగు భూమికలను పొందినవారని తెలియవలయును. అనఁగా నాలుగవభూమికయందు బ్రహ్మవిత్తని, ఐదవభూమికయందు బ్రహ్మవిద్వరుఁడని, ఆఱవ భూమికయందు బ్రహ్మవిద్వరీయుఁడని, యేడవభూమికయందు బ్రహ్మవిద్వరిష్ఠుఁడని చెప్పఁబడునని భావము.

యోగభూమిక లేడింటిని శ్రీవసిష్ఠమహర్షి చెప్పియున్నారు.

శ్లో. జ్ఞానభూమిశ్శుభేచ్ఛాఖ్యా ప్రథమా సముదాహృతా,
విచారణా ద్వితీయా స్యాత్తృతీయా తనుమానసా.
సత్త్వాపత్తిశ్చతుర్థీ స్యాత్తతో౽సంసక్తినామికా,
పదార్థాభావినీ షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా. అని.

తా. జ్ఞానభూమిక లేడింటిలో మొదటిది శుభేచ్ఛ యని, రెండవది విచారణ యని, మూఁడవది తనుమానస యని, నాలుగవది సత్త్వాపత్తి యని, అయిదవది అసంసక్తియని, ఆఱవది పదార్థాభావిని యని, ఏడవది తురీయ యని చెప్పఁబడును.

శ్లో. స్థితః కిం మూఢ ఏవాస్మి ప్రేక్షే౽హం శాస్త్రసజ్జనైః,
వైరాగ్యపూర్వమిచ్ఛేతి శుభేచ్ఛేత్యుచ్యతే బుధైః.

తా. నేను మూఢుఁడనై యుందును నిలిచితిని. సజ్జన సహవాసముచేత సచ్ఛాస్త్రశ్రవణముచేత తత్త్వమును తెలియ

యత్నించెద నని వైరాగ్యపూర్వకముగాఁ గలుగునట్టి యిచ్ఛ శుభేచ్ఛ యని పండితులచే చెప్పఁబడినది.

శ్లో॥ శాస్త్రసజ్జనసంపర్కవైరాగ్యాభ్యాసపూర్వకం,
సద్విచారప్రవృత్తిర్యా ప్రోచ్యతే సా విచారణా.

తా. వేదాంతశాస్త్రములను విని సాధుజనులసహవాసమును చేసి ఇహలోకపరలోకములయందు వైరాగ్యమును పొంది బ్రహ్మవిచారమునందుఁ బ్రవర్తించుటవిచారమని చెప్పఁబడును.

శ్లో. విచారణాశుభేచ్ఛాభ్యామింద్రియార్థేష్వసక్తతా,
యత్ర సా తనుతామేతి ప్రోచ్యతే తనుమానసా.

తా. విచారణచేతను, శుభేచ్ఛచేతను, విషయవైరాగ్యముతోఁ గూడినచిత్తము ఏదశయందు సూక్ష్మగ్రహణసామర్థ్యరూపమయిన తనుత్వమును పొందునో, ఆదశ తనుమానస యని చెప్పఁబడును.

శ్లో. భూమికాత్రితయాభ్యాసాచ్చిత్తేఽర్థవిరతేర్వశాత్,
సత్త్వాత్మని స్థితే శుద్ధే సత్త్వాపత్తిరుదాహృతా.

తా. ఈచెప్పఁబడిన మూఁడు భూమికల నభ్యసించుటవలనను విషయములయందుఁ గలిగిన వైరాగ్యదార్ఢ్యమువలనను సత్యజ్ఞానానందాత్మకమయి అవిద్యాదిదోషశూన్యమయిన పరమాత్మస్వరూపమునందు చిత్తము దృఢముగా నిలుచుట సత్త్వాపత్తి యనఁబడును.

శ్లో. దశాచతుష్టయాభ్యాసాదసంసర్గఫలా తు యా,
రూఢసత్త్వచమత్కారా ప్రోక్తాఽసంసక్తినామికా.

తా. శుభేచ్ఛాదిభూమికాచతుష్టయాభ్యాసమువలనసర్వ విషయములయందును బొత్తిగా సంసర్గము లేకయుండి పర మాత్మయందు రూఢమయిన స్థితి యసంసక్తి యనఁబడును.

శ్లో. భూమికాపంచకాభ్యాసాత్స్వాత్మారామతయా భృశం,
ఆభ్యంతరాణాం బాహ్యానాం పదార్థానామభావనాత్.
పరప్రయుక్తేన చిరం ప్రయత్నేనావబోధనమ్,
పదార్థాభావనా నామ షష్ఠీ భవతి భూమికా.

తా. శుభేచ్ఛాదిభూమికాపంచకము నభ్యసించు కేవల స్వరూపమునందే దృఢముగా చేరి యానందించుచున్న చిత్త మునకు బాహ్యవిషయములు గాని అంతరవిషయములు గాని గోచరించక యుండుటచేత నితరులయొక్క ప్రయత్నముచేతనే చిరకాలమునకు వ్యుత్థానమును బొందు పురుషునియొక్క దశ పదార్థాభావని యను ఆఱవభూమికగా చెప్పఁబడును.

శ్లో. భూమిషట్కచిరాభ్యాసాద్భేదస్యానుపలంభనాత్,
యత్స్వభావైకనిష్ఠత్వం సా జ్ఞేయా తుర్యగా గతిః. అని.

తా. వెనుక ఆఱుభూమికల నభ్యాసముచేసినందున భేదప్రపంచ మెప్పటికిని స్ఫురించకపోవుటవలన సర్వకాలసర్వా వస్థలయందు పరబ్రహ్మస్వరూపమునందు నిష్ఠ కలిగి యుండి పరప్రయత్నమువలననైనా వ్యుత్థానమును పొందకయుండుట తురీయ యనెడి యేడవ భూమికగా చెప్పఁబడును.

ఈ యేడు భూమికలలో మొదటి మూడుభూమికలు బ్రహ్మవిద్యకు సాధనములుగా నుండును. కాని విద్యయం దంత ర్భూతములు కానేరవు. ఈ మొదటి మూడుభూమికలయందు

భేదప్రపంచము సత్యముగానే తోఁచుచుండును గనుకనే యిది జాగ్రదవస్థయని చెప్పఁబడును. జాగ్రదవస్థయందు భేదప్రపంచము సత్యముగా స్ఫురించును గదా.

ఈయర్థము వసిష్ఠమహాముని చే చెప్పఁబడినది.

శ్లో. భూమికాత్రితయం త్వేత ద్రామ జాగ్రదితి స్థితం,
యథావద్భేదబుద్ధ్యేదం జగజ్జాగ్రతి దృశ్యతే. ఇని.

తా. ఓ రామచంద్రా, జాగ్రదవస్థయందు భేదబుద్ధివలన యథార్థముగా నీప్రపంచము చూడఁబడును. ఈభూమికాత్రయమునందును ప్రపంచము భేదబుద్ధివలన యథార్థముగానే తెలియఁబడుచుండును గనుక నీభూమికలు మూఁడును జాగ్రదవస్థయని చెప్పఁబడును.

ఈమూఁడు భూమికలను దృఢముగా నభ్యసించినతరువాత వేదాంత మహావాక్యములవలన నిర్విశేషప్రత్యగభిన్న బ్రహ్మస్వరూపసాక్షాత్కారము కలుగును. ఇదియద్వైతస్థితి యను నాలుగవభూమిక. ఇదియె భూమికాత్రయాభ్యాసముయొక్క ఫలము. ఇదియె బ్రహ్మవిద్య యని పండితులచే చెప్పఁబడినది. ఈనాలుగవ భూమిక యందు సర్వప్రపంచమున కుపాదాన కారణమైన పరమాత్మయొక్క స్వరూపమును అద్వితీయసచ్చిదానందస్వరూపమని నిశ్చయించి పరమాత్మయం దారోపింపఁబడిన జగత్తని ప్రపంచమని చెప్పఁబడు నామరూపములు మిథ్య యని తెలుసుకోఁబడును. మోక్షేచ్ఛగల పురుషునికి వెనుకఁ జెప్పిన జాగ్రద్దశనుబట్టి చూడఁగా నీభూమిక స్వప్న మని చెప్పఁదగియున్నది.

ఇదియును వసిష్ఠమహాముని చే చెప్పఁబడినది.

శ్లో. ఆద్వైతే స్థైర్యమాయాతే ద్వైతే చ ప్రశమం గతే,
పశ్యంతి స్వప్నవల్లోకం చతుర్థీం భూమికామితాః.

తా. చిత్తమునం దద్వితీయపరబ్రహ్మస్వరూపము స్థైర్యమును పొందఁగానే ద్వైతప్రపంచ మంతయుఁ బ్రకాశించక శాంతిని పొందియుండును. ఇట్టి నాలుగవభూమికను పొందిన మహానుభావులు ఈప్రపంచమును స్వప్నప్రపంచమును జూచినట్లు మిథ్యగాఁ జూచుచుందురు.

శ్లో. విచ్ఛిన్నశరదభ్రాంశవిలయం ప్రవిలీయతే,
సత్తావశేష ఏవాస్తే చతుర్థీం భూమికామితః.

తా. శరత్కాలమేఘమునుండి చెదరిన మేఘశకలము లేప్రకారము క్షీణించి కనుపడకపోవునో యాప్రకారమే యీభేదప్రపంచము క్రమముగా క్షీణించును. నాలుగవభూమికను పొందిన మహానుభావుఁడు కేవలసత్తారూపమయిన బ్రహ్మముగానే నిలిచియుండును.

ఈనాలుగవ భూమికను పొందిన పురుషుఁడు బ్రహ్మవిత్తని చెప్పఁబడును. పంచమ షష్ఠ సప్తమభూమికలు మూఁడు జీవన్ముక్తియొక్క అవాంతరభేదములు. అవి నిర్వికల్పసమాధ్యభ్యాసముచేతనైన చిత్తవిశ్రాంతియొక్క తారతమ్యము నవలంబించి కలుగుచుండును. పంచమభూమికయందు నిర్వికల్పసమాధిలో కొంతకాలము నిలిచినతరువాత స్వయముగానే వ్యుత్థానమును బొందును.

ఈపంచమభూమికయం దుండు యోగి బ్రహ్మవిద్వరుఁడని చెప్పఁబడును. ఆఱవభూమికలోనికి పోయిన యోగి నిర్వికల్ప సమాధిని చేయుచుండి పరప్రయత్నముచేత వ్యుత్థానమును బొందుచుండునుగాని స్వయముగా నెంతకాలమున కైనా వ్యుత్థానమును బొంద నేరఁడు. ఈరెంటిలో అయిదవభూమిక సుషుప్తియని, ఆరవభూమిక గాఢసుషుప్తియని చెప్పఁబడును.

ఈయర్థమును వసిష్ఠమహర్షిచే చెప్పఁబడినది.

శ్లో. పంచమీం భూమికామేత్య సుషుప్తిపదనామికాం,
శాంతాశేషవిశేషాంశ స్తిష్ఠత్యద్వైతమాత్రకే.

తా. సుషుప్తి యని చెప్పఁదగిన అయిదవభూమికను పొంది శమించిన సకలవిశేషములు గలవాఁడై అద్వితీయపర మాత్మస్వరూపమునందే నిలిచియుండును.

శ్లో. అంతర్ముఖతయా నిత్యం బహిర్వృత్తిపరోఽపి సన్,
పరిశ్రాంతతయా నిత్యం నిద్రాళురివ లక్ష్యతే.

తా. అయిదవభూమియందు చేరిన పురుషుఁడు సర్వ కాలములయందు నంతర్ముఖుఁడై యున్నందున చక్షురాదీంద్రియ ములు బాహ్యమునందుఁ బ్రవర్తించుచున్నట్లు కనుపడుచున్నప్ప టికి చిత్తవిశ్రాంతి కలవాఁడగుటచేత నిత్యము నిద్రించువాని వలె చూడఁబడుచుండును.

శ్లో. కుర్వన్నభ్యాస మేతస్యాం భూమికాయాం వివాసనః,
షష్ఠీం గాఢసుషుప్త్యాఖ్యాం క్రమాత్పతతి భూమికాం.

తా. ఈసుషుప్తిభూమికయందు చిరకాల మభ్యాసము చేయుచుండి వాసనల నన్నిటిని విడిచినవాఁడై గాఢసుషుప్తి

యని చెప్పఁబడిన ఆఱవభూమికను క్రమముగా పొందును.

శ్లో. యత్ర నాహన్నచాన్యోఽహం నాహం నాన్యోహంకృతిః,
కేవలం క్షీణమనన ఆస్తే ద్వైతైక్యవర్జితః.

తా. ఆఱవభూమికయందు ప్రవేశించినపురుషుఁడు సద్రూపుఁడని కాని అహంకారవిశిష్టుఁడని కాని అహంకారశూన్యుఁడని కాని చెప్పఁబడఁడు. క్షీణించిన మనస్సుకలవాఁడై ద్వైతాద్వైతములు లేక కేవలముగా నుండును.

శ్లో. అద్వైతం కేచిదిచ్ఛన్తి ద్వైతమిచ్ఛన్తి చాపరే,
సమం బ్రహ్మ న జానన్తి ద్వైతాద్వైతవివర్జితం.

ఈలోకములోని జనులలోఁ గొందఱు ఆఱవభూమికలోఁ జేరినవాని అద్వితీయుఁడని తలఁతురు. మఱికొందఱు సద్వితీయుఁడని తలఁతురు. అద్వితీయత్వసద్వితీయత్వములు రెండును లేనివాఁడై సమముగా నుండు బ్రహ్మమే యని యెఱుఁగరు.

శ్లో. అంతశ్శూన్యో బహిశ్శూన్యః శూన్యకుంభ ఇవాంబరే,
అంతఃపూర్ణో బహిఃపూర్ణః పూర్ణకుంభ ఇవార్ణవే.

తా. ఈయాఱవభూమికయం దున్నపురుషుఁడు అంతరమందుఁ గాని బాహ్యమందుఁ గాని అన్యమేమియును లేనివాఁడై యాకాశమునం దుండు రిక్తఘటమువలె నుండును. ఇదిగాక యాంతరమందును, బాహ్యమందును పూర్ణుఁడై సముద్రములో మునిఁగియున్న పూర్ణకుంభమువలె నుండును.

గాఢముగా నిర్వికల్పసమాధిని చెందిన పురుషుఁడు చిత్తము సంస్కారమాత్రముగా నున్నందున సాంకల్పికపదార్థ

ములను భావించుటకుఁగాని బాహ్యపదార్థములను గ్రహించు టకుఁగాని సామర్థ్యము లేనందున నాకాశమునం దున్నకుంభము వలె వెలుపల లోపల శూన్యుఁడైయుండును స్వయంప్రకాశ సచ్చిదానందైకరసునగు పరబ్రహ్మమునందు మగ్నుఁడైయున్నం దున బాహ్యాభ్యంతరములయం దంతటను పరబ్రహ్మస్వరూ పమునే చూచుచుండును గనుక సముద్రమున మునిఁగియున్న పూర్ణకుంభమువలె లోపల వెలుపల పూర్ణుఁడై యుండును. తురీయమనెడి యేడవభూమికను బొందినయోగికి స్వాతంత్ర్య ముగాఁగాని పరతంత్రముగాఁగాని వ్యుత్థానమె కలుగనేరదు. ఇట్టి యోగిశిరోమణి నుద్దేశించి 'దేహం చ నశ్వర' మను భాగ వతశ్లోకము ప్రవర్తించినది. అసంప్రజ్ఞాతసమాధిని బోధించు యోగశాస్త్రము లన్నియు నీభూమికయందే పర్యవసానము నొందుచున్నవి. ఈయేడవభూమిక యందుఁ జేరినయోగియే పూర్వోదాహృతశ్రుతియందు బ్రహ్మవిద్వరిష్ఠః యని చెప్పఁ బడెను. ఆఱవభూమికయందు జేరిన యోగి 'సాక్ష్యవ్యక్తబోధకృతే' అను శ్లోకము చేతను, ఏడవభూమికయందు చేరిన యోగి "దేహంచనశ్వరం" అనుభాగవతశ్లోకమువలన చెప్పఁబడినందున నీరెండుశ్లోకములకు పరస్పరవిరుద్ధము లేదని తెలియవలయును. ఇంతవరకు చెప్పిన భూమికాసప్తకమును గూర్చి సంగ్రహమును చెప్పెదము. పంచమాదిభూమికాత్రయరూపమైన జీవన్ముక్తి సంపాదింపఁబడిన పక్షమునందు ద్వైతప్రపంచప్రతిభాసము లేనందున సంశయవిపర్యయములు సంభవింపవు గనుక వేదాంత ప్రమాణమువలనఁబుట్టిన తత్త్వజ్ఞానము బాధింపఁబడకరక్షింపఁ

బడును. ఇట్టితత్త్వజ్ఞానరక్షణము జీవన్ముక్తికి మొదటిప్రయోజనము. రెండవ ప్రయోజనము తపస్సు, యోగభూమికలు దేవత్వాదిప్రాప్తికి హేతువు లగుటచేత తపస్సని తెలియవలెను.

యోగభూమికలు దేవత్వాదిప్రాప్తిసాధనము లనునర్థము శ్రీకృష్ణార్జునులయొక్కయు రామ వసిష్ఠులయొక్కయు ప్రశ్న ప్రతివచనముల చేతఁ దెలియఁబడుచున్నది.

అర్జునుఁ డడిగిన ప్రశ్న —

శ్లో. అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః,
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి.

తా. మోక్షమార్గమునందు అల్పప్రయత్నమును జేసిన పురుషుఁడు గురువేదాంతవాక్యములయందు శ్రద్ధయును శమదమాదిగుణములును కలవాఁడై గురుసమీపమునకుఁ బోయి వేదాంతవాక్యశ్రవణమును చేయుచుండి తత్త్వసాక్షాత్కారమును బొందకయే మధ్యకాలమునందు మృతిఁ బొందిన నేమిగతిని బొందును?

శ్లో. కచ్చిన్నోభయవిభ్రష్టః ఛిన్నాభ్రమివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి.

తా. బ్రహ్మాత్మైక్యజ్ఞానము లేనివాఁడై నందున ముక్తిని బొందక కర్మలను ఉపాసనలను విడిచినందున స్వర్గలోక బ్రహ్మలోకములను బొంధక ఉభయభ్రష్టుఁడై చెదరిపోయిన మేఘశకలమువలె నశించిపోఁడుగదా.

అనఁగా స్వర్గప్రాప్తిసాధనములైన యాగదానాది కామ్యకర్మలను బ్రహ్మలోకప్రాప్తి సాధనములైన పంచాగ్ని విద్యాద్యుపాసనలను విడిచి నిష్కామకర్మయోగము ననుష్ఠించి దానివలన నిర్మలమైన చిత్తము కలవాఁడై శమదమాదిగుణములుగలిగి మోక్షమునందిచ్ఛగలవాఁడయి పరమహంససన్న్యాసాశ్రమము నంగీకరించి శ్రోత్రియబ్రహ్మనిష్ఠ గురుసన్నిధియందు వేదాంతశాస్త్రమును యథావిధిగా శ్రవణముచేసి మనన నిదిధ్యాసనముల నాచరించు పురుషుఁడు అద్వితీయబ్రహ్మసాక్షాత్కారము గలుగులోపల కాలగతిచేత మరణము నొందిన పక్షమునకు తత్త్వసాక్షాత్కారము లేనందున వానికి మోక్షము నిశ్చయముగా లేదు. కర్మోపాసనలను విడిచినందున స్వర్గలోక బ్రహ్మలోకములును లేవు. వేదోక్తకర్మలను విడిచినందున నరకము ప్రాప్తించునా! లేక శ్రవణము మొదలగు అనిషిద్ధకర్మల నాచరించుచున్నందునను, సురాపానాదినిషిద్ధకర్మల నాచరించనందునను స్వర్గాదిపుణ్యలోకములే ప్రాప్తించునా యని ప్రశ్నతాత్పర్యము.

ఇందులకు శ్రీకృష్ణమూర్తిచే చెప్పఁబడినయుత్తరము.

శ్లో. పార్థనైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే,
నహి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి.

తా. ఓయర్జునా, బ్రహ్మవిద్యావిచారము చేయు పురుషుఁడు ఈలోకమునందుఁగాని పరలోకమునందుఁగాని చెరుపునుపొందఁడు. పుణ్యకార్యములను జేయువానికి ఈలోకమున నపకీర్తి గాని పరలోకమునందు నరకము గాని కలుగనేరదు

శ్లో. ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే.

తా. బ్రహ్మసాక్షాత్కారము కొఱకు ప్రయత్నము చేయుచు బ్రహ్మసాక్షాత్కారము కలుగకముందే మృతిఁబొందిన పురుషుఁడు మృతికాలమునందు భోగవాంఛలు కలవాఁడై మరణముఁబొందెనా, మరణానంతరము అశ్వమేధాది మహాపుణ్యకార్యములను చేసిన మహానుభావులు పొందు బ్రహ్మలోకాది లోకములను అర్చిరాదిమార్గము వలనఁ బ్రవేశించి యచ్చట సమస్తభోగములను చిరకాల మనుభవించి తరువాత నీలోకమునందు ఆచారవంతులై మహాసామ్రాజ్యముగల క్షత్రియోత్తములరాజకులయందు జన్మించును.

బ్రహ్మజ్ఞ జనకాదులకుఁ గలదు.

శ్లో. అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్.

తా. భోగవాంఛలు లేకయె కేవలముగా మృతిఁబొందెనా, మరణానంతర మత్యల్పకాలమునందే బ్రహ్మతత్త్వాభ్యాససంపత్తిగలబ్రాహ్మణులయొక్క వంశములయందు శ్రీశుక జడభరతాదులవలె జన్మించును. సదాచారసామ్రాజ్యములు గలరాజవంశములయందు జన్మించుట దుర్లభము. బ్రహ్మతత్త్వాభ్యాసపరదరిద్ర బ్రాహ్మణవంశములయందు జన్మించుట యంతకంటె నిండ దుర్లభము.

శ్లో. తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్,
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన.

తా. పూర్వజన్మమందు ప్రథమాది జ్ఞానభూమికలను ఏభూమిక వరకు నభ్యసించియుండెనో, ఆభూమికను ప్రయత్నము లేకయే పొందును. అంతకు పై బడిన భూమికను పొందుటకు ప్రయత్నము చేయును. అనగా సాధనచతుష్టయముతో శ్రవణమననవేదాంతవాక్యశ్రవణమనననిదిధ్యాసనము లనెడి మూడు భూమికలలో నే భూమికవరకు అభ్యసించి స్థితి పొందెనో ఆభూమికను ఉత్తరజన్మమం దప్రయత్నముగా పొంది తదుత్తరభూమికలను సాధించుటకు ప్రయత్నమును చేసి బ్రహ్మసాక్షాత్కారమును కలుగజేసుకొని ముక్తిపొందును.

ఈప్రకారమే వాసిష్ఠరామాయణమునందు శ్రీరామ వసిష్ఠసంవాదములను నిరూపింపఁబడియున్నది.

అచ్చట శ్రీరాములవారు చేసిన ప్రశ్న.

శ్లో. ఏకాంవా ద్వేతృతీయాం వా భూమికా మథవా మునే,
ఆరూఢస్య మృతస్యాథ కీదృశీ భగవన్గతిః.

తా. ఓస్వామీ వసిష్ఠ! యను నాలుగవ జ్ఞాన భూమికను బొందినవానికి విదేహకైవల్యము నిశ్చయముగా గలదు కాని శుభేచ్ఛ యను మొదటి భూమికను గాని విచారణ యను రెండవభూమికను గాని తనుమానస యను మూడవ భూమికను గాని పొంది, అప్పుడే మృతినొందినవానికి ఏమిగతి గలుగును?

ఈప్రశ్నయొక్క తాత్పర్యమును పూర్వము అర్జుని ప్రశ్నతాత్పర్యమును వలె నూహింపవలయును.

ఇందుకు వసిష్ఠమహర్షిచే చెప్పఁబడిన ప్రత్యుత్తరము.

శ్లో. యోగభూమికయోత్క్రాంతజీవితస్య శరీరిణః,
భూమికాంశానుసారేణ క్షీయతే పూర్వదుష్కృతం.

తా. ఓ రామచంద్రా, మొదటి యోగభూమికలు మూటిలో నొకదానియందుండి మృతినొందినవానికి ఆయా భూమికాస్వభావము ననుసరించి పూర్వపాపములు నశించును. అనఁగా మొదటిభూమికలో నుండి మృతినొందినవానికి కొంచెముపాపము రెండవభూమికలో నుండి మృతినొందినవానికి మరి కొంత యెక్కువపాపము మూఁడవభూమికలో నుండి మృతి నొందినవానికి ఇంక నెక్కువపాపమును నశించు నని భావము.

శ్లో. తత స్సురవిమానేషు లోకపాలపురేషు చ,
మేరూపవనకుంజేషు రమతే రమణీసఖః.

తా. దుష్కృతనాశతారతమ్యము ననుసరించి దేవతల విమానములయందు ఇంద్రాదిలోకపాలకులపట్టణములయందు మేరుపర్వతవనోద్యానములయందును రంభాద్యప్సరసలతో క్రీడించును.

శ్లో. తత స్సుకృతసంభారే దుష్కృతే చ పురాకృతే,
భోగక్షయపరిక్షీణే జాయంతే యోగినో భువి.
శుచీనాం శ్రీమతాం గేహే గుప్తే గుణవతాం సతాం.

తా. ఈప్రకారముగా ననేకసంవత్సరములు క్రీడించిన తరువాత పూర్వజన్మకృతపుణ్యమును పాపమును నశించఁగానే తిరిగి భూమిలో సదాచారసంపన్నులయి మహైశ్వర్యము గల క్షత్రియోత్తములవంశములో జన్మించుదురు.

శ్లో. తత్ర ప్రాగభ్యస్తం యోగభూమిత్రయం యతేః,
ప్రాగభ్యసితానాముక్తేః ప్రమాదాదేవ్యతి భూమికాం.

తా॥ ఆజన్మమందు పూర్వజన్మములో నభ్యసించిన భూమికలను అనాయాసముగ లభించి వాటికి పై భూమికలను సాధనాభ్యాసక్రమముచే పొందును.

ఇందు చేత యోగభూమికలు పుణ్యలోకప్రాప్తిసాధనము లని తెలియఁబడుచున్నది.

ఆక్షేపము — ఓ గురూ, యోగభూమికలు మీరు చెప్పిన ప్రకారము బ్రహ్మలోకాదిపుణ్యలోకములను పొందించుటకు సాధనము లని యంగీకరించఁదగియున్నది కాని యీ యోగ భూమికలు తపస్సని చెప్పుటకు మాత్రము ప్రమాణము గానము.

సమాధానము — ఇందుకు ప్రమాణము శ్రుతివాక్యమే యని చెప్పెదము. అట్టి శ్రుతివాక్యమును ఉదాహరించెదము.

తైత్తిరీయశాఖయందు,

శ్రు. తపసా దేవా దేవతా మగ్ర ఆయన్ తపసర్షయస్సువరన్వవిందన్.

తా. పూర్వకల్పమునందు కొందఱు పురుషులు దేవత్వమును పొంద నిచ్ఛగలవారై తపస్సు నాచరించి యీకల్పము యొక్క మొదటను దేవత్వమును బొందిరి. భృగ్వాదిఋషులు తపస్సుచేతనే స్వర్గలోకమును బొందిరని శ్రుత్యర్థము.

తత్త్వజ్ఞానోత్పత్తికి పూర్వమం దున్న మూఁడుభూమికలు తపస్సని చెప్పఁబడుచుండఁగా తత్త్వజ్ఞానోత్తరకాలమం దున్న

తా. ఆతత్త్వజ్ఞుఁడగు యోగియొక్క గృహక్షేత్రాది ద్రవ్యమును పుత్రులు గ్రహింతురు ; అన్నదానాదిపూజలచేత వారిని ఆదరించుసజ్జనులు వారియొక్కపుణ్యమును గ్రహింతురు. అధిక్షేపతిరస్కారపరిహాసాదులవలన యోగుల నవాదరించువారు ఆయోగులయొక్క పాపకృత్యములను గ్రహింతురని యర్థము

తత్త్వజ్ఞుఁడగువాఁడు ఆస్తికుఁడని నాస్తికుఁడని రెండు విధములు. ఆస్తికుఁ డనఁగా పరలోకము కలదని, సర్వేశ్వరుఁడు కలఁడని వేదశాస్త్రములు సత్యము లని జ్ఞానము కలవాఁడు. నాస్తికుఁ డనఁగా పైవియేవియు లేవనువాఁడు. ఇందులో ఆస్తికుఁడు యోగియొక్కసన్మార్గానుష్ఠానమును జూచి తాను కూడ అట్టి సన్మార్గమునందు సంచరించుచుండును.

శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే. అని.

తా. ఈలోకములో ప్రసిద్ధుఁడైన శ్రేష్ఠుఁడైనపురుషుఁడు ఏయేధర్మము నాచరించునో ఆధర్మమునే యప్రసిద్ధులగు జనులు సాధారణముగా నాచరించుచుందురు. ఇదిగాక యా ప్రసిద్ధుఁడు ధర్మము నాచరించునప్పుడు ఎంతశ్రద్ధాభక్తులతోట యెన్ని అంగోపాంగములతో నాచరించునో లోకు లందఱు నదేప్రకారముగ నాచరించుచుందురు.

ఇఁక నాస్తికుఁడు యోగిచేత చూడఁబడి సర్వపాపములు నశించి పవిత్రుఁడగును.

ఈయర్థము పురాణములో చెప్పఁబడియున్నది.

శ్లో. యస్యానుభవపర్యంతా తత్త్వే బుద్ధిః ప్రవర్తతే,
తద్దృష్టిగోచరాస్సర్వే ముచ్యంతే సర్వపాతకైః.

తా. ఏపురుషునియొక్క బుద్ధి పరమార్థతత్త్వమైన పరబ్రహ్మస్వరూపమునందు సాక్షాత్కారపర్యంతము వ్యాపించునో, అట్టి మహాపురుషునియొక్క కటాక్షమునకు గోచరించిన మనుష్యులందఱు సమస్తపాపములచేత విడువఁబడి పరమపవిత్రులై సమస్తపుణ్యములను బొందుదురు.

శ్లో. దర్శనధ్యానసంస్పర్శైర్మత్స్యకూర్మవిహంగమాః,
పోషయంతి స్వకాన్ పుత్రాన్ తద్వత్సాధుసమాగమః.

తా. లోకములో మత్స్యములు, కూర్మములు, పక్షులు తమతమపిల్లలను దర్శనముచేత ధ్యానముచేత స్పర్శచేతను ఏప్రకారముగా పోషించునో ఆప్రకారమే బ్రహ్మతత్త్వజ్ఞానముగల యోగులు కూడ లోకుల ననుగ్రహించి రక్షించెదరు. అనఁగా మత్స్యములు తమపిల్లలను కన్నులతో చూచినమాత్రాన రక్షించును. కూర్మములు పిల్లలను మనస్సులో తలఁచినమాత్రాన రక్షించును. పక్షులు స్పర్శనమును చేసినమాత్రాన పిల్లలను రక్షించును. ఇదేప్రకారము సత్పురుషులైన యోగులు మందాధికారులను దృష్టిచేతను మధ్యమాధికారులను మనస్సులో వీరు కృతార్థులగుదురు గాక యని ధ్యానించుటచేతను ఉత్తమాధికారులను హస్తమస్తకసంయోగరూపమయిన స్పర్శచేత ననుగ్రహించి రక్షించెదరని తాత్పర్యము.

ఈప్రకారముచేత సర్వవిధోపకారిత్వము యోగియందు కల దని అభియుక్తులచేఁ జెప్పఁబడినది.

శ్లో. స్నాతం తేన సమస్తతీర్థసలిలే సర్వాపి దత్తావని
ర్యజ్ఞానాం చ సహస్రమప్యఖిలా దేవాశ్చ సంపూజితాః,
సంసారాచ్చ సముద్ధృతాస్స్వపితరస్త్రైలోక్యపూజ్యోప్యయం
యస్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్.

తా. ఎవనియొక్క చిత్తము బ్రహ్మవిచారమందు నిమిషకాలమైనా స్థిరమై యుండునో అట్టి మహానుభావుఁడు గంగాయమునాదిసమస్తతీర్థములయందు స్నానము చేసినవాఁడే యావద్భూదానంబులను సాత్త్వికులైన బ్రాహ్మణులకు యోగ్యమైన దేశకాలములయందు దానము చేసినవాఁడును ఏకాహయాగములు మొదలు సహస్రవార్షికసత్రములవఱకు నెన్ని యాగములు కలవో వాటినన్నిటిని సమగ్రముగా ననుష్ఠించినవాఁడును హరిహరహిరణ్యగర్భాదిదేవతల నందఱిని సత్కార్యములచేత నారాధింపఁజేసినవాఁడును గయాశ్రాద్ధాదులను చేసి తనపితృదేవతలనందఱిని సంసారమండలములోనుండి లేవనెత్తి బ్రహ్మలోకమును జేర్చినవాఁడును మూఁడులోకములయం దున్న సమస్తజనులచేత పూజింపఁ బడువాఁడును అగును.

శ్లో. కులం పవిత్రం జననీ కృతార్థా విశ్వంభరా పుణ్యవతీ చ తేన,
అపారసంవిత్సుఖసాగరేఽస్మిన్ లీనం పరే బ్రహ్మణి యస్య చేతః.

తా. ఎవనియొక్క చిత్తము అపరిచ్ఛిన్నజ్ఞానానందస్వరూపుఁడయిన పరమాత్మయందు సుస్థిరమై యుండునో, వాని

ఇచ్చట దానమను పదము లేకపోయినా శ్రు. 'అథ యత్తపో దానమార్జవమహింసా సత్యవచనమితి తా అస్య దక్షిణా' యను ఛాందోగ్యశ్రుతి ననుసరించి దానశబ్దమును అధ్యాహారమును చేయవలయును తపస్సు దానము అకౌటిల్యము అహింస సత్యవచనము (యథార్థభాషణము) ఇవి దక్షిణ యని ఛాందోగ్యశ్రుత్యర్థము. వాగింద్రియము హోత యను ఋత్విజుడు. ప్రాణము ఉద్గాతయనుఋత్విజుడు, చక్షురింద్రియము అధ్వర్యుడను ఋత్విజుడు. మనస్సు బ్రహ్మయను ఋత్విజుడు. శ్రోత్రేంద్రియము అగ్నీధ్రుడను ఋత్విజుడు.

ఉక్తానువాకము యొక్క మధ్యభాగములో యోగి యగు తత్త్వజ్ఞానియొక్క వ్యాపారములు జీవితకాలమును జ్యోతిష్టోమాదియాగములుగాను పౌండరీకాద్యసత్రక్రతువుల యొక్క అవయవములుగాను చెప్పబడినవి.

శ్రు. యావద్ధ్రియతే సా దీక్షా యదశ్నాతి తద్ధవి ర్యత్పిబతి తదస్య సోమపానం యద్రమతే తదుపసదో యత్సంచరత్యుపవిశత్యుత్తిష్ఠతే చ స ప్రవర్గ్యో యన్ముఖం తదాహవనీయో యా వ్యాహృతిరాహుతి ర్యదస్య విజ్ఞానం తజ్జుహోతి యత్సాయం ప్రాతరత్తి తత్సమిధం యత్ప్రాత ర్మధ్యందినం సాయంచ తాని సవనాని యే అహోరాత్రే తే దర్శపూర్ణమాసౌ య అర్ధమాసాశ్చ మాసాశ్చ తే చాతుర్మాస్యాని య ఋతవస్తే పశుబంధా యే సంవత్సరాశ్చ పరివత్సరాశ్చ తేఽహర్గణాః సర్వవేదసం వా ఏతత్సత్రం యన్మరణం తదవభృథః. అని.

తా. తత్త్వజ్ఞానియొక్క అవధారణము (నిశ్చయము) ఏదికలదో అదియే దీక్షయని చెప్పబడును. తత్త్వజ్ఞానియొక్క

భోజనము హవిస్సని (హోమద్రవ్యమని), జలపానము సోమపాన మని, క్రీడావ్యాపారములుఉపసత్తులనెడి యిష్టివిశేషములని, సంచారోపవేశోత్థానములు మూడు ప్రవర్గ్యలనెడి యిష్టివిశేషము లని, ముఖము ఆహవనీయమనెడి అగ్నియని, సంభాషణము ఆహుతి యని, విజ్ఞానము హోమ మని, సాయంకాలప్రాతఃకాలములయందు చేయు భక్షణము సమిద్యాగ మని, ప్రాతఃకాలమధ్యాహ్నకాలసాయంకాలములు మూడు మూడు సవనము లని, అహోరాత్రములు దర్శపూర్ణమాసము లని, పక్షములును మాసములును చాతుర్మాస్యయాగములని, వసంతాదిఋతువులును పశుబంధములని, సంవత్సరపరివత్సరములు అహర్గణము లని చెప్పఁబడును. అహోరాత్రములు మొదలు సంవత్సరపరివత్సరములవఱకు చెప్పిన కాలావయవములతోఁగూడిన తత్త్వజ్ఞానియొక్క ఆయుష్కాలమును సర్వస్వమును దక్షిణగా నియ్యఁదగిన సత్రయాగమని చెప్పఁగను. కనుకనే తత్త్వజ్ఞానియొక్క మరణమే యీసత్రయాగమున కవభృథ మని చెప్పఁబడును.

ఉత్తరానువాకముయొక్క చరమభాగములోఁ తత్త్వజ్ఞాని చరిత్రమును సంయమజ్ఞానరూపముగా నుపాసించువానికి సూర్యచంద్రులను కార్యబ్రహ్మలయొక్క తాదాత్మ్య రూపమైన క్రమమోక్షము ఫలించు నని చెప్పఁబడినది.

శ్రు. ఏతద్వై జరామర్యం యదగ్నిహోత్రం సత్రం య ఏవం విద్వానుదగయనే ప్రమీయతే దేవానా మేవ మహిమానం గత్వాదిత్యస్య సాయుజ్యం గచ్ఛతి అథయో దక్షిణే ప్రమీయతే పితౄణామేవ

బడి యుండెనుగదా. ఈజీవన్ముక్తిదశయందు క్రోధరాహిత్యాది ధర్మములు ఏప్రకారము స్మరింపఁబడుచున్నవి?

సమాధానము — వాస్తవము. కనుకనే జీవన్ముక్తునియందు క్రోధాదు లుండునా యని శంకించుటకు గూడ నవకాశము లేదు. జీవన్ముక్తికి చాల ప్రాచీనకాలమం దనుష్ఠింపఁబడిన వివిదిషాసన్న్యాసమునందే క్రోధాదులు ప్రసక్తములు కాక యుండఁగా సర్వోత్తమమైనదగు తత్త్వజ్ఞానదశయందు క్రోధాదు లేప్రకారము సంభవించును? తత్త్వజ్ఞానదశయందే సంభవింపని క్రోధాదులు విద్వత్సన్న్యాసమునందుఁగాని జీవన్ముక్తియందుఁగాని బొత్తుగా ప్రసక్తములు కానేరవు. కనుక వివిదిషాసన్న్యాసమునం దభ్యసింపఁబడి జీవన్ముక్తిదశవరకు ననువర్తించి వచ్చు క్రోధరాహిత్యాదుల నిచ్చట నుదాహరించిన స్మృతివాక్యముచేత ననువదింపఁబడుచున్నవి గాని విధింపఁబడలేదు.

కనుక తత్త్వజ్ఞుఁడగు యోగితో లౌకికపురుషున కెప్పటికిని కలహము సంభవింపనేరదు.

నిందింపఁదగిన విషయము యోగియందు లేనందున నిందారూపమయిన విసంవాదము గూడ లౌకికపురుషునకు యోగియందు సంభవించదు

ఈయర్థము గూడ నొకస్మృతియందుఁ దెలుపఁబడియున్నది.

శ్లో. యన్న సంతం న చాసంతం నాశ్రుతం న బహుశ్రుతం,
న సువృత్తం న దుర్వృత్తం వేద కశ్చిత్స వై యతిః. అని.

తా. ఏపురుషుఁడు మరియొకపురుషుని ఉత్తమజాతి గలవాఁడనిగాని హీనజాతికలవాఁడని గాని మూర్ఖునిగాఁగాని

పండితునిగాఁగాని మంచిమాటలుగలవానిగాఁగాని దురాచారము గలవానిగాఁగాని యెఱుఁగఁడో అట్టిపురుషుఁడే యతియని జీవన్ముక్తుఁడని చెప్పఁబడును.

అనఁగా అన్యులయందు నీచోత్తమాదిభేదబుద్ధి గలిగి వ్యవహరించువానితో కలహించుట కవకాశము గలిగియుండును. సర్వత్ర సమబుద్ధి గలిగి వ్యవహరించు జీవన్ముక్తపురుషునితో కలహించుట కెవనికిని నవకాశము గలుగ దని తాత్పర్యము.

ఇఁకను శాస్త్రజ్ఞుఁడగువాఁడును యోగితో వివాదమును బొందఁడు.

శాస్త్రజ్ఞుఁడు యోగితో శాస్త్రమునందు వివాదమును పొందునా? లేక యోగియొక్క చరిత్రమునందు వివాదమును బొందునా?

శ్రు. తమేవైకం జానథాత్మానమన్యా వాచో విముంచథ,
నానుధ్యాయాద్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్.

అను శ్రుతుల ననుసరించి యోగీశ్వరుఁడు పరశాస్త్రప్రమేయములను దూషింపఁడు గనుక శాస్త్రవేత్తను యోగితో శాస్త్రప్రమేయమునందు వివాదము సంభవింపదు. పరశాస్త్రప్రమేయములను దూషించినఁగదా పరశాస్త్రవేత్తలు కలహింతురు. దృశ్యమానమైన ప్రపంచమున కధిష్ఠానమైన యాపరమాత్మ నొకనినే తెలుసుకొనుఁడి ఇతరమైన వాక్యములను విడువుఁడి బ్రహ్మజ్ఞానోపయుక్తములు గాని వాక్యముల నన్నిటిని విడువవలయును. ఇతరవాక్యముల నుచ్ఛరించుట వాగిం

జ్ఞానము ఇవి మొదలయిన గుణములు స్త్రీజన మంతఃపురము నాశ్రయించినట్లు యోగీశ్వరుని నాశ్రయించును.

శ్లో. పేశలాచారమధురం సర్వే వాంఛంతి తం జనాః,
వేణుం మధురనిర్ఘోషం వనే నవమృగా ఇవ.

తా. సర్వజనప్రియంకరమైన అనుష్ఠానముచేత నొప్పుచున్న మహాత్మజ్ఞుని సకలజనులు కోరుచుందురు. అనఁగా వనమందు మధురముగా ధ్వనిచేయుచున్న వెదురును విడువఁజాలక వనమృగములు దానిచుట్టు ముట్టుకొని యున్నట్లు సకలజనులు తత్త్వజ్ఞానియొక్క సదాచారప్రవృత్తిని జూచి విడువఁజాలక వానిని సర్వకాలసర్వావస్థలయందును ముట్టుకొనియుందురని భావము.

శ్లో. సుషుప్తవత్సర్వవిశేషవర్జితా
స్థితస్సదా జాగ్రతి యస్య చేతః,
కలాన్వితో ఇందురివ సదా బుధైః
స్సంసేవ్యతే ముక్త ఇతీహ కథ్యతే.

తా. ఏపురుషుఁడు జాగ్రదవస్థయందు కూడ సుషుప్తిదశయందు వలె సమస్తవిషయాకారవృత్తులను విడిచి కేవలముగా నున్న చిత్తముతో నుండునో సంపూర్ణకళలు గల చంద్రుఁడేప్రకారము దేవతలచేత సేవింపఁబడునో ఆప్రకారమే పండితులచేత సర్వకాలములయందును నేపురుషుఁడు సేవింపఁబడునో, అట్టి పురుషుఁడు ఈలోకములో ముక్తుఁడని చెప్పఁబడును.

శ్లో. మాలతీవ శనం యోనాది మనుజాదీ న్యమూని చ,
విశ్వానియోజా భూతాని సర్వాణి కథితాని.

తా॥ ఈలోకములో సాధువులు కఠినులు కూడ తమ తల్లియం దేప్రకారము విశ్వాసముగలవారై యుందురో యాప్రకారమే శమము ప్రధానముగాఁగల పురుషునియందు సమస్తభూతములు విశ్వాసమును బొందియుండును.

శ్లో. తపస్విషు బహుజ్ఞేషు యాజకేషు నృపేషు చ,
బలవత్సు మనుష్యేషు శమవానేవ రాజతే.

తా॥ తపస్సును జేయువారియందు సకలశాస్త్రపాండిత్యము గలవారియందు యాగాదిపుణ్యకార్యములు చేసినవారియందు మహారాజులయందు బలవంతులయందు సమస్తసద్గుణములు కలవారియందును శమగుణము గల పురుషుఁడే యధికముగా ప్రకాశించును.

ఈచెప్పిన ప్రకారము జీవన్ముక్తికి విసంవాదాభావమును మూఁడవప్రయోజనము నిర్బాధముగా కనుఁబడుచున్నది.

దుఃఖనాశసుఖావిర్భావముల చతుర్థపంచమ ప్రయోజనములు బ్రహ్మానందగ్రంథములోని విద్యానందమను నాలుగవ యధ్యాయమునందు నిరూపింపఁబడియున్నవి. ఆరెంటిని సంగ్రహముగా నిచట చెప్పెదము.

శ్లో. ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్.

తా॥ ఏపురుషుఁడు సర్వభూతములయొక్క హృదయములయందుండి అనేకాయాసాదో సహసాన్యుఁడైన ఆత్మను నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁడైన పరమాత్మునిగా తెలుసుకొనెనో, ఆ పురుషుఁడు దేప్రయోజనముకొరకు నేఫలమును కోరి శరీర

మూడువిధములు. హిరణ్యగర్భుడు మొదలు స్థావరములవరకుం గల సర్వదేహములయందు ననుగతమైన సాక్షిచైతన్యరూపమయిన యే బ్రహ్మ కలదో అట్టి పరబ్రహ్మము నేనే యని తెలుసుకొనియున్న పురుషుడు స్వదేహమునందు వలె సర్వదేహములయందును సర్వకామములను సాక్షిగా నుండును.

ఈయభిప్రాయముతోనే శ్రు. 'సోఽశ్నుతే సర్వాన్ కామాన్సహ, బ్రహ్మణా విపశ్చితా' అను శ్రుతి ప్రవర్తించినది.

బ్రహ్మాత్మైక్యజ్ఞానము గలపురుషుడు అఖండచిద్ఘనస్వరూపమయిన బ్రహ్మము తానే యయి సకలములయిన కామములను పొందును అని శ్రుత్యర్థము. లోకములలో భోగము లనుభవించుచుండినను వానికి నాభోగములయందు నిచ్ఛయుండదు ఇచ్ఛ లేకుండుటచేత అకామహతత్వము కలశ్రోత్రియుఁ డనఁబడును. సర్వభోగములయందు దివ్యభోగములను జూచుచున్న తత్త్వజ్ఞానికి సర్వభోగములయం దిచ్ఛ కలుగనందున సర్వత్ర అకామహతత్వము కలిగియుండును. కనుకనే సార్వభౌమమహారాజును ఆరంభించి హిరణ్యగర్భునివరకు నుత్తరోత్తర శతగుణాధిక్యముతోఁ జెప్పఁబడినయానందములయందు 'శ్రోత్రియస్య చాకామహతస్య' అని వినఁబడుచున్నది. సర్వభోగములయందు నిచ్ఛలేని శ్రోత్రియుఁడైన విరక్తునికి నీయానందము కలదని శ్రుత్యర్థము.

సద్రూపముచేతను చిద్రూపముచేతను ఆనందరూపముచేతను సర్వపదార్థములయందు ననుగతమయియున్న స్వస్వరూ

పము ననుసంధించువానికి సర్వభోక్తృత్వము కలదని తైత్తిరీయోపనిషత్తులో వినఁబడుచున్నది.

శ్రు. అహమన్న మహమన్నమహమన్నం. అహమన్నాదో౽హమన్నాదో౽హమన్నాదః. అని.

తా. బ్రహ్మాత్మైకత్వజ్ఞానము గలిగి ముక్తిఁ బొందినపురుషుఁడు తనకు సర్వాత్మత్వమును భావించి సర్వమయునితో అద్వితీయమయి, నిరంజనమయిన ఆత్మను నేనే అయినప్పుడు, ఈలోకమునందుఁ గల అన్నమును (భోగ్యమును), అన్నాదుఁడను (భోక్తను) నేనే యని అనుసంధించుచుండును అని శ్రుత్యర్థము.

కృతకృత్యత్వము స్మృతియందు స్మరింపఁబడినది.

శ్లో. జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః,
నైవాస్తి కించిత్కర్తవ్య మస్తి చేన్న స తత్త్వవిత్.

తా. పరబ్రహ్మాత్మైకత్వజ్ఞానముచేత తృప్తి నొంది కృతకృత్యుఁడయిన యోగికి కర్తవ్యమయిన విషయము ఏమియు నుండదు. ఉండెనో, అతఁడు తత్త్వవేత్తయే కాఁడు.

శ్లో. యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః,
ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే.

తా. ఏపురుషుఁడు ఆత్మస్వరూపమునందే రతిగలవాఁడై యుండునో, ఉద్యానాదులయందు రతిగలవాఁడై యుండఁడో, ఆత్మచేతనే తృప్తినొందునో, అన్నపానాదులచేత తృప్తి నొందఁడో, ఆత్మయందే సంతోషమునొందుచుండునో, పుత్త్ర ధనాదిప్రాప్తిచే సంతోషము నొందఁడో, అట్టి తత్త్వజ్ఞాని యయిన పురుషునకు కర్తవ్యము కొంచెమయినా కలిగియుండదు.

శ్రు, 'అభయం వై జనక ప్రాప్తోఽసి' 'తస్మాత్తత్సర్వమభవత్' 'బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి.'

అనుశ్రుతులచేత ప్రాప్తప్రాప్యత చెప్పఁబడి యున్నది. ప్రాప్తప్రాప్యత యనఁగా పొందఁదగిన యర్థములన్నియు పొందఁబడియుండుట. ఓ జనకమహారాజా, నీవు సర్వపురుషార్థశ్రేష్ఠమైన అభయమును మోక్షమును పొందితివి. ఇఁకను నీవు పొందవలసిన విషయము మరియొకటి లేదు కనుకనే సర్వాత్మక బ్రహ్మస్వరూపుఁడ వాయెను. ఏపురుషుఁడు సత్యజ్ఞానానందాద్వితీయ పరమాత్మను నేనే యని ప్రత్యక్షముగా తెలియునో ఆపురుషుఁడు బ్రహ్మయే యగు నని మూఁడు శ్రుతుల కర్థము.

ఆక్షేపము—ఓయీ, యీ చెప్పఁబడిన దుఃఖనాశ సుఖప్రాదుర్భావములు కేవలము తత్త్వజ్ఞానముచే సిద్ధించుచుండఁగా జీవన్ముక్తియొక్క ప్రయోజనము లని చెప్పుట న్యాయము కాదు.

సమాధానము— సురక్షితము లైన దుఃఖనాశసుఖప్రాదుర్భావములు జీవన్ముక్తికి ప్రయోజనము లని మాయభిప్రాయమై యున్నది. అనఁగా తత్త్వజ్ఞానము పూర్వమే పుట్టియున్నప్పటికి జీవన్ముక్తిచేత నేప్రకారముగా రక్షింపఁబడునో ఆప్రకారమే దుఃఖవినాశసుఖప్రాదుర్భావమును కూడ తత్త్వజ్ఞానముచే సిద్ధించినప్పటికి జీవన్ముక్తిచేత రక్షింపఁబడును. ఇట్లు రక్షితములైన దుఃఖవినాశ సుఖప్రాదుర్భావములు జీవన్ముక్తికి ప్రయోజనములని చెప్పుట న్యాయవిరుద్ధము కాదని తాత్పర్యము.

ఆక్షేపణము—ఓయీ, యీప్రకారము జీవన్ముక్తి అయిదుప్రయోజనములు కలిగినదై యుండఁగా సమాహితచిత్తుఁడైన యోగీశ్వరుఁడు లోకవ్యవహారమునందుఁ బ్రవర్తించుచున్న తత్త్వజ్ఞానికంటె నుత్తముఁడని చెప్పవలసియుండును. అలాగున చెప్పుటము యుక్తము కాదని రామవసిష్ఠసంవాదవాక్యముల చేత కనుబడుచున్నది.

రాములవారిచేఁ జేయఁబడిన ప్రశ్న.—

శ్లో. భగవన్ భూతభవ్యేశ కశ్చిత్సంవ్యవహారవాన్,
ప్రబుద్ధో బుద్ధవిశ్రాంతో విశ్రాంతో విగతజ్వరః.
కశ్చిదేకాంతమాశ్రిత్య సమాధినియమే స్థితః,
తయోస్తు కతరః శ్రేయా నితి మే భగవన్ వద.

తా. భూతభవిష్యత్కాలముల నియమించు స్వభావముగల ఓస్వామీ! యీలోకములో నొకపురుషుఁడు తత్త్వజ్ఞానముగలవాఁడయి లోకవ్యవహారముల నాచరించుచు విశ్రాంతి కలవాఁడయి యుండును. మఱియొకఁడు ఏకాంతమునం దుండి సమాధి నాచరించుచుండును. వీరిద్దరిలో నెవ్వఁడు శ్రేష్ఠుఁడుగానుండును. ఈయర్థమును నాకు వివరముగాఁ జెప్పవలయును.

ఇందుకు వసిష్ఠమహాముని చెప్పిన ఉత్తరము.—

శ్లో. ఇమం గుణసమాహార మనాత్మత్వేన పశ్యతః,
అంతశ్శీతలతా యాఽసౌ సమాధిరభిధీయతే.

తా. ఈదృశ్యమానమయిన దేహేంద్రియమనఃప్రాణాదిప్రపంచమును ఆత్మ కాదని తెలుసుకొనియుండు పురుష

టీ. యోగియైన తత్త్వజ్ఞానముగల జీవన్ముక్తునికి మూర్ఖులతో సమానముగాని విశేష మింక యొకటియే కలదు. అది యేది యనఁగా బ్రహ్మలోకాంతైశ్వర్యములయందు అభిలాష లేనందున రాగము లేక నిర్మలమైన మనస్సు కలిగి యుండుట.

శ్లో. వితాపదేవ ఖలు రంగమలింగమార్తే
స్పుంశాంతసంసృతిచరిత్రమనస్వ్యవస్థా,
తజ్జ్ఞస్య యస్య మనసో మదమోహమానా
లోభాభిమానముఖరాం విపులాశయస్య.

టీ. ఎవని తత్త్వజ్ఞానవిశేషముచే చిరకాలానువృత్తమైన సంసారభ్రాంతి శమించినందున యోగముఖ్యుఁడైన జీవన్ముక్తునికి కామక్రోధమదమానమోహలోభాదిదోషము లన్నియు ప్రతిదినము క్షీణించిపోవుట గలుగును.

ఇట్టి యతిరాజమునకు మీఁద వెనుక చెప్పిన రెండు దోషములు లేని మహాపురుషునియొక్క మార్గమును స్థితియును నారదమహామునిచే నడుగఁబడెను.

పరమభాగవతోత్తమునకు మార్గ మని చిత్తశాంతి యూరమనోధర్మము స్థితి యని చెప్పఁబడెను.

ఈప్రకారముగా నారదమహామునిచేఁ జేయఁబడిన ప్రశ్నమునకు భగవంతుఁడైన చతుర్ముఖబ్రహ్మ ప్రత్యుత్తరమును చెప్పుచున్నాఁడు. అందులో ముందుగా తాను చెప్పఁబోవు మార్గమునందు శ్రద్ధాతిశయమును పుట్టించుటకుఁగాను మార్గమును స్తుతించుచున్నాఁడు.

శ్రు. తం భగవానాహ సోఽయం పరమహంసానాం ముఖ్యమార్గః. లోకే దుర్లభతరో న తు బాహుళ్యం.

తా. నారదునిఁగూర్చి చతుర్ముఖుఁడు చెప్పుచున్నాఁడు. ఈముందు చెప్పఁబోవునది పరమహంసలయొక్క ముఖ్య మార్గము.

ఇది లోకములో నింపు దుర్లభము. ప్రచురముగా లేదు.

శ్రుతిలో 'సః' అనుశబ్దముచేత నేమార్గము అడుగఁబడెనో, అది పరామర్శింపఁబడినది. 'అయం' అను శబ్దముచేతను ముందు గ్రంథములో చెప్పఁబడు దండాచ్ఛాదనాదిరూపమయి స్వశరీరభోగములచేతను లోకవ్యాపారముచేతను నిరపేక్షమయిన ముఖ్యమార్గము పరామృష్టమగుచున్నది. పరమకాష్ఠను బొందిన ముముక్షువైరాగ్యము లోకములో నెచ్చటను కనుపడనందున నీమార్గము దుర్లభ మని చెప్పఁబడినది. లోకములో నెచ్చటను కనుపడకపోయినమాత్రమున నీమార్గము అత్యంతాభావ మని శంకింపఁదగ దను నభిప్రాయముతో న తు బాహుళ్య మనుశబ్దముచేత నీమార్గము ప్రచురముగా లేదని చెప్పినది.

ఓయీ! యీమార్గము దుర్లభమయినపక్షమునకు దాని వలన ప్రయోజనము లేనందున దానినిమిత్తమయి ఆయాసము చేయఁదగదు అని శంకించుకొని చెప్పుచున్నారు.

శ్రు. యద్యేవం భవతి న ఏవ నిత్యపూతస్థః, న ఏవ వేదపురుష ఇతి విదుషో మన్యంతే.

పరమహంసయే 'స ఏవ' అను శబ్దముచేత చెప్పఁబడుచున్నాఁడు. ఇతఁడే వేదపురుషుఁడు వేదమునందు ప్రతిపాదింపఁబడిన పురుషుఁడని అర్థము. శ్రు. 'బ్రహ్మవి దాప్నోతి పరం' ఇతి మొదలయినశ్రుతులు బ్రహ్మ యని చెప్పిన యిట్టి యోగియైన పరమహంసయే యని తాత్పర్యము.

బ్రహ్మానుభవవిత్తత్త్వాంశములను ప్రతిపాదించినశాస్త్రములను చక్కఁగా తెలిసినవారు విద్వాంసు లని చెప్పఁబడుదురు. అట్టి విద్వాంసులు యోగియైన పరమహంసను బ్రహ్మ యనే చెప్పుదురు. ఇతరజనులు మాత్రము బ్రహ్మనిష్ఠుఁడని చెప్పుదురని పరమతాత్పర్యము.

విద్వాంసులు యోగియైన పరమహంసను బ్రహ్మగానే తలఁచుదురనెడి యర్థము స్మృతివచనముచేత కూడ చెప్పఁబడుచున్నది.

శ్లో. జ్ఞానాజ్ఞానే పరిత్యజ్య స్వయం కేవలరూపతః,
యస్తిష్ఠతి స తు బ్రహ్మా బ్రహ్మా న బ్రహ్మవిత్స్వయం.

తా. ఏపురుషుఁడు జ్ఞానాజ్ఞానములను రెంటిని విడిచి కేవలస్వరూపముతోఁ బ్రకాశించుచుండునో ఆపురుషుఁడు సాక్షాత్పరబ్రహ్మమే కాని బ్రహ్మవేత్త యని చెప్పఁదగఁడని యర్థము

కనుక యోగికి పరమహంసత్వము దుర్లభమయినందున ప్రయోజనము లేదని శంకింపఁదగదు.

శ్రు. సంశ్రుతిషు యచ్ఛక్తిం తస్యస్వదా మయ్యేవావతిష్ఠతే. తస్మాదహం
చ తస్మిన్నావస్థితా తే.

సమాధానము—విద్వత్సన్యాసము ప్రతిపత్తికర్మవలె లౌకికవైదికరూపములు రెండును కలిగియున్నందున దురనుష్ఠేయము కాదు. అది యెట్లనఁగా వివరించెదను.

జ్యోతిష్టోమయాగమునందు దీక్షను బొందిన యజమానునకు దీక్షాంగములైన నియమములను అనుష్ఠించు కాలమునందు కండూయనార్థము హస్తము నిషేధింపఁబడి కృష్ణమృగవిషాణము (లేడికొమ్ము) విధింపఁబడినది. దీక్ష సమాప్తి నొందినతరువాత కృష్ణమృగవిషాణముతోఁ బ్రయోజనము లేనందున నాకృష్ణమృగవిషాణముయొక్క పరిత్యాగము స్వయముగానే యేర్పడినది. ఇట్టి స్వతస్సిద్ధమైన త్యాగమును, శ్రు. *'నీతాసు దక్షిణాసు చాత్వాలే కృష్ణవిషాణం ప్రాస్యతి' అనుశ్రుతి విధించుచున్నది. చాత్వాలమునందు కృష్ణమృగవిషాణత్యాగమనెడి యీకర్మ ప్రతిపత్తికర్మ యనఁబడును. ఇది వేదవిహితమైనందున వైదికముగాను స్వతఃప్రాప్తమైనందున లౌకికముగాను నుండుచున్నది. ఈప్రకారమే విద్వత్సన్యాసముకూడ శాస్త్రవిహితమైనందున శాస్త్రీయమని స్వతః ప్రాప్తమైనందున లౌకికమని చెప్పఁబడి యుభయరూపముగా నున్నది గనుక ప్రతిపత్తి సులభముగా ననుష్ఠింపఁ దగియున్నది.

* యజమానునిచేఁ జెప్పఁబడిన దక్షిణలను ఋత్విక్కులు గ్రహించిన పిమ్మట యజమానుఁడు తన చేత నున్న కృష్ణమృగశృంగమును చాత్వాలమునందుఁ బడవేయవలెనని శ్రుత్యర్థము. చాత్వాల మనఁగా యజ్ఞ సమీపమున త్రవ్వఁబడిన గోయి.

ఇదిగాక చిదాత్మయం దవిద్యచే నారోపింపఁబడిన కర్తృత్వము విద్యచేత నివర్తింపఁబడినప్పటికిని చిదాభాససహితమయి యనేకసహస్రవికారములతో నిప్పటికిని కూడియున్న అంతఃకరణోపాధియందు ప్రతిష్ఠితమయియున్న కర్తృత్వము అంతఃకరణము ఉండునందాఁక నుండు సంభావనము గలది గనుక తత్త్వవేత్తలయందు కర్తృత్వము మాత్రము నివర్తించు నని శంకింపఁదగదు.

ఆక్షేపము.—ఓయీ యీప్రకారము తత్త్వవేత్తకు కర్తృత్వము కొంచెముగా నుండు నని చెప్పితే 'జ్ఞానామృతేన తృప్తస్య' అను స్మృతివచనము విరోధించును. ఆవచనమందు తత్త్వవేత్తకు కర్తృత్వాంశము కొంచెమైనను లేదని కదా చెప్పియున్నది.

సమాధానము—ప్రకృతవిద్వత్సన్న్యాసాధికారికి తత్త్వజ్ఞానము కలిగియున్నప్పటికిని చిత్తవిశ్రాంతి లేకపోవుటచేత తృప్తియుండదు గనుక చిత్తవిశ్రాంతిపొందవలయునను కర్తవ్యాంశముకలిగి యున్నందున కృతకృత్యత్వము సంపూర్ణముగా లేదు గనుకనే విద్వత్సన్న్యాసాధికారికి కర్తవ్యము కొంచెముగాఁ గలదని చెప్పినది. 'జ్ఞానామృతేన తృప్తస్య' అనుస్మృతివచనము పంచమషష్ఠసప్తమభూమికలయందున్న తత్త్వవేత్తల నుద్దేశించి ప్రవర్తించినది గాని విద్వత్సన్న్యాసాధికారిగానుండు చతుర్థభూమికానిష్ఠునివిషయమయి ప్రవర్తించినది కాదు గనుక విరోధము లేదు.

ఆక్షేపము.—ఓయీ! తత్త్వవేత్తకు కూడ విధిబద్ధత కలదని చెప్పితే విధిజన్యమయిన అపూర్వమువలన జన్మాంతరము కూడ సంభవించును. అనఁగా శ్రు. 'అహరహస్సంధ్యాముపాసీత' యావజ్జీవ మగ్నిహోత్రం 'జుహోతి' ఇత్యాది విధివాక్యముల ననుసరించి చేయఁబడు సంధ్యావందనాగ్నిహోత్రాది కర్మలవలన సంభవించు పుణ్యమువలన జన్మాంతరము కలుగునని భావము.

సమాధానము.—విధిననుసరించి తత్త్వవేత్తలచేత చేయఁబడు నిత్యనైమిత్తికకర్మలవలన నపూర్వము పుట్టును గాని ఆ యపూర్వమునకు జన్మాంతరము ఫలము కానేరదు. చిత్తవిశ్రాంతికి ప్రతిబంధకము లైన పాపములను నివారించుటయే ఫలము. కర్మకుఁ గాని కర్మజన్యాపూర్వమునకుఁ గాని ప్రత్యక్షఫలము సిద్ధించుచుండఁగా అప్రత్యక్షఫలమును కల్పింపఁదగదని న్యాయవేత్తలు చెప్పుచున్నారుగనుకనే 'వ్రీహీనవహన్యాత్' అను వాక్యమునందు అవహననమును(దంచుటయును) కర్మకు ప్రత్యక్షమయిన తండుల సంపాదనమే (బియ్యమును జేయుటయే) ఫలము గాని అగ్నిహోత్రాది కర్మలకు వలె అప్రత్యక్షమయిన స్వర్గాదులు ఫలము కాదని చెప్పియున్నది. 'అగ్నిహోత్రాదితు తత్కార్యాయైవ తద్దర్శనాత్' అను సూత్రమందీయర్థము విస్పష్టముగా చెప్పఁబడియున్నది. తత్త్వవేత్తవలన ననుష్ఠించఁబడు అగ్నిహోత్రాది కర్మలు తత్త్వజ్ఞానము ఏ ఫలమును కలుగఁ జేయునో ఆ ఫలమునే కలుగఁజేయును గాని జన్మాంతరప్రాప్తి మొదలైన ఫలాంతరములను కలుగఁ జేయవని సూత్రార్థము. కనుక శ్రవణాదివిధి

జన్యమైన యపూర్వము జ్ఞానోత్పత్తిప్రతిబంధకములయిన పాపములను నివారించి యేప్రకారము తత్త్వజ్ఞానమును గలుగఁజేయునో, జన్మాంతరమును గలుగఁజేయదో, యాప్రకారమే శిఖాయజ్ఞోపవీతత్యాగాదివిధిజన్యమైన యపూర్వముకూడ చిత్తవిశ్రాంతిప్రతిబంధములను నివారించి చిత్తవిశ్రాంతిని కలుగఁజేయును గాని జన్మాంతరమును గలుగఁజేయదు.

కనుక విధిని సంకోచింపజేయుటకు దోషము లేనందున తత్త్వజ్ఞానేచ్ఛగలవ సన్యసించుగృహస్థునివలె తత్త్వజ్ఞానము గలిగి సన్యసించు గృహస్థుఁడును నాందీముఖశ్రాద్ధము ఉపవాసము జాగరణము మొదలయిన విధుల ననుసరించియే సన్యసింపవలయును.

విచారింపఁగా విద్వత్సన్యాసమును విధించిన శాస్త్రమునందు నాందీముఖశ్రాద్ధాది ధర్మములను విధించి యుండలేదు. అయినా, యీవిద్వత్సన్యాసము వివిదిషాసన్యాసముయొక్క వికృతి అయినందున వివిదిషాసన్యాసములోఁ జెప్పిన యావద్ధర్మములు విద్వత్సన్యాసమునందు "ప్రకృతివద్వికృతిఃకర్తవ్యా" అనున్యాయప్రకారము అతిదేశముచేత సంభవించును.

శ్రౌతకర్మలలో సర్వాంగములను ప్రతిపాదించి విధించిన కర్మలు ప్రకృతులని, కొన్ని అంగములనుమాత్రము ప్రతిపాదించి విధించిన కర్మలు వికృతు లని చెప్పఁబడును. అందులో నేకర్మ యేకర్మయొక్క వికృతిగా నుండునో ఆ ప్రకృతికర్మయొక్క ధర్మము లన్నియు వికృతికర్మలో ననుష్ఠేయములుగా ప్రాప్తించును.

ఇందువుదృష్టాంతము.—దర్శపూర్ణమాసములలోని ఆగ్నేయయాగము ప్రకృతికర్మ. దీనియందు యాజమానాంగములు విధింపఁబడియున్నవి. శ్రు. *'సౌర్యం చరుం నిర్వపేద్బ్రహ్మవర్చసకామః' అను శ్రుతిచేత విధింపఁబడిన సౌర్యయాగము వికృతికర్మ. దీనియందు యాజమానాంగములు విధింపఁబడియుండలేదు. ద్రవ్యదేవతాఫలములు మాత్రము విధింపఁబడియున్నవి. ఇచ్చట †సౌర్యయాగము ఆగ్నేయయాగమునకువలె నాచరింపఁ దగియున్నది. ఈయర్థము సూ. 'అవిధేర్యజతేః పూర్వవత్త్వం' అను జైమినిసూత్రముచేఁ జెప్పఁబడియున్నది.

కనుక వివిదిషాసన్న్యాసమునందువలె విద్వత్సన్న్యాసమునందు గూడ ప్రైషోచ్చారణపూర్వకముగా పుత్రమిత్రాదిత్యాగమును సంకల్పించవలయును. శ్రుతియందుఁగల బంధ్వాదిశబ్దములోని ఆదిశబ్దముచేత భృత్యులు పశువులు క్షేత్రములు గృహములు మొదలైన లౌకికవిషయములు చెప్పఁబడుచున్నవి. 'స్వాధ్యాయం చ' అను పదమందుఁగల చకారముచేత వేదార్థముల నిర్ణయించుటకు ఉపయుక్తములైన తర్క-వ్యాకరణ మీమాంసాశాస్త్రములు వేదోపబృంహణములగు నితి

*బ్రహ్మవర్చసమును గోరిన పురుషుఁడు సూర్యదేవత నుద్దేశించి చరుద్రవ్యముచేత యాగమును చేయవలయు నని శ్రుత్యర్థము.

†సౌర్యయాగమునకు ప్రత్యేకముగా ననుష్ఠానక్రమమును బోధించనందున ప్రకృతికర్మమగు ఆగ్నేయయాగముయొక్క అనుష్ఠానక్రమమునే యంగీకరించవలయు నని సూత్రార్థము.

హాసపురాణములును చెప్పబడుచున్నవి. లౌకికములైన పశుశాస్త్రాదులను వేదాధ్యయనమును తర్క-వ్యాకరణమీమాంసా పురాణేతిహాసములను విడువవలయు నని తాత్పర్యము.

జ్యోతిష్యాదివిద్యాస్థానములుగా నున్న కావ్యనాటకాదుల యొక్క త్యాగము కైముతికన్యాయసిద్ధము. అనఁగా శాస్త్రవిహితములైన వేదవ్యాకరణాభ్యాసాదులనే త్యజింపవలసియుండఁగా* 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అని నిషేధింపఁబడిన కావ్య నాటకాదిపాఠమును త్యజింపవలయు నని చెప్పవలసినదే లేదని భావము.

'సర్వకర్మాణి' అను పదముచేఁగల సర్వశబ్దముచేత లౌకిక వైదికనిత్యనైమిత్తిక కామ్యనిషిద్ధకర్మలన్నియును సంగ్రహింపఁ బడుచున్నవి. పుత్రత్యాగముచేత నైహికభోగవాంఛయు, సర్వకర్మత్యాగముచేత ఆముష్మికభోగవాంఛయును పరిహరింపఁబడినవి. ఈ రెండు వాంఛలు చిత్తమునకు విక్షేపమును కలుగఁ జేయును కనుక త్యాజ్యములుగానే యున్నవి. ఈ బ్రహ్మాండమును త్యజింపవలయునని చెప్పుటచేత బ్రహ్మాండాధికారప్రాపకమైన విరాడుపాసనమును విడువవలయు నని చెప్పఁబడినది. 'బ్రహ్మాండం చ' యను చకారముచేత సూత్రాత్మప్రాప్తికారణమైన హిరణ్యగర్భోపాసనము తత్త్వజ్ఞానసాధనములైన శ్రవణాదులనుగూడ విడువవలయునని చెప్పఁబడిన ఐహికాముష్మికముల నన్నిటిని విడిచి కౌపీనమును దండమును కాషాయమును

*ఉద్యానశృంగారప్రతిపాదకములైన కావ్యములను పఠింపఁగూడదని స్మృతియొక్క తాత్పర్యము.

గ్రహింపవలయును. 'ఆచ్ఛాదనంచ' అనుపదమునందున్న చకారము పాదుకలు మొదలయిన మఱికొన్నింటిని గ్రహింపవచ్చునని తెలియఁజేయుచున్నది.

శ్లో. కౌపీనయుగళం వాసః కంథాం శీతనివారిణీం,
పాదుకే చాపి గృహ్ణీయాత్కుర్యాన్నాన్యస్య సంగ్రహం.

అను స్మృతి యీయర్థమును వివరించుచున్నది.

తా. రెండు కౌపీనములను ఒక కాషాయవస్త్రమును చలినివారించు నొకబొంతను పాదుకలను గ్రహింపవలయును. ఇంతకంటె నితరమైనవాటిని గ్రహింపఁగూడదని స్మృతియొక్క యర్థము.

కౌపీనాదుల గ్రహించుటయును స్వశరీరోపభోగపరోపకారములకొఱకే కాని ఆత్మజ్ఞానోపకారముకొఱకుఁగాదు. కౌపీనముచేత లజ్జను, దండముచేత సర్పాద్యుపద్రవమును ఆచ్ఛాదనముచేత చలిని, ఎండను, పాదుకలచేత నుచ్ఛిష్టదేశస్పర్శమును నివారించుకొనుటయే స్వశరీరోపభోగమని దండకాషాయాదిచిహ్నములను జూచి తనయొక్క ఉత్తమాశ్రమమును నిశ్చయించుకొని తనకు నమస్కారభిక్షాప్రదానాదిసత్కారములను చేసి లోకులు సుకృతమును బొందుటయె పరోపకారమనియుఁ దెలియవలయును. ఇదిగాక, అనాదిశిష్టాచారప్రాప్తమయిన సన్న్యాసాశ్రమమర్యాదను పరిపాలించుటయు పరోపకారమని తెలియవలయును.

ఈవిద్వత్సన్న్యాసికి కౌపీనాదిపరిగ్రహము అనుకల్పమే కాని ముఖ్యము కాదని శ్రు. 'తచ్చ న ముఖ్యోఽపి' అని నిషేధించుచున్నది.

తా. కౌపీనదండాదులను పరిగ్రహింపవలయునని వెనుక చెప్పినది యీపరమహంససన్న్యాసికి ముఖ్యము కాదు. అముఖ్యమే యని భావము.

వివిదిషాసన్న్యాసికి మాత్రము దండకాషాయాదిగ్రహణము ముఖ్యము. కనుకనే వివిదిషాసన్న్యాసికి దండాదివియోగ మెప్పటికిని తగ దని నిషేధింపఁబడియున్నది.

శ్లో. దండాత్మనోస్తు సంయోగస్సర్వదైవ విధీయతే,
న దండేన వినా గచ్ఛేదిషుక్షేపత్రయం బుధః. ఇతి.

తా. దండమునకును తనకును సంయోగము సన్న్యాసికి సర్వకాలములయందు కలిగియుండవలయును. దండమును విడిచి మూడు బాణములు పోవుదూరమైనా నడువఁగూడదు.

'దండత్యాగే శతం చరేత్' అని దండము విడిచితే నూఱుప్రాణాయామములను ఆచరించి ప్రాయశ్చిత్తమును చేసుకొనవలయునని కూడ చెప్పియున్నది. యోగియైనపరమహంస యొక్క ముఖ్యకల్పమును ప్రశ్నోత్తరములచేత శ్రుతి చూపుచున్నది.

శ్రు. కోఽయం ముక్త ఇతి చేదయం ముక్తో న దండం న శిఖాం న యజ్ఞోపవీతం నాచ్ఛాదనం చరతి పరమహంసః. ఇతి.

తా. యోగియైన పరమహంససన్న్యాసికి ముఖ్యకల్ప మేది యనఁగా దండమునుగాని శిఖను గాని యజ్ఞోపవీత

మును గాని ఆచ్ఛాదనము గాని ధరించకయుండుటయే ముఖ్యకల్పమని తెలియవలయును అని యర్థము.

వివిదిషాసన్యాసికి శిఖాయజ్ఞోపవీతములను విడిచియుండుటె యే ప్రకారము ముఖ్యమని చెప్పబడునో, ఆప్రకారమే యోగియుక్తపరమహంససన్యాసికి దండాచ్ఛాదనములను విడిచియుండుటే ముఖ్యమని చెప్పబడును. తత్త్వజ్ఞానియగు వాడు చిత్తవిక్షేపమును నివారించుకొనుటకుగదా పరమహంసాశ్రమము నంగీకరించినది. అట్టి పరమహంసాశ్రమములో దండాచ్ఛాదనములను గ్రహించవలసియుండినా, దండమును వెదురు కఱ్ఱగా నుండవలయును అని ఆచ్ఛాదనము కంథగాను నుండవలయును అని [illegible] చేయుటయందు వీనిని సంపాదించుటయందు రక్షించుటయందును చిత్తము విక్షేపమును పొందును గనుక నిది యుక్తము కాదు. 'న హి వ్యాఘాతాయ కస్యచిద్వ్యాపారః' అని గదా లోకన్యాయము.

ఆచ్ఛాదనాదులు లేకపోతే, శీతవాతాదినివారణ మేలాగున కలుగునంటె చెప్పబడుచున్నది.

శ్రు. న శీతం న చోష్ణం న దుఃఖం న సుఖం న మానావమానే చ షడూర్మివర్జం. ఇతి.

తా. ఏప్రకారము ఆటలయందాసక్తి కలిగియుండు బాలకులకు ఆచ్ఛాదనము లేకపోయినా, హేమంతశిశిరర్తువుల యొక్క ప్రాతఃకాలములయందుకూడ చలియుండదో, ఆప్రకారమే పరమాత్మయందాసక్తులై నిరోధింపఁబడిన సమస్తచిత్తవృత్తులుగల యోగికి శీతోష్ణాదివిషయములు గోచరింపనందున

శీతోష్ణసుఖదుఃఖ మానావమానములు గలుగనేరవు. ఊర్మిషట్కమును కలుగనేరదు.

క్షుత్తు (ఆఁకలి), పిపాస (దాహము), శోకము, మోహము, జర (ముదిమి), మరణము అనియాఱు ఊర్మిషట్కమనఁబడును. ఈయాఱింటిలో క్షుత్పిపాసలు ప్రాణధర్మములు. శోకమోహములు మనోధర్మములు. జరామృత్యువులు దేహధర్మములుగనుక పరిశుద్ధాత్మస్వరూపనిష్ఠుఁడగు పరమహంససన్యాసికి ఈమూఁడు ద్వంద్వములు కలుగ నేరవని నిశ్చయము

సమాధియందు శీతోష్ణ మానావమానములు లేకపోయినా, వ్యుత్థానదశయందు వివేకము లేనివానివలె నీపరమహంసను కూడ నిందాక్షేపము బాధించు నని శంకింపఁగా శ్రుతి పరిహరించుచున్నది.

శ్రు. నిందాగర్వమత్సరదంభదర్పేచ్ఛాద్వేషసుఖదుఃఖకామక్రోధలోభ
మోహహర్షాసూయాహంకారాదీంశ్చ హిత్వా.

తా. విరోధులయిన పురుషులు తనయందు దోషముల నారోపించి చెప్పుట నింద. అన్యులకంటె తాను అధికుఁడని తలఁచుట గర్వము, విద్యాధనాదులచే నధికులైన వారిని జూచి తానుకూడ విద్యాధనాదులచేత వారితో సమానముగా నుండవలెననుబుద్ధి మత్సరము; ఇతరులు మానవలయునని తనయొక్క జపధ్యానాదికర్మల నితరులయెదుట నాచరించుట దంభము; ఇతరులను తర్జన భర్త్సనలచేత తిరస్కరించుట దర్పము; ధనక్షేత్రాదులయందభిలాషయే ఇచ్ఛ; శత్రువధాదులయందు బుద్ధి ద్వేషము; అనుకూలములైన ద్రవ్యగృహక్షేత్రాదులయొక్క

ప్ర. [illegible]. ౯౭.

ఇప్పు డీవ్యాఖ్యానము సర్వజ్ఞశబ్దమైనందున సర్వవేదాంతప్రసిద్ధమగు నాత్మను జెప్పుచున్నది. ఆపరమాత్మయందనిత్యమై యవచ్ఛిన్నమైనజ్ఞానముగలవాఁడగు *'తన్నిత్యబోధః' అని చెప్పఁబడుచున్నాఁడు. యోగీశ్వరుఁడగు పతంజలి 'తమేవ ధీరోవిజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః' అను శ్రుతి ననుసరించి యోగాభ్యాసముచేత చిత్తవిక్షేపములు నన్నింటిని నివర్తింపఁజేసుకొని నిరంతరముగా పరమాత్మవిషయమగు జ్ఞానము గలవాఁడై యుండును. కనుక జ్ఞానము నిత్యముగా నున్నందున జ్ఞానముచేతఁ జేయఁబడిన యజ్ఞానాధ్యాసనానివృత్తియును నిత్యముగా నుండునని తాత్పర్యము.

ఇఁకఁగాని వేదాంతమతము 'భావాంతరమభావోఽన్యో నకశ్చి దనిరూపణాత్' అనువాక్యప్రకారము ఘటముయొక్క ప్రాగవస్థమైన మృత్పిండము ప్రాగభావమని, ఉత్తరావస్థమైనకపాలములు ప్రధ్వంసాభావ మని చెప్పఁబడియున్నందున, అభావమనఁగా మరియొక భావపదార్థమే కాని మరియొకటి గాదని యంగీకరించియున్నందున రజ్జునం దారోపింపఁబడిన సర్పముయొక్క నివృత్తి రజ్జుస్వరూపముగానేయున్నందున 'అధిష్ఠానావశేషో హి నాశః కల్పితవస్తునః' అనువా

* వేదాంతమహావాక్యశ్రవణమువలన స్వాత్మపరమాత్మను చక్కఁగా తెలుసుకొని తదుపరి నిదిధ్యాసనము చేసి ప్రత్యక్షముగా తెలుసుకొనవలయునని ప్రశ్నార్థము.

యములవలనను బ్రహ్మయం దారోపింపఁబడిన అజ్ఞానపాప నాదులయొక్క నివృత్తి బ్రహ్మస్వరూపముగానే యున్నది గనుక అది నిత్యమని చెప్పట నిం[illegible]యుక్తము.

ఉ—వేదాంతమహావాక్యశ్రవణాదులచేఁ దెలియఁబడుపరమాత్మ తార్కికులచేఁ జెప్పఁబడిన యీశ్వరునివలె జీవులకంటె భిన్నుఁడా! యను శంకను నిరాకరించుచున్నది.

శ్రు. బ్రహ్మైవాహమస్మీతి. ౨౧.

తా. యోగియైన నేనుమాత్రము వేదాంతవేద్యమైన పరబ్రహ్మ మేది కలదో అది నేనే కాని నాకంటె భిన్నమైనది లేదని నిశ్చయించుకొనును అని యర్థము.

అ—యోగియొక్క బ్రహ్మానుభవప్రకారము చూపఁబడుచున్నది.

శ్రు. తం శాంతమచలమద్వయానందవిగ్రహం [illegible]
[illegible]. ౨౨.

తా. 'తం, శాంతం, అచలం' అను మూఁడుపదములయందు ద్వితీయావిభక్తిని ప్రథమావిభక్తిగా నన్వయించవలయును. కామక్రోధాదివికారములు లేనిదై గమనాగమనాదిక్రియాశూన్యమై సజాతీయ విజాతీయ స్వగతభేదరహితమై అఖండసచ్చిదానందరూపమయిన యేపరమాత్మ కలదో అపరమాత్మ నేనే. ఆపరమాత్మతత్త్వమే నాయొక్క వాస్తవస్వరూపముగాని కర్తృత్వభోక్తృత్వాదివికారములుగలస్వరూపముగాదు. వికారవంతమైనస్వరూపము మాయాకల్పితము.

'ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతి' యనుశ్రుతి యిందుకు ప్రమాణము. ఈపరమానంద స్వరూపుఁడయిన పరమాత్మ యొక్క స్వల్పాంశమును అవలంబించి దేవతిర్యఙ్మనుష్యాదిభూతములు సుఖము ననుభవించుచున్నవి యని శ్రుత్యర్థము.

ఇట్టియభిప్రాయముతోనే యథర్వణికులు బ్రహ్మోపనిషత్తులో చెప్పియున్నారు.

శ్లో. సశిఖం వపనం కృత్వా బహిస్సూత్రం త్యజేద్బుధః,
యదక్షరం పరం బ్రహ్మ తత్సూత్ర మితి ధారయేత్.

తా. బ్రహ్మతత్త్వజ్ఞానముగల పురుషుఁడు శిఖతోఁగూడ క్షౌరమును చేసుకొని బాహ్యమయిన కనుపడుయజ్ఞోపవీతమును త్యజింపవలయును. వినాశము లేక నిత్యముగానుండు పరమాత్మనే బ్రహ్మసూత్రముగా ధరించవలయును.

శ్లో. సూచనాత్సూత్ర మిత్యాహుః సూత్రం నామ పరం పదం,
తత్సూత్రం విదితం యేన స విప్రో వేదపారగః.

తా. సమస్తార్థములను సూచించుటచేత సూత్రమని పెద్దలు చెప్పెదరు. అట్టి సమస్తార్థసూచకమయిన సూత్రము పరమాత్మ స్వరూపమేగాని మరియొకటి గాదు. అట్టిసూత్రమును ఏ బ్రాహ్మణుఁ డెఱుఁగునో అతఁడు సమస్తవేదముల యొక్క అంతమును ఎఱిఁగినవాఁడని చెప్పఁబడును.

శ్లో. యేన సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ,
తత్సూత్రం ధారయేద్యోగీ యోగవిత్తత్త్వదర్శివాన్.

తా. దారమందు మాణిక్యములవలె నెవనియందీ ప్రపంచము కూర్పఁబడియున్నదో ఆసూత్రమునే యోగియైనవాఁడు ధరించవలయును. అతఁడే యోగవేత్తయని, తత్త్వవేత్త యని చెప్పఁదగినవాఁడు.

శ్రు. బహిస్సూత్రం త్యజేద్విద్వాన్ యోగముత్తమమాస్థితః,
బ్రహ్మభావమిదం సూత్రం ధారయేద్యస్స చేతనః.
ధారణాత్తస్య సూత్రస్య నోచ్ఛిష్టో నాశుచిర్భవేత్.

తా. తత్త్వజ్ఞాని యగువాఁడు సర్వోత్తమమైన యోగము నాశ్రయించి బాహ్యముగా నుండు యజ్ఞోపవీత సూత్రమును త్యజించవలయును. పరమాత్మస్వరూపమగు సూత్రమును ధరించినవాఁడే చేతనుఁడు. బ్రహ్మసూత్రధారి యెప్పటికిని ఉచ్ఛిష్టదోషము గలవాఁడుగాని అపవిత్రుఁడుగాని కానేరఁడు.

శ్రు. సూత్రమంతర్గతం యేషాం జ్ఞానయజ్ఞోపవీతినాం,
తే వై సూత్రవిదో లోకే తే చ యజ్ఞోపవీతినః.

తా. బ్రహ్మతత్త్వజ్ఞానమే యజ్ఞోపవీతముగాఁ గల యే యోగులకు బ్రహ్మసూత్ర మంతర్గతమైయుండునో వారే ఈలోకములో సూత్రము నెఱిఁగినవారనియు, యజ్ఞోపవీతము కలవారనియు చెప్పఁబడుదురు.

శ్రు. జ్ఞానశిఖా జ్ఞాననిష్ఠా జ్ఞానయజ్ఞోపవీతినః,
జ్ఞానమేవ పరం తేషాం పవిత్రం జ్ఞానముచ్యతే.

తా. ఎవరికి జ్ఞానమే సర్వాధికముగా నుండునో, వారు జ్ఞానమే శిఖగా కలవారుగా జ్ఞానమునందే, నిరంతరస్థితి

తా. పరమగతిప్రాపకమయిన యే బ్రహ్మతత్త్వజ్ఞానము కలదో, అదియె యజ్ఞోపవీతము. కనుకనే బ్రహ్మజ్ఞానము గలవాఁడే యజ్ఞోపవీతము కలవాఁడని చెప్పఁబడును. ప్రాజ్ఞులగువా రతనినే సకలయజ్ఞములు చేసినవాఁ డని చెప్పుదురు.

కనుక యోగికి శిఖాయజ్ఞోపవీతములు కలవు. ఆప్రకారమే సంధ్యయు కలదు. అహంప్రత్యయముచేత తెలియఁబడు జీవాత్మను కేవలశాస్త్రముచేతనే తెలియఁబడు పరమాత్మను భ్రాంతిచేత కలిగియున్న భేదము తత్త్వమస్యాదిమహావాక్యజన్యమైన అభేదజ్ఞానముచేత తిరిగి పుట్టకుండ నశించును. ఈయభేదజ్ఞానము జీవాత్మపరమాత్మలయొక్క సంధియందుఁ గలుగును గనుక సంధ్య యనఁబడును. అహోరాత్రములు రెంటియొక్క సంధియందుఁ గలుగు క్రియయే కదా సంధ్యయనఁబడునది. అహోరాత్రములయొక్క సంధియందుఁ గలిగిన క్రియ సంధ్య యని చెప్పఁబడినట్లు జీవాత్మపరమాత్మలయొక్క సంధియందుఁగలిగిన అద్వైతజ్ఞానము సంధ్యయని చెప్పఁబడును. ఈప్రకారము పరమహంసకు కూడ శిఖాయజ్ఞోపవీతసంధ్యలు కలిగియున్నందున యోగి యగువాఁడు కర్మజడులచేత వ్యామోహమును పొందించుటకు శక్యుఁడు కాఁడు.

ఈప్రకారము పరమహంసయొక్క మార్గస్థితులను గూర్చి చేసిన ప్రశ్నలకు ప్రత్యుత్తరమును చెప్పి యిప్పుడు సమాప్తి చేయఁబడుచున్నది.

నుఁడైనవాఁడు సన్న్యాసగ్రహణముచేత నరకమును బొందుట యుక్తముగానే యున్నది.

కనుకనే జ్ఞానహీనుఁడైన సన్న్యాసికి భిక్షానియమము మనుస్మృతియందు చెప్పఁబడియున్నది.

శ్లో. న చోత్పాతనిమిత్తాభ్యాం న నక్షత్రాంగవిద్యయా,
నానుశాసనవాదాభ్యాం భిక్షాం లిప్సేత కర్హిచిత్.
ఏకకాలం చరేద్భైక్షం న ప్రసజ్జేత విస్తరే.
భైక్షే ప్రసక్తో హి యతిర్విషయేష్వపి సజ్జతి.

తా. కేవలసన్న్యాసియగువాఁడు ఉత్పాతములనుగాని శకునములనుగాని జ్యోతిషములనుగాని జనులకు చెప్పి భిక్షను పొందఁగూడదు. హితోపదేశమును చేసి గాని శాస్త్రవాదములను చేసి తన పాండిత్యమును ప్రకటనచేసి గాని భిక్షను పొందవలయుఁగూడదు. ప్రతిదినము నొకపర్యాయము మాత్రము భిక్షను చేయవలయునే గాని రెండుమూఁడుపర్యాయములు చేయఁగూడదు. విస్తారముగా భిక్షయం దాసక్తిగల సన్న్యాసి విషయములయందుఁ గూడ నాసక్తి కలవాఁడై చెడిపోవును.

శ్రవణాదులచేత తత్త్వజ్ఞానము నభ్యసించు సన్న్యాసికి భిక్షాక్రమము మఱియొక ప్రకారముగా చెప్పఁబడియున్నది.

శ్లో. ఏకవారం ద్వివారం వా భుంజీత పరహంసకః,
యేన కేన ప్రకారేణ జ్ఞానాభ్యాసీ భవేత్సదా.

తా. ఒకపర్యాయము గాని రెండుపర్యాయములు గాని పరమహంససన్న్యాసి భిక్షను చేయవచ్చును. తత్త్వజ్ఞా

ప్రమాతలను ప్రకాశింపఁజేయుసాక్షిచైతన్యము తత్త్వమసి యను మహావాక్యములోని త్వంపదమునకు లక్ష్యార్థమై యున్నది. దేహేంద్రియాదివిశిష్టమైన చైతన్యము త్వంపదమునకు వాచ్యమే కాని లక్ష్యము గాదు. అట్టివాచ్యము తత్పదార్థముకంటె భిన్నము. లక్ష్యము అభిన్నము. స్వదేహనిష్ఠమయిన త్వంపదవాచ్యార్థము అహం (నేను) అని చెప్పఁబడును. పరదేహనిష్ఠమైన త్వంపదవాచ్యార్థము త్వం (నీవు) అని చెప్పఁబడును. లక్ష్యమని వాచ్యమని చెప్పఁబడు ఉభయవిధచైతన్యవ్యాప్యమై జడమైన ప్రపంచము సర్వమని చెప్పఁబడును. ఇట్టి లక్ష్యాలక్ష్యవిజ్ఞానశాస్త్రవ్యవహారములలో నొకటికూడ బ్రహ్మయందు విశ్రాంతమైన చిత్తముగలయోగికి సంభవింపనేరదు. కనుకనే యాపరమహంసగృహమందు నివసించువాఁడు కాఁడు. నియతముగా నివసించుటకొఱకొక మఠమును కల్పించుకొని యుండెనా! యామఠమందు, మమకారము గలిగి దానియొక్క హానివృద్ధులచేత చిత్తము విక్షేపము నొందుచుండును.

ఈయభిప్రాయముతోనే శ్రీగౌడపాదాచార్యులవారు చెప్పియున్నారు.

శ్లో. నిస్తుతిర్నిర్నమస్కారో నిస్స్వధాకార ఏవ చ,
చలాచలనికేతశ్చ యతిర్యాదృచ్ఛికో భవేత్.

తా. పరమహంసపరివ్రాజకుఁడు స్తుతి నమస్కార స్వధాకారములు లేనివాఁడుగాను, నియతనివాసము లేనివాఁడుగాను, యాదృచ్ఛికవృత్తిగలవాఁడుగాను నుండవలయు నని భావము.

నుతము ఏప్రకారము పరిగ్రహింపఁదగదో, ఆప్రకారమే సువర్ణరజతకాంస్యతామ్రాదిపాత్రలను భిక్షాచమనాదులయం దుపయోగించుకొనఁదగదు.

ఈయర్థము స్మృతిలో చెప్పఁబడియున్నది.

శ్లో. హిరణ్మయాని పాత్రాణి కార్ష్ణాయసమయాని చ,
యతీనాం తాన్యపాత్రాణి వర్జయేత్తాని భిక్షుకః.

తా. సువర్ణపాత్రలు, ఇనుము, ఉక్కు మొదలయిన పాత్రలు సన్న్యాసులకు భోజనపాత్రలుగా నుండఁగూడదు.

సువర్ణాదిపాత్రలను సన్న్యాసి వర్జింపవలయును అని మనుస్మృతియందు కూడ చెప్పఁబడియున్నది.

శ్లో. అతైజసాని పాత్రాణి యతీనాం నిర్వ్రణాని చ,
తేషా మద్భిః స్మృతం శౌచం చమసానామివాధ్వరే.
అలాబుం దారుపాత్రం చ మృణ్మయం వైదలం తథా,
ఏతాని యతిపాత్రాణి మనుస్స్వాయంభువోఽబ్రవీత్.

తా. సువర్ణాదిలోహములతోఁ జేయఁబడినవియు బుదుప్రలు లేనివియు అయినపాత్రములను సన్న్యాసులు గ్రహింపవలయును. ఇట్టిపాత్రలను యాగమందు చమసములను పాత్రలను ఉచ్ఛిష్టస్పర్శమందు జలమువలననే శుద్ధి కలుగునటుల కేవలజలముచేతనే శుద్ధి కలుగును. కనుకనే సొరకాయబుఱ్ఱనైనా, కొయ్యతోఁ జేయఁబడిన పాత్రమునైనా వెదురుగొట్టమునైనా సన్న్యాసి గ్రహింపవలయునని స్వాయంభువమనువుచే చెప్పఁబడినది.

బోధాయనమహర్షియు నీప్రకారముగానే చెప్పియున్నారు.

శ్లో. స్వయమాహృతపర్ణేషు స్వయంశీర్ణేషు వా పునః,
భుంజీత న మహాశ్వత్థకరంజానాం చ పర్ణకే.

తా. స్వయముగా తెచ్చుకొన్న పత్రములయందుఁగాని స్వయముగా క్రిందరాలినపత్రములయందుఁగాని సన్యాసి భోజనమును చేయవలసినది. మఱ్ఱియాకులయందుఁగాని, రావి యాకులయందుఁగాని, కానుగాకులయందుఁగాని భోజనము చేయఁగూడదు.

శ్లో. అపస్యాని న కాంస్యేషు మలాశీ కాంస్యభోజనః,
సౌవర్ణే రాజతే తామ్రే మృణ్మయే త్రపుసీసయోః.

ఆపత్కాలమందైనా ఈసన్యాసి కంచు బంగారు వెండి రాగి మృత్తు సత్తు సీసము ఈపాత్రలయందు భోజనము చేయఁగూడదు. చేసెనో మలమును భక్షించినవాఁడగును.

ఈప్రకారమే లోకమును (శిష్యవర్గమును) పరిగ్రహించఁగూడదు.

ఇది మనువుచేఁ జెప్పఁబడినది.

శ్లో. ఏక ఏవ చరేన్నిత్యం సిద్ధ్యర్థ మసహాయకః,
సిద్ధిమేకస్య పశ్యన్ హి తజ్జహాతి న హీయతే.

తా. సన్యాసి యొంటరిగా నుండి తత్త్వజ్ఞానసిద్ధికొఱకు అసహాయముగా సంచరించవలయును. ఏకాకిగా నుండువానికి జ్ఞానసిద్ధి కలుగుటను చూచి ఇతరసహాయమును విడుచును. ఆప్రకార మితరసంగమును విడిచినందున హాని లేదు.

ఈ విషయము మేధాతిథి యను మహర్షి యును చెప్పి యున్నారు.

శ్లో. ఆసనం పాత్రలోపశ్చ సంచయశ్శిష్యసంగ్రహః,
దివాస్వాపో వృథాలాపో యతేర్బంధకరాణి షట్.

తా. ఆసనము, పాత్రలోపము, సంచయము, శిష్యసంగ్రహము, దివాస్వాపము, వృథాలాపము అను నీయాఱును సన్న్యాసికి బంధకములు.

ఈ చెప్పిన యాఱుదోషములయొక్క స్వభావము ఆ ఋషి చేతనే వివరింపఁబడెను.

శ్లో. ఏకాహాత్పరతో గ్రామే పంచాహాత్పరతః పురే,
వర్షాభ్యోఽన్యత్ర యత్స్థాన మాసనం తదుదాహృతం.

తా. గ్రామములో నొకదినముకంటె పట్టణములో నైదుదినములకంటె నధికకాలము నిలువకను వర్షాకాలము నాలుగు మాసములలోఁ దప్ప నితరకాలములయం దొకచోట విశేషకాలము నిలుచుటయును ఆసనమనఁబడును.

శ్లో. ఉక్తాలాబ్వాదిపాత్రాణా మేకస్యాపి న సంగ్రహః,
భిక్షోర్భైక్ష్యభుజశ్చాపి పాత్రలోపస్స ఉచ్యతే.

తా. సన్న్యాసి యగువాఁడు భిక్షాన్నమును భుజించుచున్నప్పటికి శాస్త్రమందు విధించిన సొరకాయబుఱ్ఱ మొదలైన పాత్రలలో నొకదానినైనా గ్రహింపకపోవుట పాత్రలోపమని చెప్పఁబడును.

శ్లో. గృహీతస్య తు దండాదే ర్ద్వితీయస్య పరిగ్రహః,
కాలాంతరోపభోగార్థం సంచయః పరికీర్తితః.

తా. దండ కాషాయాదులను పరిగ్రహించి అవి ఖిలమైన తరువాత తిరిగి ధరించుటకుగాను రెండుమూఁడుదండములను కాషాయములను సంపాదించి పెట్టుకొనుట సంచయ మనఁబడును.

శ్లో. శుశ్రూషాలాభపూజార్థం యశోఽర్థం వా పరిగ్రహః,
శిష్యాణాం న తు కారుణ్యా త్స జ్ఞేయశ్శిష్యసంగ్రహః.

తా. శుశ్రూష, లాభము, పూజ, కీర్తి వీటిని అపేక్షించి శిష్యులను చేర్చుకొనుట శిష్యసంగ్రహ మనఁబడును. కేవల దయచేత శిష్యులను కృతార్థులను జేయవలయు ననెడి యిచ్ఛ చేత చేర్చుకొనుట శిష్యసంగ్రహ మని చెప్పఁబడదు.

శ్లో. విద్యా దివా ప్రకాశత్వా దవిద్యా రాత్రి రుచ్యతే,
విద్యాభ్యాసే ప్రమాదో యస్స దివాస్వాప ఉచ్యతే.

తా. బ్రహ్మజ్ఞానము ప్రకాశస్వరూపమైనందున దివా (పగలు) అనిచెప్పఁబడును. అజ్ఞానము అప్రకాశమైనందున రాత్రి యనఁబడును. జ్ఞానమనెడి పగటియందు ప్రమాదము గలిగియుండుటయె దివాస్వాప మనఁబడును.

శ్లో. ఆధ్యాత్మికీం కథాం ముక్త్వా భైక్ష్యచర్యాం గురుస్తుతిం,
అనుగ్రహప్రైషప్రశ్నౌ వృథాలాప స్స ఉచ్యతే.

తా. అధ్యాత్మవిషయమైన కథలను దేహధారణార్థమై నభిక్షాచరణమునందు 'భిక్షాం దేహి' యను శబ్దోచ్చారణమును పరమేశ్వరస్తవమును వీటిని మాత్రము సన్న్యాసి చేయవలయును. వీటికంటె నితరములైన వారిసమాచారములను అనుగ్రహముచేతనడిగినా, అదివృథాలాపమని చెప్పఁబడును. శిష్య

జనరూపమైన లోకమును పరిగ్రహింపఁదగదని చెప్పినందున శిష్యజనమును పరిగ్రహింపక యుండుటమాత్రమే కాదు. అట్టివారి యవలోకనమునుగూడ చేయఁగూడదని తెలియవలయును. ఈశిష్యులు ఖ్యాతిలాభపూజానిమిత్తమైనందున బంధహేతువులే గాని తత్త్వజ్ఞానానుకూలవృత్తి కలవారు కారు. అంతమునందుండు చకారముచేత మఱికొన్ని స్మృతినిషిద్ధములను కూడ నాచరింపఁదగదని సూచింపఁబడుచున్నది.

వానిని మేధాతిథియే కనుపరచియున్నారు.

శ్లో. స్థావరం జంగమం బీజం తైజసం విషమాయుధమ్,
షడేతాని న గృహ్ణీయా ద్యతిర్మూత్రపురీషవత్.

టీ. గృహక్షేత్రాదిస్థావరములను, దాస్యాదిజంగమములను, యవగోధూమాదిధాన్యములను, కాంస్యాదిలోహములను విషయమును అనేకౌషధములను ఖడ్గాద్యాయుధములను వీనినారింటిని మూత్రపురీషములవలె సన్యాసి సంపాదించి పరిగ్రహింపఁగూడదు.

శ్లో. రసాయనం క్రియావాదం జ్యోతిషం క్రయవిక్రయమ్,
వివిధాని చ శిల్పాని వర్జయేత్పరదారవత్.

టీ. రసాయనాదిదివ్యౌషధప్రయోగమును సువర్ణరజతాది నిర్మాణకౌశలమును భూతభవిష్యద్వర్తమానములను చెప్పు జ్యోతిషశాస్త్రమును క్రయవిక్రయాదివ్యవహారములను పలువిధములగు శిల్పములను వీనిని పరస్త్రీని త్యజించినట్లు త్యజించవలయును.

వా. ఇంతవరకు యోగియైనపరమహంసకు వైదికలౌకిక వ్యాపారములయందుండు బాధకములను గనుపఱచి వాటిని విడువవలయు నని చెప్పఁబడినది.

అ.—ఇకముందు సర్వప్రకారములచేత బాధకములైనవాటిని శ్రుతివాక్యములచేతఁ జూపించి వాటిని విడువవలయు నని యాకాంతి చెప్పుచున్నది.

శ్రు. ఆబాధకం క్వ ఇతి చేత్, ఆబాధకోఽస్త్యేవ. యస్మాద్భిక్షుర్హిరణ్యం రసేన దృష్టం చేత్స బ్రహ్మహా భవేత్. యస్మాద్భిక్షుర్హిరణ్యం రసేన స్పృష్టం చేత్స పౌల్కసో భవేత్. యస్మాద్భిక్షుర్హిరణ్యం రసేన గ్రాహ్యం చేత్స ఆత్మహా భవేత్. తస్మాద్భిక్షుర్హిరణ్యం రసేన న దృష్టం న స్పృష్టం న గ్రాహ్యం చేతి.

తా. యోగియైన పరమహంససన్యాసికి మిక్కిలి బాధకమైనది యేదిగా నుండు ననఁగా మిక్కిలిబాధకమైనది యొకటి కలదు. అది సువర్ణము. సువర్ణమును ఆసక్తితో సన్యాసిచూచెనా! బ్రహ్మహత్య కలవాఁడగును. సువర్ణమందుండు నాసక్తిచేత దానిని సంపాదించుటయందు, రక్షించుటయందు నెప్పటికి ప్రయత్నమును చేయుచు, ఆసంపాదనరక్షాప్రయత్నములయొక్క వ్యర్థత్వశంకను పరిహరించుకొరకు ప్రపంచమిథ్యాత్వబోధకములైన వేదాంతవాక్యములను దూషించి, ప్రపంచసత్యత్వమును ప్రతిపాదింపుచుండును. అందుచేత శాస్త్రసిద్ధమైన అద్వితీయబ్రహ్మస్వరూపము ఆసన్యాసిచేత నశింపఁజేయఁబడును గనుక నాసన్యాసి బ్రహ్మహత్య చేసినవాఁడనే చెప్పఁదగును.

ఈయర్థ మొకస్మృతిలోఁ జెప్పఁబడియున్నది.

శ్లో. బ్రహ్మ నాస్తీతి యో బ్రూయాత్ ద్వేష్టి బ్రహ్మవిదం చ యః,
అభూతబ్రహ్మవాదీ చ త్రయస్తే బ్రహ్మఘాతకాః,
బ్రహ్మణా చ న విజ్ఞేయస్సర్వకర్మబహిష్కృతః.

తా. పరబ్రహ్మ లేఁడని యెవఁడు చెప్పునో, బ్రహ్మవేత్తతో నెవఁడు విరోధించునో, బ్రహ్మస్వరూపము శాస్త్రములోఁ జెప్పినప్రకారముగా కాకుండ మఱియొకవిధముగా నెవఁడు నిరూపించునో, వీరు ముగ్గురు బ్రహ్మఘాతుకు లని చెప్పఁబడుదురు. ఈబ్రహ్మఘాతుకుఁడు సర్వధర్మములనుండి బహిష్కృతుఁడై యీలోకములో నిందింపఁబడుచు పరలోకమున కయోగ్యుఁడై చెడిపోవును. అభిలాషపూర్వకముగా సువర్ణమును స్పృశించినయెడల సన్న్యాసి పతితుఁడై మ్లేచ్ఛసమానుఁడై పోవును.

ఈయర్థము స్మరింపఁబడుచున్నది.

శ్లో. పతత్యసౌ ధ్రువం భిక్షుర్యస్య భిక్షోర్ద్వయం భవేత్,
ధీపూర్వం రేతఉత్సర్గో ద్రవ్యసంగ్రహ ఏవ చ.

తా. ఏసన్న్యాసి బుద్ధిపూర్వకముగా రేతస్సును విడుచునో, సువర్ణమును సంగ్రహించునో, ఆసన్న్యాసి నిశ్చయముగా పతితుఁడౌను.

ఆసక్తిపూర్వకముగా సువర్ణమును గ్రహింపఁగూడదు. గ్రహించెనో, అట్టియాసన్న్యాసి దేహేంద్రియాదిసాక్షియు యసంగుఁడైనచిదాత్మనుచంపిన వాఁడగును. ఆత్మయొక్క అసంగత్వమును మఱచి సువర్ణాదిద్రవ్యమునుగూర్చి ఆత్మ భోక్త

యంగీకరించినందున ఆత్మహత్యచేసినవాఁ డని చెప్పఁబడు ను. ఇట్టి అన్యథాప్రతిపత్తి సర్వపాపస్వరూప మని మహా భారతములో శకుంతలాదుష్యంతసంవాదములోఁ జెప్పఁబడి యున్నది.

శ్లో. అన్యథాసంతమాత్మానం యోఽన్యథా ప్రతిపద్యతే,
కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా.

తా. ఒకప్రకారముగా నున్న యాత్మస్వరూపమును మరియొకప్రకారముగా నెవ్వఁడు తలఁచునో, అట్టి ఆత్మాపహారము చేసిన చోరుఁడు ఏపాపమును జేయనివాఁడుగా నుండును? అనఁగా సర్వపాపములను జేసినవాఁడే యని యర్థము.

అదిగాక యాత్మహత్యచేసినవానికి సుఖలేశము కూడ లేక నానావిధదుఃఖపూర్ణము లైన లోకములు ప్రాప్యములుగా నుండు నని యొకశ్రుతిచేఁ జెప్పఁబడుచున్నది.

శ్రు. అసుర్యా నామ తే లోకా అంధేన తమసా వృతాః,
తాంస్తే ప్రేత్యాభిగచ్ఛంతి యే కేచాత్మహనో జనాః.

తా. ఆత్మ నన్యథాప్రతిపత్తిచే నశింపఁజేసిన పురుషులు గాఢాంధకారముచే నావరింపఁబడిన అసుర్యములను పేరుగల పాపలోకములను పొందుదురు. దృష్టస్పృష్టగ్రాహ్యశబ్దములతో క్రమముగా సంబంధించిన చకారత్రయమునకు శ్రుతకథితవ్యవహృతము లర్థము. సువర్ణముయొక్క దర్శనస్పర్శనగ్రహణములు సన్యాసికి ప్రత్యవాయకరము లైనటులసాభిలాషముగా సువర్ణముయొక్కవృత్తాంతమును వినుటయును

దాని గుణములను కీర్తించుటయును సువర్ణమును క్రయ విక్రయాదులచేత వ్యవహరించుటయును ప్రత్యవాయకరము లని తాత్పర్యము. సన్యాసికి సువర్ణస్పర్శనాదులు దోషసంపాదకములు గనుక వానిని సన్యాసి ప్రయత్నపూర్వకముగా పరిహరించవలయును అని సముదాయతాత్పర్యము.

సువర్ణమును త్యజించినందువలన విశేషఫలమును చెప్పుచున్నది.

శ్రు. సర్వే కామా మనోగతా వ్యావర్తన్తే; దుఃఖోద్విగ్నస్సుఖే నిస్పృహస్త్యాగే రాగే సర్వత్ర శుభాశుభయో రనభిస్నేహో న ద్వేష్టి న మోదతే చ సర్వేషామింద్రియాణాం గతిరుపరమతే య ఆత్మన్యేవావస్థీయతే.

తా. పుత్రభార్యాగృహక్షేత్రాదికామము లన్నియు సువర్ణమూలములు గనుక సువర్ణమును పరిత్యజించగా మనోగతములైన యీ కామములన్నియు పరిత్యజించబడును. కామములను పరిత్యజించగా కాముకునిచేత ప్రాప్తించు సుఖమునం దభిలాషయును దుఃఖమునం దుద్వేగమును గలుగనేరదు. సుఖదుఃఖములయం దభిలాషోద్వేగములు సంభవించనేర వను నర్థము స్థితప్రజ్ఞలక్షణమును చెప్పినప్పుడు విస్తారముగా నుపపాదించి యున్నారము. ఐహికసుఖదుఃఖములను విడువంగా నాముష్మికసుఖమునందు రాగమును విడువబడును. ఐహిక సుఖాభిలాషగలపురుషుఁడే యాముష్మికసుఖమును కోరుచుం

డును. కనుక నైహికమందు నిస్పృహగలవాఁడు ఆముష్మిక సుఖములయందును నిస్పృహగలవాఁడై యుండు నని చెప్పుట యుక్తముగానే యున్నది. ఇందువలన నిహలోక పర లోకములయందుండు శుభాశుభ విషయములయందు స్నేహము లేనివాఁడై యుండును. ద్వేషముకూడ లేకనే యుండును. ఇటువంటి మహాపురుషుఁడు తనయందు ప్రతికూలముగా ప్రవర్తించువానివిషయమై ద్వేషమునుగాని అనుకూలముగా ప్రవర్తించువానివిషయమై మోదమును గాని పొందఁడు. ద్వేషమోదములు లేనివాఁడై యేపురుషుఁడు పరమాత్మయందే నిరంతరనిష్ఠగలవాఁడై యుండునో ఆపురుషునకు సర్వేంద్రియములు ప్రవృత్తిశూన్యములై యేకాగ్రతనొంది యుండును. ఇంద్రియము లేకాగ్రత నొందుటవలన నిర్వికల్ప సమాధికి విఘ్నమెప్పుడు కలుగనేరదు.

ఇఁకను శ్రుతి విద్వత్సన్న్యాసము నిగమించుచున్నది.

శ్రు. యస్సర్వాంతరబోధ స్తత్పరిక్షోహమస్మీతి కృతకృత్యో భవతి.

తా. ఏపరబ్రహ్మ వేదాంతములయందు పూర్ణానందజ్ఞానస్వరూపుఁడని, పరమాత్మయని ప్రతిపాదింపఁబడియున్నదో, ఆబ్రహ్మను నేనే యని సర్వదా అనుభవించుచుండు యోగి యైన యీపరమహంససన్న్యాసి కృతకృత్యుఁడై యుండెను.

ఈయర్థము స్మృతియందుఁ జెప్పఁబడియున్నది.

శ్లో. జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః,
నైవాస్తి కించిత్కర్తవ్య మస్తి చేన్న స తత్త్వవిత్.

# సంస్కృతగ్రంథములు.

## పురాణగ్రంథములు.

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి | |
| బాలరామాయణము, టీక | ... | 0 | 2 |
| ప్రతిపదాంధ్రటీకాతాత్పర్యవిశేషార్థసహిత శ్రీమద్రామాయణము, షట్కాండలు, 15 వాల్యములు | ... | 70 | 0 |
| శ్రీమద్రామాయణము, చిన్నసైజు | ... | 3 | 8 |
| ,, మేలుప్రతి, 2 వాల్యములు | ... | 6 | 0 |
| ,, సుందరకాండము, మూలము | ... | 1 | 0 |
| ,, ఉత్తరకాండము, మేలుప్రతి | ... | 1 | 4 |
| అధ్యాత్మరామాయణము, మూలము | ... | 1 | 0 |
| ,, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 8 | 0 |
| శ్రీమద్రామాయణము, వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము, 2 సంపుటములు | ... | 15 | 0 |
| శ్రీమద్రామాయణము, ఉత్తరకాండసహిత, ఆంధ్రతాత్పర్యసహితము 7 వాల్యములు | ... | 17 | 0 |
| బాలకాండ, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 0 |
| అయోధ్యాకాండము ,, | ... | 3 | 0 |
| అరణ్యకాండము ,, | ... | 2 | 0 |
| కిష్కింధాకాండము ,, | ... | 2 | 8 |
| సుందరకాండము ,, | ... | 2 | 0 |
| యుద్ధకాండము ,, | ... | 4 | 0 |
| ఉత్తరకాండము ,, | ... | 2 | 8 |

